శ్రీ ఆచంట జానకిరామ్‌గారు ఆంధ్రజాతి సర్వతోముఖ వికాసానికి అర్ధశతాబ్ది క్రితమే మహోద్యమం ప్రారంభించిన అతిరథులలో ఒకరైన డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారి జ్యేష్ఠపుత్రుడు. కళాహృదయం, స్నేహశీలం ఈయన అభిమాన విషయాలు. చిన్ననాడే ఆంగ్లంలో కవిత లల్లి అనీబిసెంట్ ఆశీస్సు లందుకున్న భావుకుడు. జీవితపు లోతులను కథలలో జిగితో బిగితో చిత్రించిన రచయిత. నవకవుల కళావైభవాన్ని పాఠకులకు ద్రాక్షాపాకంగా అందజేసిన విమర్శకుడు.

ఈయనను జీవితపరిస్థితి, సన్నివేశాలు, పరిసరాలు దేశదేశాల పెద్దలతో సన్నిహితుని చేశాయి. వారి పరిచయ ప్రభావంతో ఈయన జీవితాంగణంలో జాలువారిన స్మృతి ముక్తాఫలాలను ఈ వారం నుంచి క్రమక్రమంగా పాఠకులకు అందజేస్తున్నాము.

6, నవంబర్ 1957 — ఎడిటర్, ఆంధ్ర ప్రభ



ఇదిగో ! ఇంకా నిద్రలేవని,

మంచుతడి ఆరని, పారిజాతాలు !!

ఈ ధవళిమ నా భావాల స్వచ్ఛత;

ఈ ఎరుపు నా అనురాగపు రక్తిమ,

ఈ పరిమళము మన స్నేహసౌరభము !!

అందుకోవూ !!

నీ వెక్కడున్నా నీ వద్దకే వస్తాను

నేను, భిక్షాపాత్రతో గాని

నవరత్నాలు కూర్చిన కంఠమాలతో గాని;

ఎప్పటికీ నేను నీ వాడనే !!

జా న కి రా మ్

శ్రీ రమణాశ్రమం

25-2-1958

జానకిరామ్,

మీరు ఏవో రెమినిసెన్సులు వ్రాస్తూన్నారని, దాంటో చాల చోట్ల నా సంగతి రాస్తున్నారని, చదివిన నా మిత్రులు కొన్ని కొటేషన్స్ పంపారు. వాటిని చూసి, ఎంతో బాగా వ్రాస్తున్నారనుకొన్నాను. మీ రికలెక్షన్స్ అన్నీ అట్లానే వుంటే ఆ గ్రంథం చాలా విలువైనది అవుతుందనుకున్నాను.

దాంటో ఛారమ్ ఏవిటంటే మీ అనుభవాన్ని ఎంతో భద్రంగా ఇన్నేళ్ళు ఆఫ్టర్ ఈవెంట్స్‌వల్ల ఇన్‌ఫ్లూయెన్సు కాకుండా ఐసొలేట్ చేసి, స్టెరిలైజ్ చేసి, దాచిఉంచి, ఈనాడు ప్రొడ్యూస్ చేయడం! ఇన్నేళ్ళ తరవాత, ఇప్పటి జానకిరామ్ కాక, ఆనాటి జానకిరామ్, ఆనాడే వీటిని రాసి పెట్టుకున్నాడా అనిపించింది. ఆ ఒక్క గుణం చాలు, అట్లాంటి రాతల్ని ప్యూర్ ఆర్ట్‌గా మార్చడానికి!

ఈశ్వరాశీర్వాదాలతో.

చలం



శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మకు నాపైన అపరిమిత వాత్సల్యము. నాకు తెలుగు వ్రాయడము నేర్పినది వారే. నేను ఏమి వ్రాసినా, అన్నగారు ఊళ్ళో ఉంటే, మొట్టమొదట వారికి చదివి వినిపించడము నాకు అలవాటు. నా ఏభైనాలుగో ఏట, నా జీవితములో ఏభై ఏళ్ళలోని ముఖ్య విషయాలను గుర్తిస్తూ 'జ్ఞాపకాలు' అనే ఆత్మగత వ్యాసము వ్రాసి, సిరా ఆరకుండానే అన్నగారి వద్దకు తీసుకువెళ్ళాను. ఈ వ్యాసములో మా అమ్మను గురించిన ప్రస్తావన ఉండబట్టేనేమో, ఇంకా కొన్ని వివరాలవల్లా అన్నగారిని చాలా కదలించినది నా రచన. ఆయన అన్నారు: "చాలా చక్కగా కుదిరింది, ఇది గొప్ప సాహిత్యము; మీరు ఈ వ్యాసాన్ని ప్రచురించాలి, తప్పకుండా!" అని.

ఒక పత్రికవారి కిచ్చాను నా "జ్ఞాపకాలు", మా అమ్మ ఫోటో బ్లాక్‌తో సహా. ఏ కారణంవల్లనో వారు ఈ వ్యాసాన్ని ప్రచురించలేదు. ఇంతట్లోకి, ఒకరోజున, మా నాన్నగారైన శ్రీ ఆచంట లక్ష్మీపతిగారిని చూడడానికి వెళ్ళగా, ఆయన అన్నారు: "బెజవాడలో ఒక మాసపత్రికలో నాస్వీయచరిత్ర వస్తోంది, నీకు తెలుసుగా! ఈసారి వ్యాసంలో మీ అమ్మను గురించిన ప్రస్తావన ఉన్నది. నీవద్ద మీ అమ్మ ఫోటో

ఉన్నట్లు జ్ఞాపకము. ఆ ఫోటో వెంటనే ఆ పత్రికవారికి పంపు తావా" అని. "నావద్ద బ్లాకే ఉన్నది; ఆ బ్లాక్ పంపిస్తాను." అని, నేను నా వ్యాసమును ఇచ్చినవారికి టెలిఫోన్ చేశాను, 'బెజవాడలో ఫలానావారికి మా అమ్మ ఫోటో బ్లాక్‌ను అందజేయండి' అని ఇక ఆ విషయం మరచిపోయాను.

మరి కొన్నాళ్ళకు, మళ్ళా, మా నాన్నగారిని దర్శించినప్పుడు ఆయన కొంచెం ఆశ్చర్యంతోనే, అన్నారు: "ఇదేమిటి! నీవూ నీ స్వీయచరిత్ర వ్రాస్తున్నావా?" అని. "నీ వ్యాసము, పొరపాటున, బెజవాడ వెళ్ళినట్లుంది. ఇదుగో, వారు నాకు పంపారు" అంటూ నా జ్ఞాపకాలు' నా చేతికిచ్చారు, నాన్నగారు.

ఈ వ్యాసమును తీసుకొని ఇంటికివస్తూ, త్రోవలో, ఆప్త స్నేహితుడు నార్ల వెంకటేశ్వరరావును పలుకరిద్దామని అతని ఆఫీస్‌కు వెళ్ళాను. ఎంతపనిలో ఉన్నా, ఒక్క నిమిషం ఆ పని ఆపి; నాతో ఆప్యాయంగా మాట్లాడుతారు నార్ల. మా సంభాషణ కొంత సాగాక, అలవాటుప్రకారం, ఆయన అడిగారు: "ఏమైనా క్రొత్తరచన వ్రాశారా?" అని. నాదగ్గర ఉన్న 'జ్ఞాపకాలు' వారిచేతి కిచ్చాను. నార్లవల్ల మెప్పు పొందడం చాలా కష్టం. కాని, నా వ్యాసం చదివి ఆయన అన్నారు: "చాలా బాగా వ్రాశారు, మా కియ్యండి; మీ జీవితవిశేషాలు వివరంగా వారం వారం, ఇల్లాగే వ్రాయండి. ఒక శీర్షికగా ప్రచురిస్తాము, ప్రభలో" అని. ఉద్యోగములో ఉంటూన్న నేను ఇలా వారం వారం నన్ను గురించి వ్రాసు

కోడానికి వ్యవధి ఉంటుందాఅని నేను సందేహిస్తూంటే నార్ల "మీరు వ్రాయకలరు, నాకు తెలుసు; ఈ ఆదివారమే ఈ వ్యాసము వేస్తున్నాను; మళ్ళా వారానికి రెండవ వ్యాసము పంపండి" అని, తన పనిలో మునిగిపోయారు.

ఆ ఆదివారం ఆంధ్రప్రభలో "నా స్మృతిపథంలో ..."అంటూ, చదువుకున్నాను నా 'జ్ఞాపకాలు'. తరువాత, వారం వారం. ఈ పేరు పెట్టినది నార్లవారే. వారం వారం వ్రాయించినది నార్లవారే.

ఒక వయస్సు వచ్చేసరికి, "జీవితములో ఏమి సాధించాను!" అనే ఆత్మపరీక్ష సహజము. అల్లా నన్ను నేను ప్రశ్నించుకుంటే, వెంటనే, "ఇది నేను సాధించాను" అని ధైర్యంతో చెప్పలేకపోయేవాడను, ఇంతకుముందు. కాని,ఈ "నా స్మృతిపథంలో..." మన తెలుగువారు యావన్మందీ చదివి, నా కథ వారి కథగా భావిస్తూ, ఆనందిస్తున్నారని తెలియవచ్చేసరికి, కొండంత ధైర్యం వస్తుంది నాకు. ధైర్యమూ, కృతజ్ఞతాను. వారి ప్రోత్సాహంవల్లనే, ఆంధ్రప్రభలోని వ్యాసాలు, ఇదుగో, పుస్తకంగా రూపు దాల్చాయి.

"ఇదుగో! మీరు కోరిన మీ పుస్తకము" అంటూ మనవారి చేతి కందియ్యకలిగాను పుస్తకం, అనే సంతృప్తి నొప్పది.

ఈ పుస్తకము మొదటి ప్రతి నా స్నేహితుడు కొంపెల్ల జనార్దనరావు చేతిలో ఉంచుతున్నాను, స్వర్గీయుడైనా, ఆయన మన హృదయాలలో చిరంజీవి కాబట్టి.

ఒక్క విషయం: ఇది ఆత్మచరిత్రకాదు; ఆత్మకథ. అందువల్ల, ఇందు సత్యంతో పాటు కొంత ఊహాకూడా ఉంటుంది. అక్కడక్కడ ఈ ఊహ ఓ పాలు ఎక్కువగా ఉంటుందేమో కూడా ఆ సందర్భాన్నిబట్టి. కాని, ప్రధాన సంఘటనలు మాత్రం అక్షరాల, జరిగినవే. అంతేగాక, ఇది 'స్మృతిపథం, కాబట్టి జ్ఞాపకం చేసుకోవడములో కొన్ని సంఘటనలు ముందు వెనుకలుగావచ్చి, ఒక కాలక్రమాన్ని అనుసరింపక పోవచ్చు, అప్పుడప్పుడు. జ్ఞాపకాలలో వచ్చే ఇబ్బందీ స్వారస్యమూ కూడా ఇదే.

ఆచంట జానకిరామ్

అందమైన ప్రతివస్తువూ నిన్నే జ్ఞాపకం జేస్తుంది ।
సున్నితమైన ప్రతి భావమూ నిన్నే జ్ఞాపకం జేస్తుంది ।
ప్రాణమిచ్చే ప్రతి ఊహలోనూ నీవే స్ఫురిస్తావు ॥



# 'నా స్మృతిపథంలో ....'

ఎన్ని జ్ఞాపకాలో! వద్దు అనుకున్నా ముసురుకొని వస్తాయి జ్ఞాపకాలు. ఎన్నని! ఏభై ఏళ్ళ జీవితపు విషయా లెన్నో 'నేను ముందు' 'నేను ముందు' అనుకుంటూ వస్తాయి.

అన్నిటికంటె ముందు మా అమ్మను గురించిన జ్ఞాపకం. ఎప్పటిమాట! నాకు నాలుగోఏట అనుకుంటాను! నాన్నలా ఉండాలని పొడుగుకోటు తొడుక్కుని బడాయిగా ఇటూ అటూ పచారుచేస్తుండగా నాన్న, అమ్మ నన్నుచూచి నవ్వుకొన్న జ్ఞాపకం, పార్థసారధి కోవిలలో ప్రభల ఉత్సవం చూచిన జ్ఞాపకం. అప్పుడే కొత్తగా అవతరించిన పార్శీ నాటకంలో సీనుమీద నిగనిగలాడే ఎర్రని పూలతో విరగపూసిన దానిమ్మచెట్టు-అబ్బ! ఎంత అందంగా ఉంది! ఇవన్నీ ఎప్పటి కబుర్లు! ఏదో ఆటలో చిన్నగాయం తగిలి, రక్తం వస్తే ఎంత భయపడిపోయింది, అమ్మ....నా కోసం ఎంత తాపత్రయ పడింది. అదే ఆమెను గురించిన ఆఖరి జ్ఞాపకం....తర్వాత, ఆమె మనకు దక్కకుండా పోయింది.

అమ్మ తర్వాత, ఈ జీవితంలో ఎందరెందరు ప్రవేశించారో!

కవులు, రాజులు, కొంతామతల్లులు,

యుద్ధవీరులు, రాజ్యాంగవేత్తలు,

ప్రాణమును కూడ బలియిచ్చే నేస్తగాండ్రు - ఎందరో వచ్చి వెళ్ళారు ఈ జీవితం లోకి. ఒక్కొక్కరు క్షణకాలమో కొన్ని ఏళ్ళో ఈ జీవిత ప్రాంగణంలో మసలి, చక్కా వెళ్ళారు. ఎంత వన్నె తెచ్చారో, ఈ నిరుపేద జీవితానికి. కాని, నిరుపేద ఎల్లా అవుతుంది? గోపాలకృష్ణ గోఖలే ఉపన్యాసం వింటూ అతని సౌజన్యానికి ముగ్ధుడనైన నిమిషం, కోడి రామమూర్తి ఉపన్యాసం అనుకరిస్తూ అతని ఒళ్ళోకూర్చుని ఏనుగును ఛాతీపై ఎత్తుకొన్న శాండో

వళ్ళో కూర్చొన్నానని గర్వించిన నిమిషం, వీరేశలింగం పంతులుగారు నాన్న గారితో తమ కష్టాలు చెప్పుకుంటూ ఉండగా విని జాలిపడిన నిమిషం, కాశ్మీర శాలువ గప్పుకొని, వెన్నెలరాత్రిని అరుబయట నాన్నగారితో కబుర్లు చెప్పుతూ ఉన్న గురజాడ అప్పారావుగారి ఎదుట గిరీశం "మూన్‌లైట్ బ్రైటా" అన్న మాటలు వల్లించిన నిమిషం, ఎన్నసీ! అమూల్యమైన అనుభవాలు.

"అమరావతిని బౌద్ధులు విశ్వవిద్యాలయము స్థాపించునాడు" అన్న పద్యం అవతరించిన మహాసభలో—1914 అనుకుంటాను—ఆంధ్రత్వం నాట్యమాడింది. కన్నులారా చూస్తూ గర్వించాను. హేమాహేమీలైన సర్. బి. ఎన్. శర్మ, మోచర్ల రామచంద్రరావు-వీరి పంక్తిని భోజనం చేస్తూ పెద్దవాళ్ళు చర్చించుకుంటున్న రాజకీయ విషయాలను అవగాహన చేసుకున్నాను. 'వందేమాతరం' ఆందోళనను గమనిస్తూ దేశభక్తితో మైమరచాను. దక్షిణాఫ్రికాలో గాంధి చేస్తున్న మానవసేవను గురించి చదివి హర్షించాను. గాంధి, అనీబెసెంట్లు మద్రాస్‌లో మొదటి సమావేశం విక్టోరియా పబ్లిక్ హాలులో-అప్పుడు నేనున్నానక్కడ.

రవీంద్రనాథ్ టాగూర్ మద్రాసులో మొదటి పర్యాయం ఉపన్యసించి నప్పుడు అతనిపక్కన నిలుచున్న వలంటీర్ నేనే. "మేనేజ్ ఆఫ్ ది ఫారెస్టు" చదువుతూ ఆయన సింహగర్జనతో గొంతు సవరించుకున్నది ఇప్పటికీ ప్రతి ధ్వనిస్తూ ఉంటుంది నా మనోవీధిని. జీవితాన్ని అర్థంచేసుకొనే విషయంలో అనీబెసెంట్ పెట్టినజ్ఞానభిక్ష ఇప్పటికీ ఎంతోబలాన్నిస్తుంది. అప్పుడుఇంగ్లీషులో నే వ్రాసిన 'వెన్నెలలో దేవాలయం' 'నీటిఒడ్డున సాయం సమయం' 'మాఊరి చెరువు' 'కర్షక జీవిత దృశ్యాలు' ఆమె నన్ను ఆశీర్వదించిన అనుభవం ఎంత విలువైనది!

మొట్టమొదటిసారి జేమ్స్ కజిన్స్‌ను కలుసుకొన్నప్పుడు ఎన్నేళ్ళనుంచో ఎరిగిన ఆప్తబంధువును కలుసుకొన్నట్లు అనిపించిందిగాని, కాలేజీ ప్రిన్సిపాల్ ఎదుట హాజరైనట్లు తోచలేదు. ఇన్నేళ్ళ పరిచయంతోనూ జీవితంలో ఎన్నో

వన్నెలు తెలుసుకోగలిగాను, ఆయన సుసాంగత్యంవల్ల. ఆయన భార్య వీర వనిత. ఆయన గురుతుల్యుడు.

జేమ్సుకజిన్స్ వల్లనే దువ్వూరి రామిరెడ్డిగారి రచనలతో పరిచయం కలుగుత; కజిన్స్ వల్లనే మా అడివి బాపిరాజు బావను గురించి తెలుసుకుంట. ఆ తరువాతనే తెలుగు కవులతో పరిచయం.

అవి తెనుగుభాషా ప్రచారంలో మిషనరీ ఉద్యమం సాగేరోజులు. తెలికిచర్ల వెంకటరత్నం, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణ వీరితో అప్పుడప్పుడు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు— ఊరూరా తిరిగి మన భాషను గురించి జనులకు చెప్పేవారు. కృష్ణపక్షంలోని పద్యాలూ, యెంకిపాటలూ, కాటూరివారి 'కవితా సామాగ్రి' వీరువెళ్ళిన ప్రతి ఇంటిలో మారు మ్రోగుతుండేవి, ఆ రోజులలో. అప్పుడే వేంకట పార్వతీశ కవుల 'ఏకాంతసేవ' కూడా వెలువడింది.

ఇన్నేళ్ళ జీవితంలో ఎన్నివేల పుస్తకాలు చదివానో, ఇంగ్లీషులో తెనుగులో. కానీ అవన్నీ ఒకఎత్తు, ఆనాడు నేను చదివి, అనుభవించిన 'ఏకాంత సేవ' ఒక ఎత్తు! సూర్యోదయపువేళ సింహాచలం కొండ ఎక్కుతూ, రాత్రి కురిసినమంచు నిలిపిన వెండి ముత్యాలతో మెరిసిపోయే పోక మొక్కలమధ్య 'ఏదో విద్యుత్ ప్రభావపుంజ మిపుడుతోచె ఏదో దివ్యవాద్యస్వన మిపుడుతోచె' అని ఏకాంతసేవలోని పంక్తులు అనుకుంటూ తన్మయుడనై పోయేవాడిని.

మహా పండితుడు ఆచంట వేంకటసాయంఖ్యాయన శర్మగారికి 'ఏకాంత సేవ'తో పరిచయం గలిగించిన ఖ్యాతినాది! మొదట వారితో వాదించాను, ఇది వరకు మన భాషలోలేని క్రొత్త అందాలను ఈ కావ్యంలో చూపించ గలిగాను వారికి. నా వాదనను అంగీకరించడమే గాకుండా ఆ మరునాడు వారివద్దకు వచ్చిన జనమంచి శేషాద్రిశర్మగారికి ఈ కొత్త కావ్యాన్ని చదివి వివిపించారు, సాయంఖ్యాయన శర్మగారు, అందలి రచనా శిల్పాన్ని, భావ సంపదనూ మెచ్చుకుంటూ.

## నా స్మృతిపథంలో...

వేంకటసాయంఖ్యాయన శర్మగారితో పరిచయమైన కొన్ని నాళ్ళకే గిడుగు రామమూర్తి పంతులుగారితో పరిచయమున్నా. పర్లాకిమిడిలో వారిని కలుసుకొన్నప్పుడు రెండు మాటలు మాట్లాడానో లేదో — "ఈ అబ్బాయిది పశ్చిమ గోదావరిజిల్లా" అన్నారు. నేను చిరునవ్వు నవ్వుతుంటే "కాదు! 'మాది మద్రాస్' అంటావేమో! నీ మాట స్వచ్ఛమైన పశ్చిమ గోదావరి మాట" అన్నారు. ఆవేళ వారి బల్లమీదనే చూచాను, పేజీ పేజీకి మాట మాటకీ సవరణలతో నిండిన శబ్ద రత్నాకరం.

* * *

అరవిందుని నేను మొదట దర్శించినప్పుడు ఆయన ఇంకా రాజకీయ విషయాల చింతలోనే నిమగ్నులై ఉండేవారు, అప్పుడుకూడా మహాప్రయత్నం మీదగాని, ఆయనను చూడలేకపోయాం. కాని, మాలో ఏముందో, ఒక సాయంత్రము పదినిముషాలు మాట్లాడినాక "రేపుఉదయం మళ్ళారండి, ఇంకాకొంచెం సేపు సావకాశంగా మాట్లాడుకొందాము" అన్నారు. మర్నాడు కలుసుకున్నప్పుడు నేను ఆయనను ఒక వింతప్రశ్న వేశాను; "ఇప్పుడు మీవంటి వారంతా భారత స్వాతంత్ర్యానికి పాటుబడుతున్నారు. ఎప్పటికైనా భారతస్వాతంత్ర్యమే లభిస్తే ఆ తరువాత మనం దేనికోసం పాటుపడతాం?" అని అడిగాను.

ఆయన నవ్వారు: "మంచిప్రశ్న వేశావు. కాని, ఈ స్వాతంత్ర్యం ఒక సాధనం మాత్రమే. మనకు కావలసినది ఇంతకంటె ఇంకా గొప్పది. ప్రపంచానికంతా వెలుగు చూపించవలసిన బాధ్యత మన దేశానిది. స్వతంత్రులమైతే గాని ఆ పని చేయలేము మనం. స్వాతంత్ర్యం వచ్చాకనే మన అసలు పని ప్రారంభమవుతుంది" అన్నారు ఆయన 1918లో.

1950లో కాబోలు, ఆయనను తిరిగి దర్శించినప్పుడు ఎంతో మారిపోయారు. నాటిరాజకీయవేత్త ఈనాడు మహాయోగిలా కనిపించారు. బంగారపు దేహచ్ఛాయ. కళ్ళల్లో అనిర్వచనీయమైన వింతశోభ. మొదటి సమావేశంలో ఎంతోచనువుతో మాట్లాడిన ఆయనఎదుట ఈ మారు శిలాప్రతిమలా నిలుచుండిపోయాను. దర్శనానికి నియమించిన రెండునిమిషాలూ గడిచినట్లు తెలియదు.

ప్రక్కన నిలుచున్న శ్రావకుడు భుజంతట్టి కదలమనేవరకు అల్లాగే చూస్తూ ఉండిపోయాను. అదే ఆఖరుసారి, వారిని చూడడం .... ఈనాడు ఆధ్యాత్మిక విషయాలద్వారా ఐహిక భాగ్యాలను సంపాదింప కోరేవారి కెందరికి తెలుసో అరవిందుని సందేశము ?

నాకు ఇరవై ఏళ్ళు వచ్చేసరికి నా దృష్టిలో జీవితంలో అతిముఖ్యంగా కనపడి నవి సౌందర్యానుభూతి, స్నేహసంపద. మనచుట్టూ ఎంతో సౌందర్యం ఉంది. మన పరిసరాలలో, మనం కలుసుకొనే వ్యక్తులలో. ఈ సౌందర్యాన్ని అవగాహనం చేసుకుని, నిమిష నిమిషమూ మన జీవితాన్ని ఎంతో విలువకలదిగా చేసుకోవచ్చు మనము. జీవితంలో ఎంతో అందం ఉంది. ఎంతో మాధుర్యం ఉంది. ఇది అనుభవించడమే మన విధి.

ఇక, స్నేహసంపద , స్నేహము ఒక అపూర్వమైన అనుభవము. ఎంత గొప్ప సంపద స్నేహ సంపద ! అప్పుడు నేనున్న పరిసరాలనుబట్టి దేశ దేశాల వారితోను పరిచయం కావడానికి నాకు అవకాశం కలిగింది. గ్రీక్ యువకుడు దిమిత్రియనూ నేనూ కలిసి సముద్రతీరాన ఆడుకొన్నాము సింహళ ద్వీపంనుంచి వచ్చిన అమ్మాయికి మన దేవాలయాల శిల్పసంపద చూపించాను. బ్రిటిష్ రాజ కుటుంబంతో సంబంధం గల ఒకరికి మన పాఠశాలలో ఉన్నతాశయాలు గల కొందరు యువకులు చేస్తున్న విద్యాబోధ గురించి చెప్పాను. ఇలాగే ఎందరితోనో పరిచయం కలిగింది. ఇట్టే స్నేహితులై పోయేవారు ప్రతివారూ. వారు వేరూ నేను వేరూ అనే అభిప్రాయం కలిగేదికాదు ఒక్క క్షణమైన. ఆ స్నేహ వాంఛే ఇప్పటికీ నా జీవితంలో నాకు పట్టుగొమ్మగా ఉంది. "సృష్టిలో తీయనిది స్నేహమేనోయి" అన్న ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి మాటలు ముమ్మాటికి సత్యమయ్యాయి నా జీవితంలో.

## ౨

ఒకానొక సుందర దృశ్యము, ఒకానొక దివ్యమంగళ విగ్రహము, ఒకానొక పిచ్చికల....తరువాత ఎన్ని సుందర దృశ్యాలు చూచినా, ఎన్ని దివ్యవిగ్రహాలు కనపడ్డా, ఎన్ని వింతకలలు కన్నా, ఆ మొదటి దృశ్యమే, ఆ మొదటి

విగ్రహమే, ఆ మొదటి పిచ్చికలే, మరల మరల మనసులో అవతరిస్తూ ఉంటుంది.

నాకు నాలుగేళ్ళప్పుడు మా అమ్మను గోదావరి తల్లికి వప్పజెప్పి ఆ రాత్రికి రాత్రే నదినిదాటి విఙ్ఞేశ్వరం వస్తున్నాము, రహదారి పడవలో. మాఘ పౌర్ణిమ. వెన్నెలైనా, ఆకాశమంతా ఎందుచేతనో ఒకవింత వూదారంగుతో నిండి ఉంది. నక్షత్రాలు మెరిసిపోతున్నాయి. గాలిలేదు. సర్వమూ నిశ్శబ్దము. బొబ్బర్లంకలో సంపాదించిన ఊచబియ్యాన్ని రాల్చుకుంటూ పడవవాళ్ళందరూ ఒకమూల కూర్చున్నారు, కిక్కురుమనకుండా. పడవనిండా జనమున్నా ఎవ్వరూ పలకడంలేదు. హాలులో దీపం మినుకు మినుకు మంటోంది.

అప్పుడు, లక్ష కెరటాలమీద తేలిపోతూఉన్న చంద్రబింబంకేసి చూస్తూవున్న నా కళ్ళఎదుట ఆ కెరటాలమీద మా అమ్మ కనపడింది:

తెల్లని జరీ చీరె, బంగారపు వడ్డాణము, చేతులకు వంకీలు, మెళ్ళో కంటె, కాసులపేరు, చెవులకు బావిలీలు, ముక్కున అడ్డబాస, చెంపలకు చేర్చి దువ్విన నల్లని తలకట్టు, ఒంపైన కొప్పు, పెద్ద అరకాసంత కుంకుమబొట్టు, కప్పువేసిన పలవరుస, కొంచెం కనపరుస్తూ చిరునవ్వుతో నన్నుచూచి 'నాన్నా' అని పిలిచినట్టయింది. నేను 'అమ్మ అదుగో!' అనికేకవేశాను. ప్రక్కనేవున్న మా చెల్లెలు బావురుమంది. అప్పుడు మా తాతయ్య మమ్మల్ని ఇద్దరినీ తన సందిట్లోకి తీసుకొని, దుఃఖాన్ని దిగమింగుకొంటూ 'పిల్లలు జడుసుకుంటు న్నారు' అని మామీద దుప్పటీ కప్పాడు.

ఏబదిఏండ్ల క్రితం మాట అది. కాని, అప్పటికీ ఇప్పటికీ, ఎంతటి అద్భుతమైన సృష్టి వైచిత్ర్యాలని చూచినా, అఖండ గోదావరి కెరటాలలో అవతరించిన దృశ్యము జ్ఞప్తికి రాకమానదు. శివసముద్రపు కావేరీ ధారల్లోనూ, బొంబాయి సముద్రపు షికార్లలోనూ, ప్రయాగవద్ద యమునా నదీ నౌకావిహారా ల్లోనూ, హృషీకేశంలోని అతి నిర్మలమైన గంగానదీ అగాధపు లోతులలోనూ ఆ మొదటిదృశ్యమే కనబడుతుంది.

తాజమహాల్ చూచాను, నాలుగైదు సార్లు. ఒక పర్యాయం ఆ భువన మోహన శిల్ప సౌందర్యాన్ని నాతోకలిసి అనుభవిస్తూ, మిక్కిలి ప్రేమించిన

## నా స్మృతిపథంలో...

ఒక వ్యక్తినన్ను ఉద్దేశించే అభినయంతో 'చేతులార శృంగారము' పాడుతూ,

"అందమైన నిన్ను యురమున జేర్చి"

అన్నచోట నన్ను గబుక్కున తన హృదయానికి చేర్చుకుంది. నేను ఆనందం భరింపలేక, కళ్ళు మూసుకున్నాను. మళ్ళా ఆ దృశ్యమే ! అఖండ గోదావరి, మా అమ్మ.

*　　　*　　　*

జీవితాదర్శమైన నా సౌందర్యరాశిని నేను మొదట చూచినప్పుడు స్థంభితుడనై పోయాను. నా కోరికమీదనే ఆమెనుచూచాను. కాని, ఏమిమాట్లాడను? రెండవ పర్యాయం కన్నెత్తి చూడ్డానికి కూడా భయం వేసింది. ఆమె మాత్రము నిర్భయంగా నన్ను పరిశీలించి చూచి నా లోతు కనిపెడుతూ ఉన్నట్లు గ్రహించాను—ఆ మొదటిచూపు ఇప్పటికీ మరువలేను.

తర్వాత అనేక విషయాలు జరిగాయి—మంచీ, చెడ్డాకూడాను. ఒక దివ్య నిమిషం ఆమె నా ఒళ్ళో తలపెట్టుకుని అనిర్వచనీయమైన ప్రేమ దృక్కులతో నన్ను ముంచెత్తింది. 'నేను నీకు తగను' అని అంటూ గద్గదికయై ఏడ్చింది.

చంద్రవంకను ప్రతిఫలింపజేస్తూఉన్న ఆమె కన్నీటి బొట్లను నేను పెదవులతో అతిభక్తితో తుడిచాను. ఆ రుచి ఇప్పటికీ ఈ పెదవులను వదలలేదు.

ఆ దివ్యమంగళ విగ్రహాన్ని ఇప్పటికీ ఆరాధిస్తున్నాను. ఆమెకు మాత్రము నేను లేనేలేను.

"మోమున మోముజేర్చి నిను
　　ముద్దిడు కోరికలేదు, నీదు వ
క్షో మృదుశయ్యపైని శిరసున్
　　గెడవాలిచి ప్రేలు మల్లికా
దామ సువాసనా మధుర
　　తల్పరికింపగ గాంక్షలేదు, నా....

....ప్రేమకు దారి జూపగ వ
　　రించితి...."

అన్న కవిహృదయం ప్రకారము ప్రేమ పూర్తిగా అశరీరమైనదే!

*　　　　*　　　　*

తరువాత, అనేక అనుభవాలొచ్చాయి ఈ జీవితంలోకి.

అందాన్నే ప్రధానంగా చూచుకుంటూ గుజరాతులోనూ, కాశ్మీరంలోనూ, కలకత్తాలోను, మధురలోను, మలబారులోను అనేకులను చూచాను రూపసుల్ని. కొంతవరకు ఆకర్షించి ఈ హృదయాన్ని వశం చేసుకున్నారు. కాని తృప్తి ఎందుకుంటుంది!

చివరకు ఒకానొక ప్రణయ సంబంధానికి లొంగినా దానికికూడా కారణం ఆ మొదటి ఆదర్శంలోని ఏదోకళ ఒకటి ఈ వ్యక్తిలో కనబడడం వల్లనే కాని మరల మరల ఎప్పటి ఆరాధనే, ఎప్పటి అన్వేషణే, ఎప్పటి దాహమే!

అయితే, ఇన్ని ప్రేమ సంబంధాలను పెట్టుకోవడం ఏకాగ్రతకు లోపం కాదా, ఒక విధమైన మానసిక వ్యభిచారం కాదా అంటే:

ప్రేమ సంగీతం వంటిది, అనేక రాగాలతో కూడినది సంగీతం. నాకు సావేరి రాగం చాలా యిష్టం. సావేరి వింటూవుంటే పరవశుడనైపోయి, యేడ్చి వేస్తాను. కాని భైరవి రాగమూ ఇష్టమే. "జయజయ గోకులపాల...." వింటూ ఉంటే నా కళ్ళముందర గోపాలకృష్ణుడు తాండవమాడతాడు. "శివదీక్షా పరు రాలను" వింటూఉంటే శివభక్తుడనై పోతాను. దీనివల్ల నాకు ఏకాగ్రత లేదనడం న్యాయమా?

కళాపరిపూర్తికి ఈ రాగాలన్నీ తోడుకావాలి. ఏ మనోభావాని కనుగుణ్యంగా ఆ రాగం కదిలిస్తూవుంటుంది. అన్నిటికంటె నన్ను ఎక్కువగా కదిలించేది సావేరి. కాని, ఇతర రాగాలకు కూడా స్థానం ఉంది, గౌరవం ఉంది.

భౌతికంలోకి దిగకుండా ఉన్నంతవరకు ఎందరిని ప్రేమిస్తే ఏమి? ఎన్ని ఆత్మలను ఆరాధిస్తే ఏమి? మానసికపూజకు కట్టుబాట్లేమిటి?

ఈ పూజ, ఈ గౌరవము, ఒకమెట్టు దిగి అన్యోన్యాభి లాషకోసం దేవుళ్ళాడడం మొదలుపెట్టినప్పుడే వస్తుంది చిక్కు.

కాని, సంస్కారమంటే మన ఆశయాలని మన్నులో పడకుండా, కాచు కోవడమే. ఇది కష్టం కావచ్చు, తెలియని వారికి అమానుషంగా కూడా ఉండ వచ్చు. కాని, మనలో ఉన్న మృగత్వాన్ని నశింపజేసి దేవత్వం ప్రసాదించేదే నిజమైన ప్రేమ.

* * *

అంటే, ఇందాకటి కవికి భౌతికమైన ప్రేమ విలువ తెలియదనుకో కూడదు. అతని జీవితంలో ఇవన్నీ అనుభవిం ఉండొచ్చు. అతడు, ఒకప్పుడు వర్ణనాతీతమైన ఆనందాన్ని కూడా పొందిఉండవచ్చు వీనిద్వారా ;

కాని కొంతసేపో, కొన్నినాళ్ళో, కొన్నిఏండ్లో శరీరానికి ఉద్రేకం కలి గించి, రక్తాన్ని వేడిచేసి, ఇంద్రియ సౌఖ్యాల్ని ఇచ్చిన ఈ విలాసాలు అతనికి శాశ్వత మనిపించవు.

అవి అతని పరిణామంలో ఒకప్పుడు మిక్కిలి విలువకలవిగా కనబడ బట్టే—

"మోమున మోము జేర్చి
నిను ముద్దిడు కోరికలేదు"

అంటాడు.

"....వ్రేలు మల్లికాదామ సువాసనా
మధురత గ్రోలగ కాంక్షలేదు——"

అంటాడు.

అవి ముఖ్యమైనా, అతనికి ఆ "అప్రాప్త మనోహరి" తన "ప్రేమకు దారి చూపడమే" మరీ ముఖ్యం.

అయితే ఇందులో కూడా ఒక లోపం ఉంది.

నిజమైన ప్రేమకు ఇంకొకరు దారి చూపడమేమిటి? అప్రాప్త మనోహరి ఒకవేళ ప్రాప్తించినట్లయితే అతని ప్రేమకు దారి తెలిసినట్లా?

ఒకప్పుడు అట్టి విపత్తే జరిగితే, అతని త్రోవకు నిరోధం కలుగుతుంది కాని, ప్రేమ ప్రయాణం పైకిసాగదు. మనము కోరిన గగన కుసుమాలు మన చేతిలో పడితే అవి గగన కుసుమాలే కాకపోవచ్చును— ఎన్నెన్ని స్వర్ణ విగ్రహాలకు మంటికాళ్ళు ఉండడం మనం చూడ్డంలేదు?

ప్రేమకు దారిచూపమని ఆమెను కోరడం వెర్రి. ప్రేమకు దారి ఉండనే ఉంది. ఏకాంతసేవ— దివ్యనామార్చన— ఎడబాటు భరింపలేనపుడు వేడి నిట్టూర్పులూ, బాష్పసలిలధారలు. అయితే ఇవన్నీకూడా కొంత తక్కువరకపు వికారాలనే చెప్పాలి.

మనోహారిణి ప్రాప్తించడం ఎందుకు? ఏనాడు నీవు నిర్మల హృదయంతో ఆమెను నీ ప్రణయరాణిగా చేసుకున్నావో ఆనాడే నీకామె లభించింది. నిజమైన ప్రేమకు అవతల వారి అంగీకారంకాని, సహాయంకాని, అవసరమే లేదు. అవుంటే ప్రేమ పరిపూర్తి చెందుతుందని కొందరి మతం — కాని అవి లేకుండానే నానాటి కతిశయిల్లి గొప్పదయ్యే ప్రేమే నిజమైన ప్రేమ.

అయితే జనసామాన్యానికి మాత్రం పెద్ద పెద్ద ఆశయాలు పొసగవు. శారీరకమైన విలాసాలూ, తద్వారా ఆనందమూ, వివాహం, సంసారం, సంసార తాపత్రయాలూ—ఇవన్నీ జరగవలసినవే.

సంసారంలో ప్రేమ లేదనకూడదు. అద్భుతమైన ప్రేమ ఉండడానికి అవకాశాలున్నాయి. కాని ఈ అవకాశాలు ఇప్పటి పరిస్థితులలో రాణింపవు.

నిజంగా భార్యాభర్తల స్నేహంకంటె గొప్పస్నేహం లేదనవచ్చు. ఎంత అన్యోన్య ప్రేమఉన్నా, ఎంత త్యాగసంపత్తిఉన్నా, ఎంతటి సమాన ఆశయాలు ఉన్నా ఏ మిత్రద్వయమున్నూ అదృష్టవంతులైన దంపతుల అన్యోన్యానికి సాటికారు.

కాని ఇప్పుడు దేశంలో అమలులోనున్న వివాహాలలో అట్టి అన్యోన్యా నికి ఎంతవరకు, ఎందరి విషయంలో వీలున్నది ?

* * *

ఒకరి మనస్సులు ఒకరు అర్థం చేసుకుని. ఒకరి ఆశయాలకు ఒకరు దోహదం చేస్తూ అభివృద్ధిఅయ్యే ఐక్యాలు యెన్ని ఉన్నాయి మనలో ? లేనే లేవేమో.

అనేకులు భర్తలు తమ భార్యల విలువ తెలియకుండా ఉన్నవాళ్ళని నే నెరుగుదును. అనేకులు భర్తలు తమ భార్యలు దేదీప్యమానమైన అందం గల వారని ఎరుగరు — వారికి ఆ ధోరణేలేదు. అనేకులు భర్తలు తమ భార్యలకు అద్భుతమైన సంగీతజ్ఞాన ముందని ఎరుగనే ఎరుగరు.

* * *

ఒకనాడు మేము కారులో షికారు వెళ్ళాము. మా అక్కయ్య (డాక్టరు) అంది: "మా స్నేహితురాలుంది తీసుకువస్తాను" అని.

అలవాటు చొప్పున నే నన్నాను: "ఆమె అందంగా ఉంటుందా" అని.

"నువ్వున్నావుగా మహా నవమన్మధుడిలాగ" అంటూ నన్ను స్టెతస్కోపుతో కొట్టి వారి వీధికి కారు మళ్ళించింది — మా అక్కయ్య.

మేము రావడం కిటికీలోంచే చూచి కిటికీ తలుపులు దబాలునవేసి ఆమె అంతర్ధానం అయిపోయింది. కాని, ఆ క్షణంలోనే మెరుపు మెరిసినట్లు ఆమె దివ్యమైన దేహకాంతీ, తీవ్రదృష్టిగల విశాలనేత్రాలూ, సాక్షాత్తూ సంపెంగ పువ్వును అనుకరించే నాసికా, నిజంగా ఎర్రని నాజూకైన పెదవులూ నా కళ్లకు కనబడ్డాయి.

ఆమె వచ్చింది. నా కామెను పరిచయమేనా చేయలేదు మా అక్కయ్య. కాని, ఆమె ఏడేండ్ల కుమార్తె—అచ్చంగా తల్లి పోలిక—"కారు మామయ్యా" అంటూ నా ఒళ్ళోకి ప్రాకింది. "వూరుకో కనకం" అంది ఆవిడ. నేను కన కాన్ని మరీ దగ్గరకు తీసుకున్నాను.

త్రోవ పొడుగునా వారేదో మాట్లాడుతున్నారు. ఆ ఊళ్ళో ఆడవాళ్ళ క్లబ్బులు, క్లబ్బుకీమె వెళ్ళకపోవడమూ, ఎంత వెళ్ళాలని ఉన్నా ఇంట్లో తెమలకపోవడమూ, ఈ వూరొచ్చాక ఒక్క సినిమా అయినా ఎరక్క పోవడం, వారి పుట్టిల్లు విశాఖపట్టణపు సొంపూ, వాల్తేరులో సముద్రపు టొడ్డున వారి బంగళా, సింహాచలం అందం, ఆ సంపెంగ తోటలూ, గులాబీ వనాల్లో అత్తవారింటికి వచ్చేదాకా అన్నదమ్ములతోనూ, వదినెలతోను ఆమె విహారం చెయ్యడం-ఆమె చెపుతోంది ఉత్సాహంతో.

"నేనుకూడా వెళ్ళాను సింహాచలం, చాలాసార్లు. అద్భుతంగా ఉంటుంది. ఆ పోకచెట్ల పక్కని చిన్నబోదె ఉంది. ఆ బోదెచుట్టూ మెట్టతామర గింజల్ని యేరి దండలుగా గుచ్చేవాళ్ళం" అన్నాను నేను.

అప్పుడంది మా అక్కయ్య! "సత్యవతీ వీడు మా తమ్ముడు. చాలా కొంటెవాడు" అని. ఆమె లేతగా నవ్వినట్టు చూశాను....

మా అక్కయ్యకు "బోటనీ" (వృక్షశాస్త్రం) అంటే చాలా యిష్టం. కొండమీదికి వెళ్ళాక తానుతెచ్చిన తడివట్టివేళ్ళ సంచీలో రకరకాల మొక్కల్ని, పువ్వుల్ని యేరి నింపుతోంది కనకం సహాయంతో. "మీరు పదండి వస్తాము" అంది మాతో. తప్పనిసరిగా మేమిద్దరమూ పక్క పక్కన నడవడం ఆరంభించాము. తీగలాగ వూగిపోతూ ఉన్న ఆమె విగ్రహంనుంచి కళ్ళు మరల్చుకోవడం నాకు దుస్సాధ్యమైంది.

పడమటి కనుమ చేరాం. సూర్యుడు అప్పుడే ఇంటిముఖ మయ్యాడు. దట్టంగా కమ్మిన నీలమేఘాల సందునుంచి కిరణాలు దురాస్నున్న కృష్ణపాయలను వెండి సెలయేళ్ళుగా చేసేస్తున్నాయి. మాముందు ఆమడల పర్యంతం దట్టమయిన పచ్చని అడవి. నది అవతలి వొడ్డున కొండలు. బహురమ్యంగా ఉంది.

ఆమె అటు తేరిచూచి, ఉత్సాహంతో "అదుగో వేదాద్రి! అదుగో అమరావతి" అన్నది.

"మీకు అమరావతి తెలుసునా?" అన్నాను.

"తెలియకేం ? అక్కడ ఒకప్పుడు బౌద్ధస్తూపం ఉండేది.... నేను సార నాథ్ కూడా చూశాను.... అబూ పర్వతంలోని జైన దేవాలయాలూ చూశాను."

"ఇంకా ?"

"ఇంకా చాలాచోట్లు చూశాను—కాని—"

"కాని ?"

"ఏమి లాభము ?—అదో పూర్వజన్మ !"

నాకు ఆశ్చర్యం వేసింది. నేను తప్ప నా కారులో ఇంత భూప్రదక్షిణం చేసిన వాళ్ళు లేరని నా గర్వం.

"చెప్పండి—నాకు వినాలని ఉంది" అన్నాను ఆత్రుతతో,

"దిల్వారాలో ఆ అద్భుత శిల్పాలని చూచి—చనిపోవాలనిపించింది."

"ఎంతమాట."

"అవును—అంతటి సుందరమైన విషయాలను చూచాక, ఇంక జీవించడ మెందుకు !"

నాకు మరీ ఆశ్చర్యమైంది. ఒకానొకప్పుడు హంపీక్షేత్రంలో విరూపాక్షాలయం దగ్గిర ఒక మందిరంలో మహావలయాకృతిని రాసక్రీడ చిత్రించి ఉండటం చూశాను. కృష్ణకర్ణామృతములోని

శ్లో॥ అంగనా మంగనా మంతరే మాధవో
 మాధవం మాధవం చాంతరే చాంగనా
 ఇత్థమా కల్పితే మండలే మధ్యగ
 స్సంజగౌ వేణునా దేవకీ నందనః

అన్న వర్ణన ననుకరించి అద్భుతంగా చెక్కబడివుంది రాసక్రీడ. దానిని చూచి నేను స్నేహితుడు కృష్ణశాస్త్రితో అన్నాను: "అబ్బా ! ఏమి అందం! చచ్చిపోవాలని ఉందోయి" అని.

మరల ఇన్నేళ్ళకు అదే భావము : అద్భుతమైన అందాన్ని చూచి అంతటితో అంతమై పోవాలనే వెర్రి ఉద్రేకం—మరల ఈనాటికి ఈమెవల్ల విన్నాను.

ఆమె మాటలు ఇంకా వినాలని అనిపించింది. ఒకవేళ పాడగలదేమో?

"మీకు సంగీతము ఇష్టమా?"

ఆమె ఒక్కక్షణం ఆలోచించి, "ఇష్టమే—కాని పాడి కొన్నేళ్ళయింది" అన్నది.

"ఏం—ఇప్పుడు మానివేశారా?"

మౌనము.

"ఈ దివ్యసమయములో కొంచెము పాడాలని లేదా?"

ఆమె నాకేసి చూడలేదు. మరల అడిగాను: "పాడరా—నే నడుగుతున్నాను కాబట్టి...." (ఏమి చొరవ!)

ఏమి ఆ చూపు! జాలిపడుతూ, జాలి చూపిస్తూ, జాలి కోరుతూ, జాలిని కలిగిస్తూ నన్ను చకితుణ్ణి చేసింది. ఆమె పెదవులు కదిలాయి.

"ఏమి పాడను?"

"ఏదయినా సరే—మీ యిష్టం వచ్చినపాట."

నేను కళ్ళుమూసుకున్నాను.

తేనె సోనలు చింద నారంభించినాయి.

"క్షీరసాగర శయనా—నను

చింతల బెట్టవలెనా...."

ఎంతసేపు పాడిందో ఆమె....ఆ ప్రశాంత సమయంలో, దేవతలు విహరించే వేళ, ఎంత స్వానుభవంతో, ఎంత దీనంగా, ఎంత మధురంగా, ఎంత జాలిగా ఆలాపించిందో ఆమె, నేను చెప్పలేను....

"మా అక్కయ్య ఎప్పుడో వచ్చి మోకాళ్ళమీదికి వ్రంగివున్న నాతలను తన మెత్తని చేతులతో నిమురుతూ "ఏమిటది" అని, నా కన్నీటిని చూచింది.

కనకం తల్లి ఒళ్ళోచేరి "అమ్మా! ఎందుకే ఏడుస్తున్నావు" అన్నది.

మా అక్కయ్య దొంగకోపంతో "చాల్లెండి — సెంటమెంటల్ ఫూల్స్!

పదండి, చీకటి పడుతోంది" అని ఆమెను బహు నెమ్మదిగా లేవ దీసింది; కౌగలించుకుంది.

సూర్యుడు ఎఱ్ఱబారిన మొగంతో "వెళ్ళిపోతున్నారా? నేనూ వెడు తున్నాను" అన్నట్టు వేదాద్రి వంకకు మరిగాడు, మేము ఇళ్ళకు చేరు కున్నాము.

ఆ రాత్రి ఆమెభర్త—వాసుదేవరావు ఆమెను కొట్టాట్ట !

*　　　*　　　*

తరువాత చెప్పింది మా అక్కయ్య: వాసుదేవరావుగారు భార్య పోగా మరదల్ని సత్యవతిని పెళ్ళాడాడనీ, సత్యవతి తండ్రి సర్వే ఇలాకాలో గొప్ప ఉద్యోగం చేసి ఫించను పుచ్చుకొని, విశాఖపట్టణంలో కాపురముండేవాడనీ — కాలక్రమేణా కలకత్తా గుఱ్ఱపు పందాలలో ఆమె అన్నగారి ఆస్తి అంతా చాల వరకు పోయిందనీ, తండ్రి గతించాక సత్యవతికి ఈ ఆనుకోని పెళ్ళి; అతను చాలా మంచివాడైనా, ఒంటెత్తు గుణం కలవాడనీ, ఎప్పుడూ తన వంతెనలూ, రోడ్లూ, కంటాక్టులే తప్ప వేరే వ్యాపకం లేనివాడనీ, దేశదేశాలలో మహా తీవిగా వెలిగిన ఆమె తండ్రిద్వారా ఆమెకు కలిగిన విద్య, కళా వ్యాపకము, అన్నీ బూడిదలో పోసిన పన్నీరయినాయనీ, అతనికి రూపవతిన్నీ, తనకంటె ఎక్కువ సంస్కారి అయిన భార్య అంటే తగని అనుమానమనీ, ఆమె ఎవరితో నైనా, ఆడువారితో గాని, మగవారితోగాని, మసలితే పట్టలేనంత ఈర్ష్య, కోపము వస్తాయనీ, ఆమె కనకంమీద పంచప్రాణాలు పెట్టుకొని ఎట్లాగో కాలం గడుపుతోందనీ. ఇంకా ఏవేవో చెప్పింది మా అక్కయ్య.

ఆ రాత్రి నాకు నిద్దురలేదు. రెక్కలమీద ఆమెవద్దకు వెళ్ళి ఆమె రెండు చేతులూ పట్టుకొని "అమ్మా విచారపడవద్దు, నేనున్నాను మిమ్మల్ని పూర్తిగా అర్థం చేసుకోగలవాణ్ణి, మీ లాగే బాధపడుతూ ఉన్నవాణ్ణి. మీలోఉన్న నిరా శనూ, నిరుపేదరికాన్ని నేనూ అనుభవించాను. అనుభవలోకంలో మన మిద్ద రమూ సహచరులము, స్నేహితులం" అని పూరడించాలని ఎంతో

అనుకున్నాను। కాని, ఏమి లాభం? ఆశలు గుర్రాలైతే, బిచ్చగాళ్ళు రౌతు లవు తారు!

మా ఇద్దరి మధ్యా సంఘ నియమాలనే మహా కందకం ఉంది....

నాటికీ, నేటికీ, నేను మళ్ళా ఆమెను చూడలేదు....కనకం పుట్టినరోజుకు మాత్రం నాకు "కారు మామయ్యకు" అని పట్టుజేబురుమాలు వస్తూఉంటుంది. ప్రతి శ్రావణశుద్ధ పంచమికి సత్యవతీదేవికుట్టిన సువర్ణాక్షరాలతో నేను ఎక్కడ వుంటే అక్కడికి పట్టురుమాలు కానుకగా వస్తూ ఉంటుంది, నా తడికళ్ళను అద్దుకోడానికి.

జవాబు వ్రాయాలని ప్రయత్నిస్తాను. "కొంప మునుగుతుంది సుమా!" అంటుంది– మా అక్కయ్య, ఆమెకు సంఘపు మొట్టికాయల బాధ తెలుసును కాబట్టి.

సంఘమేకాదు. ఈర్ష్యాపిశాచం కూడాను. "అమ్మ పెట్టదు; అడుక్కు తిననీయదు" అన్నట్టు తానామెకు ఆనందం ఇయ్యడు; ఇచ్చే త్రోవలను నిరోధిస్తాడు. భార్య అతనికి విలువగల ఒక వస్తువైందిగాని, ఆమె గౌరవానికి, తన స్నేహానికి, తన అనురాగానికి, ఒక్కొక్కప్పుడు తన భక్తికి నిలయమైన తేజస్స్వరూపిణి అని గుర్తెరగడు. మమకారంతో చూచుకుంటూ ఉన్న మడి మాన్యాలలో ఆమెకూడా ఒకర్తె. తన తోటలోని గులాబీ పువ్వులను ఇతరులు తేరిపారజూస్తే కర్రపుచ్చుకునే తోటమాలిలాగే ఇతనున్నూ. ఎవరైనా తన భార్య లావణ్యాన్ని కన్నెత్తి చూచినా, అమె మృదుల సంభాషణవల్ల కొంత మనశ్శాంతి పొందినా ఇతనికి కిట్టదు.

ఇక వీరిద్దరి మధ్యా స్నేహం ఎల్లా కుదురుతుంది? పాపం! అక్కడికీ ఆమె అనేక విధాల అతని వ్యాపకాలతో జోక్యం కలిగించుకొని అతను ఇంటికి వచ్చాక, తినికూర్చుని తమలపాకులను అందుకుంటూ ఉన్నప్పుడు, మెల్లిగా అడుగుతుంది: 'ఈవేళ ఆఫీసులో జరిగిన విషయాలు ఏమి' టని. అతనికి చెప్పటానికి ఓపికేది? అడిగించుకోవాలనీ. కనకం సంగతీ, కనకం ఎదుగుతో ఉన్న విషయం, కనకం చిన్ని హృదయంలోంచి మొలకెత్తుతూన్న చిన్నారి

భావాలూ, ఆమె అల్లరీ, అప్పుడే సంగీతంలో ఆమె చూపిస్తూవున్న శ్రద్ధ, స్థానం పాటలను అచ్చంగా స్థానంలాగే పాడటం, ఇవన్నీ అతనితో చెప్పాలని ఉంటుంది ఆమెకు. కాని అతనికి తీరికేది? పక్క ఇంటికి కబురు పంపించి తెప్పించిన అర్ధణా పేపరులో జమ్మలమడుగు వృత్తాంతాలని చదువుతూ నిద్దరవచ్చే అతనికి ఈమెతో సల్లాపమే అక్కరలేదు. గుర్రుపట్టి నిద్రపోతాడు. ఆమె ఒకసారి పక్కదగ్గరికి వెళ్ళి కనకాన్ని తడిమి చూచుకొని కింద పడుతుందేమో నని ఈవైపూ ఆ వైపూ తలగడలను సరిచేసి వచ్చి పడుకుంటుంది. కాని, నిద్రవస్తేగా ! మళ్ళా లేచివెళ్ళి చల్లగాలిలో కొంచెం హాయి అనుభవించి పడకటింటి మూలను భద్రపరచిన వీణను తీసికొని శ్రుతులు సరిచేసుకొని ఇష్టం వచ్చిన వర్ణమో, ఏదో పదమో పలికిస్తూ వీణతో చెప్పుకుంటుంది, తన భగ్నహృదయపు గాథను.

*　　　*　　　*

భార్య తన స్వార్జితమైన చరాస్తి, నిజంగా స్థిరాస్తి కూడాను అని అనుకుంటూన్న భర్తలే కాదు, అదే విధంగా భర్తకూడా తమ ఆస్తి అనుకునే భార్యలూ వున్నారు. వీరి విషయంలో సాధారణంగా ఈ భావము ప్రేమోద్రేకం వల్ల వచ్చిందేమో - ఆర్థికంగా మాత్రం కాదు. మొట్టమొదటి చనువులను పూతగా తీసికొని వీరు భర్తను తమ అనుచరుణ్ణిగా చేసుకుంటారు. ఆమెమీద అపరిమితమైన ప్రేమవల్లో, సహజంగా ఇతనిలో ఉన్న స్త్రీ జనమందలి గౌరవంవల్లో ఇతడు ఆమెను చాల చాల పెద్దచేసి అన్నివిధాల ఆమెకు సంతోషం కలిగించాలనే చూస్తుంటాడు. ఏమి చేసినా, ఆమెను కనుక్కోకుండే చేయడు. ఏ ఆనందం అనుభవించినా ఆమెతో పాటే అనుభవిస్తాడు.

కాని, ఏ ముహూర్తాన వస్తుందో, శాంతి నికేతనం నుంచి బెంగుళూరు వెడుతూ పూర్వపరిచయంవల్ల బెంగాలీ అమ్మాయి రేణుక వీరింట్లోనే దిగాలా! రేణుక మన పార్వతికంటే ఎక్కువ అందంగా ఎందుకుండాలి? పార్వతికంటే వేషభాషలలో ఎక్కువ నాజూకుగా ఉండటం రేణుక తప్పా? పూర్వం కొన్ని యేండ్లు తనతో సహాధ్యాయుడై ఉన్న మోహన్‌తో ఆమె చనువుగా ఉండటం

ఆమెకు తప్పులా కనపడదు. అతను సోఫాలో కూచుంటే దబ్బున వెళ్ళి అతని పక్కనే కూచుంటుంది. అతను లేచి వెళ్ళి యింకో కుర్చీలో కూచుంటే ఏం బాగుంటుంది? వారిద్దరి మధ్యా తాను కూర్చోవాలని ఎన్నిసార్లు ప్రయత్నం చేస్తుంది పార్వతి?

"ఈ మధ్య వసంతోత్సవం చేశామోయ్ బోల్పూరులో. గురుదేవుడు నా నృత్యాన్ని చూచి ఆనందమయుడయాడు. 'బిడ్డా! ధన్యురాలవు' అని కౌగలించుకున్నాడు" అంటుంది రేణుక.

ఆమెను నిదానించి చూచి, నృత్యము కోసమే సృష్టింపబడ్డ ఆమె అంగ సౌష్ఠవానికి ఒక్క నిమిషము అతడు సంతోషించటమూ, ఆ పొగడ్త అతని చూపులలో ప్రసరించడమూ పార్వతికి ఎల్లా కిడుతుంది?

సాయంత్రము బీచికి వెళ్ళాలని ముగ్గురూ బయలు దేరతారు. కారులో ఎక్కబోతూ వుంటే, కలెక్టరుగారి భార్యవచ్చి "పార్వతీ" అంటుంది. కలెక్టరు గారి భార్య కొంచెం పూర్వాచారం కలది. మోహన్‌తో మాట్లాడదు. పార్వతి వెనకుండిపోతుంది. వారు వెళ్ళాలా, వద్దా? -పోనీ, ఆమె నిలబడిపోయిందని వారు ఆగరాదూ? రేణుక రోజూరోజూ వస్తుందా? మళ్ళా ఎన్నాళ్ళకొస్తుందో ఈ వూరు! కలకత్తా, ఆవేపున, సముద్రం వుండదు. మోహన్ భారమంతా డ్రైవరుమీద వేసి వూరుకుంటాడు. క్రొత్తదృశ్యాలని చూడాలని ఉన్న రేణుక ఉత్సాహం డ్రైవరుని కమ్మివేసి పార్వతి లేకుండానే బీచి ప్రయాణం సాగుతుంది.

ఎంత మంచి మోటారైనా ఏదో మర పాడవడం ఆశ్చర్యమా? రాకరాక వచ్చిన రేణుక కోసం మరోగంటసేపు భోంచెయ్యకుండా కనిపెట్టుకోవడంలో అంత గొప్ప ఇబ్బంది లేదు. కాని, కలెక్టరుగారి భార్య పుణ్యమా అని రేణుక "తెయితక్కల బొమ్మ"యింది. ఆమెకోసం కనిపెట్టుకోవడం కంటకమయి పోయింది, పార్వతికి.

వారిద్దరూ ఉత్సాహంతో మేడమెట్లెక్కి రావడం వింది. వారు హాలులో కొచ్చేసరికి పార్వతికి తలనొప్పి వస్తుంది.

"అయ్యో! ఇంత సేపూ ఇంట్లోనే వున్నారా? చల్లగాలి లేకపోతే తల నొప్పి రాదూ? ఈ కిటికీ తీయనా?" అంటుంది రేణుక.

"వద్దండి! చలేస్తోంది - మీరెళ్ళి భోంచెయ్యండి" అంటుంది పార్వతి.

మోహన్‌రా వేంచేస్తాడు ?

"అమృతాంజనం పట్టుకొచ్చి రాయనా?" అంటాడు. కాని, ఆమెకు కావలసింది ఆ అంజనం కాదు!

"ఏమీవద్దు! మీ రిద్దరూ వెళ్ళి భోంచెయ్యండి. పరమాన్నం చల్లారి పోయిం దప్పుడే" అంటూ, అతనికేసి చూడనయినా చూడదు. ఎప్పుడో మధ్యాహ్నం తాగిన కాఫీ—ఇంక ఆమెను మరీ బతిమాలలేక, వారిద్దరూ భోజనానికి వెడతారు.

రోజూ అయిదు నిమిషాలలో భోంచేసి చెయ్యి కడుక్కునే మోహన్ అరగంట ఎందుకుండాలి భోజనం దగ్గర? ప్రతి వస్తువు మారు వడ్డించుకుంటున్నాడు. ఆమెకు మన వంటకాలన్నీ వర్ణించి చెపుతూ ఇంకా రుచి చూడమని బలవంతం చేస్తూన్నాడు!

పార్వతి తన తలనొప్పి మాట మరచిపోయి రొజుకుంటూవచ్చి "అవ్వగారూ, పెరుగెక్కడుందండీ!" అంటూ, వెండిగిన్నెలో పెరుగు తీసుకొని వారిని కనుక్కోకుండానే దబదబా వారిద్దరికీ వడ్డించి మెరుపులాగ మళ్ళీ పడక టింటిలోకి వచ్చేస్తుంది.

వారిద్దరికీ తమలపాకుల్ని పంపిస్తుంది. మోహన్ వినేట్టుగా"సుబ్బారావూ! డ్రైవరుని కారు తెమ్మను. అమ్మగారు రైలుకెళ్ళాలి!" అంటుంది.

పాపము! రేణుక ఇంకా నాలుగైదురోజు లుంటుందేమో, ఆమెవల్ల పార్వతి ఇంకా క్రొత్తవిషయాలను తెలుసుకుంటుందేమో, ఈవూళ్ళో కొందరికైనా వంగదేశపు కళంటే ఏమిటో, వారు మనకంటే ఎందుచేత గొప్ప వారయారో చూపించాలని అనుకున్న మోహన్ ఇప్పుడు ఆమె ప్రయాణాన్ని ఎల్లా ఆపగలడు? రేణుకకూడా తన ప్రోగ్రాం ప్రకారము మోహన్‌వద్ద నాలుగైదు రోజు లుందామని వచ్చినా, ఇంకమీదట ఎట్లా వుంటుంది ?

రైలు కదులుతూండగా అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని రేణుక అంటుంది:

"నాకు తెలుసు....విచారించకు....కాని, ఆమె సౌఖ్యాన్నే నీ సౌఖ్యంగా చూచుకో!"

పార్వతీ మోహనుల మధ్య అంకురించిన ఈ చిన్నగాలి ఈదరగాలై, హోరుగాలై, తుఫానై, ఉప్పెనై, ప్రళయమై, వారిని శాశ్వతంగా విడతీసి వేసింది. ఎవరిది తప్పు?

తప్పెవరిదైతేనేమి? వీరిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకోడానికి ప్రయత్నించక పోవడమే విచారకరం. ఆపేక్ష, అనురాగమూ, వేరు—ప్రేమ వేరు. ప్రేమలో స్నేహం వుంది. ప్రేమలో స్వార్థం ఇసుమంతైనా లేదు. త్యాగ స్వరూపమే ప్రేమ!

నీ ఆరాధ్య దేవతను చేతులార లోకపు ఆరాధ్య దేవతగా చేయగలిగి నప్పుడే ధన్యుడవు.

"నీ వెత హరింతు—సుఖమెల్ల నీకె యింతు" అన్న ప్రియుడే గొప్ప ప్రియుడు.

నిజమైన ప్రేమ అంటే భౌతికం కాని అశరీరమైన ఆశయారాధన.

మనం మిక్కిలి హృదయపూర్వకంగా ఆరాధిస్తూ ఉన్న ఆశయాలు, మన నిజమైన అనుభవాల పరిపూర్తి, మనము పైకి చెప్పడానికికూడా భయపడే గొప్ప కోరికలు, అన్నీ మూర్తీభవించి ఒక దివ్యమంగళ విగ్రహంలో 'సగుణ బ్రహ్మ'గా అవతరిస్తూ ఉంటాయి.

కాని మన అజ్ఞానం వల్ల ఒక్కొక్కప్పుడు వీనిని భూలోకానికి దిగలాగ చూస్తాము. అప్పుడే అంటాడు కవి:

"ఔర! ప్రభాత శైల సానూపలనీలపాళి కల నొత్తకయే స్రవియించు ఆ హిమానీ పరగాయనీ గళవినిస్రుత మాధురి మంటి కీడ్తురా?" అని.

ఉత్తమకవి, ఆదర్శప్రియుని దృష్టిలో:

## నా స్మృతిపథంలో ...

" ప్రేయసి పోయగమ్మ్మనకు లేదు శరీరము;
లేదు మేను నా తీయని ప్రేమకేని,
కలదే యెడ బాటిక మాకు"....

కాని, కొన్ని కొన్ని గొప్ప ఉద్దేశాలను మనసులో జపించుకోవడం ఒకటి, వానిని అనుభవాలుగా చేసుకోవడం ఒకటి. ఒక్కొక్కమారు మన ఆశయాలు చాల దగ్గరగా అందుబాటులో ఉన్నట్టుంటాయి. ఎన్నాళ్ళనుంచో మనసులో చిత్రించుకున్న గుణపరంపరల నన్నిటినీ, ఎన్నాళ్ళనుంచో హృదయంలో ఆరాధిస్తూ ఉన్న విలాసాలను అన్నిటినీ, ఆఖరికి, ఒక్క వ్యక్తిలో చూచామనుకుంటాము. అన్వేషణ పూర్తి అయిందనుకుంటాము. కాని, చివరికి ఏదో లోపం వుంటుంది.

ఎంతటి స్వర్ణ విగ్రహానికైనా కాలి గోరికైనా మన్ను తగిలివుంటుంది. అప్పుడే వస్తుంది ఆశాభంగము. భరింపరాని ఆశయ భంగము ! ఆ స్థితిలోనే అంటాడు కవి:

"ఏ మృగతృష్ణనో వలచి యేడ్చేదు, నీ
దురదృష్ట జీవిత
ప్రేమము నీ యెడంద కొన రెక్కల కేనియు
నందరాని స్వ
ర్గామృత నందన ప్రసవమయ్యెగదా ! వెదకాడ
బోయె దే
లా మిహికామృషా పథములం దని రందరు
నవ్వులాడుచున్."

[ఈ ఘట్టం మరొక రూపంగా ఇరవై యేళ్ళ క్రితం అచ్చయింది. కాని, ఈ అనుభవాలలోని శాశ్వతమైన విలువలను ఈ తరంవారికి అందించే ఉద్దేశ్యంతో, ఈ "స్మృతి పథం"లో చేర్చబడమైనది. - రచయిత]

# 3

చెన్నపట్టణం కుంకువారి అగ్రహారంలో నా చిన్నప్పుడు కొన్నేళ్ళు న్నాము. నాన్న డాక్టర్ పరీక్షకు చదువుతూ వుండేవారు. పై చదువుకోసం ఆయన చాల కష్టపడ్డారనీ, ఒక అవసరంలో అమ్మ తన నగలిచ్చి ఆయన చదువుకు తోడ్పడిందనీ మా మామయ్య చెప్పారు ఓసారి. చిన్నప్పుడు నేను చాలా అల్లరి చేసేవాడినట. ఒకసారి నాన్నలా వుండాలని ఆయన కోటు తొడుక్కొని బడాయిగా యిటూ అటూ పచారు చేసింది నాకు జ్ఞాపకముంది. అప్పుడు నాకు నాలుగో యేడనుకుంటాను. అయినా ఎన్నోవివరాలు యిప్పటికీ కండ్లకు కట్టినట్లుంటాయి. ఆ రోజులలో పట్టణవాసమైనా ఇరుగు పొరుగువారు ఎంతో సౌజన్యంతో వుండేవారు. దాక్షిణాత్యులు-ఉత్తరాదివారు అనే తేడాలు ఉండేవి కావు. ప్రక్కయింటి పిల్లలు మాతో వచ్చి ఎంతో చనువుగా ఆడుకుంటూ వుండేవారు. మేమున్న ఇంటి ఆవరణలో జామి చెట్టు వుండేది. కొమ్మమీద చిలుక, చిలుక కొట్టిన యెర్రనిజామపండు ఇప్పటికీ జ్ఞాపకమున్నాయి. ఆరోజులలో ఒక పర్యాయం పార్థసారథి గుడికి వెళ్ళాము. ఏదో విశేషము. ప్రభల వూరేగింపులు చూశాము. ఫలానావారి ప్రభ, ఫలానా వారి ప్రభ, అంటూ మామయ్య అమ్మతో చెబుతూ ఉండడము బాగా జ్ఞాపకముంది.

పార్శీ నాటకాలు అప్పుడే కొత్తగా వచ్చాయి. రంగస్థలం నిర్మాణంలో అద్భుతమైన శిల్పం చూపేవారు పార్శీవారు. ఒక నాటకంలో సీనుమీద విరగ బూసిన దానిమ్మ చెట్టు చూపారు, రంగస్థలమున, ప్రేక్షకులున్నచోట కూడా ఒక్క నిముషం దీపాలు ఆర్పివేశారు. ఆ చీకటిలో దానిమ్మ పువ్వులు ఎర్రగా ధగధగ లాడుతూ కనిపించాయి.

నా కంటే రెండేళ్ళు పెద్ద మా అక్కయ్య. రెండేళ్ళు చిన్న మా చెల్లాయి. నే నెంత అల్లరి పిల్లవాణ్ణి అనిపించుకునే వాణ్ణో మా అక్కయ్య అంత మంచి పిల్ల అనిపించుకునేది. ఒకసారి తన మువ్వల వడ్డాణము పారేసుకుని, అందుకై విచారపడటానికి బదులు "వడ్డమ్మ పో! వడ్డమ్మ పో!" అంటూ

వయ్యారంగా చేతులు తిప్పేది—నాకు జ్ఞాపక ముంది. ఈ నెమ్మదే యిప్పటికీ ఆమెలో ఉంది.

నాల్గవకాన్పుకు అమ్మను పుట్టింటికి తీసుకువెళ్ళడానికి తాతయ్య వచ్చారు. వారు రావడం ఎందుచేతనో చాలా ఆలస్యమైనందున నాన్నగారు 'అమ్మ ఈ వూళ్ళోనే పురుడు పోసుకోవచ్చు' నన్నారు. కాని తాతయ్య నిరుత్సాహపడతా రేమో నని పుట్టింటికే పంపారు. ఆ రైలు ప్రయాణము నాకు బాగా జ్ఞాపక ముంది. బాపట్ల - తెనాలి, మధ్య అమ్మ రైలులోనే నీళ్ళాడింది. రైలు ఆపారు. ప్రయాణీకులు ఎంతో సహాయం చేశారు. ఎక్కడనించి అవత రించిందో! మంత్రసాని సాయపడింది. స్టేషన్ మాస్టర్ ఇంట్లో మాకు—పిల్ల లకు అన్నము పెట్టారు. ఆ నాడు వారింట రుచిచూచిన పాత చింతకాయ పచ్చడి రుచి ఎప్పటికీ మరువము. అవ్యాజమైన సానుభూతికి, అకారణమైన ఉపకార చింతకు చిహ్నంగా వుంటుంది, ఆ రుచి నా స్మృతిలో.

మా స్టేషన్ జేరాక అమ్మను మేనా సవారీలో ఇంటికి తీసుకువెళ్ళారు. మేము రెండెడ్ల బండిలో వెళ్ళాము. రైలులో పుట్టిన శిశువు దక్కలేదు. అంతే గాక అమ్మకు జబ్బుకూడా చేసింది. ఆమె జబ్బులో వుండగా, నాన్న ఒకటి రెండు పర్యాయాలు వచ్చి చూసి వెళ్ళారు. నాడు, మా మేనమామ కొడుకుతో ధాన్యపు బస్తాలమీద కూర్చుని ఆడుకుంటూ ఉంటే నాకు దెబ్బతగిలి రక్త మొచ్చింది. ఆ రక్తంతో నేను అమ్మదగ్గరకు వచ్చాను; ఎంతో జబ్బులో ఉన్న ఆమె చటుక్కున లేచి కూర్చుని "అయ్యో! నా బిడ్డా!" అంటూ ఎంతో కంగారు పడింది. బలవంతాన ఆమెను మళ్ళా పడుకోబెట్టి నన్ను వైద్యుని వద్దకు తీసుకువెళ్ళారు. గాయం చిన్నదే. ఐతే అప్పుడు అమ్మ పడిన ఖంగారు నా స్మృతి పథంలో అల్లాగే వుండిపోయింది. తరువాత నలభై ఏళ్ళకు "మాతృ హృదయం" అనే చిన్న నాటిక వ్రాస్తూండగా మరీ మరీ జ్ఞాపకం వచ్చింది. కొడుకు ప్రియురాలికి పూర్తిగా వశ్యుడై పోతాడు. ఆమె ఏది కోరినా తల్లి వద్ద తీసుకొని వెళ్ళి అర్పిస్తూ వుంటాడతను. ఎంత దుర్లభమైన వస్తువైనా అతడు దుర్వినియోగం చేస్తున్నాడు అని తెలిసికూడా తల్లి కాదనక ఇస్తూ వుంటుంది. ఆఖరికి "నీ తల్లి గుండెకాయ తెచ్చి ఇవ్వు- నీవు నిజంగా నన్ను

ప్రేమిస్తే" అంటుంది ప్రియురాలు. ఈ కోరిక అడగటానికి అతను చాలా సందేహిస్తుండగా తల్లి తెలుసుకొని, "ఈమాత్రానికేనా! నన్ను చంపి నాగుండె కాయ తీసుకెళ్ళు. మీ రిద్దరూ సుఖంగా వుండండి. అంతే చాలు" అని ఆశీర్వ దిస్తుంది. మాతృ హృదయాన్ని మూట కట్టుకుని అతడు ప్రియురాలివద్దకు తొందర తొందరగా వెళుతూండగా ముఖం ద్వారబంధానికి ఠంగున తగులు తుంది. బాధతో అతను "అమ్మా" అనగా, మూటలోని తల్లిహృదయం "దెబ్బ తగిలిందా! నాయనా!!" అని వోదారుస్తుంది. ఈ సన్నివేశాన్ని ప్రదర్శించే టప్పుడు మరీ మరీ అనుకున్నాను, చిన్ననాడు నాకు తగిలిన గాయానికి అమ్మ ఎంత ఖంగారు పడిందో అని. తర్వాత ఎన్ని గాయాలు తగిలాయి! — భౌతి కంగా కాదు; మానసికంగా. అనేకపర్యాయాలు తల్లిలేని లోటు అనుభవించాను.

అమ్మకు జబ్బు ఎక్కువ కాగా రాజమహేంద్రవరం తీసుకువెళ్ళారు. నాన్నగారు ఆ యేడే డాక్టర్ పరీక్ష ప్యాసయ్యారు. ఆమెను బ్రతికించాలని చాలా ప్రయత్నించారు. కాని, విధి బలీయమైంది. ఆమెను గోదావరికి వప్ప గించి, రాత్రికి రాత్రి పడవలో వియ్యేశ్వరం వచ్చేశాము.

నాచిన్నతనము కొన్నేళ్ళు నాతల్లిగారి పుట్టింటనే గడిపాను. అమ్మమ్మ తాతయ్య మమ్మల్ని పంచ ప్రాణాలుగా కాపాడేవారు. మా మేనమామ తన కొడుకూ, కూతురూ కంటే ఎక్కువ ఆప్యాయంగా చూసేవారు మమ్మల్ని. కొడుకుని సుబ్బారావూ అని పేరుపెట్టి పిలుస్తూ నన్ను నాన్నా! నాన్నా!! అనే వారు. ఆటల్లో నాకూ సుబ్బారావుకు ఏమి హెచ్చు తగ్గులు వచ్చినా, మామయ్య ఎప్పుడూ నా పక్షమే తీర్పు చెప్పేవారు.

సుబ్బారావూ, నేను జోడుగా పెరిగాము. ఇద్దరికీ ఒకే మోస్తరు లాగూ చొక్కా, ఒకేమోస్తరు టోపీ. ఒకే కంచంలో తినేవాళ్ళము, ఒకే పక్కలో పడుకునే వాళ్ళము. బడికి వెళితే అతనికి 'శ్రీ' నాకు 'చుక్క' ఒక్కొక్క ప్పుడు నాకు 'శ్రీ' అతనికి 'చుక్క', విజయదశమి దసరా వేడుకలకు గిల కలు పట్టేవాళ్ళము, మమ్మల్ని యిద్దర్నీ అత్తయ్య అతిరమ్యంగా సింగారించేది. జలతారు తాపిన మఖమల్ లాగు, కోటు తొడిగి, జలతారు టోపీ పెట్టేది. ఆమె దిద్దిన కళ్యాణము బొట్టును నేను ఎన్నోసార్లు జ్ఞాపకం చేసుకున్నా,

ఆతని మెళ్ళో తన కాసులపేరు వేసేది. నా మెళ్ళో మా అమ్మ కాసులపేరు వేసేవారు. ఒక పర్యాయం నేను మా అమ్మ వడ్డాణముకూడా మెడలో వేసు కుంటాను అని మారాం పెట్టాను. "అబ్బే వడ్డాణము మెళ్ళో వేసుకోరు! నీవు పెద్దవాడ వయ్యాక నీ పెళ్ళాము నడుమున పెట్టుకుంటుంది మీ అమ్మ వడ్డాణము" అని నన్ను మరపించేవారు.

విజయదశమికి గిలకలు పట్టుకొని మా మేష్టారుతో చుట్టుపట్ల వూళ్ళన్నీ తిరిగేవాళ్ళము! ఆ! "జయా విజయీభవా, దిగ్విజయీభవా" లో ఎంత ఉదాత్త ముండేదో ఎక్కడకు వెళ్ళినా మేష్టార్ని బాగా సత్కరించేవారు. అక్కడికి పది మైళ్ళ దూరంలో వున్న మా పితామహుల వూరికి వెళ్ళాము. మా తాతయ్య అప్పుడే స్నానం చేసి వచ్చి, రుద్రాక్షమాల తిప్పుకుంటూ అరుగుమీద కూర్చు న్నారు. "ఘన తురంగము నెక్కి కత్తి చేతబట్టి" అనే దసరాపద్యం చదివి "జయా విజయీభవా! దిగ్విజయీభవా!" అంటూ నేను గిలకను గట్టిగా లాగి విడిచాను. తాతయ్య ముఖం నిండా ఎర్రని బుక్కా! పిల్లలంతా బిగ్గరగా నవ్వారు. మా మేష్టారు భయపడ్డారు. కాని, తాతయ్య నవ్వుతూ "ఆరి పిడుగా! ఇప్పటినుంచీ భాగంకోసం యుద్ధానికి వస్తున్నావా" అంటూ మడిగట్టుకున్నా, నన్ను దగ్గరకు తీసుకొని బుజ్జగించారు. మేష్టారుకి ఒక వరహా, జరీ పంచల చాపు ఇచ్చారు.

బడిలో మా చేత నాటకాలు వేయించేవారు. ఇన్‌స్పెక్టర్‌గారు వచ్చి నప్పుడు తోటమాలి రాముడు నాటకము వేశారు. ఆ నాటకంలో తోటమాలిని నేనే! ఆ అనుభవం వల్లనే కాబోలు ఇప్పటికీ నాకు తోటలన్నా, తోటపని అన్నా చాలా ఇష్టము, 'తోటమాలి' అనే కథానిక కూడా వ్రాశాను.

క్లాస్ పాఠాలు చెప్పడమే గాకుండా మా మేష్టారు మాకు మంచి మంచి పుస్తకాలు చదివి వినిపించేవారు. బండారు అచ్చమాంబగారు వ్రాసిన అబలా సచ్చరిత్ర రత్నమాలలో ఒక వీరవనితను గురించి వారు చదివినది నాకు బాగా జ్ఞాపకముంది. అప్పుడే నాన్నగారి విజ్ఞాన చంద్రికామండలి గ్రంథాలున్నూ వెలువడినవి. అచ్చు తడి ఆరని భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం పుస్తకాలు నాన్నగారు చెన్నపట్నం నుంచి తెచ్చేవారు. ఒకసారి చెన్నపట్నం నుంచి

హైదరాబాద్ మీదుగా మా వద్దకు వచ్చారు. హైదరాబాద్‌లో నేసిన అతి రమ్యమైన పట్టు రుమాళ్ళు తెచ్చారు మా కోసం. చక్కని పట్టు రుమాలు పైన ముద్దులొలికే రంగుల పువ్వులు ఎంతో అందంగా వున్నాయి. హైదరాబాద్ అంటే అందాలకి పుట్టినిల్లు అనుకునేవాళ్ళం ఆ నాటి నుంచీ.

నాన్నగారు మమ్మల్ని చూడటానికి వచ్చి తిరిగి చెన్నపట్నం బయలుదేరేటప్పుడు ప్రతిసారి నేను కూడా వారితో వెళతానని ఏడ్చేవాడిని. మామయ్య నన్ను భుజాలపైన ఎక్కించుకుని నాన్నగార్ని వూరి చివర కాలువవరకు సాగనంపడం నాకు బాగా జ్ఞాపకం. కొన్నాళ్ళకు మేమున్నూ చదువులకు చెన్నపట్నం వచ్చేశాము.

అప్పటికే నాన్నగారు సుప్రసిద్ధ వైద్యులయ్యారు. వైద్యంకోసం ఆంధ్రదేశం మారుమూలల వూళ్ళ నుంచి కూడా వచ్చేవారు ఆయన వద్దకు. వారు చేసే ఆపరేషన్లు అన్నీ మేడమీదనుంచి శ్రద్ధతో చూస్తూ ఉండేవాళ్ళము—పిల్లలము, మేము. వారు చేసిన కంటి ఆపరేషన్ చూచి చేతికర్ర పిడిపైన వున్న కుక్కపిల్ల కంటికి ఆపరేషన్ చేశాము మేము !

నాకు ఈ వూరిబడి నచ్చలేదు. ఇప్పటి వాతావరణానికీ మావూరి బడి వాతావరణానికీ ఎంతో వ్యత్యాస ముండేది. అంచేత కొన్నాళ్ళు బడికి వెళ్ళటం మానేశాను నేను. అయితే, బడికి వెళ్ళనిరోజున నన్ను ఒక గదిలో పెట్టి తాళం వేసేవారు. ఈ ఖైదులోవుండగానే నేను రాణీ సంయుక్త, విజయనగర సామ్రాజ్యం, రాయచూరుయుద్ధం చదివాను. అప్పుడు మాచేత పుస్తకాలు చదివించడానికి, నాన్నగారు మేము చదివిన ప్రతి పుస్తకానికి, పేజీకి ఒక పైస చొప్పున ఇచ్చేవారు. ఈవిధంగా నేను ఒక రోజు బడికి వెళ్ళడం ఎగగొట్టి నూటతొంభై రెండు పేజీల రాణీసంయుక్త చదివి ఒక రూపాయి సంపాదించాను. సాయంత్రమయ్యేసరికి నా ఖయిదు తలుపు తీసేవారు. నే చదివిన కథంతా పూసగుచ్చినట్లు చెప్పేవాడిని, నాన్నగారికి. విజయనగర సామ్రాజ్యం చదివాక తిమ్మరుసు గురించీ, కృష్ణదేవరాయల గురించీ నాన్నగారు నన్ను ఎన్నో ప్రశ్నలువేసేవారు. అన్నిటికీ తగిన సమాధాన మిచ్చాను.

గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు ప్రపంచ చరిత్ర వ్రాసే రోజులవి. కొమర్రాజు లక్ష్మణరావుగారు శివాజీ వ్రాస్తున్నారు. రాయప్రోలు సుబ్బారావు గారు 'తెలుగుతోట' వ్రాస్తున్నారు. రోజూ వీరంతా కలుసుకొని భాషా విషయమై, రాజకీయ విషయాల గురించి మాట్లాడుకునేవారు. లక్ష్మణరావుగారిది గంభీరమైన విగ్రహం. ఆయన కంఠస్వరం యోధుని కంఠస్వరం. ఆయన తన శివాజీ చరిత్ర చదివి వినిపిస్తూ వుంటే పిల్లలము మేము పరవశులమై పోయే వాళ్ళము. బిపిన్ చంద్రపాల్ గురించీ, వందేమాతరం ఆందోళన గురించీ ఎంతో వినివున్న మాకు శివాజీ స్వాతంత్ర్యసమర నాయకుడయ్యాడు. బెంగాలులో జరుగుతూన్న ఉద్యమ వివరాలను పత్రికలో పెద్దవారు చదువు తుండగా విని మేమున్నూ అప్పుడు బెంగాల్‌లో వుంటే బాగుండును అని పించేది. వీనికి తోడు ఒక మాసపత్రికపై అట్టపైన వున్న ఇండియా పటమును పోలిన హిందూమాత బొమ్మలో ఆమె చేయెత్తి బెంగాల్ ప్రాంతవాసులను దీవిస్తూ వుండడం నెల నెలా చూచి వంగదేశీయుల వుత్సాహమును భరత మాత కూడా మెచ్చుకుంటోంది అనుకునే వాళ్ళము.

గొప్పవారిని చూడడానికి వెళ్ళినప్పుడు నాన్నగారు మమ్మల్ని ఆయనతో కూడా తీసుకు వెళ్ళేవారు. ఈ విధంగా నాన్నగారితో కలిసి వెళ్ళి గోపాలకృష్ణ గోఖలేని, ఆ తరువాత మదనమోహన మాలవ్యాను చూచాము. ఉపన్యసిస్తూ వున్నప్పుడు వారిద్దరి మర్యాద, సౌజన్యం మమ్మల్ని చాలా ఆకర్షించాయి.

ప్రొఫెసర్ కోడి రామమూర్తి తన సర్కస్ తీసుకువచ్చాడు, మద్రాస్. అప్పుడు, కలియుగ భీముడు నాన్నగారికి స్నేహితుడు, వారివద్ద వైద్యసలహా పొందుతూ వుండేవాడు కూడాను. ప్రతిరోజూ మేము సర్కస్‌కు వెళ్ళేవాళ్ళము. అక్కడ చూచిన ఫీట్స్ అన్నీ ఇంటికి వచ్చాక మేమూ చేయటానికి ప్రయత్నించే వాళ్ళము. ప్రదర్శన సమయంలో ప్రొఫెసర్ రామమూర్తి రెండు మూడు సార్లు గంభీరంగా వుపన్యసించేవాడు. ఆ వుపన్యాసమును వున్నది వున్నట్టు రెట్టించిన పటాటోపంతో ఇంటివద్ద ఏకరువు పెట్టేవాణ్ణి నేను. ఒక నాడు నాన్నగారు కోడి రామమూర్తిని మా యింటికి విందుకు పిలిచారు. ఆయనను సత్కరించడానికి వూరిలోని పెద్దమనుష్యులు మునగాల రాజావారు మొద

లైనవారు కొందరు వచ్చారు. అప్పుడు నేను ఎంతో గర్వంతో రామమూర్తి ఉపన్యాసం వప్పచెప్పాను. అందరూ చాలా మెచ్చుకున్నారు. ఆయన ఉప్పొంగి పోయి తన ఒడిలో కూర్చోబెట్టుకొని నా ముఖం తడిమారు. ఆయన చేతుల మెత్తదనానికి ఎంతో ఆశ్చర్యపోయాను. గొలుసులను తెంపే చేతులా ఇవి అను కున్నాను. ఏనుగను ఛాతిపై ఎక్కించుకొన్న శాండో ఒడిలో కూర్చున్నాను నేను అని చాలా గర్వించాను.

ఒక రోజున కట్టమంచి రామలింగారెడ్డిగారు వచ్చారు మా ఇంటికి. నాన్నగారు వుత్సాహంతో ఎదురువెళ్ళి ఆయనను సత్కరించారు. ఆయన కన్నుల తీక్షణత నన్ను చాలా ఆకర్షించింది. అప్పుడే అనుకుంటా ఆయన 'కవిత్వ తత్వ విచారము' పూర్తిచేసి నాన్నగారికి యిచ్చారు.

గురజాడ అప్పారావుగారు వూటీ వెళ్ళివస్తూ మా ఇంటనే బస చేసేవారు. కాశ్మీరశాలువ, బంగారపు ఫ్రేమ్ సులోచనాలు, అందమైన తలపాగాతో వారి మూర్తి మాకు సుపరిచితం. కొవ్వొత్తి దీపపు వెలుగులో నాన్నగారు, ఆయన చాలా రాత్రివరకు భాషా విషయాలు మాట్లాడుకునేవారు. ఒకసారి వారు వచ్చి వెళ్లిన కొద్ది రోజులకే వారి కన్యాశుల్కం నాటకం మా ఇంట్లోనే "రిహార్సల్స్" చేశారు. ఆంధ్ర సభ సభ్యులు వార్షికోత్సవానికి ఆ నాటకం వేస్తున్నారు. ఎంత పని వున్నా ఆ సమయానికి ఎల్లాగో వీలుచేసుకుని వచ్చి నాన్నగారు రిహార్సల్స్ చూచి వెళ్ళేవారు. గిరీశం పాడిన "మూను లైట్ బ్రైటటా!" అనే పాట చాలాసార్లు వల్లించేవాడను నేను.

కన్యాశుల్కంతో పాటే ప్రతాపరుద్రీయమున్నూ పరిచయమైంది. ఆఏడు సంవత్సరాదికి బయ్యా నరసింహేశ్వర శర్మగారి ఆతిధ్యాన పట్టణంలోని తెలుగువారంతా వారి భవనాన సమావేశమయ్యారు. ఎన్నో వుపన్యాసాలు, ఎన్నో వేడుకలు. వేదికపైన ప్రతాపరుద్రీయ నాటకమును ప్రదర్శించారు. శత్రువులు ప్రతాపరుద్ర మహారాజును పడవలో గోదావరి దాటించే దృశ్యంలో పడవ లాగుటను ప్రదర్శించినది ఆనాడు చెన్నపట్టణంలోని ప్రముఖులు కొందరు. వీరు చొక్కాలు తీసివేసి, నడికట్లు కట్టి "గంగమ్మ తల్లికీ చెంగల్వపూదండ" అనే పడవ పాట పాడుతూ తాడు లాగే దృశ్యం జనాన్ని తన్మయుల చేసింది.

కారణం: పాటలోని మాటలలో కొంత మార్పు—ప్రతి చరణము దేశభక్తి పూరితమైన ఒక వుద్బోధనే: ఇటువంటి యోధులకు ఇటువంటి దండ, వీరికి ఈ దండ, వారికి ఆ దండ, అంటూ "దొంగ నాయకులకెల్ల దూలగుండ దండ" అన్నప్పుడు సామాజికుల చప్పట్లు మిన్ను ముట్టినవి.

అప్పటికే దేశంలో, దేశభక్తులలో కొంత అభిప్రాయభేదం ఏర్పడినది. ఆంధ్రోద్యమ విషయంలో కూడా అతివాదులకు, మితవాదులకు భేదాభిప్రాయాలు కలుగజొచ్చాయి. అంతేగాకుండా, కొందరు ముఖ్య నాయకులు వుద్యోగ వ్యామోహంలో పడి తగిన రీతిని దేశసేవ చేయడంలేదనే అపవాదు బయలుదేరింది. అందువల్లనే కాకినాడ ఆంధ్ర మహాజన సభలో అధ్యక్షపదవి అలంకరించిన మోచర్ల రామచంద్రరావుగారు చాలా దీనంగా "ఆంధ్రోద్యమం మాకూ ఇష్టమే, ఆంధ్రరాష్ట్రం మేమూ వాంఛిస్తున్నాము - కాని ఆ పద్ధతిలో మాత్రం—"అంటూ క్షమాపణ చెప్పవలసి వచ్చింది.

ఒకనాడు వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ "గ్రామ్య దేశనిరసన" అనే పుస్తకాన్ని నాన్నగారి చేతికిచ్చారు. ప్రతాపరుద్రీయ నాటకంలో పేరిగాని చేత, అతని అనుచరులచేత గ్రామ్యభాష విరివిగా మాట్లాడించిన శాస్త్రిగారు ఆనాడు తెలుగు రచనలో గ్రామ్యభాష ఎక్కువగా వాడుతున్నారని అభ్యంతర పెడుతూ ఈ విమర్శ ప్రచురించారు. పిల్లలకు మాకు అప్పటికే గురజాడవారి అభిప్రాయాలంటే కొంత అభిమాన ముండేది. కాని, వేదంవారి విమర్శ కూడా వుత్సాహంతో చదివాము. చెన్నపట్టణంలో తెలుగుపదాలు ఎంత వికృత రూపాలకు పాలైనది వివరించారు :

"అతడు నిన్ను బొమ్మనుచున్నాడు; నీవెందులకు బోవు?" అనుటకు పట్టణపు తెలుగు:

"వాడుదా, నిన్ను పూడవమంటాడే; నీవెందుకు పూడవ్వా?"

నెల్లూరి నుండి రాజమహేంద్రం వెళ్లిన కొలదీ బర్రెలు గేదెలవుతా యన్నారు ఆయన.

ఉత్తరాది అతను "మేడమీదికి వెళ్లి తాళం వేసిరా!" అని తమ్మునితో అంటే, పక్కనే వున్న నెల్లూరు మనిషి వుత్సాహంతో "మిద్దె పైన పాట

కచ్చేరీయా?" అనిఅడిగాడట! ఇట్లానే ప్రాంతీయ భాషా ప్రయోగాలను చాలా హేళన చేశారు ఆయన.

నిడదవోలు కాన్ఫరెన్సుకు వెళుతూ, శ్రీ వేంకటరాయశాస్త్రిగారితో నాన్నగారు, నేనూ చేసిన ప్రయాణం నాకు బాగా జ్ఞాపకమున్నది. నేను ఆయనకు మనుమనివంటి వానినైనా, నాతో ఎంతో చనువుగా మాట్లాడారు. భాషా విషయాలు ఎన్నోచెప్పారు. తమ పరిశోధనలో వారు తెలిసికొనిన క్రొత్తవిషయాలను గురించి చెప్పేటప్పుడు వుత్సాహంతో వారికన్నులు మెరిసేవి.

ఆ సభలోనే రాయప్రోలు సుబ్బారావుగారు "అమరావతిని బౌద్ధులు విశ్వవిద్యాలయము స్థాపించునాడు" అనే రచన చదువుతూ తెలుగు వారిని మాతృదేశాభిమానంతో పరవశులను చేశారు. "తన గీతి యరవజాతిని పాటకు లనుగా దిద్ది వర్ధిల్లిన తెలుగువాణి" అనే రచన చదువుతూ.

"————చావలేదు

చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర, హృదయము జీల్చి చదువుడో సదయులార!" అని ప్రబోధించేసరికి జనం విపరీతంగా ఆవేశపూరితులయ్యారు.

ఆ వాతావరణలో వీరరసం ప్రధానంగా వర్తించి, తిరుపతి వేంకట కవులవారి పాండవోద్యోగ నాటకంలోంచి కొన్నిరంగాలు ప్రదర్శించినప్పుడు భారత యుద్ధాన్ని ఒక సమకాలిక సన్నివేశంగా అర్థంచేసుకుంటూ, తెలుగువారు పాండవులు, వారికి రాష్ట్రంలో తగిన స్థానం ఇవ్వనందున తదితరులు కౌరవులు అని సభికులు అన్వయించుకున్నారు.

కాకినాడ ఆంధ్రమహాజనసభలో బందరు బృందము వారు కొంత ప్రముఖ పాత్ర వహించారు. ఇతర ప్రాంతాలవారి "మితభావ ధోరణి" వారికంత నచ్చలేదు. పదండి ముందుకు, పదండి తోసుకు—అనే వీరావేశం వారిది.

ఆ నాటి కృష్ణా పత్రికలోని వ్యాసాలున్నూ ఇందుకు చాలా దోహద మిచ్చేవి. ఇంతకు కొంచెం ముందే అనుకుంటా - ఆంధ్రుల చేతకానితనాన్ని

ఈసడిస్తూ కృష్ణా పత్రికలో ఒక వ్యంగ్య రచన పాఠకులను ఎక్కువగా ఆకర్షించింది.

"జో! ఆంధ్ర పుత్రుడా! జో! మహాఘనుడా!
జో! దంబపరుడా! జోజో!"

అంటూ తెలుగువారు తమ ప్రగల్భాలను నిలబెట్టుకోలేరనే తీవ్రమైన విమర్శ అది. తెలుగువారు నెలకొల్పిన ప్రతి సంస్థ విఫలమైనదని ఆ గేయ భావం.

"విజ్ఞాన చంద్రికను వెలయించినావు
అజ్ఞానమును కొంత అణగించినావు"

అంటూ, కొంత మెచ్చుకొని,

"జాతీయ కళాశాలలను స్థాపించినావు
జాతమందే దాని చంపినావు"!

అని విమర్శిస్తూ ఆంధ్ర మహాజన సభల కృషి కూడా ఆగిపోయిందని ఆక్షేపించారు:

"అల్లబాపట్లలో ఆటలాడావు
ఆ విజయవాడలో పాట పాడావు
మెల్లగా పై శాఖపురము జేరావు
చల్లగాలికి అచట చల్లబడ్డావు!—జోజో!!"

కాని, కృషిమాత్రం జరుగుతూనే వుండేది. ఎన్నోపుస్తక సంస్థలు వెలిశాయి. అంధ్రప్రచారిణీవారిపుస్తకాలు ఇంటింటా చదివేవారు. మహిళా ఉద్యమం కూడా వుత్సాహంతో సాగుతూ ఉండేది.

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక కోసం చాలా ఎదురుచూస్తూ వుండేవారం మేము. ఎన్నోచక్కని వ్యాసాలు, కథలు, పద్యరచనలు మా దృష్టిని ఆకర్షించేవి. ఆ నాడు తెనుగునాట రాజకీయంగాను, సాంఘికంగాను, సాహిత్య వీధులలోను సేవచేస్తూన్నవారి చిత్రపటాలు చూస్తూ చాలా ఆనందించేవాళ్ళము.

## ౪

ఇందీవరము! ఆమాటలో ఎంతఅందముంది! కలువలు సాధారణములు. నల్లకలువ అపురూపము. నాపదకొండవయేట, నేను మొదటిసారి ఇందీవరాన్ని చూస్తి. అదివరకు ఏఏట వినాయకచవితికి పాలవెల్లిని అలంకరించటానికి ఎర్రకలువలు, తెల్లకలువలు, పసుపురంగు కలువపువ్వులు చెర్లోదిగి కోసుకు వచ్చేవారము. కాని, ఇందీవరాన్ని గురించిమాత్రం చదివాను. ఆరవ వాచక పుస్తకంలో అనుకుంటా—శ్రీరాముని బాల్యాన్ని వర్ణిస్తూ తెల్లని పక్కపైన పరున్న పసిపాప, కౌసల్యా తనయుడు, గంగానదిలోని ఇందీరవరంవలె ఉన్నాడన్నారు. ఇందీవరము అంటే నల్లకలువ అని అర్థం చెప్పారు గాని మే మెవ్వరమూ నల్లకలువను చూచివుండలేదు.

నాన్నగారు పనిమీద శంకరిదుర్గము వెళుతూ నన్నుకూడా తీసుకువెళ్ళారు. వారితో కలిసి నేను చేసిన మొదటి ప్రయాణ మది కాబట్టి నాకు బాగా జ్ఞాపక ముంది. సేలం దగ్గర ఉన్నది శంకరిదుర్గము. టిప్పుసుల్తాన్ కొన్నాళ్ళిక్కడ నిలకడగా ఉండేవాడు. అతడు సేకరించిన ధాన్యపు రాసుల ఆనవాళ్ళు ఇప్పటికీ చూడవచ్చు. స్టేషన్ నుంచి శంకరిదుర్గము బండిమీద వెళ్లాము. కొండ ప్రదేశమున మెలికలు తిరిగి సాగే తెల్లని కంకర బాట ఒక పెద్ద పాములా తోచింది నాకు.

శంకరిదుర్గం రహదారి బంగాళాలో మా బస. వూరికి కొంచెం దూరం. నాన్నగారు వూళ్లోకి వెళ్లినపుడు నేను, గుమస్తా, మరికొందరము కొండ ఎక్కాము. అదే నేను తొలిసారి కొండ ఎక్కడము - ధవళేశ్వరము కొండ ఎక్కివున్నాను గాని, అది చాలా చిన్నకొండ. చాలా పట్టుదలతో పైకంతా ఎక్కాను. చాలా ఆయాస పడ్డాను. కాని, కొండ చివర చక్కని అమ్మగారి గుడి కనపడ్డది. గుడిముందు స్వచ్ఛమైన నీరు నిండిన చిన్నసరస్సు, సరస్సులో ఇందీవరాలు లెక్కకు నాలుగే నాలుగు నల్లకలువలు! పూజారి చెప్పాడు: ఇందీవరాలు అమ్మవారికి చాలా ఇష్టమనీ, ఆ కొండపైన సరస్సులో తప్ప దక్షిణదేశం మొత్తాన ఎక్కడా నల్లకలువలు లేవనీ.

'నల్లకలువ' అంటారు గాని నిజంగా నల్లగా ఉండదు. ఇందీవరము, చక్కని వూదా రంగు. లోపల పసుపుపచ్చని కేసరాలు. సాధారణ కలువ పువ్వు కంటే చాలా అందంగా ఉంటుంది. అతిసున్నితమైన ఆ పరిమళము మనస్సుకు ఎంతో హాయి నిస్తుంది.

కొండ దిగి వచ్చేసరికి నాన్నగారు మాకొరకు వేచిఉన్నారు. మేము చూచిన వింతలను గురించి ఉత్సాహంతో చెప్పాను. వారిని అడిగి నాలుగు తెల్ల కాగితాలు తీసుకున్నా. "తన ప్రయాణం గురించీ, కొండమీద తాను చూచిన వింతలు గురించీ మా అబ్బాయి వ్యాసం వ్రాస్తాడు" అని ఆయన స్నేహితునితో అన్నారు.

కాని నిజానికి నేను వ్యాసం వ్రాయడానికి కాదు కాగితాలు తీసుకుంట. అంతకు పూర్వపు రోజు, శుక్రవారం, క్లాస్‌లో పరధ్యానంగా ఉండి మాష్టారు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోయ్యాను. ఆయన కోపగించుకొని "ఇంకెప్పుడూ క్లాస్‌లో పరధ్యానంగా ఉండను"అని నూరుసార్లు 'ఇంపోజిషన్' వ్రాయమన్నారు. కాని, ఇందుకోసం కావాలి తెల్లకాగితాలు—వ్యాసం వ్రాయడం కోసం కాదు, అని నాన్నగారితో చెప్పలేదు. ఆ చెప్పక పోవడము జీవితములో నేనాడిన మొదటి అబద్ధము కాబట్టి నాకు బాగా జ్ఞాపకముంది. తరువాత సత్యా సత్యాలను గురించి చదువుతూ లేనిది ఉన్నట్లూ, ఉన్నది లేనట్లూ భ్రమింపజేయడం ఎంత అనృత మాడడమో, ఎదుటివారి మనస్సులో తప్పు అభిప్రాయం కలిగినప్పుడు వారించకపోవడమూ అంత అనృత మాడడ మేనని తెలుసుకున్నాను. ఐతే, నాన్నగారి మనస్సులో కలిగిన వూహ ప్రకారం, ఆ కాగితాలపైన ఇంపోజిషన్ బదులు వ్యాసమే వ్రాయాలని ప్రయత్నించాను. కాని, సాగలేదు, మళ్ళా ఎవరోవచ్చి వూరుచూద్దామని తీసుకుపోయారు. ఇంపోజిషన్ కూడా తిరిగి పట్నం వచ్చాకనే వ్రాశాను.

ఆ రోజులలో క్లాస్‌లో చదివిన పుస్తకాలకంటే ఇట్లోనే ఎక్కువ పుస్తకాలు చదివేవారం. అప్పుడు వెలువడిన ప్రతితెలుగు నవల తప్పకచదివేవాడను. ఇంగ్లీష్ పుస్తకాలున్నూ విరివిగా చదివేవాడను. వీరేశలింగంగారి రాజశేఖర

చరిత్రకంటే చిలకమర్తి నరసింహంగారి రామచంద్రవిజయము నాకు ఎక్కువ బాగుంది. పంతులుగారి ప్రహసనాలన్నీ చదివాము. సత్యరాజ పూర్వదేశ యాత్రలో 'ముక్కాల్ రూపాయ-ఉక్కారుంగో' అనే సన్నివేశం మరీ మరీ నవ్వు కలిగించేది. అప్పుడే సెంట్రల్ స్టేషన్‌లో రైలుదిగిన తెలుగు పెద్దమనిషి బండి కుదుర్చుకుంటూ, బండివాడు 'ముక్కాల్ రూపాయ-ఉక్కారుంగో' అనేసరికి 'ఎల్లాగో అల్లా ముక్కాల్ రూపాయ ఇచ్చుగుంటా, ఆపైన ఉక్కారుంగో మాత్రం ఇయ్యలేను' అన్నాడట-ఉక్కారుంగో ఏదో నాణెమనుకుని.

ఆనందమఠం నవల చదివాను — ఎంతో ఆసక్తితో. వందేమాతరం గీతంతో అదే మొదటి పరిచయము. ఆ నవల చాలా నచ్చినది నాకు. ఆంధ్ర ప్రచారిణీవారి నవలలు, అనుబంధములు అన్నీ చదివేవారము. బంకించంద్రుడు ఆప్తమిత్రుడయ్యాడు, మాకు.

నాన్నగారు మాకు భారత భాగవతాలు చదివి వినిపించేవారు. జలక మాడుచున్న దేవతా స్త్రీలు దిగంబరుడైన శుకుని చూచి సిగ్గుపడకుండా పంచ, ఉత్తరీయంతో ఉన్న వ్యాసుని చూచి చాటుకువెళ్ళిపోయే ఘట్టములోని అంత అంతరార్థము నాన్నగారే చెప్పారు.

దేశమాత పత్రికలో 'హాస్యలత' తప్పక చదివేవారము. కాని, ఏవ్యాసం క్రిందనైనా 'సశేషము' అని అంటే చాలా కోపం వచ్చేది. ఇంకొక్క వారం రోజులు ఎల్లాగా కనిపెట్టుకు ఉండడము అనిపించేది.

చిలకమర్తివారి రాజస్థాన కథావళి చదివి, రాజపుత్రులంటే ఎంతో గౌరవం ఏర్పడింది నా మనస్సులో. కాని అప్పుడే జరిగిన ఢిల్లీదర్బారులో ఈ రాజపుత్ర వంశంవారు కొందరు చక్రవర్తికి వంగి నమస్కరించారని చదివి చాలా ఖిన్నుడనయ్యాను.

ఇంటిలో వాతావరణం అంతా స్వదేశాభిమానంతో నిండిఉండేది. తిలక్‌నకు కారాగారశిక్ష విధించినప్పుడు ఆయన చెప్పిన గంభీర వచనములు మాకు కంఠతావచ్చేవి. బెంగాల్‌లోనూ, పంజాబ్‌లోనూ జరిగే రాజకీయ ఆందోళన వివరాలను ఎంతో ఆసక్తితో గమనించేవారము.

అప్పుడే మొదటి ప్రపంచ సంగ్రామము ప్రారంభమైనది. శత్రువులు మన మిత్రులన్నట్లు జర్మనీవారంటే కొంత పక్షపాతముండేది. ఇటలీవారు జర్మనీ పక్షం చేరారని వార్తవచ్చినప్పుడు సంతోషించాము. కాని, జర్మనీ బెల్జియంపై సలిపిన దురాక్రమణను నిరసింపక పోలేదు. ఐతే, జర్మనులకు భారతీయుల యెడ సానుభూతి కలదనిన్నీ, వారికి మన సంస్కృతి అంటే చాలా గౌరవమనీ అనుకొనేవారము.

యుద్ధము జరుగుతూ ఉండగానే నేను చెన్నపట్నం చదువుమాని, పై చదువుకు మదనపల్లె వెళ్ళాను. అది ఒక వింత వాతావరణం. ఇతర బడులలో ఉండే కట్టుబాట్లు ఇక్కడలేవు. పిల్లలు, ఉపాధ్యాయులు పరస్పర సోదర భావంతో ప్రవర్తించేవారు. మాష్టార్ని పిల్లలు ఆప్తమిత్రులవలెపరిగణించేవారు. మా కాలేజీ ప్రిన్సిపాల్ డాక్టరు కజిన్స్‌ని చూడటానికి వెళ్ళినప్పుడు ఆయన మా నాన్నగారిని గురించి ఎంతో ఆప్యాయంగా ప్రశ్నించి ఎంతో ఆదరించారు. నేను చాలా ఆశ్చర్యపోయాను. ప్రిన్సిపాల్ ! పైగా తెల్లవాడు ! ఇంత స్నేహ భావంతో ప్రవర్తించడం ఎంతో క్రొత్తగా కనిపించింది.

ప్రతి శుక్రవారం రాత్రి కజిన్స్ ఇంట్లో పిల్లలము కొందరం సమావేశ మయ్యేవారం. ఆయన, ఆయనభార్య మాకు చక్కని కథలు చెప్పేవారు. ఎన్నో గేమ్స్ ఆడించేవారు. పాటలు పాడించేవారు. ఆమె పియానో వినిపించేది; అద్భుతంగా వాయించేది.

హోమ్‌రూల్ ఉద్యమ నాయకులైన అనీబిసెంట్, అరండేల్, వాడియాలు నిర్బంధ నివాసశిక్ష అనుభవిస్తూన్న రోజులవి. ఉదయాన్నే పిల్లలము ఉపాధ్యాయులు సమావేశమై జాతీయ పతాకమును ఎగరవేసి దేశభక్తి గీతాలు పాడుతూ త్వరలో వారికి స్వాతంత్ర్య మిచ్చి తద్వారా దేశ స్వాతంత్ర్యమునకు త్రోవ చూపమని ప్రార్థించేవారము. మా ప్రార్థనల ఫలితముగానో అన్నట్లు కొద్ది దినాలలోనే వారికి విడుదలై, అనీబిసెంట్‌ను చూడడానికి మేము అడయార్ వెళ్ళాము.

స్టేషన్‌నుంచి బ్రహ్మాండమైన వూరేగింపుతో ఆమె అడయార్ చేరింది. బాలభటులు (బోయ్‌స్కౌట్)గా మేము ఇరుప్రక్కల బారులుతీరి నడిచాము. నాన్నగారు, శ్రీ మునగాల రాజుగారు, గుర్రములపై స్వారీ చేస్తూ ఆ ఊరేగింపులో పాల్గొన్నారు. తర్వాత, నాన్నగారు, శ్రీ రాజాగారు అడయార్‌లో నన్ను చూచి, ఆమెను గురించి ఎంతో శ్లాఘిస్తూ మాట్లాడారు.

తిరిగి మదనపల్లె వెళ్ళాక మా ఎప్పటి చదువు సంధ్యలో నిమగ్నుడనై పోయాను. అంతేగాక రాత్రి వేళలందు ప్రక్కనున్న పల్లెలో నైట్‌స్కూల్‌లో పిల్లలకు చదువు చెప్పేవాడను నేను. ఇది అద్భుతమైన వ్యాపకము. చదువుకోవాలని ఎంతో ఆసక్తితో ఉన్న ఆ గ్రామీణ బాలురకు చదువు చెప్పడము చాలా సరదాగా ఉండేది. మదనపల్లెలో శీతాకాలమున చలి ఎక్కువ. ఐనా మేము రాత్రి పదిగంటలవరకు పిల్లలకు చదువుచెప్పుతూ వుండేవారము. ఒక్కొక్కప్పుడు క్లాసుకీ క్లాసుకీ మధ్య కొంత విరామముండేది. అప్పుడు ఆరు బయటకు వచ్చి పక్కనున్న పొలములో కూర్చుని చలిమంట కాచుకుంటూవున్న రైతులమధ్య మేమున్నూ కూర్చునేవారము. ఎండిన కొత్తిమిరి కంపతో చలమంట వేసేవారు. ఆ వాసనలో ఒక విచిత్రమైన వాతావరణం ఉండేది. చుట్టూ దట్టమైన మంచు, ఎక్కడో దూరాన నక్కకూతలు, ఎదుట సన్నని మంట. కొత్త క్రొత్తకాడ మంటలో వేసినప్పుడల్లా సున్నితమైన పరిమళము. పాఠములు ముగించి, ఇంటికి వెళ్ళి నిద్రలో మునిగిపొయ్యేవరకు ఆ పరిమళము జిహ్వను ఆవరించి ఉండేది.

అక్టోబర్ 1 వ తేదీ అనీబిసెంట్ పుట్టినరోజు. మదనపల్లె కళాశాల ఆమెకు అభిమాన సంస్థ. మాకున్నూ ఆమె మాతృస్వరూపిణి. అనాటి సభలో నేను ఉపన్యసించాను. నన్ను తెలుగున మాట్లాడమన్నారు. స్వచ్ఛమైన తెల్లని లాగూ, తెల్లని కమీజూ తొడుక్కుని పెద్దహాలు ఆ చివరనుంచి ఈ చివరకు నేను తాపీగా నడిచిరావడం నాకు బాగా జ్ఞాపకముంది. అందరి దృష్టి నాపై కేంద్రీకరించినా, నేను ఏవిధముగానూ చకితుడను కాలేదు. నేను చెప్పదలచిన వాక్యాలు స్పష్టంగా చెప్పాను. ఎంతో మనస్ఫూర్తి మాట్లాడాను అన్నారు:

తర్వాత స్నేహితులు. నా జీవితంలో మొదటి ఉపన్యాస మది. తరువాత కొన్ని యేండ్లకు మరియొక విద్యాసంస్థలో ఉపన్యసించాను. కాని, ఆ అనుభవం వేరు.

అందరియెడ సోదరభావం, అందరి అభిప్రాయాలనూ తగురీతిని పాటించడమూ నిరంతరమూ ఇతరుల సంతోషాన్నే ఆశించడం—ఇవీ, నేను మదనపల్లెలో గ్రహించిన ఆశయాలు. ఇవి తదుపరి జీవితంలో నాకు చాలవరకు త్రోవ చూపించాయి.

పెద్ద పెద్ద ఉద్యోగాలుచేసి ధనము సంపాదించాలనే ఆశ ఏ మాత్రమూ ఉండేదికాదు. ఇతరులతో పోటీపడి అందరికంటె గొప్పస్థానం అందుకోవాలనే ఆశ ఏ మాత్రమూ ఉండేదికాదు. ఏ వ్యాపకంలో ఐతే, నేను నా తోటి వారికి ఉపయోగపడగలను, నాకున్న అవకాశాలను ఏవిధంగా ఇతరుల మేలుకు వినియోగింపగలను అనేదే ప్రశ్న. ఈ దృష్టి కలగడానికి కారణం అచ్చట ఉపాధ్యాయులు పోషించిన వాతావరణే!

మదనపల్లెలో ఉండగా ఒక వింత అనుభవం కలిగింది. మృత్యువు అంటే ఎన్నడూ భయంలేని నేను మృత్యుముఖమును చూచాను. అంతవరకు నాకు ఈత చేతకాదు. ఆ వూరిలో తోటలలోని పెద్ద పెద్ద దిగుడు బావులలో పిల్లలందరూ ప్రతిరోజూ ఉదయమూ, సాయంత్రమూ ఈదుతూ ఉండేవారు. నేనూ ఈదవలెనని సరదాపడి నేర్చుకోవడం ప్రారంభించాను. నాకు ఈతనేర్పే స్నేహితుడు నా నడుముకు ములగబెండ్లు నాలుగు ఒక కట్టగా బెల్ట్‌లా కట్టి నేర్పాడు. వీటి సహాయంతో పైకితేలుతూ, ఈదుతూ ఉండేవాడను. అవి లేకపోతే ఈదలేక పోయేవాడను. ఇల్లా నాలుగు నెలలయాక గజ ఈతగాడని పేరుపొందిన ఇంకొక స్నేహితునితో బావికి వెళ్ళడం తటస్థించింది. "ములగ బెండ్లు కట్టుకు నేర్చుకున్నావా, ఈత" అని నవ్వి "అవి అక్కర్లేదు. నేనున్నానుగా!" అంటూ నీటివద్దకు తీసుకువెళ్ళాడు. "ఎంతపెద్ద బావి! ఎన్ని నిలువులలోతో? తాడిచెట్టు ప్రమాణముంటుందేమో!" అంటూ ఈ మాట, ఆమాట చెబుతూ గబుక్కున నీటిలోకి ఒక్క త్రోపుతో తోశాడు. ఏమరపాటున ఉన్న

నేను అమాంతంగా మునిగిపోయాను. నీటి అడుక్కి, అడుక్కి ఇంకా అడుక్కి పోతున్నా. నిగనిగలాడే పూదా వెలుతురులో కళ్ళు భ్రమిసిపోయాయి. చెవులలో ఏదో గొప్ప హోరు; అదే నా ఆఖరు నిమిషమనుకున్నాను— నా గుండె ఆగి పోతుందేమో అని తోచింది. రెండవ క్షణంలో అప్రయత్నంగా కాళ్ళు సారించి చేతులు చాచి నా బలమునంతా ఉపయోగించి పైకితేలి పెద్ద పెద్ద బారలతో ఒడ్డు చేరాను. అతనిమీద తగనికోపం వచ్చింది. కాని, చిరునవ్వుతో నా వైపు చూస్తున్న అతనిని చూసేసరికి నా కోపమంతా కృతజ్ఞతగా మారింది. ఇంక నాకు ఈత వచ్చేసింది. బెండ్లసహాయం అవసరంలేదు—అని తెలిసింది. తరువాత కొన్నాళ్ళకి మా వూళ్ళో, వూరచెరువు—బ్రహ్మాండమైన సరస్సు—నడి స్తంభందాగా ఒక్కడనూ అవలీలగా బారీతనువెళ్ళి అక్కడున్న తామరపూవులను కోసుకు వచ్చేవాడను.

నాలుగు నెలలు బెండ్లసహాయంతో నేర్చుకోలేని విద్య ప్రాణరక్షణా గత్యంవల్ల ఒక్కక్షణంలో నేర్చుకున్నాను.

మదనపల్లెలోనే నాకు రవీంద్రనాథ్‌టాకూర్ రచనలతో పరిచయ మవుత. వారిని గురించి జేమ్స్‌కజిన్స్ తరుచు చెబుతూ ఉండేవాడు. టాగూర్‌కి నోబెల్ బహుమతి రావడం, దేశ దేశాలవారు ఆయన రచనలను చాలా మెచ్చుకోవడం ఇదివరకే విని ఉన్నాను. చెన్నపట్నంలో ఉన్నప్పుడు శ్రీఆదిపూడి సోమనాథరావుగారు తాము రచించిన గీతాంజలి అనువాదం చదివి వినిపించారు గూడా, మా ఇంట. కాని, రవీంద్రుని రచనలు నేనుగా చదవడము మదనపల్లి వెళ్ళాకనే. చదవడమే గాకుండా, ఆయన పోస్టాఫీస్ నాటకంలో అమల్ అనే కుర్రవాని పాత్రను అభినయించాలని కూడా ప్రయత్నించాను. కాలేజీ పిల్లలు ఆ నాటకము ప్రదర్శించాలని ఉత్సాహపడ్డారు. నాచేత అమల్ పాత్ర పాఠం చేయించారు. కాని, చివరకు ఎందువల్లనో ఆ నాటకం ప్రదర్శింపలేదు. పుస్తకం చదవడము మాత్రము నాకు ఒకగొప్ప అనుభవం. అప్పటి నా మానసిక పరిస్థితికి ఆ పాత్ర చాలా అనుగుణ్యంగా కనబడింది. అప్పుడేకాదు, ఈనాడు కూడా ఆ దృషితోనే చూస్తున్నాను, ప్రపంచాన్ని.

మదనపల్లె అంటే రవీంద్రునికి ప్రత్యేక అభిమానముండేది. చల్లని ప్రదేశం, జేమ్స్‌కజిన్స్ వంటి సన్నిహితులు, కాబట్టి అక్కడ కొన్ని వారాలున్నారు ఆయన. ఆయన స్వయంగా తన జనగణమణ జాతీయగీతం నేర్పారు, అచటి విద్యార్థులకు. ఆయన విచ్చేసి ఉండడంవల్ల! లలితకళా విషయాలలో మదనపల్లె కళాశాలకు దరిమిలాను చాలా ప్రాముఖ్యం యేర్పడింది.

మదనపల్లెలో నేను పట్టుమని పది నెలలన్నా లేకపోయినా ఆ ఉన్న కొన్నాళ్ళ నా జీవితంలో నేను మరువరానివిగా పరిణమించాయి. నా సహచరులు, ఉపాధ్యాయులు నా యెడలచూపిన వాత్సల్యం, అనురాగం ఎల్లప్పుడూ జ్ఞాపకం చేసుకుంటూ ఉంటాను. ఆ అనురాగ వాత్సల్యాలలో ప్రత్యేకత యేమిటంటే: అది పూర్తిగా ప్రతిఫలాపేక్ష లేనిది. ప్రతిఫలాపేక్ష లేని సుహృద్భావం చాలా అరుదే. ఐతే అట్టిభావాన్ని నేను ఆ రోజులలో, ఆ వాతావరణంలో అనుభవింప గలిగాను.

నిజానికి మదనపల్లె విద్యార్థులు ఒకవిధంగా ఆదర్శ విద్యార్థులుగా ఉండేవారు. చలింపని మాతృదేశాభిమానము, దృఢమైన మానవసేవా దీక్ష, అన్ని విషయాలలోనూ సుందరత పాటించడము—వీరి ముఖ్యలక్షణాలుగా గణించేవారు ప్రజలు. మదనపల్లెలో చదువు పూర్తి అయ్యాక ఇక పై చదువు గురించి ప్రశ్న వచ్చింది. నాన్నగారిని నేను తండ్రివలెనే గాక, నా స్నేహితునిగా కూడా పరిగణిస్తూ వచ్చాను. నాతో ఆయన నా పై చదువు గురించి తానే చర్చించి ఉండవచ్చును. కాని, ఒకవేళ మనస్సు విప్పిచెప్పడానికి సందేహిస్తానేమోనని మాకు ఆప్తమిత్రులు ఒకరిచేత అడిగించారు—నాకు ఇకముందు ఏమి చేయాలని ఉన్నదీను. అందరిలాగ బి. ఏ., ఎమ్. ఏ. పరీక్షయి సర్కారు ఉద్యోగం చెయ్యాలని ఉన్నదా, బి. ఎల్. పరీక్షయి న్యాయవాది కావాలని ఉన్నదా, లేక జాతీయ విద్య నేర్చుకొని దేశసేవ చెయ్యాలని ఉన్నదా అని అడిగారు. నేను ఒక్క నిముషమైనా ఆలోచింపకుండా 'జాతీయవిద్య నేర్చుకొని దేశసేవ చెయ్యాలని ఉన్నది' అన్నాను. ఆయన నాయందు పరిపూర్ణమైన అభిమానంతో సర్కారు ఉద్యోగాలలో పెద్ద పెద్ద హోదాలలో ఉండి తాముస్నా

తగు రీతిని దేశసేవ చేస్తూన్నవారిని గురించీ, న్యాయవాదులై తద్వారా హైకోర్టు జడ్జీలై ఖ్యాతిగాంచిన వారిని గురించి చాలా చెప్పారు. తరువాత తిలక్ వంటి వారు చేస్తూన్న దేశసేవను గురించీ, సమీపంలో అనీబిసెంట్ ఆమె అను చరులు చేస్తూన్న మానవసేవ గురించీ కూడా చెప్పారు. నేను జాతీయవిద్య అభ్యసించి ప్రజాసేవ చేయాలని కోరుతున్నాను అని చెప్పాను. అప్పుడు నేను మరో నిర్ణయానికి వచ్చివుంటే ఈనాడు నా జీవిత మెట్లుండేదో చెప్పలేను కాని, నేను చేసిన నిర్ణయానికి ఈ నలభై యేళ్ళలో ఒక్క క్షణమైనా విచారపడ లేదని చెప్పగలను. విధినిర్ణయ మెల్లావున్నా మన సుఖదుఃఖాలకు చాలవరకు మనమే బాధ్యులము. ఇందుకు సందేహంలేదు. కాని, లోకపురీత్యా సుఖమనేది ఒకవ్యక్తి దృష్టిలో సుఖముగా కనబడకపోవచ్చును. లోకపు దృష్టిలో ఒకవ్యక్తి అష్టకష్టాలూ పడుతూ ఉండవచ్చును. కాని, తనకు కొంత ఇబ్బంది కలిగినా, తనవల్ల ఇతరులకు ఎంతో సుఖము కలుగుతూ ఉంటే అదే అతనికి చాలా సంతుష్టి నిస్తుంది.

ఐతే, ఆ రోజులలో, ఆ వయస్సులో నా ఆశయాల ఆవేశం నన్ను పూర్తిగా కమ్మివేసిందని ఇప్పుడు అనవచ్చును. ఎన్నో విషయాలను గురించి తెలుసుకోడానికి అవకాశ ముందని తోచింది. దేశసేవకు, మానవ సేవకు నా జీవితాన్నే అంకితము చేయడానికి చక్కని అవకాశ మున్నట్టు తోచింది. నేను ప్రేమించినవారు, గౌరవించినవారు నాయందు అభిమానం ఉన్నవారు చేస్తూవున్న కృషిలో నేనున్నూ పాల్గొన్నాను, అనే కాంక్ష నన్నావహించింది.

"పత్రం పుష్పం ఫలం తోయం
యోమే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః
యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసియత్.

యత్తపస్యసి కౌన్తేయ
తత్కురుష్వ మదర్పణమ్"

(భగవద్గీత 9 అ—26, 27)

మదనపల్లెలో ఉండగా, ప్రతిరోజూ ఈ గీతావాక్యంతో ఆనాటి పాఠాలు పూర్తి అయ్యేవి. ఇది ఏవో మంత్రాలు వల్లించేటట్టుగాక, మనసార ఆత్మార్పణ అని పాటించేవారము. మద్రాస్ కళాశాలలో కూడా ఇల్లాగే గీతావాక్యంగా ప్రతినిత్యమూ ఆ ఉన్నతాశయానికే జీవితమును అంకిత మొనర్చేవారము. ఉదయపు కార్యక్రమం గీతాపఠనముతో ప్రారంభమయ్యేది. హైకోర్టు జడ్జి సర్ టి. సదాశివయ్యర్ మాకు భగవద్గీత పాఠం చెప్పేవారు. తెల్లగుర్రపు కోచ్ బండిలో సరిగ్గా 7—25కు ఆయన వచ్చేవారు. సౌజన్యత వెల్లివారే ఆయనను చూడడముతోనే మనస్సు భక్తి పూరితమయ్యేది. ఒకానొక సంఘటనవల్ల ఆయనయందు మాకు భక్తిప్రేమలు వెయ్యింతలయ్యాయి. వారు మరింత పూజనీయులైనారు.

ఆయన కుమారుడు మదనపల్లెలో చదువుకుంటూ, ఈత ఈదటానికి వెళ్ళి, ఇంటికి తిరిగిరాలేదు. అగాధమైన నూతిలో అందని లోతుకువెళ్ళి, ఆకస్మిక మరణానికి పాలయ్యాడు, పాపము! ఈ భయంకర వార్త ఒక ఆదివారం ఇక్కడ మాకు తెలిసింది. మరునాడు, అతనితండ్రి కాలేజీకి రాడనుకున్నాము. కాని, సరిగ్గా 7—25కు, యథాప్రకారం ఆయన తెల్లగుర్రపు కోచ్‌బండి హాజరైంది. బండి దిగుతూన్న ఆయనవద్దకు మా హెడ్‌మాస్టర్ వెళ్ళి పరామర్శించారు. వారిద్దరూ ప్రార్థనా వేదికవద్దకు వచ్చారు. ప్రార్థన ఐనపిదప గీతాపఠనం ప్రారంభమైంది. మాతోకలిసి జడ్జిగారున్నూ శ్లోకాలు వల్లిస్తున్నారు. కాని ఆయన కనులవెంట అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. పుత్రశోకంతో ఉన్న వారియందు సానుభూతితో మా హృదయాలు కరిగిపోయాయి. కాని, పితృసమానులు ఆయనను ఓదార్చేశక్తిలేదు మాకు. కొంతసేపటికి ఆయనే కన్నులు తుడుచుకుని పాఠం ప్రారంభిస్తూ ఇలా అన్నారు: "క్షణకాలం భ్రాంతిలో పడిపోయినందుకు ఆప్తమిత్రులు మీరు నన్ను మన్నించాలి. దుఃఖాన్ని ఆపగలుగు

తాను అనుకున్నాను గాని, మిత్రులు మిమ్ములను అందరినీ చూసేసరికి నిన్నటి వరకూ మీలాగే ఆడుతూ పాడుతూ ఉన్న మావాడు జ్ఞాపకమొచ్చాడు. మమ కారంతో నన్ను నేనే మరచిపోయాను. నా మనోదౌర్బల్యానికి సిగ్గుపడు తున్నాను. నన్ను క్షమించండి." అన్నారు. వారిని మేము క్షమించడమేమిటి? వారికి బాధ కలిగినందుకు మమ్ములనే వారు క్షమించాలి అనుకున్నాము. కాని, వారి మనఃపరిపాకం తదుపరి జీవితంలో నా కెంతో ఆదర్శప్రాయమైంది.

అరండేల్ కూడా మాకు పాఠాలు చెప్పేవారు. అది ఒక గొప్ప అదృష్టమే అనాలి. మహా మేధావంతుడు ఆయన—ప్రతిభాశాలి, చాల ప్రజ్ఞకలవాడున్నూ. ఎటువంటి వారినిన్నీ ఉత్సాహ పూరితులుగా చేయగలశక్తి ఉండేది ఆయనలో. ఎంతోసరదాగా మాట్లాడేవారు. పిల్లలను మమ్మల్ని తరుచు తమ ఛలోక్తులతో నవ్విస్తూ ఉండేవారు. రాజకీయ వ్యవహారాలలో పూర్తిగా నిమగ్నులైఉన్నా, ఎల్లాగోఅల్లా వీలుచేసుకుని వచ్చి, మాతో కొన్నిఘడియలు గడుపుతూ ఉండేవారు. ప్రతిరోజూ చెట్లక్రింద, మా క్లాసులు. ఒకప్పుడు తాపీగా పద్మాసనము వేసుకు కూర్చుని భారతీయ నాగరికతా విశేషాలను గురించి చెప్పేవారు. ఒకప్పుడు ఇటూ అటూ పచారుచేస్తూ సమకాలిక రాజకీయ విషయాలను గురించి తీవ్రంగా విమర్శించేవారు. ఏదో విషయంలో ఆయన జాతీయవాదుల తరఫున గవర్నర్‌తో సంప్రతింప వలసి వచ్చింది, ఒకసారి. గవర్నర్‌తో మాట్లాడి తిన్నగా మావద్దకు వచ్చారు. "గవర్నర్‌గారు ఏమన్నారో వినాలని ఉన్నదికాదూ మీకు? చెప్తాను" అంటూ ఆనాడు ప్రభుత్వవర్గాలను ఆవరించి ఉన్న కృత్రిమ వాతావరణను ఎంతోచక్కగా వర్ణించారు. "నిజంగా, దేశంలో ఏమిజరుగుతోందో వారి కెవ్వరికీ తెలియదు. తెలిసికోవాలని ప్రయత్నించరు కూడా. తమచుట్టూ నిర్భేధ్యమైన కోటకట్టుకు కూర్చున్నారు. వారికేమి అర్థమవుతుంది?" అన్నారు.

అరండేల్ అసమానమైన కార్యదీక్ష, బిసెంట్ రాజకీయ ఉద్యమానికి పట్టుగొమ్మగా ఉండేది. ఆమె ఉద్దేశ్యాలను ఇట్టే తెలుసుకొని కార్యరూపం ఇచ్చేవారు. క్షణం విశ్రాంతిలేదు. ఆమెసేవలో ఎటువంటి ఆటంకాలు వచ్చినా గుర్తించేవారు కారు, ఆయన.

అప్పుడే ఒక పర్యాయం, గాంధీజీ, బిసెంట్ల సమావేశమైంది మద్రాసులో. ఏదో ఒక విషయంలో వారికి చిన్న అభిప్రాయభేధం కలిగింది అంతకు కొంచెంముందు. దానిని, గోరంతను కొండంతలుచేసి ప్రచురించాయి పత్రికలు. ఈ సమావేశంలో ఆమె ఆయన కృషిని గురించి చాలా ప్రశంసిస్తూ చక్కని ఉపన్యాసాలిచ్చారు. తరువాత, పత్రికావిలేఖరులు ఇదివరకు కలిగిన అభిప్రాయ బేధం గురించి ఆమెను ప్రశ్నింపగా, ఆమె తన సహజ సౌశీల్యంతో అతి ఉదాత్తంగా: "అబ్బే! ఆ విషయం పాటింపనక్కరలేదు. మా ఇద్దరి మధ్య ఉన్న స్నేహభావం ఎన్నటికీ చలింపదు. సముద్రపు ఒడ్డున నిలుచుంటే కెరటములు ముందుకు తోసుకువస్తవి. వానిలో ఓకెరటము మరీముందుకు తోసుకురావచ్చు. కాని, వెంటనే వెనుకకు మళ్ళిపోతుంది—తిరిగి, ఎప్పటి ప్రశాంతతే!" అని చెప్పారు.

బిసెంట్ ఆహ్వానింపగా గాంధీజీ మా కళాశాలకు వచ్చారు. ఆయన శిష్యుడు సురేంద్రనాధ్ మా సహపాఠి. సురేంద్రుడు మాతో ఉంటూ ఉన్నా, సబర్మతీ ఆశ్రమంలోని నియామాలు అన్నీ పాటిస్తూ ఉండేవాడు. చాలా వేకువనే, మా అందరికంటే ముందులేచి, దైవధ్యానము చేసి, రాట్నమున నూలు వడికేవాడు. మేమందరమూ అతిపల్చని-మల్లెపువ్వులకంటె తెల్లని మిల్లు బట్టలు ధరిస్తే—అతను తాను స్వయంగా వడికిన ముతకనూలుతో నేసిన కోరా ఖద్దరు ధరించేవాడు. ఆనాడు గాంధిజీ మా వద్దకు వచ్చినప్పుడు ఆయనను ఆహ్వానిస్తూ వేదికను పూవులతో ఎంతో చక్కగా అలంకరించాము. కాని, ఆయన అది చూడనైనా చూడలేదు. వచ్చీ రావడముతోనే సురేంద్రుని భుజము పైన చేయి ఆనించి, చకాచకా నడుస్తూ మరుగుదొడ్లకేసి, స్నానాల గదులకేసి వెళ్ళారు. వాని పరిశుభ్రత అవీ ముఖ్యమని మాకు తెలియజెప్పారు.

తరువాత, చెట్లక్రింద సమావేశంలో మాతో ముచ్చటిస్తూ "మీ వలెనే నేనూ ఆశ్రమవాసినే. సబర్మతీ ఆశ్రమ విశేషాలను గురించి సురేంద్రుడు మీకు చెపుతూ ఉంటాడు. మిమ్మల్ని గురించి నేనూ అతనివల్ల వింటూ ఉంటాను. బోల్పూరులో శాంతినికేతన వాసులూ, అహమ్మదాబాద్‌వద్ద సబర్మతీ

ఆశ్రమవాసులూ, ఇచ్చట మీరు, ఒక్కొక్క విశిష్ట మార్గాన మన నవభారత మున కొక స్వరూపమును కల్పించడానికి యత్నిస్తున్నారు" అని చెప్పారు.

గాంధీజీ ముచ్చటిస్తూ ఉంటే, "లైట్ ఆఫ్ ఏషియా"లో ఎడ్విన్ ఆర్నాల్డు చిత్రించిన బుద్ధుడు జ్ఞాపకం వచ్చాడు నాకు. ఆ రోజులలో నన్ను అమితంగా ఆకర్షించిన గ్రంథము ఆ బుద్ధ జీవితము. ముఖ్యంగా అతడు యజ్ఞ వాటికలో బలిగానున్న మేకపిల్లను రక్షించిన ఘట్టాన్ని మరీ మరీ చిత్రించు కునేవాడను నా మనో వీధిని. నోరులేని జీవిని ఎత్తుకుని తన మృదు హస్త ముతో దాని తల నిమురుతూ బుద్ధుడు చెప్పిన శాంతివచనాలు ఎన్నటికీ మరుపు రావు.

బుద్ధ జీవితంలో ఇంకో ఘట్టంకూడా నాకు చాలా ఇష్టమైనది, ఆ రోజు లలో. తదుపరి, కొన్నేళ్ళకు అది కథావస్తువుగా రూపకం కూడా రచించాను. చనిపోయిన తనబిడ్డను బ్రతికింపమని కోరినతల్లికి అతడు చేసిన ఉపదేశమును గురించినది ఈ గాథ. "కనపడే ఆ పల్లెకువెళ్ళి ఎవరినన్నా అడిగి చిటికెడు ఆవగింజలు తీసుకురా ! కాని, ఏ ఇంటిలో తండ్రిగాని, తల్లిగాని, బిడ్డగాని సేవకుడుగాని చనిపోయి ఉండలేదో, ఆ ఇంటినుండే తేవాలి సుమా !" అని పంపిస్తాడు ఆమెను. ఆ పేదరాలు కోరిన ప్రతిఇంటా ఆవగింజలైతే అడిగీ అడగడంతోనే ఇచ్చేవారు. కాని, ప్రతిఇంటా ఎవరో ఒకరు ఆయేడో, క్రింద టేడో ఆ ముందటేడో చనిపోయిఉంటారు. మృత్యువు తొంగిచూడని పూరి గుడిసెగాని, భవంతిగాని, ఆమెకు కనుపించనే లేదు. "ఇంత మందితో నీ దుఃఖాన్ని పంచుకుంటున్నావు. తల్లీ, మన అనురాగమే మనకు ఎంత బాధాకర మగుతోందో తెలుసుకున్నావా ! కోటానుకోట్లను వేధించే ఈ బాధను జయించ డానికే నాయత్నం' అని భగవానుడు ఆమెను వూరడిస్తాడు.

బుద్ధుని జీవితములాగే జీసస్ జీవితాన్ని శ్రద్ధగా చదివాను ఆ రోజులలో. మేరీమాగ్దలీన్ చరిత్రలోని సత్యము నాకుచాలా నచ్చింది అప్పుడు. రాళ్ళురువ్వి పాపిని శిక్షించడానికి పూనుకున్న కులగురువులను ఉద్దేశించి "మీలో,ఏ పాపం చేసి ఎరుగని మనిషి ఈమెపై మొదటిరాయి రువ్వవలెను" అంటాడు జీసస్. వారు ఒక్క క్షణం ఆలోచించి, ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ తెల్ల

పోతారు. ఒకరి తర్వాత ఒకరు, అక్కడినుంచి చల్లగా జారిపోతారు. కొంత సేపటికి ఇంతవరకూ ఆలోచనా నిమగ్నుడై ఉన్న జీసస్ తలపైకెత్తి ఆమె వైపు ఎంతో జాలిగా చూస్తూ, "అమ్మీ ! నిన్ను ఎవ్వరూ శిక్షింపలేదా ? నేనూ శిక్షింపను, వెళ్ళు. ఇంకెన్నడూ తప్పుచెయ్యకు" అంటాడు. పశ్చాతాపంతో క్రుంగిపోతూన్న ఆమె అతని దయకు భక్తి పరవశురాలై మోకరిల్లి జీసస్ పాదధూళిని తలపై దాలుస్తుంది. పాదదాసిగా తనను స్వీకరింపమని ప్రాధేయ పడుతుంది—గణికగా ఒకప్పుడు మహారాజును సైతం శాసింపగలిగిన అతి రూపలావణ్యవతి మాగ్దలీన్.

ఈ మేరీ మాగ్దలీన్ వృత్తాంతమే నాటికగా చదివాను ఆ రోజులలో. ఎంతో రమ్యంగా రచించాడు మారిస్‌మాటర్లింక్. ఆ రచనలో ఒక చిత్రము: నాటకానికి ప్రాణమైన జీసస్ మాటలు వింటామేగాని ఆ పాత్రను రంగస్థలం పైన చూడము మనము. దేవుని రంగస్థలముపైన ప్రవేశపెట్టరాదనే పాశ్చాత్య సంప్రదాయాన్ని పాటించాడు మాటర్లింక్.

పాశ్చాత్య సంప్రదాయ నాటకములు నాలుగైదు చూచాను, ఆ రోజులో. జగత్ప్రసిద్ధమైన క్వార్టర్‌మెయిన్ బృందమువారు నటించిన షేక్స్పియర్ నాటకాలు, ఆధునిక రచనలూ ఎంతో ఆసక్తితో చూచాను. వారి నటనా కౌశల్యం నన్ను చాలా ఆకర్షించింది. వీని తరువాత హరీంద్రనాధ్ చటోపాధ్యాయ ప్రదర్శించిన తన 'అబూహాసన్' సంగీత నాటకము చూచాను. 'ఒపేరా' పద్ధతిని ప్రదర్శించిన ఈ నాటకమును కళాప్రియులందరూ ఎంతో మెచ్చుకొన్నారు. అరేబియన్ నైట్స్‌లోని కలీఫ్ అబూ హసన్ల కథను హరీన్ ఎంతో చమత్కారంగా ఇంగ్లీషులో ఒపేరాగా రచించి చక్కని హిందూస్తానీ సంగీతంతో ప్రదర్శించాడు; ఒక్కరోజు కలీఫ్ పదవిని అలంకరించిన వెర్రిబాగుల అబూహాసన్ పాత్ర హరీన్ అద్భుతంగా నటించాడు. తన గానకళా నైపుణ్యంతో ప్రేక్షకులను ముగ్ధులను చేశాడు. ఆ ప్రదర్శనలో అతని అక్కగారు మృణాళిని, చెల్లెలు సుహాసిని కూడా పాల్గొన్నారు. వింత వింత దుస్తులతో అందమైన రంగుల మేళవింపుతో రంగస్థలమెంతో రాణించింది.

హరీంద్రనాథ్ అక్కగారు మృణాళినీదేవి చాలా చదువుకున్నది. కళా వేత్త. "సెమ్మా" అనే మనోహరమైన పత్రికను నడుపుతూ ఉండేది ఆమె. ఇందు అరవిందుని వంటి జ్ఞానసంపన్నుల వ్యాసాలూ, ఆధునిక రచయితల కవిత, కళావిషయమై నిపుణుల విమర్శలు ఉంటూ ఉండేవి. కవితా ప్రియులు, కళారాధకులు, జ్ఞానపిపాసులు, రాజకీయవేత్తలు, ఉత్తమశ్రేణికి చెందినవారు మృణాళినీదేవి ఇంట సమావేశమై అనేక విషయాల గురించి చర్చిస్తూ ఉండే వారు. కట్టమంచి రామలింగారెడ్డి, ప్రొఫెసర్ ఎమ్. ఎ. కాండెత్, సి. పి. రామస్వామి అయ్యర్, అబ్దుల్ హమీద్ ఖాన్, రాధాకమల్ ముఖర్జీ, హుమయూన్ కబీర్, సర్. ఎన్. సుబ్రహ్మణ్య అయ్యర్ మున్నగువారు అక్కడజేరి ఎన్నో క్రొత్త విషయాలను గురించి ముచ్చటించుకుంటూ ఉండేవారు. ఇటువంటి ప్రాజ్ఞుల సమక్షంలోకి నేను వెళ్ళడం తటస్థించింది. వారునన్ను చాలా ఆదరించే వారు.

ఆ రోజులలోనే కొందరు స్నేహితులతో చిదంబరం, కడలూరు, ఆ తర్వాత పుదుచ్చేరి వెళ్ళాను. చిదంబరంలో శిల్ప సౌందర్యంతోపాటు తెర వెనుకనున్న "చిదంబర రహస్యం" నన్ను ఆకర్షించింది. "మీరు చూసినదంతా అనిత్యము; శూన్యాకాశము-ఒక్కటే నిత్యం" అనే ఈ గొప్పరహస్యం నాడు నాకూ చాలా నచ్చింది.

ఉ

వ్యన ప్రియ జీవితంబు కుసు

మంబుల పోలిక జంచలంబు గా

వున ఋవులంట్లు కాలమును

బుత్తము నవ్వుల నాట పాటలన్

గొనగొనబారు కాలువల

కోవల దియ్యని పానమాని జీ

## నా స్మృతి పథంలో ...

వన భరణ ప్రయాస మొక

ప్రక్కకు రువ్వద మోసి ప్రేయసీ.

(రామిరెడ్డి—ఉమర్ ఖయ్యామ్‌నుండి)

జగత్ప్రసిద్ధుడైన ఉమర్ ఖయ్యామ్ రచనను తెలుగు చెయ్యడము కోసము దువ్వూరి రామిరెడ్డి పారశీకభాష నేర్చుకున్నారట. రామిరెడ్డిఅనువాదం గురించి మొట్టమొదట జేమ్స్ కజిన్స్ చెప్పారు నాతో.

తరువాత కొన్నాళ్ళకు నాకు గురువు, స్నేహితుడు ఐన ఎన్. ఎస్. రామారావు ఉమర్ ఖయ్యామ్ రుబాయత్‌ను పారశీక భాషలోనే చదివి వినిపించారు. ఫిట్‌జరాల్డు చేసిన ఆంగ్లానువాదము ఒక ప్రతిన్నీ నాకు కానుకగా ఇచ్చారు. అప్పటినుండి, ఉమర్‌ఖయ్యామ్ పుస్తకము సదా ఉంటుంది నావద్ద. అడయార్ లైబ్రరీలోనే ఈ ఆంగ్లానువాదం, వేరు వేరు ప్రచురణలు ఒక పాతికకు పైగా ఉన్నవి. వీనిని ఎంతో శ్రద్ధతో పరిశీలించాను. ఒక్కొక్క ప్రచురణలో ఒక్కొక్క విశిష్టత ఉంటుంది. కొన్నిటిలో పాశ్చాత్య చిత్రకారులు రచించిన చక్కని బొమ్మలున్నాయి. కొన్ని ప్రఖ్యాత భారతీయ చిత్రకారులు చిత్రించిన అమూల్యమైన చిత్రాలతో ఎంతో అందంగా ఉన్నాయి. ఈ పద్యాలన్నీ నాకు ఒక్కరోజులో కంఠతా వచ్చాయి. తిరిగి, ఎన్ని వందలసార్లు వల్లించానో కొన్నిటిని; ఒకొక్క మానసిక పరిస్థితికి అనుగుణంగా ఒకొక్క పద్యం మసులుతూ ఉంటుంది మనస్సులో.

"రాత్రింబవళ్ళు అనే నలుపు, తెలుపు గళ్ళలో మనుష్యులనే బలగాలతో విధాత చతురంగ మాడుతూ ఉంటాడు. బలాలను ముందుకూ, వెనుకకూ నడుపుతూ, చంపుతూ, ఆట కట్టిస్తూ, ఒక్కొక్క కాయతీసి, భరణిలో పడవేస్తూ ఉంటాడు"—అనే పద్యం ఎంతో భావగర్భితంగా తోచింది నాకు.

ఒకరోజు సాయంత్రము కనుచీకటిలో, ఒక కుమ్మరి ఇంటికి వెడతాడు ఉమర్‌ఖయ్యామ్. అక్కడ బారులు బారులుగా తీర్చి, అమర్చిన రకరకాల మంటిపాత్రలను చూస్తాడు. వానిలో కొన్ని మనభాషలో మాట్లాడుకుంటూ ఉంటాయి. అతడు విస్తుబోయి వింటాడు:

"కుమ్మరి ఎవరు ? కుండ ఎవరు ?" అని, ఒకపాత్ర ప్రశ్నిస్తుంది. ఆ ప్రశ్నకు సమాధానం లేదు.

పాపము ! కొంచెము మూతివంకరగల కూజా 'నాకు మూతి వంకర అని అందరూ ఆక్షేపిస్తారు, నన్ను తిప్పుతూ ఉండగా కుమ్మరి చెయ్యి కదిలింది కాబోలు' అంటుంది. మనుష్య మాత్రుల లోని లోపాలన్నీ, ఒక్కసారిగా జ్ఞప్తికి వస్తాయి, ఈ పంక్తులు చదువుతూఉంటే. మళ్ళా, అవి లోపాలుకావు- పుట్టుకతోనే వచ్చిన అసంపూర్ణత అని తెలుస్తుంది.

అమూల్యమైన ఈ పంక్తులు, అక్షరాలా సత్యమని ఎంతో బాధపడ్డాక తెలుసుకున్నాను. అశ్రుజలాలు నదులై ప్రవహించినా విధివ్రాతను చెరిపివేయ లేవు—అని బోధపడింది జీవితంలో.

*                *                *

కజిన్స్ మాకు సౌందర్యానుభూతి గురించి ఉపన్యసించేవారు. ప్లేటో నుండి నేటివరకు సౌందర్యమును గురించి అనేకులు వెల్లడించిన భావాలను ఎంతో చక్కగా తెలియజెప్పేవారు. అప్పుడే వారు జపాన్ వెళ్ళివచ్చారు. అచ్చట, సౌందర్యసీమలో వారు చూసిన విశేషాలెన్నో మాకు చెప్పారు. జపానీయులు సౌందర్య ప్రియులనీ, వారి ఇంట్లో దుస్తులలో, చేష్టలలో, మాటలలో సౌందర్యం వెల్లువారుతూ ఉంటుందనీ చెప్పారు. మన ప్రాచీన సౌందర్య లక్షణాలు వివరిస్తూ ఆధునికులు ఆనంద కుమారస్వామి, అవనీంద్రులు ఈ ప్రాచీన కళాసంపదను ఎట్లు అవగాహన చేసుకుంటున్నారో తెలిపారు. ఈ సందర్భం లోనే అప్పుడు బందరు జాతీయ కళాశాలలో ఉన్న ప్రమోదకుమార ఛటర్జీ, అడవి బాపిరాజు, అనందమోహన్ల గురించి మాకు పరిచయం చేశారు. వారి శిల్పచాతుర్యాన్ని చాలా మెచ్చుకున్నారు ఆయన.

"కళా తపస్వి" అనే పేరు కజిన్స్‌కు అన్నివిధాలా చెల్లుతుంది. సౌందర్యానుభూతిని పొందటానికి అభిరుచి, పరిచయము, విచక్షణ అవసరమనేవారు ఆయన. జన్మతఃమన అందరిలోకూడా అందమైన వస్తువులలో, అందమైనభావాలలో ఎంతో కొంత అభిరుచి ఉంటుంది. ఈఅభిరుచిని అభివృద్ధి చేసుకుంటూ,

కుంటూ, సుందర విషయాలతోటి పరిచయం ఇంకా, ఇంకా ఎక్కువ చేసుకో వాలి. ఈ విధంగా కలిగిన విశేష పరిచయంవల్ల కొన్నాళ్ళకు విచక్షణ అల వడుతుంది. సృష్టిలో అన్నీ స్వతహాగా అందమైనవే. వీనిలో అంతరాలుం టాయి. ఇక, మానవ నిర్మితమైన సుందర విషయాలలో వానిని సృష్టించిన వారి సంస్కారమునుబట్టి, సాధననుబట్టి ఆత్మవికాసమునుబట్టి అంతస్తులెన్నో ఉంటాయి. వీనిలోని హెచ్చుతగ్గులను గుర్తించడానికి విచక్షణ అవసరము. ఈ విచక్షణతో పరిశీలించినప్పుడే సంపూర్ణమైన సౌందర్యానుభూతిని పొంద గలము—అని బోధించారు ఆయన.

స్టెల్లా క్రామిరిష్ అనే కళాశీలి శాంతినికేతనమునుండి మా కళాశాలకు వచ్చారు, ఒకసారి. సౌందర్యపరిశీలన గురించి చెపుతూ ఒక చక్కని దృష్టాంతం చూపారు. మమ్మల్ని తలా ఒక పెన్సిల్, కాగితము తీసుకో మన్నారు, వీలైనంతవరకు మనస్సులో ఎటువంటి భావాలూ లేకుండా ఉంచుకో మన్నారు. "నేను కొన్ని భావాలను గురించి కొన్నిమాటలు అంటూ ఉంటాను. ఒక్కొక్కమాటా, వినడముతోనే కాగితముపైన మీ చేతికివచ్చిన గీతలు గియ్యండి, ఒక క్షణమైనా వితర్కించకుండా గీయాలి" అన్నారు. అని సూర్యో దయము, కటిక చీకటి, ప్రేమ, దయ, క్రోధము, పండువెన్నెల, ఈర్ష్య, భక్తి, నదీతీరము, పచ్చికబయలు, ముండ్లపొద- అంటూ గబగబా కొన్ని మాటలు చెప్పుకుపోయారు, ఆమె. తర్వాత మేమందరము గీసిన గీతలు సమన్వయించి మాకు చెప్పారు. సున్నితమైన భావాలు, అందమైన అభిప్రాయాలు, తెలిపే మాటలు వినడంతోనే అప్రయత్నంగా చక్కని వలయాకారమైన గీతలు గీసాము. క్రోధము, ఈర్ష్య—ఇటువంటి మాటలు చెవిని తాకడముతోనే వంకర టింకర గీతలు గీశాము. అందానికీ, మన మనోభావానికీ గల పరస్పర సంబం ధమును ఈ విధంగా నిరూపించారు ఆమె.

* * *

ముప్పది ఏళ్ళ తర్వాత ఇటీవల నేను స్వయంగా చిత్రించిన కొన్ని బొమ్మలను తీసుకువెళ్ళాను కజిన్స్‌వద్దకు. అప్పటి ఆప్యాయమే, అప్పటి సౌజ

న్యమే ఆయనలో. నా బొమ్మలన్నీ శ్రద్ధతో చూశారు. ఆయన ఏమంటారో అని ఆత్రుతతో ఉన్న నన్ను చూచి స్నేహ ముప్పతిల్లే మందహాసంతో, "వీనిలో చిత్రరచనకంటే కవిత్వం ఎక్కువ కనబడుతోంది. చిత్రకళ నీవు ఎవరివద్దా అభ్యసింపలేదని తెలుస్తూంది. చిత్రరచన కూడా ఒక సాధనే. భాష నేర్చుకునే టప్పుడు ఓనమాలు, వర్ణక్రమము, గుడింతాలు, వ్యాకరణము నేర్చుకొన్నట్లే బొమ్మలు వెయ్యడానికి కావలసిన 'టెక్నిక్' కూడా నేర్చుకునే సంపాదించాలి. శాంతినికేతనం నుంచి వచ్చిన చిత్రకారుడు ఉన్నాడు ఇక్కడ. అతనివద్ద ఆరునెలలు మొదటినుండి నేర్చుకో. ఆ నేర్పు తెలిసాక, కవి హృదయంగల నీలోని సున్నిత భావాలకు సుందరమైన రూపకల్పన చేయడానికి వీలవుతుంది" అన్నారు.

* * *

సాహిత్య రీత్యాకూడా ఆ రోజులలో (1918—20) నా జీవితంలో ఎంతో వెన్నెల విరిసింది. వాల్ట్ విట్‌మన్, ఈట్స్, షెల్లీ, కీట్స్ వీరి రచనలు నిత్యమూ చదివేవాడను. ఈట్స్ వెలిబుచ్చే భావాలు నా భావాలకు ఎంతో సన్ని హితంగా తోచాయి. ఒకచోట ఆయన ఇలా అన్నారు:

> The wrong of unshapely things is
> a wrong too great to be told;
> I hunger to build them anew and
> sit on a green knoll apart,
> With the earth and the sky and
> water, remade, like a casket
> of gold.........

"అందవికారమైన వస్తువులు చేసే అపచారం ఇంతింతగాదు. వీటిని బాగుచెయ్యడానికి తహతహ పడుతున్నాను నేను. భూమి, ఆకాశం, నీరు— వీటికి బంగారవు భరిణకుమల్లే కొత్తరూపమిచ్చి, నేను మాత్రము దూరముగా చిన్న పచ్చిక బయలున కూర్చోవాలని ఉంది నాకు" అన్నారు ఈట్స్.

ఆనాటి తహ తహ ఈనాడూ ఉన్నది నాలో—ప్రత్యక్ష పరిస్థితుల మొట్టికాయలతో తల బొప్పికట్టి ఉన్నా. ఆ ఆశ, ఆ ఆవేశము నానాటికి అతి

శయిల్లుతూ ఉన్నాయే గాని సన్నగిలలేదు. కాని, కాలక్రమేణా కొంత అణు కువ నేర్చుకున్నాను. కుందేటికొమ్ము సాధింపవచ్చుననే వెర్రి నమ్మకము తగ్గింది. ఐతే, యత్నం మాత్రము చేయక తప్పదని తోస్తుంది.

*　　　*　　　*

అరవిందుని మొదట దర్శించినప్పుడు నాకు పదహారేళ్ళుంటాయి. మేము ఐదుగురు స్నేహితులము కలసి వెళ్ళాము ఆయన దర్శనార్థము. చిదంబరం వెళ్ళి, అక్కడనుండి కడలూరు మీదుగా పుదుచ్చేరి వెళ్ళాము.

పుదుచ్చేరి చేరడముతోనే సి. ఐ. డీలు మమ్మల్ని అనుసరించటము ప్రారంభించారు. మాలో ఒకడు బర్మీయుడు. ఒకతను మహారాష్ట్రుడు. ఇద్దరు తమిళులు. నేను సరే—తెలుగువాడను. ఇందరమూ, ఒక బృందంగా అర విందుని దర్శనార్థము వెళ్ళడమువల్ల వారి దృష్టికి మరింత పాత్రమయ్యాము. ఐనా, వారు మమ్మల్ని ఏవిధంగానూ ఇబ్బంది పెట్టలేదు.

మొదటిరోజు సాయంత్రము, దీపాలు పెట్టబోతూ ఉంటే, అరవిందుని మందిరానికి వెళ్ళాము. అప్పటికింకా ఆశ్రమము వెలిసి ఉండలేదు. హాలులో బల్లవద్ద కూర్చుని మా రాకకై నిరీక్షిస్తున్నారు అరవింద ఘోష్. వేరు వేరు ప్రాంతాలనుంచి వచ్చి, ఒకేచోట చదువుకుంటూన్న మమ్మల్ని చూచి ఆయన చాలా ఆనందించారు. ఎంతో చనువుగా మాట్లాడారు మాతో. రాజకీయ విష యాల ప్రస్తావన అంతగా రాలేదు. కాని, అప్పుడే వచ్చిన పేపర్ చూస్తూ "బిపిన్ చంద్రపాల్ లాహోర్ చేరగా, కొద్దిగా వర్షం మాత్రం కురిసిందట" (Bepin Chandra Pal arrives in Lahore: it only rains.) అనే వార్తను ఆయన అనుచరుడు చదువగా, అరవిందుడు బిగ్గరగా నవ్వారు. ఆనాటి రాజకీయ వాతావరణంలో బిపిన్ చంద్రపాల్ లాహోర్ వస్తే ప్రమాదకరమని పంజాబ్ ప్రభుత్వము ఆయన రాకను నిషేధించారు. కాని, పాల్ ఆ ఆజ్ఞను ధిక్కరించి లాహోర్ స్టేషన్‌లో రైలు దిగారు. తీరా వచ్చాక ఆయనను అప్పుడు నిర్బంధిస్తే మరింత ప్రమాద మవుతుందని ప్రభుత్వం ఆయనను ఏమీ చేయలేదు. ఆ సమయానికి వర్షం మాత్రం కురిసింది—అని వారు

వివరించి చెప్పారు. ప్రభుత్వోద్యోగులకు రాజకీయ వాదులంటె తగని భయ మనీ, కొన్ని కొన్ని సమయాలలో ఆ ఉద్యోగులకు యుక్తాయుక్త విచక్షణ ఉండదనీ అన్నారు.

అరవిందునితో చాలాసేపు మాట్లాడాము. తిరిగి, దేశంవచ్చి స్వరాజ్యో ద్యమ నాయకత్వం వహింపరాదా అని మాలో ఒకరు ఆయనను ప్రశ్నింపగా, "నేను భౌతికంగా రా నగత్యములేదు. ఇక్కడ ఉండే, నా కర్తవ్యాన్ని నెర వేర్చగలను" అన్నారు. అప్పుడు నేను ఆయనను ఒక వింత ప్రశ్న వేశాను: "ఇప్పుడు తమవంటివారు అంతా దేశస్వాతంత్ర్యానికి పాటుపడుతున్నారు. మీ శ్రమఫలించి, మనకు సంపూర్ణ స్వాతంత్ర్యమే లభిస్తే, ఆ తరువాత ఉద్యమ నాయకులు దేనికొరకు పాటుపడతారు?" అని అడిగాను. ఆయన నా మాట లకు నవ్వి, "మంచి ప్రశ్నవేశావు, కాని, సంపూర్ణ స్వాతంత్ర్యమే మన లక్ష్యముకాదు. అది మనకు ఒక సాధనము మాత్రమే. మనకు కావలసినది అంతకంటె ఇంకా గొప్పది. ప్రపంచాని కంతా వెలుగు చూపింప వలసిన బాధ్యత మన దేశానిది. స్వతంత్రుల మైతేగాని ఆ పని చేయలేము మనము, స్వాతంత్ర్యము వచ్చాకనే మన అసలుపని ప్రారంభమవుతుంది" అన్నారు.

మేము ఆయనతో ఉన్నంతసేపూ, ఎంతో ఉల్లాసంగా మాట్లాడారు ఆయన. మేము లేచి, సెలవు దీసుకోబోతే, "మంచిది, రేపు ఉదయం మళ్ళా వోసారి రండి. ఇంకా కొంచెముసేపు కబుర్లు చెప్పుకుందాము" అన్నారు.

మర్నాడు ఉదయము మళ్ళా వారివద్దకు వెళ్ళాము. తెల్లని మల్లు ధోవతి, బెంగాలీ పంపిణీగా ఆ ధోవతిచెంగే ఉత్తరీయంగా వేసుకొని, ఎంతో ఉత్సా హంతో మమ్మల్ని ఆహ్వానించారు అరవిందులు. మా సరసన కూర్చుని ఫొటో తీయించుకున్నారు, మాలో ఒకరి కామిరాతో.

ఆ ఫొటో ఇప్పటికీ ఉంది పదిలంగా నా వద్ద—నలభై ఏళ్ళ తర్వాత.

*　　　*　　　*

రష్యన్ రచయితలు తుర్గినీవ్, చెకోవ్, పుష్కిన్లు చాలా ఆప్తులయ్యారు నాకు ఆ వయస్సులో. వీరి రచనా శిల్పము నన్ను చాలా ఆకర్షించింది. వీరిని

నాకు పరిచయము చేసిన ఆమె నాకంటె ఒక్క ఏడాదే కాబోలు పెద్ద. కాని, ఎన్నో మంచి మంచి పుస్తకాలు చదివింది. మనసంగీతం గురించి, పాశ్చాత్య సంగీతము గురించి ఎంతో తెలుసు ఆమెకు. అందమన్నా, సుస్నేహమన్నా ఆమెకూ తగనిపిచ్చే. ప్రతివస్తువూ, ప్రతిమాట, ప్రతిచేష్ట అందముగా ఉండాలనేది ఆమె. సముద్రపు ఒడ్డున, నదీ తీరాన, ఉదయాస్తమాన సమయాలలో ఎన్నో విషయాలను గురించి మాట్లాడుకునేవారము మేము. కాలేజి పిల్లలతో ఒక పర్యాయం నేను పూనాకు సమీపానఉన్న లొనవాలాకు వెళ్ళగా, అక్కడకు ఆమె నాపేర ప్రతిరోజూ ఉత్తరాలు వ్రాసేది, ముత్యాల కోవలవంటి అక్షరాలతో. ఇతరులెవ్వరూ చదువకూడని విషయాలు ఏవీ లేకపోయినా, ఉత్తరాలను నేను ప్రేమలేఖలుగా భావించి దాచుకునేవాణ్ణి.

కాలేజికి తిరిగివచ్చాక, సాయంత్రము, నదిఒడ్డున, ఆమె ఉన్నట్టుండి నన్ను ప్రశ్నించింది: 'ఫలానావారు నేను ఆయనను పెండ్లి చేసుకోవాలని కోరుతున్నారు. నాకంటె ఆయన వయస్సున చాలా పెద్దఅని నీకు తెలుసుగా, నీ వేమంటావు ?' అని అడిగింది.

"ఆయనంటే నీకు ఇష్టమేనా ? అన్నాను.

"ఆ ! చాలా ఇష్టం" అన్నది ఆమె.

"మరి, ఇంకేమీ ?" అన్నాను.

"మా పెండ్లికి లోకము ఒప్పుకోదు. అనేక ఆటంకాలు వస్తాయి" అన్నది ఆమె.

"లోకముతో మీ కెందుకు ? మీ రొకర్ని ఒకరు మనస్సార ప్రేమిస్తే, లోకము ఏమి చేయగలదు, మిమ్మల్ని ?" అన్నాను.

లోకము మొదట ఎన్నో ఆటంకాలు కల్పించినా, తుదకు వారి నిద్దరినీ పూజనీయులుగా ఆరాధించింది.

కాని, ఆమె నన్ను సలహా అడగడమే నాకు చాలా జ్ఞాపకముంది. తలిదండ్రు లున్నారు. అన్నదమ్ము లున్నారు, అక్క చెల్లెళ్ళున్నారు. నా సలహా కోరడము నన్ను గౌరవించినట్టు అనుకున్నాను. ఐతే, నిజానికి ఈ విషయా

లలో ఇతరుల సలహా అట్టే పనిచెయ్యదు. మనం ఇదివరకే ఒక నిర్ణయానికి వచ్చి ఉంటాము. స్నేహితులైనవారిని సలహా అడిగినా, వారిచ్చిన సలహా మన భావానికి అనుకూల మైతేనే ఆమోదిస్తాము. వ్యతిరేకమైతే, మన తొలి నిర్ణయాన్ని ఇంకా బలపరచుకోడానికి కావలసిన కారణాలు వెతుక్కుంటాము.

నా మటుకు నేను ఇటువంటి ముఖ్యమైన నిర్ణయాలు చేయవలసి వచ్చింది—ఒకసారి కాదు, రెండు, మూడుసార్లు. ఇన్నిసార్లూ కూడా ఆ నిర్ణయానికి రావడానికి నిమిషముకంటె ఎక్కువసేపు పట్టలేదు నాకు. నిర్ణయించాక ఎవరి సలహా కూడా నా మతమును మార్చలేదు.

ఒకనాటి సాయంత్రము, మా మేనత్తగారింటి వీధి అరుగుమీద కూర్చున్నా. కృష్ణాపత్రిక చదువుకుంటూ. మా మేనత్త భర్త, కరణముగారు ఆ వూరికి, తన లెఖ్ఖలు పూర్తిచేసుకుని, కండ్లజోడు సవరించుకుంటూ నా వద్దకు వచ్చారు ఆయన. నేనంటే మా అత్తయ్యకూ, మామయ్యకూ ఎంతో ఇష్టము. నేను ఇంతవాణ్ణి, అంతవాణ్ణి అని ఎంతో సదభిప్రాయంతో ఉండే వారు. ఆయన అప్యాయంగా నా వద్దకు వచ్చి, "చూడు! నీవు ఈ విధంగా చేస్తే బాగుంటుంది" అంటూ, నా భావి జీవితానికి సంబంధించిన ఒక ముఖ్య విషయం గురించి సూచించారు. "నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేసినవారు చాలా సంతోషిస్తారు. మేమంతా చాలా సంతోషిస్తాము. వారిని సంతోషపెట్టడము నీ విధి, ఎప్పుడూ ఇతరుల కోసమే జీవిస్తాను అనే నీకు ఇదే చేయవలిసిన ధర్మము"అన్నారు.

ఒక్క క్షణము ఆలోచించాను—అంతే. "సరే" అన్నాను.

ఆ నిర్ణయము ఇద్దరి జీవితాలకు సంబంధించినది. తనకు మాత్రం సంబంధించిన విషయంలో ఎట్టి నిర్ణయానికి వచ్చినా ఇబ్బందిలేదు. కాని, ఆ నిర్ణయం మరొక వ్యక్తి సుఖదుఃఖాలకు కారణభూతమవుతుం దన్నప్పుడు చాలా చాలా ఆలోచించాలి. లేకపోతే అది హృదయాలతో చర్లాటమే అవుతుంది. ఎంతో బాధ కలిగించి, బాధ అనుభవించి తెలుసుకున్నాను, కొన్నేళ్ళ తరువాత, ఈ సత్యాన్ని నేను.

మరొక పర్యాయం, అర్ధరాత్రివేళ వాల్తేర్ స్టేషన్‌లో ఒకానొక ముఖ్య నిర్ణయానికి వచ్చాను. అదికూడా మరొకవ్యక్తి జీవితానికి సంబంధించినదే. పరోపకారవాంఛ అనే భ్రమతో, అవ్యక్తమైన అనురాగబలమువల్ల ఒక క్రొత్త బాధ్యతను నాపై వేసుకోడానికి నిర్ణయించాను. అప్పుడున్నూ ప్రక్కనున్న ఆప్త స్నేహితుడు "నీ 'ఇంపల్స్' మంచిదే. కాని, సాధక బాధకాలు ఆలోచించాలి కదా" అన్నాడు. నా నిర్ణయము మారలేదు.

తత్ఫలితం నా జీవితాన్నంతా కమ్మివేసింది. అనిర్వచనీయమైన మధురానుభవాలు పొందగలిగాను—వర్ణింప నలవిగాని దుఃఖభారంతో క్రుంగిపోయాను కూడా. కొన్నాళ్ళు వెన్నెల విరిస్తే జీవితంలో కొన్నాళ్ళు చీకట్లు క్రమ్మడమున్నూ సహజమేనేమో.

మూడవసారి, మోటార్‌కార్ నడుపుతూ ఒక నిర్ణయానికి వచ్చాను. నా ముందు గుర్రపుబండిలో వెళుతూన్న వ్యక్తి అప్పటి నా శిథిల జీవిత ప్రాంగణములో అడుగుపెట్టబోతూన్నట్టు నాకుతెలుసు. 'కాస్త తెలివితో ప్రవర్తిస్తే' మరో విధంగా జరిగి వుండవచ్చు. కాని, ఇక్కడ, విధికూడా సాయపడిందేమో. ఎదుట, మేము దాటవలసిన రైలుగేటు చటుక్కున మూసివేశారు— రైలు వస్తోందని. వారి బండివెనుకనే నా కార్ ఆగవలసి వచ్చింది. నా కార్ దీపాలు తగ్గించేముందు బండిలో ఉన్నవ్యక్తి ముఖాన తళుక్కుమని మెరిశాయి ఒక్క క్షణము. ఆ చిరునవ్వు నాకెన్నో పూర్వస్మృతులు కలిగించింది. ఆ క్షణమే, నేను నిర్ణయించాను.

ఆ గేట్‌ను నేను చాలాసార్లు దాటాను తర్వాత. ప్రతిసారి ఆ సంఘటన జ్ఞాపకము రాకమానదు. గేటు తీసేఉంటే ఏమైఉండేదోగాని క్షణములో చేసిన నా నిర్ణయంవల్ల ఎంతో మార్పు కలిగింది ఇద్దరి జీవితములో.

మొత్తానికి, కొందరకు నలుగురూ నడిచేత్రోవను వెళ్ళడము చేతగాదు. నలిగిన త్రోవలో ముళ్ళుండవు అని తెలుసు. రాళ్ళత్రోవను నడిస్తే రమ్యమైన దృశ్యాలు చప్పున కనబడుతవేమోననే వెర్రిఆశతో అల్లాగే పరుగులెత్తుతారు వీరు. కాలుజారిపడి, నుదుటరక్తం స్రవించినప్పుడే తెలుస్తుంది నలిగిన బాటే నయమని. కాని, గాయంమానినా, రాళ్ళబాట మాత్రము మానలేరు వీరు—రహస్యాన్వేషణా కుతూహలమువల్ల.

హిరణ్మయేన పత్రేణ
సత్యస్యాపి హితం ముఖం
తన్మే బ్రహ్మ న్నపావృణు
సత్యకామాయ దృష్టయే॥

"బంగారపు మేలి ముసుగుతో సత్యస్వరూపము ఆవృతమై యున్నది. సత్యసాక్షాత్కారము కొరకు, దేవా, తెరను తొలగింపుము!"

1921లో అనుకుంటా, అడయార్‌లో 'వర్ల్డ్ కన్వెన్షన్' జరిగింది. ప్రపంచంలో అన్ని ప్రాంతాలనుంచి సభ్యులు వచ్చారు. నార్వేనుంచి, న్యూజీలాండ్‌నుంచి, మెక్సికోనుంచి, అమెరికా ఇతర ప్రాంతాలనుంచి, ఆఫ్రికా నుంచీ కూడా వచ్చారు. ఒకవారంరోజులు సభలుజరిగాయి. కన్వెన్షన్ ఇన్‌క్వైరీ ఆఫీస్ పని చూస్తూన్న నాకు సభ్యులందరితో పరిచయం కావడానికి వీలైంది. వీరందరికీ ఒకటే ఆశయం. సత్యాన్వేషణ, ఒకటే విశ్వాసము: సత్యము కంటే గొప్ప మతంలేదు,అని. అన్ని మతాలలో ఉండే సత్యస్వరూపాన్ని వీరు మన్నిస్తారు. సర్వమానవ సౌభ్రాతృత్వము వీరి పరమలక్ష్యము. వీరందరూ భారతదేశాన్ని పుణ్యభూమిగా పరిగణిస్తారు. జన్మతః యే మతానికి చెందినా అందరికీ కూడా మన హిందూమత సూత్రాలలో విశేషమైన పరిచయమూ వాని యందు ఎంతో అభిమానమూ ఉన్నవి. మన దుస్తులు ధరిస్తూ, మన ఆహారం సేవిస్తూ మన సంప్రదాయాలను పాటిస్తూ మన నాగరకతను ఎంతో గౌరవిస్తారు.

ఒకనాటి రాత్రి సభలో వైస్ ప్రెసిడెంట్ జినరాజదాసా అంతకు కొన్నాళ్ళ ముందు జర్మనీలో ఓబర్ ఓమర్‌గామ్ వద్ద తాను చూచివచ్చిన "పాషన్‌ప్లే" నాటకం గురించి చెప్పారు, మాజిక్ లాంటర్న్ బొమ్మలుచూపిస్తూ. సుమారు మూడువందల యేండ్లక్రితము ఆ గ్రామవాసులు క్రైస్తు జీవిత గాథ లోని తుది ఘట్టాలను చిత్రించే ఈ నాటకాన్ని మొట్టమొదటిసారి ప్రదర్శించారు. తరువాత, పదేళ్ళకొకసారి వారే ఈ నాటకాన్ని క్రమము తప్పకుండా

ప్రదర్శిస్తూ ఉంటారు. పాత్రధారు లందరూ ఆ గ్రామస్థులే. వారి వారి భూమి కలను ఎంతో భక్తితో అభ్యసిస్తూ ఉంటారు. ముఖ్యంగా క్రైస్తు పాత్రధారి ప్రదర్శనానికి ముందు నెలరోజుల నుంచి ఉపవాస దీక్షలో ఉండి తాను నటింప వలసిన లోకోత్తర పురుషుని జీవితాన్ని పూర్తిగా అవగాహన చేసుకుంటాడు. అతని భావప్రకటన చూస్తూ ఉంటే అచ్చంగా జీససే తిరిగి అవతరించాడా అనిపిస్తుంది.

మరొకరాత్రి, అడయార్‌లోని అతి విశాలమైన మర్రిచెట్టు క్రింద రవీంద్రుని శరదోత్సవ నాటకమును ప్రదర్శించారు, మాబడిపిల్లలు. ప్రదర్శనం యెంతో రక్తికట్టింది. కవిగా, నాటక రచయితగా రవీంద్రుని ప్రతిభ చక్కగా వ్యక్తమైంది. ఠాకూర్ దాదా వేషధారి అద్భుతంగా నటించాడు. ఆ ప్రదర్శన చూచాక, నేను అదేపనిగా రవీంద్రుని రచనలన్నీ చదివాను.

కొన్నాళ్ళకి రవీంద్రులే పట్నంవచ్చారు. గోఖలేహాలులో ఆయన ఉపన్యసించారు. విద్యావంతులు, కళాప్రియులు, అంతటూ వచ్చారు. అంత పెద్దహాలు కిక్కిరిసి పోయిందన్నమాట. వాలంటీర్‌గా నేను రవీంద్రునికి అతి సమీపాన ఒక స్తంభాన్ని ఆనుకుని నుంచున్నా ఆ గంటన్నరసేపూ!

'మెసేజ్ ఆఫ్ ది ఫారెస్ట్' (కానన సందేశం)ను గురించి సంభాషిస్తున్న ఆయనను చూస్తూ అల్లాగే నుంచున్నా అంతసేపూ. ఒక పర్యాయం ఆయన గొంతుక సవరించుకుంటూఉంటే ఆయనకంఠస్వరం సింహగర్జనలా హాలంతా ప్రతిధ్వనించింది. ఆధ్యాత్మిక సంబంధమైన ప్రస్తావన ఐనా, ఆయన నాలుగైదు సార్లు తన ఛలోక్తితో సభికులను నవ్వించారు. మన ఉపనిషత్సారమును తేట తెల్లంగా చెప్పారు ఆయన నేటి పరిభాషలో. ఏదో ఋష్యాశ్రమంలో గురువు శిష్యులకు ఉపదేశిస్తూన్నట్టే ఉన్నది ఆయన ప్రవచనము. ఆరోజు గంటన్నరా ఇట్టేగడిచిపోయింది. ఉపన్యాసం ముగిశాకకూడా, సభికులు, అల్లాగే, కూర్చొని ఉండిపోయారు. ఆయన లేచి నమస్కరించాకనే వారూ లేచారు. ఆయనకు అంగరక్షకునిగా నేను ఆయన ముందు నడవడము ఎంతో గొప్పగా హర్షించాను నేను.

## నా స్మృతిపథంలో...

మా పినతల్లి కూతురు ఒకామె తరుచు చెపుతూ ఉండేది, మదనపల్లెలో రవీంద్రుని సమక్షాన ఆమె తెలుసుకున్న అనేక గొప్పవిషయాలను గురించి. ఆయన ఆదరణ, ఆయన సౌమ్యభావం, ఎంతో ఉత్సాహంతో వర్ణించేది ఆమె. ఆయన మదనపల్లెవిడిచి వెడుతూఉంటే, తన ఆటోగ్రాఫ్ పుస్తకంతో ఏదైనా వ్రాయమని ఆయనకు అందియ్యగా, గురుదేవుడు అందు 'ది ఫ్రూట్ కారీస్ విదిన్ ఇట్ ది సాక్రిఫైస్ ఆఫ్ ది ఫ్లవర్' అని వ్రాశారు. 'పుష్పంచేసిన త్యాగ సంపదే ఫలమునందు ఇమిడి ఉన్నది' అన్నారాయన.

ఆమె వలననే నాకు సంగీతసాహిత్యములందు ఎంతో అభిరుచి ఏర్పడినది. ఆమెకు సంగీతమున మంచి ప్రవేశము; ఉత్తమ గాయకులతో పరిచయ మున్నా. పట్నంలో వారింట ఎవరైనా పాడుతోఉంటే నాకు కబురుపంపేది. ఒక పర్యాయము, ఆమె స్నేహితురాలు ఒకామె వీణవాయిస్తూ పాడగా విన్నాను. అప్పుడు నేను వినిన 'వెడలెను కోదండపాణి' అనే పాటలోని రమ్యత ఎన్నటికీ మరచిపోను. సీతారామ లక్ష్మణులు, అయోధ్య ప్రజలు కన్నులకు కట్టినట్లు కనిపిస్తారు, ఆ పాట జ్ఞాపకం వచ్చినప్పుడల్లా.

సాహిత్యం విషయంలో, కొందరు ఉత్తమ రచయితలతో పరిచయం కలిగింది, ఆమె ప్రోత్సాహంవల్ల. అదీ చిత్రంగానే జరిగింది. ఆమె పట్నము విడిచి మదనపల్లె వెడుతూ, 'అక్కడ నాకేమీ తోచదు; నీవేమైనా మంచి పుస్తకాలు పంపుతూ ఉండాలి నాకు' అని కోరగా నేను మా కాలేజీ లైబ్రరీ నుంచి తీసి పుస్తకాలు పంపేవాణ్ణి, ఆమెకు. వారానికి నాలుగైదు పుస్తకాలు పంపేవాణ్ణి. ఆమెకోసం తీసిఉంచిన పుస్తకాలు నేనూ చదివేవాణ్ణి. ఇల్లాగ నాకు కొన్ని ఉత్తమ గ్రంథాలు చదవడానికి అవకాశం కలిగింది. ఆ పుస్తకాలు ఆమె ఎంతో శ్రద్ధతో చదివి నాకు తిరిగిపంపివేస్తూ ఉండేది. ఆ సందర్భంలో ఆయా రచయితలను గురించి మాకు ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూ ఉండేవి. అప్పుడే ఒకసారి నేను ఆస్కార్‌వైల్డ్ రచనలనుగురించి ఆమెకు ముప్పది పేజీల ఉత్తరం వ్రాశాను: అతనిని గురించి మొదట ఆమె నాకు చెప్పింది. తరువాత, నేను అతనివి పద్యాలు, నాటకాలు, విమర్శలు అన్నీ చదివాను. బర్నార్డ్‌షా,

ఎడ్వర్డ్ కార్పెంటర్, మారిస్ మాటర్లింక్-వీరి రచనలు కూడా అప్పుడే చదవడం ప్రారంభించాను, నేను. ఇబ్సెన్ నాటకాలున్నూ అప్పుడే చదివాను.

'సంఘ శత్రువైన' ఆస్కార్‌వైల్డ్ జైలులో వ్రాసిన ఒక పద్యకావ్యం, ఒక వచన కావ్యం, నాకు చాలా నచ్చాయి. పద్యకావ్యాలలో అభిప్రాయమే ఒకటి కొన్నేళ్ళ తర్వాత నేను తెలుగులో వ్రాశాను. 'జైలులో ఉన్నవారికి ఎంతో ఎత్తున ఉన్న కిటికీ ద్వారా కనుపించే ఆకాశ మొక్కటే కాస్త ఉత్సాహాన్ని ఇస్తుంది' అన్నాడు ఆస్కార్‌వైల్డు. ఈ భావమే ఈ పంక్తులలో ఉండవచ్చు!

నేను నిదురించు శయ్యాగృహంపు టాకాశ
గవాక్షమందుండి యొక్క తారకామణి
మిణుకు మిణుకంచు దన సందేశాల
బరప జూచు... ...
దాని గనినంత, దప్పిగొనియున్న నా హృదయమున
కేదో నవజీవనామృతా స్వాదనం బొనరించునటులె దోచు;

ఒక్క నక్షత్రమునకె నేనొకండ నింత
ఆశార్ద్ర హృదయుండనైతినేని, మింటగల
యీ తారక మహోతతుల గంట గాంచి
యుర్వి జనులందరెంత యుప్పొంగవలయునొక్కొ!

అని వ్రాశాను. కాని, తర్వాత ఆలోచిస్తే తెలిసింది, అపురూపమైన ఒక్క నక్షత్రానికి ఉండే విలువ అవలీలగా కనపడే లక్ష నక్షత్రాలకు ఉండదని!

వైల్డ్ వచన కావ్యం 'డీప్రఫండిస్'ను గురించి మా ఇంగ్లీషు ప్రొఫెస్సర్ టి. ఎల్. క్రాంబీతో నేను ఎంతో పొగడుతూ మాట్లాడగా, అయన చదు

నవ్వుతో ఇలా అన్నారు: "చాలా గొప్పగా వ్రాశాడు; ఎంతో బాధపడే వ్రాశాడు. కాని, ఆ రచనలో 'సత్యము' కంటె 'కళ' ఎక్కువుంది తెలుసా?" అన్నారు.

కాస్త ఆలోచించాక, ఆ అభిప్రాయమే నిజమని తెలుసుకున్నాను. స్వానుభవము ఇంతుంటే, దానికి మెరుగులుదిద్ది, చిలవలు, పలవలూ కలిపి, మరింత చేస్తాడు కవి. ఈ విధంగా రమ్యత సాధింపవచ్చు. కాని, ఇందులో అంతా అక్షరాలా, నిజమేనా అంటే. అది ఆ రచయితతో ఆంతరంగికంగా, ఎంతో పరిచయమున్నవారు గాని చెప్పలేరు.

ఇటువంటిదే కొందరు ప్రఖ్యాత నటుల విషయంలో కూడా చూడవచ్చు. తప్పతాగి, రంగస్థలముపై కెక్కి, మహనీయుడైన ఒక యోగిపుంగవునిగా, అద్భుతంగా నటించినవారు మనకు తెలుసు. 'నిషా' సహాయంతో వింత ఐన ఒకానొక అలౌకిక వాతావరణంలో విహరిస్తూ తన నటనా చాతుర్యాన్ని వెల్ల డిస్తాడు నటుడు. ఆ స్థితిలో అతను ఆత్మసాధనను అద్భుతంగా నిరూపించ వచ్చు. కాని తన నిత్య జీవితంలో ఒక వ్యసనాన్ని అరికట్టలేని అతను అరిషడ్ వర్గాలను జయింపకలిగినట్లు ప్రేక్షకులను అంతగా ఒప్పింపకలగడము ఇక్కడ ఒక గొప్పకళే.

మా ఇంగ్లీష్ ప్రొఫెస్సర్ మాకు ఉత్తమరచన గురించి ఎంతో చక్కగా చెప్పేవారు. మంచి మంచి రచనలను మాకు చదివి వినిపిస్తూ ఉండే వారు. స్టీఫెన్ ఫిలిప్ప్ వ్రాసిన 'పఅలో అండ్ ఫ్రాంసెస్కా' అనే నాటకము చదివారు ఒకసారి. ఎంతో రమ్యంగా ఉంది ఆ రచన. యుద్ధవీరుడైన రాజు రాచకార్యాల నిమిత్తం సామంతరాజు కుమార్తె, తనకంటె చాలా చిన్నదైన ఫ్రాంసెంస్కాను పెళ్ళాడతాడు. ఆమె భువనైక సుందరి. వట్టి బేల. వివాహమైన వెంటనే యుద్ధభూమికి తరలి వెళుతూ, రాజు తన తమ్ము డైన పఅలోను తోడిచ్చి పంపుతాడు, నూతన వధువును, పమర్యాదగా, తన నగరానికి. పఅలో ఫ్రాంసెస్కాలు సమాన వయస్కులు. అతడూ రూప వంతుడే. ఆమెలాగే అతి సున్నితమైన స్వభావం కలవాడు. దైవనిర్దేశమో

అన్నట్టు, మొదటి చూపులోనే, అతి సహజంగా వారిలో పరస్పర ప్రేమ భావం అంకురిస్తుంది. బేలఐన ఆమెకు ఈ ప్రేమవలన కలిగే ముప్పు తెలియదు. అతడు మాత్రం ఆ ప్రేమను జయించాలని చాలా ప్రయత్నిస్తాడు. అది అతని చేతగాదు. చివరకు, విధి బలీయమై వీరి ప్రేమసంగతి తెలిసిన అన్నగారు, రాజుగా, వారినిద్దరినీ చంపివేస్తాడు. కాని, అతనిలోని ఉదాత్త మానవత్వము నిర్మలమైన వారి ఆత్మలను పూజిస్తుంది. "ఇప్పుడు భౌతికాతీతమైనది వీరి అమర ప్రేమ!" అంటాడు. ఈ నాటకము ఆయన మాకు చదువుతూ ఉంటే కథకుని, శ్రోతల కన్నుల నీరు గ్రమ్మినవి అంటే, అతిశయోక్తిగాదు.

ఇంకొకటి ఏకాంకిక, 'అసంపూర్ణ చిత్రపటము'. ప్రఖ్యాత ఇటాలియన్ చిత్రకారుడు ఆండ్రియో డొనాటే బాలుడైన జీసస్ క్రైస్టు బొమ్మను చిత్రించాలని ఉత్సాహపడి వాడవాడా తిరిగి అన్నివిధాలా జీసస్‌ను స్ఫురింపజేసే ఒక బాలకుని వెతికి తెచ్చి అతని రూపం చిత్రిస్తాడు. ఈ జీసస్ పటమును లోకమంతా ఎంతో మెచ్చుకుంటుంది. 'జీసస్ అంతఃకరణను ఈ చిత్రపటము చూపినట్లు ఇంతవరకూ ఏ చిత్రమూ చూపలేదు' అంటారు విమర్శకులు. శిల్పి ఆండ్రియో ఖ్యాతి నేల నాలుగు మూలలా వ్యాపిస్తుంది. మరి కొన్నేళ్ళకి జీసస్ గాథ చిత్రిస్తూ, ఒక్క ముప్పై వెండి నాణాలకు ఆశపడి జీసస్‌ను శత్రువులకు పట్టిఇచ్చిన విశ్వాసఘాతకుడు జూడాస్‌బొమ్మ వెయ్యాలని సంకల్పిస్తాడు అతడు. ముమ్మూర్తులా జూడాస్‌ను స్ఫురింపజేసే వ్యక్తికోసం అన్వేషిస్తూ, ఎక్కడెక్కడో తిరిగి, తుదకు ఒక జైలుకు వస్తాడు. ఆ జైలు అధికారి తన అధీనంలో ఉన్న అతి కఠిన హృదయులను, నీచాతి నీచులను, తండ్రికి సైతం ద్రోహం చెయ్యడానికి ఏ మాత్రమూ సంకోచింపని కిరాతకులను నలుగురైదుగురను చూపుతాడు అతనికి. వీరిలో మరీ క్రూరస్వభావంగల అతనిని ఎన్ని, అతనిబొమ్మ చిత్రించడానికి ఉపక్రమిస్తాడు శిల్పి.

తెల్లవారితే ఈ ఖైదీకి మరణదండన. కనుక రాత్రిఅంతా నిద్రిస్తూనే ఉంటాడు ఆండ్రియో. ఇక, ఒక గడియలో చిత్రం పూర్తికావాలి. ప్రతిరేఖ,

క్రూరత్వాన్ని, విశ్వాస ఘాతకత్వాన్ని సూచిస్తూన్న ఆ బొమ్మ పూర్తిఐతే అది జూడాస్ అపరావతారంగా ఉంటుంది అనుకుంటూ, చిత్రమును పూర్తిచేస్తూ ఉంటాడు. అప్పుడు, ఖైదీ 'బొమ్మ పూర్తిఐందా ?' అని ప్రశ్నిస్తాడు. 'ఆ ! ఐపోవచ్చింది. ఇంక నాలుగు గీతలే' అని, తన పనిలో నిమగ్నుడై పోతాడు శిల్పి. ఖైదీ మళ్ళా అంటాడు: 'కోడికూస్తే ఇంక మీకు కనపడను. ఇప్పుడే ఆఖరుసారి నిదానించి చూడండి నన్ను !' అని, వికృతంగా నవ్వుతాడు. మరీ గట్టిగా నవ్వుతాడు. కుంచె క్రిందపుంచి, శిల్పి అతని ముఖంలోకి చూస్తాడు.

నిర్ఘాంత పోతాడు.

ఆనాడు బాలుడైన జీసస్‌గా తన ఎదుట నిలిచిన వ్యక్తే ఈనాడు జూడాస్ ! 'ప్రభూ ! నీ లీలలు అగమ్యగోచరములు; నీ చేతులలోనే ఇంతగా మారిపోయిన స్వరూపానికి మానవమాత్రుణ్ణి నేను రూపకల్పన చేయడము సాహసం !!' అంటూ, బొమ్మను చింపివేస్తాడు.

మా ప్రొఫెస్సర్ మాకు ఇంకా కొందరు గొప్ప రచయితలను గురించి చెప్పారు. జాన్ డ్రింక్‌వాటర్ రచించిన అబ్రహామ్‌లింకన్, క్రామ్‌వెల్ నాటికలు చదివాము మేము, వారితో.

అబ్రహామ్‌లింకన్ గాధ లోకోత్తరమైన గాథ. ఇది రంగస్థలమున కూడా చూచాను నేను, ఆ రోజులలోనే ప్రఖ్యాత బ్రిటిష్ నాటక బృందము వారు నటింపగా. ఈ నాటకంలో రెండు మూడు సన్నివేశాలు నన్ను మరీ ఎక్కువగా ఆకర్షించాయి.

నీగ్రో బానిసలవిముక్తి విషయమై అమెరికా ఉత్తర రాష్ట్రాలకీ, దక్షిణ రాష్ట్రాలకీ మధ్య ఘోరయుద్ధం సాగుతూ ఉంటుంది. జయాపజయాల త్రాసు ఎటుమొగ్గినా మొగ్గవచ్చు. అట్టి పరిస్థితిలో ప్రెసిడెంట్ అబ్రహామ్‌లింకన్ యుద్ధభూమికి వెళ్ళుతాడు. క్రిందటి రాత్రి సెంట్రీ డ్యూటీచేస్తూ ఏమరపాటున నిద్రపోయిన ఒక సైనికుడ్ని అతని వద్దకు తీసుకువస్తారు. ఆ అపరాధానికి శిక్ష మరణదండనే. లింకన్ సైనికుని ప్రశ్నిస్తాడు:

'నీ వయస్సెంత ?'

'ఇరువది' అంటాడు, సైనికుడు వణికిపోతూ.

'నీకు తలిదండ్రు లున్నారా?'

'తండ్రిలేడు; మా అమ్మ ఉన్నది' అంటాడు సైనికుడు.

'సెంట్రీగా కావలికాస్తూ నిద్రపోవడం మహాపరాధమని నీకు తెలియదా?'

'తెలుసు; కాని నిద్ర ఆపుకోలేకపోయాను' అని, వెలవెల యేడుస్తాడు సైనికుడు.

'సరే! అతనిని తీసుకువెళ్ళండి' అంటాడు లింకన్. అతనిని క్షమించినట్టు మాటలలో అనడు. కాని క్షమించాడని మనకు తెలుస్తుంది.

ఈ మారణహోమము లింకన్‌కు ఏ మాత్రమూ కిట్టదు. మరో రంగంలో యుద్ధభూమిని చనిపోయిన వారి సంఖ్యగురించి సేనాధిపతిని ప్రశ్నిస్తాడు. 'నేటి యుద్ధంలో ఎందరు చనిపోయారు?' అని అడుగగా 'మన పక్షమున ఆరువేల మంది; కాని, శత్రువులు ఎనిమిదివేల మంది హతులయ్యారు!' అంటాడు సేనాధిపతి ఎంతో గర్వంతో.

'పద్నాలుగువేలమంది అమెరికన్లు!' అంటాడు లింకన్ స్వగతంగా.

ఇంకొక రంగంలో, ఓడిపోయిన దక్షిణరాష్ట్ర సైన్యాధిపతి ఉత్తరరాష్ట్ర సైన్యాధిపతివద్దకు వస్తాడు. ఖిన్నుడై, యుద్ధసంప్రదాయానుసారంగా తన కరవాలాన్ని తీసి ఎదిరిచేతిలో ఉంచబోతాడు. అతనిని చటుక్కున వారించి కరవాలాన్ని తిరిగి ఒరలో అమర్చి, సోదరభావంతో అతని భుజముపై చేయి వేస్తాడు విజయుడైన సైన్యాధిపతి.

ఇటువంటి సన్నివేశాలు నన్ను ఎంతో కదిలించేవి.

మా ప్రొఫెస్సర్, ఒక పర్యాయం, 'ఇది గొప్ప పుస్తకము, చదువు' అని అప్పుడే వెలువడిన ఒక నవల ఇచ్చారు, నాకు. రచయిత పేరు ఎ. ఎస్. ఎమ్. హచ్చిన్‌సన్. 'ఇఫ్ వింటర్ కమ్స్' అనే పుస్తకం. నేను ఒక పూటలో ఆ పుస్తకం వారికి తిరిగి ఇచ్చివేశాను.

'నాకు నచ్చలేదు' అన్నాను.

ఆయన, ఆశ్చర్యపడి, వెంటనే సర్దుకొని, అన్నారు:

'ఒకందుకు మెచ్చుకోవాలి నిన్ను; సాహితీలోకమంతా ప్రశంసించిన గ్రంథము నీకు నచ్చలేదని ధీమాగా అనగలుగుతున్నావు. ఈ పుస్తకము రచించినందుకు హచిన్‌సన్‌కు పదివేల నవరసులు బహుమాన మిచ్చారు. తెలుసా?' అన్నారు.

'తెలుసు. కాని, నాకు భాష బాగాలేదు! అన్నీ చిన్న చిన్న వాక్యాలే. కర్త, కర్మ, క్రియ పాటించినట్టు లేదు, ఎక్కడా' అన్నాను.

"అదాకారణం! కాని, భావాన్ని చటుక్కున ప్రదర్శింపకలిగే ఇటువంటి భాషే ఇకముందు ప్రచారంలోకి వస్తుంది, కొన్నాళ్ళయినాక నీవే మెచ్చుకుంటావు" అన్నారు ఆయన.

నిజమే!

కొన్నాళ్ళయినాక, ఆ పుస్తకాన్ని కొనుక్కుని మళ్ళా చదివాను. ఈసారి భాష నాకు చాలా నచ్చింది. అంతేకాదు; నేనూ అల్లాగే, నా భావాలు సూటిగా చెప్పగలిగితే ఎంత బావుండును అనిపించింది. పూర్వపు శైలిలో ఒకపెద్ద వాక్యంలో తెలిపే భావమును ఒక్క చిన్నమాటలో చెప్పిస్తాడు హచ్చిన్‌సన్. సంభాషణ చకచకా నడుస్తుంది. ధోరణి ఎంతో సహజంగా ఉంటుంది. ఇక కథావస్తువున్నూ, జీవితంలో క్రొత్త విలువలను చూపించింది నాకు. ఈ మధ్యకాలంలో మారినది నేనే.

"ఇఫ్ వింటర్ కమ్స్ కాన్ స్ప్రింగ్ బి ఫార్ బిహైండ్" అనిన షెల్లీ ఆశా సందేశమే ఈ నవలకు మకుటము. ఎంతటి నిస్సార శిశిరంలో కూడా భావి వసంతం ఇమిడి ఉన్నది. శిశిర ఋతువును అనుసరించేకదా వసంతం వచ్చేది. కనుక నిరాశకు తావులేదు. ఈ సత్యము చాలా చక్కగా నిరూపించారు కథలో

ఈ నవలలో ఒక చోట కథానాయకుడు మార్క్సాబర్ అంటాడు:

"నోనా బ్రోక్ ది కప్" అని. 'ఆ కప్పు నోనా పగులకొట్టింది'—ఈ మాటలు ఇప్పుడూ నేను అనేక పర్యాయాలు అనుకుంటూ ఉంటాను. కారణం?

అవి ఎంతో భావగర్భితమైనవి. అనుభవ పరంపరల వెనుక అణగిఉన్న ఒకానొక విఫల మనోరథాన్ని జ్ఞప్తిపరచేవి.

మార్క్ సాబర్ ఇంచుమించు మన గాంధీవంటివాడు. చెడ్డ అనేమాట అతనికి తెలియదు. మొదట, తనకు అన్నివిధాల అనుకూలమైన స్వభావంగల నోనా అనే ఆమెతో స్నేహమవుతుంది, అతనికి. అనేక విషయాలలో వారి మనస్సులు ఏకీభవిస్తాయి. అతడు ఆమెను ఆదర్శస్త్రీగా భావిస్తాడు. వారిద్దరు ఒకరి నొకరు పూర్తిగా అర్థం చేసుకోగలుగుతారు. పరస్పరము ప్రేమించి పెండ్లి చేసుకోవాలని నిశ్చయించుకుంటారు కూడా. కాని, ఇంతట్లోకి, ఉన్నట్టుండి ఆమె మరేవో ప్రబల కారణాలవల్ల మరొకతనిని పెండ్లాడుతుంది. ఇది సాబర్‌ని కలవరపరచినా, అతడు ధీరుడై ఆవేదన భరిస్తాడు. కొన్నాళ్ళయినాక, మేబెల్ అనే ఆమెను పెండ్లాడుతాడు. వారిద్దరూ సంసారయాత్ర సాగిస్తారు. కాని, అనేక విషయాలలో వారికి అభిప్రాయభేదం కలుగుతుంది. అతడెంత ఆదర్శజీవో ఆమె అంత సాదామనిషి. అతడెంత ఉదారమనస్కుడో ఆమె అంత సంకుచిత స్వభావం కలది. ఐనా, ఆమెను సంతోషపెట్టాలని శాయశక్తులా ప్రయత్నిస్తాడు. ఎంతో సర్దుకుపోతాడు. కాని, అతనిని ఏ మాత్రమూ అర్థంచేసుకోదు; ఒకొక్కప్పుడు ఎంతో క్రూరంగా ప్రవర్తిస్తుంది. ఈ యమయాతనను అతడు ఎల్లాగో భరిస్తాడు.

ఒకరోజున ఒక స్వల్ప విషయాన్ని గురించి ఆమె రాద్ధాంతపడి అతనితో తీవ్రంగా మాట్లాడుతుంది. అతడెంతో నెమ్మదితో, ఎంతో సౌమ్యంగా ఆమెకేసి చూస్తూ నిలబడడం ఆమె సహింపలేక, ఒళ్ళుమండి, గదితలుపు దభాలున బాది వెళ్ళిపోతుంది. తలుపు దభాలున బాదటంవల్ల గోడమీద చిలక కొయ్యను ఉన్న పింగాణీకప్పు జారి క్రిందపడి వేయిముక్కలవుతుంది. భూమిలోకి కృంగిపోతూ, ఆ ముక్కలను ఏరుతూ, సాబర్ తనలో అనుకుంటాడు: "నోనా బ్రోక్ ది కప్"-నోనా మూలాననే ఈ కప్ పగిలినది, అని. హృదయాంతర్హృదయంలోంచి వెలువడిన ఈ నిట్టూర్పును తలచుకొన్న కొద్దీ ఎన్నో విషయాలు స్ఫురణకు వస్తాయి నాకు.

# నా స్మృతి పథంలో...

మన అందరి జీవితంలోనూ ఒక 'నోనా' ఉంటుందేమో. ఎవరో కొందరు అదృష్టవంతుల విషయంలో తప్ప....

"ఇఫ్ వింటర్ కమ్స్" నవలను చాలాసార్లుచదివాను తరువాత. స్నేహితులు కొందరికి చదువమని ఇచ్చాను కూడా.

*　　　*　　　*

క్రాంబీ మాచేత ఇంగ్లీష్ వ్యాసాలు వ్రాయించేవారు. కాంపోజిషన్‌గా ప్రారంభించినది నా విషయంలో సాహిత్య రచనగా పరిణమించినది చూచి, మా ప్రొఫెస్సర్ చాలా సంతోషించారు. వెన్నెలలో దేవాలయము గురించి వ్రాశాను. నేను సృష్టించిన వాతావరణం, వ్యక్తపరచిన భావాలు ఆయన చాలా మెచ్చుకున్నారు. ఆ ధోరణిలోనే ఇంకా వ్రాయమన్నారు. వారి ప్రోత్సాహంతో "మా ఊరి చెరువుగట్టున", "నదీతీరాన" అనేవి వ్రాశాను.

నిత్య జీవితంలోని పరిచిత దృశ్యాలే ఎంతో ఆకర్షణీయంగా రచిస్తూ సాహితీప్రియుల మన్ననలను అందుకున్నాడు వెంకటరమణి, అప్పుడే. "నీ రచన వెంకటరమణి రచనలా ఉన్నా, అంతకంటె కూడా రష్యన్ రచయిత చెకోవ్ రచనను స్ఫురింపజేస్తుంది. ఇటువంటిది ఈ దేశంలో వారికంటే అమెరికాలో ఎక్కువ ఆదరిస్తారు. అక్కడకు పంపుతాను" అని నా రచనలు ఒక స్నేహితునిద్వారా అమెరికా పంపారు. అక్కడ వాళ్ళసంగతి ఏమైనదో తెలియ లేదు; కాని, మరికొన్నాళ్ళకి అవే అనీబ్ సెంట్ ప్రచురించే 'యంగ్ సిటిజన్' పత్రికలో వెలువడి ఆమె మన్ననకు పాత్రమైనాయి.

"ఈ కుర్రవాడు చక్కగా వ్రాస్తాడుసుమా!" అన్నారు ఆమె.

## ౭

కస్తూరీ తిలకం లలాటఫలకే
వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే
వేణుం కరే కంకణం
సర్వాంగే హరిచందనంచ కలయన్
కంఠేచ ముక్తావళీం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే
గోపాల చూడామణిః

బెంగుళూరు నాగరత్నము పాడుతోంది గోఖలేహాలులో. ముడు పల కల ముక్కుపుడుక, చెవులకమ్మలు దీపపుకాంతిలో ధగధగ మెరుస్తున్నాయి. లయపాటిస్తూ ఆమెతల ఊపినప్పుడల్లా అడ్డబాస అందంగా నాట్యమాడుతోంది పై పెదవిపైన. ఊదా చంద్రకాంతపు పువ్వురంగు పట్టుమీద బంగారపు జరీ పువ్వులు కుట్టిన బనారస్ పట్టుచీరె, ముఖమల్ పట్టురవిక, పద్మాసనమున కూర్చున్న ఆమె "సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళీం" అని వర్ణిస్తూ, భక్తి పారవశ్యంతో కన్నులు మూసుకున్నప్పుడు కట్టెదుట సాక్షాత్కరించిన బాలకృష్ణుని దివ్యస్వరూపాన్ని అట్టే ఆత్మలో ఇముడ్చు కుంటోందా అనిపిస్తూంది....

నిజంగా, దాక్షిణాత్య సంగీతము దెస నా మనస్సు మరల్చినది బెంగు ళూరు నాగరత్నము గానమే. తరువాత, ఎన్నో ఏళ్ళయినాక ఆమెతో అన్నాను కూడా ఆ మాట. "అవునా, బిడ్డా, అట్లనా" అన్నది ఆమె, ఎంతో దయతో. నన్ను "బిడ్డా" అని పిలిచేది, త్యాగరాజ పరమభక్తురాలుగా సంగీత ప్రపంచ మున మాననీయురాలైన ఆమె.

అంతవరకూ మనసంగీతము ఎక్కువగా 'సరిగమపదనిసల' చమత్కారపు మేళవింపు మాత్రమే అనుకునేవాడను నేను, భావముకంటె శాస్త్రము ఎక్కువ పాటిస్తారు మన విద్వాంసులు అని తోచేదినాకు. ఆనాడు నాగరత్నము గానములోని విపరీత భావసంపద నన్నెంతో చకితుణ్ణి చేసింది. ఆమె భైరవి రాగం ఆలాపిస్తూ ఉంటే "రహివుట్ట జంత్ర గాత్రముల రాల్గరిగించు విమల గాంధర్వంబు విద్య మాకు" అని ఆ గంధర్వస్త్రీ అనిన మాటలు జ్ఞాపకం వచ్చాయి.

మానవుడు తన నిరంతరాన్వేషణలో ఎన్నో గొప్ప విశేషాలు సాధించి ఉండవచ్చును. విద్యుచ్ఛక్తిని అరికట్టి ఉండవచ్చును. ఉపగ్రహాలను సృష్టింపవచ్చును. అణుశక్తి ప్రభావంతో అంతరిక్షాన కోట కట్టుకోవచ్చు. కాని వీటన్నిటికంటే గొప్పదీ శాశ్వతానంద కరమైనదీ అతడు పరిణితికి దెచ్చిన సంగీతకళ అనుకుంటాను అనేకసార్లు. ఎటువంటి అనుభవాలను కలగజేస్తుంది మన ఆత్మలో సంగీతం! ముఖ్యంగా, పాశ్చాత్య సంగీతమును ఆలకిస్తూ మన అంతశ్చక్షువుతో ఎన్నో సుందర దృశ్యాలను చూచి ఆనందింపగలము. ఇట్టి ఆనందానుభూతికి హద్దులేదు. రసన అనే రెక్కలతో రమ్యత అనే ఆకాశంలో యథేచ్ఛావిహారం చెయ్యవచ్చును ఎంతసేపైనా ఉత్తమ సంగీతము వింటూ.

నాకు పాశ్చాత్య సంగీత రీతులలో విశేషపరిచయము కలిగించిన పుణ్యము మా జర్మన్ ప్రొఫెస్సర్ ఎ. ఎన్. ష్వార్ట్జ్‌కు చెందినది. స్విట్జర్లాండ్‌నుంచి మనదేశమువచ్చి ఇక్కడే ఉండిపోయా రాయన. ప్రతి శనివారం రాత్రి వారిబంగళాకు వెళ్ళేవాళ్ళము మేము, సంగీతము వినడానికీ వారితోకబుర్లు చెప్పుకోడానికీ. చిన్న చిన్న అందమైన కప్పులలో కాఫీ యిచ్చేవారు మాకు. దోరగా వేయించిన బాదం పప్పున్నూ. బాదంపప్పు తింటూ అద్భుతమైన పాశ్చాత్య సంగీతమును ఆలకించేవారము. ఆయనవద్ద సుప్రసిద్ధ పాశ్చాత్య సంగీతజ్ఞుల రికార్డులు ఎన్నో ఉండేవి. బితోవెన్ సింఫనీ తొలిసారి వారి యింటనే విన్నాను నేను. ఫ్రిట్జు క్రైస్లర్ వయొలిన్ కూడా విన్నాను.

క్రైస్లర్ రికార్డ్ వింటూన్నప్పుడే అతనిని గురించి ఒక విశేషము చెప్పారు మా ప్రొఫెస్సర్ మాతో. తన పద్నాలుగో ఏటనే విచిత్రమైన వయొ

లిన్ ప్రవీణతవల్ల ప్రపంచ విఖ్యాతిని గాంచిన క్రైస్లర్ ఆస్ట్రియా దేశస్థుడు. మొదటి ప్రపంచ సంగ్రామపు తొలి రోజులలో బ్రిటిష్, ఫ్రెంచివారు అమెరికన్ రాయబారి ద్వారా ఆస్ట్రియా ప్రభుత్వానికి ఒక సందేశం పంపారు: "క్రైస్లర్ ప్రతిభ ఏ ఒక్క దేశానికీ ప్రత్యేకం గాదు. అది ప్రపంచపు సొత్తు. కనుక ఆస్ట్రియాదేశపు చట్టము ప్రకారం అతడు తప్పకుండా యుద్ధంలో పాల్గొనవల సినా, ప్రపంచ పౌరుడైన అతని విషయంలో మాత్రం ఆ నిబంధన పాటింప రాదని" వారు కోరారు. అతని ప్రాణం ఎంతో విలువైనది కాబట్టి, అతను యుద్ధభూమి పరిసరాలకు రాకుండా చూడాలని అర్థించారు. తరువాత కొన్నా ళ్ళకు అతడు ఆస్ట్రియా వదలి అమెరికాలో స్థిరనివాస మేర్పరచుకున్నాడు.

స్విట్జర్లాండ్‌లో విస్తారమైన పచ్చిక బయళ్ళుంటాయి. ఆ బయళ్ళలో చక్కని పాడియావులు కడుపార మేస్తూ ఉంటాయి. పసుల కాపర్లు పిల్లన గ్రోవిని ఊదుతూ ఆవులను మేపుతూ ఉంటారు. ఆ పిల్లనగ్రోవి మన వేణువు లాగ కాక, మనిషి ఎత్తున ఉంటుంది. దానిని నిలువునా నిలబెట్టి వూదుతారు. గాన కళాకోవిదుడు కాకపోయినా, ఆ అకాపరి ఇట్టి పిల్లనిగ్రోవిపైన ఎంతో మనోహరమైన గానాన్ని సృష్టిస్తాడు. ఆ వాద్యము రికార్డ్ తరుచు వినేవారము మేము. వింటూ ఉంటే ఏవేవో క్రొత్త క్రొత్త భావాలు కలుగుతూ ఉండేవి నాలో. పారవేసుకున్న ఏదో అమూల్యమైన వస్తువుకొరకు నిరంతరము వెదుకుతూన్నట్టు ఉండేది ఆ సంగీతము.

అప్పుడప్పుడు మా ప్రొఫెస్సర్ తానే స్వయంగా వయొలిన్ వాయించే వారు. మంచి ప్రవీణతగల ఆయన వాద్యము వినసొంపుగా ఉండేది. పాశ్చాత్య సంగీత రీతుల లోతులు నా కప్పటికి అంతగా అవగాహన కాకపోయినా, వారి వాద్యములోని భావోద్రేకము నన్ను పరవశుణ్ణి జేసేది. మన సంగీతానికీ, ఆ సంగీతానికి గల తేడా ఇదే అనుకుంటా. మన సంగీతము చాలావరకు సాహిత్య ప్రధానమైనది.వాద్యమును వింటున్నా, ఆ కృతులలోని మాటలు స్పష్టంగా మన మనోవీధిని మసలుతూ ఉంటాయి. ఆ మాటలలో భక్తిరసము ప్రధానముగా ఉంటుంది. శృంగారమున్నా, చాలావరకు దేవుని పరంగానే

ఉంటుంది. స్వచ్ఛమైన సంగీత రూపములను ఊహించుకుని ఆనందించడానికి ఈ మాటలు ప్రతిబంధకంగా ఉంటాయి. యధేచ్ఛగా విహరింపవలసిన రసనకు ఎల్లలు కల్పించి క్రిందికి దిగజార్చ చూస్తాయి. పాశ్చాత సంగీతం అల్లాకాదు. అతి ఆహ్లాదకరమైన ధ్వని పరంపరల ద్వారా మనస్సులో, మన హృదయంలో ఎన్నెన్నో వింత భావాలను రేకెత్తింపగలదు పాశ్చాత్య సంగీతము. అద్భుత రసము మన సంగీతములోకంటే ఆ సంగీతములో ఎక్కువగా ఉంటుంది. ఇతర రసములున్నూ పాశ్చాత్య సంగీతరీతిని చప్పున, సులభంగా అనుభవింప జేయవచ్చును. ఎడతెగని అన్వేషణ, పైకి చెప్పుకోలేని మూగబాధ, భయంకర మైన ఒంటరితనము ఆ రీతులలో, ముఖ్యంగా వయొలిన్‌ద్వారా, అతిరమ్యంగా ప్రకటింపవచ్చును. సృష్టి వైచిత్రి, బహురూపమైన జీవన మాధుర్యము, హృదయాంచలముల వింతగా చిగురించే ఆశాభావాలు —ఇటువంటివి పియాన్‌తో చక్కగా చిత్రించవచ్చు. నవరసాలను అద్భుతంగా పోషిస్తూ, జంత్ర సమ్మేళన ద్వారా ఎంతో భావస్ఫురణ, భావోద్రేకము కలిగింపవచ్చును.

ఐతే, అత్యుత్తమ సంగీతాన్ని కూడా పూర్తిగా ఆస్వాదించడానికి తగిన వాతావరణము అవసరము. అనుకూలవాతారణము రసాస్వాదనను ఇనుమడింప చేస్తుంది. నేను ఎన్నటికినీ మరువలేను, మహాబలిపురమున గడిపిన ఒకరాత్రి.

మేమంతా మహాబలిపురం చూడడానికి వెళ్ళాము, ఆ రోజులలో ఒక సారి. సాయంత్రము వరకూ, అందరిమూ కలిసి అచ్చటి శిల్పసంపద శ్రద్ధతో పరిశీలించాము. రాత్రివేళ సముద్రతీరానికి చేరాము ముగ్గురు స్నేహితులూ, నేనూ. కటికచీకటి, నక్షత్రాలు మిణుకు మిణుకుమంటూ ఎంతో దగ్గరగా ఉన్నట్టు కన్పిస్తున్నాయి. ఎక్కడో దూరాన్నుంచి బయలుదేరి, ధగ ధగలాడే తెల్లని ఊదా వెలుగుతో ముందుకు చొచ్చుకు వస్తున్నాయి కెరటాలు నురగలు గక్కుకుంటూ—అంచీలమీద వచ్చే అశ్వదళాలలాగ. ఒక్కటే హోరు. కాని, ఉన్నట్టుండి కెరటాల సందడి చటుక్కున అణిగిపోయేది. కెరటానికీ కెర టానికీ మధ్య కలిగిన ఆ గాఢనిశ్శబ్దము హృదయాన్ని వింతగా పలుకరించి నట్టు లయ్యేది. ఎదుట, అనతిదూరాన సముద్రంలో సగము మునిగిపోయిన

ధ్వజస్తంభము, మా వెనుక ఉన్న లైట్‌హౌస్‌నుంచి నిమిషానికి రెండు పర్యాయాలు, ఎంతో కాంతితో కిరణాలు కెరటాలతో తడిసిన ధ్వజస్తంభం మధ్యభాగాన సూటిగా తాకేవి. ఆ వెలుతురు ప్రసరించినప్పుడు కెరటమున్నా ఇంత్తెత్తు ఎగిరి విరుచుకుపడేది స్తంభంపైన. వాడియైన పెద్ద బాణంలా కటిక చీకటిని ఛేదించే ఆ కిరణపరంపర, బంధితయక్షుని అనంత రోదనలా తడి స్తంభంపైన పడే కెరటాల ఆరొాదా—ఇవన్నీ అలౌకికమైన ఒకవింత వాతావరణను కల్పించాయి.

ఆ సమయంలో స్నేహితుడు శాస్త్రి-అతనిది మచిలీపట్నము—చల్లగా పాడడము మొదలుపెట్టాడు: "పాండ్య భూపాలపుత్రీ పర్వతరాజ తనయా" అంటూ. ఈ రాగమాలిక చాలాసార్లు విన్నాను అంతకుముందు, ఆ తరువాత. కాని, అప్పటి అనుభవము ప్రత్యేకమైనది. అది పూర్తిగా భౌతికాతీతమైన అపూర్వానుభవము. అతనిని ఇంకా పాడమని, పాటవింటూనే నిద్రపోయానట నేను, ఆ సముద్రతీరాన.

మరునాడు, మేము వచ్చివేస్తూండగా, ఒకవింత జరిగింది. పడవుల రేవుకు చేరేముందు చేరువనే ఉన్న ఇదివరకు చూడమరచిన ఒక ప్రాచీన ఆలయాన్ని చూడాలని ఆ వైపు వెళ్ళాము శాస్త్రీ, నేనూ. శిథిలదేవాలయం ప్రక్కనే ఆకులులేనిచెట్టు కనబడింది. ఆ చెట్టునిండా ఎరుపు కలిసిన మేలిమి బంగారు ఛాయతో నిగనిగలాడే గుండ్రనిపండు. పందిరకు కట్టిన పాదరసము బుడ్లలా, కొమ్మనుండి వేలాడుతున్నాయి, గుత్తులు గుత్తులుగా. "అబ్బ! ఎంత బాగున్నాయి! ఏమిపళ్ళు ఇవి!" అంటూ గబగబ చెట్టెక్కి నాలుగుపళ్ళున్న గుత్తి ఒకటి కోశాను. ఆ గుత్తి చేతితో పట్టుకుని ఎంతో మురిసిపోయాను. నీటిదరి చేరాక, "ఈపండ్లు బాగాపండినట్టున్నాయి. తిందామా?" అన్నాను. నేను అలా అంటూనే ఉన్నాను—పడవను దరికి లాగడానికి వచ్చిన పడవవాడు నా వైపు చూస్తూ, "బాబూ! బాబూ!! ఆ పళ్ళు తినేరుగనక-అవి ముష్టిపళ్ళు! విషం బాబూ! పారెయ్యండి!" అని కేకవేశాడు. "విషముష్టిపళ్ళా! కాలకూట విషం అవి. మనకు ఈరోజున గండము తప్పింది" అన్నాడు శాస్త్రి. ఎంతో అయిష్టంమీద అవతల పారవేశాను, అందమైన ఆ పండ్లను నేను.

అప్పటినుంచీ, స్నేహితులు తరుచు ఆక్షేపించేవారు, "అందంగా ఉన్న ప్రతి వస్తువునూ చూచి ఆశపడబోకు, ఒక్కొక్కప్పుడు ప్రమాదము సుమా!" అని.

*　　　*　　　*

సాయంత్రపు పూట మా కాలేజీ చుట్టూ ఉన్న సర్వీచెట్ల మధ్యనో సముద్రతీరాననో, కొబ్బరి తోటలలోనో, నది ఒడ్డునో, ఊరికే తిరుగుతూ ఉండటము నాకు అలవాటు. సర్వీచెట్టును సంగీతపుచెట్టు అనికూడా అంటారు. పొడుగాటి సూదులలాంటి ఆకులలో కదులుతూఉన్న గాలి ఇంపైన సంగీత ధ్వని కలుగజేస్తుంది. ఈ సంగీతము వింటూ అక్కడే ఉండిపోయేవాడను రాత్రయ్యేవరకూ, ఒక్కొక్కప్పుడు. చదువుకోవలసిన సమయాలలోకూడా నేను ఇలా షికార్లు తిరుగుతూ ఉండడం రెండుమూడు పర్యాయాలు మా ప్రిన్సిపాల్ జి. ఎస్. అగాషే చూశారు. మాంచెస్టర్ ఎమ్. ఎస్. సి. గణిత శాస్త్రంలో గొప్ప పరిశోధన చేసి విదేశాలలో గొప్పపేరు సంపాదించిన మేధావి ఆయన. చాలా నియమవంతుడు. ప్రతివిషయం క్రమపద్ధతిని జరగాలని ఎంతో పట్టింపు ఆయనకు. శుక్రవారం, శుక్రవారం, ఉదయం మా తరగతి పిల్లలందరమూ ఒక్కొక్కరే వెళ్ళి ఆయనతో ఐదు, పదినిమిషాలు మాట్లాడి వచ్చేవారము. మా చదువులను గురించి మాట్లాడుతూ, మా యోగక్షేమాలు విచారించేవారు ఆయన. ఈ పర్యాయం నేను ఆయనవద్దకు కొంత భయంతోనే వెళ్ళాను. కాని, ఆయన చాల దయతో మాట్లాడారు. నా చదువు గురించి కనుక్కున్నాక, "చూడు, నీవు షికార్లు తగ్గించుకోవాలి. వాటికీ ఒక నియమం ఉండాలి; వృధా కాలయాపన, శరీరాయాసం కాకూడదు; అవునా?" అన్నారు. నేనేమీ అనలేదు. ఆయనంటే నాకు భక్తితో కూడిన ఒకవిధమైన భయం. ఆ సంగతి ఆయనకు తెలుసును. ఊరికే క్రిందికి చూస్తున్న నా వైపు చూస్తూ:

"నీవు రోజూ ప్రార్థిస్తూంటావా?" అని అడిగారు.

నేను జవాబుచెప్పలేదు. ప్రార్థించటం నాకు అలవాటులేదు. చిన్నప్పుడు మా ఇంట్లో దేవుని ప్రశంస అంతగా ఉండేదికాదు. విగ్రహారాధన అసలేలేదు.

సర్వాంతర వ్యాప్తియైన ఒక మహాశక్తివల్లనే ఈ సృష్టి నడుస్తున్నదనే విశ్వాసము ఉన్నదిగాని, సర్వసాక్షిఐన ఆ శక్తితో నా వ్యక్తిగత విషయాలు చెప్పుకోవాలని తోచేదికాదు, నాకు.

"పోనీ, ధ్యానిస్తావా, రోజూ కొంతసేపు?" అన్నారు.

ధ్యానించడం కూడా చేతకాదు నాకు. నేనేమీ అనలేదు.

అప్పుడు, ఆయన అన్నారు: "ప్రార్థించినా, ప్రార్థింపకపోయినా, రోజూ ఉదయం స్నానంచేసివచ్చాక కాసేపూ, రాత్రి పడుకునేముందు కాసేపూ రెండు మూడు నిమిషాలు ధ్యానించు. మనస్సు నిశ్చలం చేసుకుని, ఇతర సంగతులేవీ రానీయకుండా, ఏదైనా ఉదాత్త విషయంగురించి ధ్యానించు. నీవు మనసునిలకడ నేర్చుకోవడం చాలా అవుసరం. రాత్రి పడుకునేముందు ఒక్కక్షణం ఆనాటి నీ చర్యలను గురించి విమర్శించుకో. జీవితము ఒక అమూల్యమైన అవకాశము. ప్రతినిమిషమూ ఎంతో విలువైనది. ఈ రోజు నీవు ఎంత సదవకాశాన్ని వృథాచేశావో తెలుసుకోగలిగితే, రేపు మరింత జాగ్రత్తగా ఉంటావు. ఇలా విమర్శించుకునేటప్పుడు నిర్దాక్షిణ్యంగా ఉండాలి, నిన్ను నీవే వెనుకవేసుక రాకూడదు ఎప్పుడూ. ఈ ఆత్మపరీక్షవలనే మనం ఒక్కొక్కమెట్టు పైకి వెళ్ళగలము. అందుకు ధ్యానం అత్యవసరం" అన్నారు మా ప్రిన్సిపాల్ అగాషె.

వారి ఉపదేశం తరువాత నా జీవితంలో నాకెంతో సహాయమైనది. తద్వారా అనేక పర్యాయాలు నేనెంతో శాంతిని, ప్రోత్సాహాన్ని పొందగలిగాను. కొన్ని విషమపరిస్థితులను ధైర్యంతో ఎదుర్కొనడానికి బలము నిచ్చింది, ఈ ధ్యానశక్తి.

ముఖ్యంగా, కొన్నేళ్ళ తరువాత, ఒకానొక బంధమునుండి తెగత్రెంపులు చేసుకున్నప్పుడు నా మనస్సులోని విపరీతమైన ఆవేదనను ఈ ధ్యానశక్తి వలన కొంత ఉపశమింప చేసుకోగలిగాను. ఐదేళ్ళ అన్యోన్యతను ఒక్క క్షణంలో చెరిపివేయడము సులభంకాదు. కాని, పరిస్థితులు ముంచుకువచ్చి, గత్యంతరం లేకపోయింది. అన్నేళ్ళు, నాలో సగభాగంగా నాతో కలిసి మెలిసి ఉన్నవ్యక్తి ఒక్క నిమిషంలో తలుపు తీసుకుని విసురుతో నా జీవిత రంగంలోంచి వెళ్ళి

పోయినప్పుడు, అందమైన మా బొమ్మరిల్లు కూలిపోయినందుకు చాలా కలవర పడ్డాను.

నా భగ్నహృదయగాథ ఎవరితో చెప్పుకోను ?

అప్పుడు, నేనున్న స్నేహితులఇంటి దేవుని గదిలోనికి వెళ్ళాను. అక్కడ, అఖండజ్యోతి వెలుగుతూ ఉంటుంది ఎప్పుడూ. ఆ జ్యోతిముందు మోకరిల్లి, "ఈ తప్పు నాదికాదు, ఎవరిదీకాదు; పరిస్థితుల ప్రభావము. కాని, ఒకవేళ, దూరదృష్టిలేని నావల్లనై ఉండవచ్చును ఈపరిస్థితులు. ఇందుమూలాన మరోవ్యక్తికి కలిగిన బాధకు మనస్సారా చింతిస్తున్నాను" అని ఆ జ్యోతితో చెప్పుకున్నాను. పశ్చాత్తాపంతో వలవల ఏడ్చాను. పెనుగాలిని అనుసరించి వచ్చే వర్షధారలవల్ల ఆ గాలిఅంతా అణగిపోయినట్టు, ఆ కన్నీరు నా మనస్సు కెంతో శాంతినిచ్చింది. నిశ్చలమైన మనస్సుతో కొంతసేపు ధ్యానించాను. ఆ ధ్యానము నా కెంతో బలము నిచ్చింది.

* * * *

1921 వేసవికాలపు సెలవులకు నేను మా ఊరు వెళ్ళాను. ఆ సెలవలలోనే, నన్నుపెంచి పెద్దవాణ్ణి చేసినవారిని సంతోషపెడుతున్నాననే అభిప్రాయంతో నేను మనస్సు మార్చుకోవడంవల్ల నా జీవితంలో మార్పు కలిగింది. సెలవల నుండి తిరిగి వచ్చేసరికి ప్రిన్సిపాల్ అగాషె జబ్బుపడి, మహాబలేశ్వరము దగ్గరఉన్న శానిటోరియంకు వెళ్ళారు. ఆ జబ్బులోనే ఆయన నాకు ఉత్తరము వ్రాశారు:

"ఇంత చిన్న వయస్సులో నీ జీవితంలో ఇటువంటి మార్పు రావడము ఆశ్చర్యమే. కాని, మన ఇళ్ళలో ఇటువంటివి జరుగుతూనే ఉంటాయి. ఇందు గురించి నీవు నిరుత్సాహ పడనక్కర లేదు. నీవు తెలివితో ప్రవర్తిస్తే, ఈ సంఘటన మీ ఇరువురి జీవితాలనూ ఎంతో సౌఖ్యప్రదంగా చేయవచ్చును" అని వ్రాశారు.

నేను తెలివితో ప్రవర్తింపలేదు.

స్నేహితుడు కృష్ణశాస్త్రి, కవిగా వర్ణించినట్లు:

'మింట నెచటనో మెరయు చుక్కల
కంట జూచితి కాంక్ష లూరగ
కాంక్షలూరిన కొలది చుక్కలె
కాంచి బ్రతుకే గడిపితిన్'

తమ అమూల్యమైన ఉపదేశాన్ని అనుసరించానో లేదో తెలిసికోకుండానే మా ప్రిన్సిపాల్ పిన్నవయస్సులోనే ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయారు. వారు సూచించిన ప్రకారము నేను నడుచుకోలేక పోయాను-అని తెలిస్తే ఆయన చాలా బాధపడి ఉండేవారు.

*　　*　　*　　*

మా కాలేజీ విద్యార్థి సభలో విజ్ఞానవంతు లెందరో వచ్చి ఉపన్యసిస్తూఉండేవారు. ఒకపర్యాయం సి. పి. రామస్వామి అయ్యర్ ఆంగ్లసాహిత్యంలోని రమ్యతను గురించి ఎంతో చక్కగా చెప్పారు. గొప్ప న్యాయవాదిగా పేరు పొందినా ఆయనకు ఆ అభిరుచిని అభివృద్ధి చేసుకోడానికి తీరికఉన్నందుకు చాలా సంతోషించాను నేను. తరువాత, కొన్నాళ్ళకు శ్రీనివాసశాస్త్రి ఉపన్యసించారు. గోఖలే శిష్యులు, గోఖలే అంతవారాయన-మా అందరితోను ఎంతో చనువుగా మాట్లాడారు. ఆయన ఉపన్యసించేటప్పుడు, వారి వాక్చాతుర్యమూ, శబ్దమాధుర్యమూ మమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేశాయి. ఎంత సేపు వినినా, ఇంకా వినాలి అనిపించేది వారి సంభాషణ.

అమెరికా హార్వర్డ్ విశ్వ విద్యాలయంలో అప్పుడే పి. హెచ్. డి. డిగ్రీ పొందివచ్చిన డాక్టర్ వంగల శివరామ్ మా సభలో ప్రసంగించారు ఒకసారి. ఆయన అనేకమైన ఇబ్బందులకోర్చి, అమెరికా వెళ్ళి, అక్కడ చాలాశ్రమపడి ఉన్నతవిద్య అభ్యసించి అచ్చటి విద్యావంతుల మన్ననలను పొందిన యుదంతమంతా ఆసక్తితో విన్నాము. ఆయన చదువుకు డబ్బులేక కాఫీ హోటళ్ళలో కప్పులు కడిగి, చదువుకు కావలసిన పైకము సంపాదించేవారనీ, ఆ కారణంచేత సహపాఠులు ఏ విధంగానూ ఆయనను తక్కువగా చూసేవారు కారనీ చెప్పేవారు. విద్య పూర్తి అయ్యాక, అమెరికాలో అనేక ప్రదేశాలు చూచి,

అచ్చటి వారనేకులతో స్నేహం చేసుకున్నారు. వారి స్వగ్రామం మా ఊరికి సమీపంలో ఉన్న తణుకు. నేను ఫలానా అని తెలిసి నావద్దకు వచ్చి చాలా ఆప్యాయంగా మాట్లాడారు. తరువాత కొంతకాలానికి ఆయన లక్నో విశ్వ విద్యాలయంలో ఉన్నత పదవి అలంకరించారు.

విదుషీమణి యామినీ పూర్ణతిలకమ్మ మా సభలో మాట్లాడారు. ఆమెతో ఆమె ఐదేళ్ళ కూతురుకూడా వచ్చింది. తెలుగు భాషలో చక్కని పాండిత్యం అలవరచుకుని, ఆమె మన ప్రబంధాలలోని అందాలను పూర్తిగా అవగాహన చేసుకున్నారు. ఆరోజు ఆమె మనుచరిత్రలోని విశేషాలను గురించి వివరిస్తూ చాలా బాగాచెప్పారు. మన భాషలోని మాధుర్యమును గురించి ఎంతో తెలుసు కున్నాము ఆమె ఉపన్యాసంవింటూ. ఇంచుమించు ఒక గంటసేపు, ఏక ధోర ణిని ఆమె ఇతర కవుల రచనులనుండి ఉదాహరణల నిస్తూ, అల్లసాని పెద్దన్న ఔన్నత్యాన్ని చక్కగా వ్యక్తపరిచారు. పద్యాలు ఎంతో చక్కగా చదివారు. ప్రవరుడు వరూధినిని చూచినప్పటి దృశ్యము గురించి చెపుతూ,

'తతనితంబాభోగ ధవళాంశుకములోని
అంగ దట్టపు కావి రంగువలన'

అనే పద్యం చాలా భావయుక్తంగా చదివారు. పద్య వివరణలోకి వచ్చేసరికి, అతిపల్చని వల్లెవాటునుండి, లోనున్న పావడ ఎర్రనికాంతులు చంద్రకాంత శిలావేదికపై ప్రసరించాయి అనిఅంటూ, ఆమె పూర్వం మనవారు అతిపల్చని బట్టలు కట్టుకునేవారు అని, అప్పటి మన నేతపరిశ్రమను శ్లాఘించడము మొదలుపెట్టారు. ఆ ప్రస్తావనలోకి దిగాక, ఇంక, మన పూర్వపు నేతగాంధ్ర అప్రతిమానమైన నేర్పరితనము, బందరు కలంకారి, ఢక్కామస్లీన్ల ప్రాశ స్త్యము, వీనిని గురించి అనర్గళంగా చెప్పుకు పోసాగారు. అక్కడ నుంచి రాట్నము, ఖద్దరు సందేశము, స్వరాజ్య సాధనకై మహాత్ముడు మనకు చూపిన త్రోవ - వీనిని గురించి ఆవేశంతో ఉపన్యసింప సాగారు. అప్పుడు, ఇంత సేపూ అవతల, తోటలో, ఆడుకుంటున్న ఆమె కూతురు పరుగెత్తుకుంటూ వచ్చి, "అమ్మా, కాలుద్దామే ! అమ్మా, కాలుద్దామే !!" అంటూ ఆమె చేయి పట్టుకు లాగడం మొదలెట్టింది. ఆమె ఆ బిడ్డ మాటలు సరకు చెయ్యకుండా,

ఇంకా, ఇంకా, ఆవేశంతో ఉపన్యసిస్తున్నారు. పంజాబు దురంతాల గురించీ, అసహాయోద్యమం గురించీ వీరావేశంతో చెపుతున్నారు. ఇంకా ఎంతసేపైనా ఆ ధోరణినే చెప్పి ఉంటారేమో, ఆ బిడ్డ అల్లరి లేకపోతే. కాలుద్దాము కాలుద్దాము అంటూ ఉపన్యాసం ముందుకు సాగనియ్యని ఆ పాపాయి గొడవ ఇంక భరింపలేక, ఆమె ఉపన్యాసం పూర్తిచేశారు. జాతీయగీతంతో సభ ముగిసింది. మా మన్ననల నంది ఆమె వెళ్ళిపోయారు.

తర్వాత మేమంతా గుమిగూడి నాటిసభ ఏర్పాటుచేసిన సీతారామయ్యను ప్రశ్నింపగా, అతను వివరంగా చెప్పాడు. యామినీ పూర్ణతిలకమ్మ నాటి రాజకీయరంగంలో ఎంతో పాటుపడుతున్నారనీ, ఆంధ్రదేశంలో, ఊరూరా, వాడవాడలా తిరిగి జాతీయోద్యమం గురించి ఉపన్యాసాలిస్తూంటారనీ, ముఖ్యంగా ఆమె విదేశ వస్త్రధారణను నిరసిస్తూ మాట్లాడుతూ ఉంటారనీ, ఆమె ఉపన్యాసానంతరం ప్రతిచోట సభికులు తెచ్చిన సీమబట్టలను కాలుస్తూంటారనీ చెప్పాడు సీతారామయ్య. ప్రతిసభకు ఆమెతో కూతురు కూడా వెళ్ళుతూ ఉంటుంది. ఆ పాపకు విదేశ వస్త్రదహనం ఒక వినోదంగా పరిణమించింది. ఈ సభలో ఎంత సేపటికీ ఆప్రసక్తి రానందున అలా అల్లరి చేసిందని అన్నాడు సీతారామయ్య.

ఆ మాటలకు మాలో కొందరు విపరీతంగా నవ్వుతూ, ఎంతో హేళన చేశారు. సీతారామయ్య చాలా సాత్వికుడు. అతనికి ఎప్పుడూ కోపం రావడం ఎరుగను నేను. కాని, వీరు ఇలా హేళన చేసేసరికి అతను మండిపడి "మీకేం తెలుసు! నవ్వుతారు. దేశం అట్టుడికినట్టు ఉడికిపోతూ ఉంటే మీరిక్కడ కలలు గంటున్నారు. ఊరూరా, వాడవాడల, నిరంకుశ పరిపాలనమును ఎదిరిస్తూ స్వాతంత్ర్యోద్యమం ఎలా ప్రాకిపోతూందో మీకేమైనా తెలుసా? కూపస్థమండూకాలలాగ మీ సాహిత్యగోష్ఠి, మీ రమ్యాలోకము-అంతే అనుకుంటారు సర్వం. మీ నెత్తిమీది ఆకాశపు అందం చూస్తూ అల్లాగే కూర్చోండి! దేశం ఏమైపోతే మీకేమి!!" అని గర్జించాడు.

నిజమే!

# నా స్మృతి పథంలో...

ఈసారి సెలవలకు ఊరు వెళ్ళినప్పుడు తెలిసికోగలిగాను నేను మేమందరము ఏదో స్వప్నసీమలో ఉండిపోయి, దేశంలోని నిజపరిస్థితులను గురించి ఏ మాత్రమూ పాటింపలేకపోయాము అని.

నేను ఊళ్ళోకి వచ్చానని తెలిసి మా బంధువర్గమూ, స్నేహితులు అందరూ నా చుట్టూ మూగారు. ఇందరిలోనూ మిల్లుబట్టలతో ఉన్నది నేను ఒక్కడనే !

మరునాడు ఉదయం మా పిన్ని చాకలికి బట్టలు వేస్తూంటే "ఈ మిల్లు గుడ్డ లెవరివి అమ్మగారూ ?" అని అడిగింది చాకలి ఎల్లమ్మ.

పాలకొల్లుకు సమీపాననే మా మేనత్తగారి ఊరు. నేను సెలవలకు మన ప్రాంతాలకు వెళ్ళినప్పుడల్లా విధిగా ఆ ఊరువెళ్ళి, వారితో పదిరోజులు ఉండి వస్తాను. నేనంటే మా అత్తయ్యకు అపరిమితమైన ప్రేమ. నన్ను చూడడం తోనే ఆమె ముఖం ఇంతవుతుంది ! దొడ్లో జాజిపందిరివద్ద పీట వేసుకు కూర్చొని పువ్వులు కట్టుతోంది నేవెళ్ళేసరికి. నన్ను చూచి, పువ్వులు పళ్ళెంలో ఉంచి, చేతులుచాచి నన్ను తన ఒడిలో కూర్చోపెట్టుకుంది. కాని, వెంటనే, తెల్లని నా లాగూ, చొక్కా-చూచి "ఇంకా మిల్లుబట్టలేనా !" అన్నది. నన్ను తన ఒడిలోంచి దిగిపొమ్మంటుందేమో అనుకున్నాను-అంతటి దోషారోపణ ఉంది ఆమె స్వరంలో. కాని, అలా దింపివెయ్యక, ప్రేమతో నా తల నిము రుతూ, ఆమె "మహాత్ముని మాటలు ఇంకా నీ చెవిని పడలేదా బాబూ ?" అన్నది ఎంతో ఆప్యాయంగా. ఇంకోక్షణానికి ఆటలు ఆపి మా వద్దకు పరు గెత్తుకుంటూ వచ్చిన మా చిన్నిమరదలు సీత "అమ్మా! బావ ఇంకా విదేశీ బటలే కడుతున్నాడేమి ?" అంది.

ఆ ఊరు రాజుల ఊరు. అదివరకు అతిపల్చని గ్లాస్గో మల్లే కట్టేవారం దరూ ముతక కోరా కద్దరు బట్టలే కడుతున్నారు ఇప్పుడు. చిన్నా పెద్దాకూడా కద్దరే. ఎనభై ఏళ్ళ సూరపరాజుగారు కూడా కద్దరు బట్టలే కడుతున్నారు. ఇంచుమించు ప్రతి ఇంటాకూడా రాట్నం వెలిసింది.

ఆ రాత్రి, నారాయణ రాజుగారింటి పెళ్ళిలో హరికథ. తిలక జీవితము. నేను వెళ్ళి విన్నాను. "నిన్ను నెన్న మా తరమా ! నిరుపమాన భరతమాతా!"

నా స్మృతి పథంలో...

అంటూ మాతృదేశ స్తవంతో ప్రారంభించి అతి దేశభక్తి పూరితంగా నడిచింది కథ. తిలక్ జీవితగాథ నాకు బాగా అవగాహనే. కాని, హరికథద్వారా కథకుడు పురికొల్పి కలిగిన విచిత్రమైన రాజకీయ ఆవేశము నాకెంతో ఆశ్చర్యం కలిగించింది. అది కథచెప్పడం గాదు—ఒకగొప్ప ప్రబోధము. సందర్భమును బట్టి అనేక సమకాలిక సంఘటనలు తీవ్రంగా విమర్శించారు కథకులు. విదేశ ప్రభుత్వపు చర్యలను నిర్దాక్షిణ్యంగా ఖండించారు. తిలక్ నిర్యాణ సమయంలో ఆయనలోంచి ఒకజ్యోతి వెడలి చెంతనే ఉన్న గాంధిలోకి ప్రవేశించినది అని. ఆ దృశ్యమును వర్ణిస్తూ ఆయక కథ ముగించారు. గాంధిజీ తలపెట్టిన ఉద్యమాన్ని జయప్రదంగా కొనసాగించాలని ప్రేక్షకులందరు దీక్ష వహించడమే ఈ హరికథ ఉద్దేశ్యమూ, పర్యవసానమూ అని నాకు తోచింది.

రామచంద్రపురము దగ్గర ఒక ఊరిలో జరిగిన మా పెత్తండ్రి కుమారుని పెండ్లికి నేను వెళ్ళడం తటస్థించింది ఆ సెలవలలోనే. పెండ్లి సమయాన ఊరేగింపులో నాదస్వరము, బ్యాండ్ వాద్యమూ-రెండూ ఉంచారు. డోలు, సన్నాయిమేళము వారు త్యాగరాయ కృతులు వాయిస్తే, బ్యాండ్ మేళమువారు జాతీయగీతాలు వాయించేవారు. కృతులు ఎవరూ అంతగా వినేవారుకారు. బ్యాండ్‌వాద్యం ప్రారంభమయ్యేసరికి పిల్లలూ, పెద్దవారూ చుట్టూ మూగేవారు. అప్పుడే నేను "మా కొద్దీ తెల్ల దొరతనము" పాట విన్నాను. వాద్యము విన్నాక, కూడా ఉన్న స్నేహితుని అడిగి మాటలు వ్రాసుకున్నాను. ఇటువంటి సాహిత్యం ఉన్నట్టే తెలియదు నాకు!

'పండ్రెండు దేశాలు పండూతున్నా గాని
పట్టెడన్నము లోపమండి!
ఉప్పు ముట్టుకుంటే దోసమండి!
... ... ... ... ... ...
ఏడాది కేడాది కెక్కూవ సిస్తేసి
ఈ భూమి తనదే నన్నాడు.

మమ్ము కూలీకి దున్నమన్నాడు
కడుపు మంటతో చావు మన్నాడు!
మా కొద్దీ తెల్ల దొరతనము!'

—ఇటువంటి మాటలు జనానీకంలో ఎంతటి తీవ్రమైన ఆందోళన కల్పింపగలవో ఊహించుకోగలిగాను.

"సిరిసిరిమువ్వల" వరుసలోనే కొన్ని జాతీయగీతాలు, పాటకజనానికి చిర పరిచితమైన ఇతర జానపదగేయాల వరుసలలో ఇంకా కొన్ని జాతీయగీతాలూ ఆబాల గోపాలమూ పాడుతూ ఉండేవారు. ఈ ఉద్యమము ఏ కొందరు విద్యాధికులో దీక్షగా నిర్వర్తించేదిగాదు. ఈ భూమిని పుట్టిన ప్రతివ్యక్తీ ఉత్సాహంతో పాల్గొనవలసిన మహా యజ్ఞము-అని తోచింది.

పెండ్లిలో భోజనాలవద్ద కూడా పిన్నపెద్దలు దేశభక్తి పూరితమైన పద్యాలే చదివేవారు. కొంచెము సంగీతము వచ్చినవారు అటువంటి పాటలే పాడేవారు. "మాతాడా బారదేనో" అనె జావళీ వరుసలో "మానరా నాయన్న ఈ మాయచదువు" అంటూ ప్రబోధగేయం విన్నాను. అదివరకు రంగస్థల నాటకాలలో రాణించిన పద్యాలు కొన్నిటికి ఈ నూతన వాతావరణంలో క్రొత్త అర్థాన్ని స్ఫురింపజేసేవారు. రసపుత్ర విజయనాటకము, మొగలాయీ- రాజపుత్రిల మధ్య కలిగిన వైరముకాదు. ఆనాడు బ్రిటిష్‌వారికీ భారతీయులకూ జరుగుతున్న తీవ్రయుద్ధము. ఎటొచ్చీ ఈ యుద్ధంలో మనవారి ఆయుధాలు కదురు, కద్దరుదారము. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి పద్యాలు ప్రతి పిల్లవానికి కంఠతా వచ్చు.

సాయంత్రము, స్త్రీల వేడుకలలో నలుగుపాటలూ తలుపు దగ్గర పాటలూ అన్నికూడా దేశభక్తి గేయాలే. "రారా! గాంధికుమారా!" అంటూ భరతమాత ప్రియతనయుడైన గాంధిని బుజ్జగించినట్లు నలుగుపాట! మంగళ హారతి పళ్ళెము పట్టుకున్న ముక్కుపచ్చలారని పిల్లలు పాడేపాట "మంగళంబు భరతమాత!"

దేశమంతటా వచ్చిన ఈ గొప్పమార్పును చూచి ఎంతో ఆశ్చర్య పోయాను. కాని, నాలో ఇంకా మార్పురాలేదు-నాకు దేశభక్తి తక్కువనికాదు, నా దృష్టి రాజకీయాల దెసలేదు కాబట్టి. అడయార్‌లో ఉండగా, ఒంగోల్‌నుంచి వచ్చిన ఒక సహపాఠి, ఆప్తస్నేహితుడు, నాచే కొనిపించిన ఒకే ఒక కద్దరు పంచ ఉండేది నా వద్ద. అదీ పొందూరులో నేసిన అతిపల్చని బట్ట. ఎప్పుడైనా కట్టుకుంటూ ఉండేవాడను, స్నానం చేసివచ్చి, మడిబట్టలాగ. అంతేగాని, నూలు వడకాలనిగాని, నియమంగా కద్దరు కట్టాలనిగాని ఇంకా అనిపించలేదు.

ఒకరోజు మాత్రము, నాన్నగారిని చూడడానికి వెళ్ళినప్పుడు, నా విదేశ వస్త్రాలు చూచి ఆయన "ఎంత సుకుమారమైనా, అధమం, మనదేశము మిల్లు బట్టలైనా కట్టాలి. ఇప్పటి పరిస్థితులలో మాంచెస్టర్‌కి ఒక్క కానీ వెళ్ళనియ్యడము మహాపాపం!" అన్నారు. ఆ నిమిషమునుంచీ నేను విదేశపు మిల్లుబట్ట ముట్టుకోలేదు.

## ౮

జీవనగంగా హరితతటంబున
చింతావటతరు మూలమునన్
ఏల యధోముఖివై గడతెంచెద
వివ్విధి యవ్వన నిశలన్ ?
అవ్వలి గట్టున స్వప్నపురంబున
నవ్యయనిర్వృతి వనులన్
డోలాఖేలన రతుడౌ ప్రియుని గ
డుంగడు భావన సల్పెదవో !

—దువ్వూరి రామిరెడ్డి

'అవ్వలిగట్టున, స్వప్నపురంబున'- ఎంత బాగుంది ! స్వప్నపురము-ఎప్పుడూ అవ్వలిగట్టునే ఉంటుంది, చేరబోనయికొద్దీ, దూరమగుతూవుంటుంది.

అప్పుడే వచ్చిన "శారద" సంచికలోని అందమైన ఈ పద్యాన్ని రాజమహేంద్రవరంలో, గౌతమీపుస్తకాలయంలో మా మేనత్తకొడుకు మల్లవరపు వెంకట కృష్ణారావు చదివి వినిపించాడు నాకు, 1923లో. నవ్యాంధ్ర సాహిత్యం లోని భావకవిత్వ సంపదతో తొలి పరిచయము ఈ రచనద్వారానే నాకు. ఇది వరకు సుపరిచితమైన కీట్స్, షెల్లీ, ఈట్స్ రచనలోని భావస్ఫురణ ఇందు కనబడింది నాకు. దానికి తోడుగా తెలుగుభాషలో సహజంగా ఉన్న మాధుర్యము యెంతో అందమిచ్చింది. చక్కని లయా, అద్భుతమైన ఊహా నాకెంతో నచ్చాయి. రామిరెడ్డి కవితను చాలా మెచ్చుకుంటూ డాక్టర్ కజిన్స్ తరుచు చెపుతూ ఉండేవారు. కాని, ఆ కవితలోని రమ్యత ఇంగ్లీష్ తర్జుమాలో కంటె నూరురెట్లు అధికంగా తోచింది, అసలు రచనలో. అదీ, మా బావ ఎంతో భావయుక్తంగా ఎంతో అర్థగౌరవంతో కొంచెము సంగీతముతో చదవడము వల్ల మనోహరంగా ఉంది. "చింతావటతరు మూలము", "అవ్యయనిర్వృతి

వనులు", "దోలాఖేలనరతుడౌ ప్రియుడు" ఊహించినకొద్దీ, ఇంకా ఇంకా ఊరిస్తాయి మనలను.

నీ వయసెల్ల హృదీశుని చింతన
నిర్మల ధూపము పగిదిన్
కాలెడి నబలా, రేయింబవళులు
గంధము చిమ్మచు నల్గడలన్

ఇంతటి భావసంపద ఉన్నది మనవారి కవిత్వంలో అని నాకు అంత వరకు తెలియదు. ఈ పద్యము తొలిసారి వినిన అనుభవము ఒక మధుర స్మృతి.

"శారద" పత్రికపైన ముఖచిత్రం చూపాడు మా బావ నాకు. చిత్ర కారుడు మహనీయుడు, ప్రమోదకుమార ఛటర్జీ. సుకుమార రేఖాసంపద, రమ్యమైన రంగుల మేళవింపు. శాంతినికేతన శైలిలో ఉన్నా, ఈ తీరులో ఇంకెంతో క్రొత్తదనము కనుపించింది. చిత్రంకేసి అల్లాగే చూస్తూన్న నాతో మా బావ అన్నాడు: "అద్భుతంగా ఉన్నదికదూ ? కాని, ఈ బొమ్మమూలాన ఈ పత్రికను పోస్టులో పంపడానికి నిరాకరించారు తపాలాశాఖవారు, తెలుసా?" అన్నాడు. ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించి, దివ్యమాతృస్వరూపిణి ఐన వాణికి అంశుకోత్తరీయములేదు. అందువల్ల చిత్రము అసభ్యమన్నారు. ఆ నిషేధాన్ని తొలగించడానికి కజిన్స్ అంతవాని కళావైదిగ్ధ్యము కావలసి వచ్చింది. ఆయన పూనుకున్నాక, ఆ ఆంక్ష తొలగింది.

మా బావ తన ఉన్నత విద్యఅంతా మద్రాస్‌లోనే అభ్యసించినా, అత నికి మన తెలుగు ప్రాంతాలతో ఎక్కువ పరిచయమూ ఇచటి రాజకీయ, సాంఘిక ఆర్థిక పరిస్థితుల గురించి చక్కని అవగాహనా ఉండేవి. నా దృష్టి ఎక్కువ అంతర్జాతీయంగా ఉంటే, అతని ఆలోచన ఎక్కువ జాతీయంగా ఉండేది. అతని స్నేహమువల్ల ఆనాటి ఆంధ్రదేశములో వివిధ రంగాలలోని వాతావరణాన్ని చక్కగా అర్థం చేసుకొనగలిగాను. ప్రాచీన హిందూసంప్ర దాయాలంటే చాలా గౌరవమున్నా, అతను బ్రహ్మసమాజపు ఆశయాలను

చక్కగా తెలిసికొన్నాడు. అతని స్నేహితులైన కొందరు బ్రహ్మసమాజీకు లతో నాకు పరిచయము కలిగింది. ఇక జాతీయోద్యమములో పాల్గొంటూన్న కొందరు ప్రముఖులతోనూ స్నేహమైంది మా బావద్వారా. అతనంటే వారం దరికీ ఎంతో గౌరవము. నేను ఫలానా అని తెలిసి నన్ను చాలా ఆదరించే వారు.

కృష్ణారావు సహవాసం వల్లనే నేను తొలిసారి కద్దరు దుస్తులను ధరిస్తి. ఐతే, కాస్త ఖరీదైనా, అతిపల్చని బట్టలే కొనుక్కున్నాను. ఆ రోజులలో కొత్తవరము కద్దరు చాలా బాగుండేది. అంగలూరూ, కొత్తవరమూ జాతీయోద్య మంలో చాలా ప్రసిద్ధి చెందినవి. వేషము మారినంత మాత్రాన మనస్సు మారక పోవచ్చు గాని, కద్దరును ఆవరించిఉన్న జాతీయతా వాతావరణ నన్ను కొంత వరకు కమ్మివేయకపోలేదు. తెల్లనిమిల్లుబట్టలకు బదులు, కోరారంగు చొక్కా లాగూ తొడుక్కున్న నేను ఒక అవతారము మారినట్టు అనిపించింది. కాని, తద్వారా నావారిలో ఒక్కడనైనాననే సంతోషము కలిగింది. వేగంగా వెళ్ళి, కద్దరు ధరింపమని నన్ను ప్రబోధించిన మా అత్తయ్య ఒడిలో కూర్చోవాలని పించింది. అయితే, నూలు వడకకుండా, ఎవరో వడికిన నూలుతో నేసినబట్ట కట్టుకోవడము సబబుగా తోచలేదు. ఈ విధంగా కద్దరు వెలఎక్కువ చేస్తాము; మనము స్వయముగావడికిన నూలే మనము వాడాలి, అప్పుడే కద్దరు సందేశము పూర్తిగా అమలుపరిచినట్లు అవుతుంది అనుకున్నాను. ఐతే, నేను నూలువడికే రోజులు ఇంకా రాలేదు. అవి ముందున్నవి.

కోరా కద్దరుకు తగినట్టు, ఎర్రంచు కేసరిరంగు ఖండువాకూడా కొను క్కొని పైనవేసుకున్నాను. మొదట కొంచెము క్రొత్తగానే ఉండేది. కాని, కృష్ణారావు తమ్ముడు విశ్వేశ్వరరావు ధరించిన దుస్తులు చూచాక, ఈ క్రొత్త దనం అంతకొట్టొచ్చినట్టు కనబడలేదు. విశ్వేశ్వరరావు చొక్కా లాగూ కూడా కేసరిరంగే! అతడు, అప్పుడే, సెలవలకని శాంతినికేతనం నుంచి తిరిగి వచ్చాడు. అంతకు కొంచెముముందే వసంతోత్సవము చేశారట. వసంతోత్స వము వారంరోజులూ అందరూ ఈరంగుబట్టలే ధరిస్తారట, శాంతినికేతనంలో. మా చిన్నబావను అడిగి శాంతినికేతనం విశేషాలు ఎన్నో తెలుసుకున్నాను.

రవీంద్రునితోనూ, సి. ఎఫ్. ఆండ్రూస్‌తోనూ, నందాలాల్, అవనీంద్రులతోనూ ప్రతినిమిషమూ పరిచయమున్న అతని అదృష్టాన్ని చాలా మెచ్చుకున్నాను. అతనివలెనే నేనూ శాంతి నికేతనంలో ఉండగలిగితే ఎంత బాగుండును, అనుకున్నాను.

*                *                *

1923లో అడయార్‌లో బి. ఎస్‌సి. పూర్తిచేసుకుని, రసాయన శాస్త్రంలో క్రొత్త విషయాలను గురించి పరిశోధించటానికి విజయనగరము వెళుతున్న నాకు, నాన్నగారు వ్రాసిన ఉత్తరంలో వారు ఇలా వ్రాశారు:

జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యగూర్ప దలపవలయు
ధర్మ మాచరింపదగు మృత్యుచే దల
పట్టి ఈడ్వబడిన వానివోలె.

చిన్నప్పుడు నీతిపద్యంగా వల్లించినది ఇప్పుడు విశేషార్థముగల ఉపదేశమైనది. "ఇంతటితో నీవు పరీక్షలకు చదువవలసిన అవసరము తీరింది. ఇక తీరమేలేని జ్ఞానసంపాదన అనే మహాసముద్రము నీ యెదుట ఉన్నది. ఎడతెగనికృషి చేసి నీవు ఆర్జింపగల జ్ఞానానికి అంతులేదు" అని వ్రాశారు వారు.

విజయనగరంలో ఉన్న తమ ముఖ్యస్నేహితులు నలుగురికి, ఉత్తరాలు ఇచ్చారు నాన్నగారు. సంస్థానపు దివాన్‌జీ ఏచూరి నరసింహంపంతులు, డాక్టర్ బుర్రా శేషగిరిరావు, ప్రొఫెస్సర్ ఎనమండ్ర నారాయణమూర్తి, కోటంరాజు సన్యాసిరాజు—వీరి నలుగురిని వెళ్ళి చూడమన్నారు. రైలు దిగడంతోనే సరాసరి డివాన్‌జీ గారింటికి వెళ్ళాను. వారంటే ఊళ్ళో అందరికీ ఎంతో గౌరవము, కొంచెం భయము కూడాను. వల్లభ్భాయ్‌పటేల్‌లా ఉండేవారు ఆయన. సంస్థానపు విషయాలలోనూ, కాలేజీ విషయాలలోనూ అంతటి ప్రజ్ఞా చూపించేవారు. అందుచేతనే ఊరివారికి ఆయనంటే సింహస్వప్నము. ఎవరో కొందరు గాని ఆయన ఎదుట నిలిచి ముఖాముఖి మాట్లాడడానికి సాహసించే

వారుకాదు. నేను మాత్రము తిన్నగావెళ్ళి, నమస్కరించి, నాన్నగారి ఉత్తరం చేతికిచ్చాను. చదువుకుని నా వైపుచూచి చిరునవ్వు నవ్వారు. "వచ్చావా?" అన్నారు ఎంతో ఆదరణతో. వెంటనే మనిషినిచ్చి హాస్టల్‌కు పంపారు. నేను సెలవు తీసుకుంటూ ఉంటే, "ఎప్పుడైనా కనుపిస్తూఉండు—మీ నాన్నగారికి ఇప్పుడే ఉత్తరము వ్రాస్తున్నా" అన్నారు. తిరిగి సంస్థానపు రాచకార్యాలలో మునిగిపోయారు.

హాస్టల్ అంతా క్రొత్త. ఇదివరకు వాతావరణకూ దీనికీ వెయ్యింతలు తేడా. ఐతే, అందరూ ఇట్టే చనువయ్యారు. కొందరికి నా వేషభాషలూ నా పద్ధతులూ వింతగా తోచినా, అందరూ నన్ను చాలా ఆదరించారు. మొదట ఈ క్రొత్తవ్యక్తి ఎవరో తెలుసుకోవాలని నా గది ముంగిట ఇటూ అటూ పచారు చేసేవారు. నేను పలకరించగానే గదిలోకి వచ్చి చక్కగా మాట్లాడి వెళ్ళేవారు. వీరిలో కొందరు ఎక్కువసేపు ఉండిపోయి, దగ్గర స్నేహితులుగా మారిపోయేవారు.

డాక్టర్ బుర్రా శేషగిరిరావు వద్దకు నాన్నగారి ఉత్తరము తీసుకు వెళ్ళాను. ఆయన చాలా సరదామనిషి. ఠీవిగా తలపాగా, రాచరికపు మీసము-విగ్రహం బాగుండేది. అతి ఉత్సాహవంతుడు. ఏదో వ్రాస్తూన్నారాయన. "కొండమీద వెండిగిన్నె కొక్కిరాజు కాలువిరిగె" అనే చిన్నపిల్లల గచ్చకాయల పాటకు అంతరార్థముతీస్తూ, అది సారంగధరుని గురించిన జానపద గేయమని నిరూపిస్తున్నారు. ఉత్తరం చూచి,

"నువ్వటోయి! మీ తండ్రిగారి సిఫార్సుకూడా ఎందుకూ? నువ్వు ఫలానాఅంటే చాలదూ? మా ఇంటి కొచ్చెయి, మాతోనే ఉందువుగాని" అన్నారు.

ప్రొఫెస్సర్ యనమండ్ర నారాయణమూర్తిని ఇంటివద్దనే చూచాను. చక్కని బంగాళా. నేను వెళ్ళిన కాసేపటికి కాలేజీనుంచి కోచ్ బండిలో వచ్చి దిగారు. నన్ను చాలా ఆదరించారు. ఒక్క నిమిషపు పరిచయముతోనే వారు తమ కవితావ్యాసంగమును గురించి చెప్పసాగారు నాతో. తాము రచించిన

'అడవిమల్లెలు' అనే భావగీతాల సంపుటి నాకిచ్చారు. గురజాడ అప్పారావు వీరికి చాలా స్నేహితులు. అందుచేతనే కాబోలు ఆ ఛాయలుకొన్ని వీరి కవితలో తోచాయి:

అడవి మల్లెలు! అడవి మల్లెలు!

అందముగా పూచెనవిగో!

అడవి మల్లెలు!

అంటూ చక్కని గేయం వినిపించారు. వారికి ఇంగ్లీష్‌లో కూడా మంచి ప్రవేశము ఉండేది.

నాన్నగారి నాల్గవ స్నేహితులు కోటంరాజు సన్యాసిరాజు. వీరిని నేను విజయనగరము చేరిన వెంటనే చూడలేకపోయినా, దసరాకు మా ఊరికి ప్రయాణమై బయలుదేరబోతూ వెళ్ళాను వారింటికి. నేను ఆపూట వారిపంక్తినే భోజనము చేశాక నాతోకూడా స్టేషన్‌కు వచ్చి నన్ను రైలు ఎక్కించి మరీ వెళ్ళారు.

ఇటువంటి ఆదరణా, ఇటువంటి ఆప్యాయమూ అందరికీ అనుభవమో కాదో కాని, నా వంతుకు వచ్చినది చాలా పెద్దపాలే అని చెప్పాలి. ఎక్కడకు వెళ్ళినా పలుకరించడంతోనే ఎంతో స్నేహభావము చూపేవారు అందరూ; తొలిసారి కలుసుకున్నా పూర్వస్నేహితునిలాగే ప్రవర్తించేవారు. మరో విశేషము: విజయనగరము జమీందారీనిలయము కాబట్టి అన్ని విషయాలలోనూ మర్యాద, మన్నన ఎక్కువగా ఉండేవి. ఎవరినన్నా, ఎక్కడికన్నా త్రోవఅడిగితే, కూడా పదిఅడుగులు నడిచి త్రోవచూపించి మరీవెళ్ళేవారు. కిళ్ళీ దుకాణదారు మొదలు బ్యాంక్ ఏజంట్ వరకూ అతివినయంగా మాటాడేవారు. ఇది ఆ రోజులలో మాట.

నా రసాయనిక పరిశోధనాకృషిలో మా డైరెక్టర్ ఏచూరి వెంకట్రామయ్య నన్ను ఒక స్నేహితునిగా భావించి అంతటి చనువుతోనూ మసలుతూ ఉండేవారు. ఆయన కలకత్తాలో విశేష పరిశోధన చేసి సర్ సి. వి. రామన్ వంటి వారి పొగడ్తల నందినవారు. వారితో కలిసి పనిచేయడము ప్రారంభించిన

రెండవరోజుకే రసాయన శాస్త్రంలో కొన్ని కొత్త విషయాలు కనిపెట్టగలి గాను. దీనికి ముఖ్యకారణము వారి పూనిక, ఉత్సాహమే. ఈ నూతన విష యాన్ని చక్కగా పరిశీలించి, తత్ఫలితాన్ని గురించిన వివరాలు నా పేరుతో ఇంగ్లండ్, జర్మనీలలోని శాస్త్రపరిశోధనా పత్రికలలో ప్రచురించారు.

ఐతే, చిత్రం ఏమిటంటే, విజయనగరంలో నేను ఉన్నది రసాయనిక శాస్త్రపరిశోధనకోసమే,ఐనా - ఆ పరిశోధనకంటే ఎక్కువగా నాకు సాహి త్యములో వ్యాసంగము కలిగినది. అక్కడ ఉన్నప్పుడే ఆధునిక ఆంధ్ర సాహి త్యములో విశేషమైన అభిరుచీ, కవనరీతులతో విశేషమైన పరిచయమూ కలు గుత. విజయనగరంలోనే నా తొలి కధానిక వెలువడింది.

"వద్దని నేనంటిగా !" అనే పేరుతో వ్రాసిన నా మొదటికథను పంపీ పంపడముతోనే కృష్ణాపత్రికవారు ప్రచురించారు. ఐతే, నేను పంపిన తరువాత సోమవారం ఆ ఊరుజేరే పత్రికలో నా కథ లేనందుకు కొంత ఆశాభంగము కలిగింది. కాని, ఆ తరువాత సోమవారం టౌన్‌హాల్‌కి వెళ్ళి అప్పుడే వచ్చిన కృష్ణాపత్రికలో, చూచీ చూడనట్టు మధ్యపేజీ తిప్పిచూతునుగదా, పెద్ద అక్ష రాలతో నా పేరూ ఆ పేరుకుపైన కథపేరూ కనబడ్డాయి. ఆ అనుభవము ఎప్పటికీ మరువరానిది. ఒక్కసారి గబగబా మొదటినుంచి చివరవరకూ చదువుకొన్నాను. నా దస్తూరిలో కనుపడని అందాలు అచ్చైనకథలో ఉన్నట్టు తోచి చాలా సంతోషించాను. వెంటనే అటూ ఇటూ చూచాను, ఎవరైనా ఈ వేపు చూస్తారేమో, వారితో ఈకథ వ్రాసింది నేనేసుమా అని చెపుదామని. కాని, ఎవరూ నా కోరిక చెల్లించలేదు. బిలియర్డ్ ఆటలో కొందరూ రన్‌మోర్ ఆటలో కొందరూ నిమగ్నులై ఈ నవరచయితను ఎవరూ ఆదరింపలేదు. మరునాడు పోస్టులో నా కాపీ వచ్చింది. అది నా దగ్గరస్నేహితులకు చదవ మని ఇచ్చాను.

ఇదివరకెప్పుడో, కాలేజీలో చదువుతూఉండగా నా స్నేహితు డొకతను ఇంగ్లీష్‌లో వ్రాసిన కథలోని సంఘటనను జ్ఞప్తిఉంచుకొని ఈ కథను వ్రాశాను. భర్తృవియోగంలో ఉన్న ఒక ఆమె పంచప్రాణాలూ తన ఐదేండ్ల కూతురుపై

పెట్టుకొని, ఎల్లాగో కాలం గడుపుతూ ఉంటుంది. ఆ చిట్టితల్లి తాను ప్రేమతో తండ్రిపేరట వ్రాసిన ఉత్తరాలను "నాన్నకు పంపుతాను" అంటూ చెంతనే ఉన్న పెద్దసరస్సు వద్దకు వెళ్ళబోతుంది. 'ఒకతెవ్వూ, కొలనివద్దకు వెళ్ళకమ్మా' అని తల్లి ఆమెను వారిస్తుంది. కాని, ఒకానొక విజయదశమి రోజున తల్లి మరేదో వ్యాపకంలో ఉండగా బిడ్డ ఆమెకు తెలియకుండానే కొలనివద్దకు వెళ్ళి ఉత్తరంతోపాటు, తనూ నీళ్ళల్లో పడిపోతుంది. గారాబుబిడ్డను, తన జీవిత సర్వస్వాన్ని గోల్పోయినతల్లి "వద్దని నేనంటిగా" అని కెవ్వున కేకవేసి మొదలు నరికిన అరటివలె నేలపై వ్రాలిపోతుంది. మాతృ హృదయాన్ని ఛేదించుకు వచ్చిన ఆ కేకను ఇప్పటికీ సాయం సమయాల ఆ లోయలో నడిచే పథికులు వినవచ్చు—అంటూ కథ ముగిస్తుంది.

కొన్నాళ్ళయినాక మాబావద్వారా చాలావిద్యావంతుడైన ఉలవభద్రదొరతో నాకు స్నేహమైంది. ఆయనది పర్లాకిమిడి. ఆ పర్వతసీమలో కొన్ని ఊళ్ళకు ఆయన "దొర". సాహిత్యము అతని మొదటిప్రేమ. బ్రహ్మాండమైన లైబ్రరీ సమకూర్చాడు, ఎక్కడెక్కడనుంచో విలువైన పుస్తకాలు తెప్పించి. మేమిద్దఱమూ కలిసినపుడు సాహిత్యవిషయాలగురించి రాత్రింబవళ్ళు మాట్లాడు కుంటూ ఉండేవారము. ఒక పర్యాయమట నేను వ్రాసిన ఆ కథానికను ఆయనకు చూపగా "నేనుఇదివరకే చదివాను; బాగానేఉంది; కాని శైలి నారికేళ పాకము" అన్నారు. నిజమే.

"ఆనాడు విజయదశమి. శ్రీవిజయవాద సమన్విత కోలాహలితమై సకల జంతుకోటియు నొప్పారుచుండెను. భూతప్రపంచ మంతయు ప్రభాభాసితమై ప్రజ్వరిల్లుచుండెను. అట్టియదనున పర్వతడోలికా మధ్యమున నూగుచున్న యొకానొక సరోవరము నంటియున్న మనోహరారామ మందలి మాలతీ నికుంజమున నొక దివ్య స్త్రీమూర్తి యాసీనయై యుండెను. కులీన సహజము లగు దివ్యాభరణంబు లేవియు నా యమ నలంకరింపకుండినను, వాని లేమి యొకింతయు గానరాకుండెను" అంటూ నడిచిన కథ ఇంకెలా ఉంటుంది ?

దీనికి కారణము నాలో మిళితమయిన ఆంధ్రప్రచారిణీ నిలయమువారి 'ప్రమదావనము' వంటి నవలలు, చిన్నయసూరి నీతిచంద్రికలోని 'అస్పంద

మిళింద సుందర వికసిత కుసుమరాజ విరాజమాన మల్లికా వల్లికా మతల్లికా విభ్రమానుకారిణులగుచు, దూరీకృత నిమేషంబుగా దృష్టి సారించి, సూచీ ముఖాలంకృత నాసికాగ్ర లగుచు"— ఇటువంటి సమాసపు వాసన. నాకు తెలియకుండానే ఆ భాష పట్టుబడిపోయింది నాకు.

నా రెండవకథ: "దివ్యతేజస్సు". ఇది మారీకరెల్లీ రచనకు అనుసరణ. హిమవత్పర్వత శిఖరాన, ఉదయభానుని కిరణపరంపరలతో మంచుతెర వీడి సత్యపురుషుడు ప్రేమ స్వరూపుడైన చిన్ని బాలునితో సాక్షాత్కరించిన గాథ. ఇదీ కృష్ణాపత్రికలోనే అచ్చైంది. ఈ కథలోని రమ్యత చాలవరకు మారీకరెల్లీదే. కాని. తెలుగులో ఆ భావాలు క్రొత్తగ కనుపించాయి.

మూడవ కథ వ్రాసేసరికి నేను దేవులపల్లి కృష్ణశాస్త్రి తొలి రచనలు చదువసాగాను. ఆ కథలో ఆతని మాటలు కొన్ని ఇమిడ్చాను.

కురియుమురా కన్నీటిని
మరి మరి విలపింపురా
సరము గూర్చి పరమేశుడె
దాల్చునురా !

అనే ఈ పంక్తులవల్లనే నాకు మరికొన్నాళ్ళకి కృష్ణశాస్త్రితో ముఖాముఖి పరిచయము, తరువాత గాఢమైన స్నేహము కలిగాయి. ఆ కారణముచేత ఆ కథ నాకు విలువైనదిగా భావిస్తాను.

అవి ఆధునిక సాహిత్య ప్రచారంలో 'మిషనరీ' రోజులు. తెలికచెర్ల వెంకటరత్నము, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి వంటివారు ఊరూరా తిరిగి నవ్యసాహిత్యము గురించి ప్రజలకు నచ్చచెప్పేవారు. ఇటువంటి దీక్షతోనే వెంకటరత్నం మా హాస్టల్‌కి వచ్చారు. ఆయన తమ్ముడు కృష్ణమూర్తి మాహాస్టల్‌లో ఉన్నాడు. పలుకరించడానికి గది ముంగిటకు వచ్చి, చిరకాల స్నేహితునిగా నిలిచిపోయిన సహృదయుడు. నాకు భాషావిషయంలో ఎక్కువ ఆసక్తి ఉన్నదని తెలిసి కృష్ణమూర్తి ఎప్పుడూ అటువంటి విశేషాలను గురించే నాతో

కబుర్లు చెబుతూ ఉంటాడు. నిజానికి, ఒక చక్కని పద్యము పల్లిస్తూ నా గది ముందు ఇటూ అటూ పచారుచేస్తున్న అతనిని నేనే ముందు పలుకరించాను. ఆ రోజులలో అతనికి చాలా ఇష్టమైన పద్యము:

తలపు తరగల నూగు ముత్యాల నౌక
అబ్ధి గర్భంబులోబడి భగ్నమైన యపుడు,
ఊర్చి, ఒకసారి కన్నుల నీ రోడ్చుకంటె,
చింతిలుట కంటె ఎవరేమి చేయగలరు ?

"తలపు తరగల నూగు ముత్యాలనౌక" చాలా అందంగా తోచింది నాకు. ఎవరు అన్నారు ఇంత మంచిమాట అంటూ అతనిని నేను పలుకరించి, నా ఎదుటఉన్న కుర్చీలో కూర్చోమన్నాను. అప్పుడు కలిసిన స్నేహం శాశ్వతమైంది మాలో. ఒక్కొక్కప్పుడు, వరుసగా ఐదు ఆరేళ్ళు కలుసుకోక, ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా లేకపోయినా, పలుకరిస్తే మాత్రం "ఆ! ఇక్కడే ఉన్నాను" అంటూ చెయ్యి అందిస్తాడు అతను. 'ఎంతో మంచివాడు అతను' అంటే, అతనినిగురించి సొంతము ఒక్కమాటలో చెప్పినట్టవుతుంది. అతనికి ప్రబంధాలలో మంచి మంచి పద్యాలన్నీ కంఠతా వచ్చును. ఎంతో భావయుక్తంగా చదివేవాడు. అడిగినప్పుడల్లా, ఎన్నిసార్లడిగినా, చదివేవాడు. వసుచరిత్ర యావత్తూ అతనికి కొట్టినపిండి. ఐతే, ఆధునిక రచనలూ బాగా చదివాడు. ముఖ్యంగా గురుజాడవారి రచనలు చాలా శ్రద్ధతో పరిశీలించాడు.

మెచ్చనంటూ నీవు, నీ వికె
మెచ్చుకుంటే మించిపోయెన ?
కొయ్య బొమ్మలె మెచ్చు కళ్ళకు
కోమలులు సౌరెక్కునా ?

అని తరచు వల్లించేవాడు. ముత్యాల సరాల గురించి కృష్ణమూర్తే నాకు మొదట చెప్పాడు. 'శారద' పత్రికలో అనుకుంటాను కృష్ణమూర్తి

రచించిన 'ప్రేమతత్వము' (షెల్లీ రచనకు అనుసరణ) అచ్చయింది. దానిని గురించి మాట్లాడుకుంటూన్నప్పుడే బసవరాజు అప్పారావు వ్రాసిన 'ఎదమెత్త నొటక్కై నొదగుందరా, అంత మదిగల అహమెల్ల వదలి పోవునురా!' అనే పద్యము చదివాడు. తరువాత కొన్నాళ్ళకి కృష్ణమూర్తే నన్ను బసవరాజు అప్పారావుతో పరిచయము చేశాడు.

అటువంటి కృష్ణమూర్తి అన్నగారు, వెంకటరత్నం, మా హాస్టల్‌కు వచ్చారు.

చక్కని చిన్న బైండ్‌పుస్తకంలో కృష్ణశాస్త్రి గేయాలు కొన్నీ, శివశంకర శాస్త్రివి కొన్నీ, పింగళివారి కవితాసామగ్రీ, వేదుల సత్యనారాయణ పద్యాలు, చామర్తి రాజశేఖరరావు పద్యాలు, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య 'ఆతిథ్యము'-ఇంకా కొందరు నవకవుల అమూల్య రచనలు, అందమైన చిన్న చిన్న అక్షరాలతో ఎంతో ఓపికతో వ్రాసి ఉంచారాయన. చక్కని విగ్రహము, స్వచ్ఛమైన కంఠస్వరము, అపురూపమైన ఆత్మవిశ్వాసము-ఆయన పద్యాలు చదువుతూఉంటే ఎంతసేపైనా వింటూ ఉండవచ్చు. ఒకొక్క కవిని గురించి వివరంగా చెప్పేవారు. కొడవటిగంటి వెంకటసుబ్బయ్య కథ చెప్పారు. అతడు మూడుమూర్తులా కవే అట. అతి సున్నితస్వభావము కలవాడు. చాలా చిన్న వయస్సులోనే అతనిలో ఆధ్యాత్మికచింత ప్రబలి, స్నేహితులనూ, బంధువులనూ విడిచి హిమవత్పర్వత ప్రాంతాలకు వెళ్ళిపోయాడు. ఆ అన్వేషణనుంచి ఇంకా తిరిగిరాలేదు. మృదుత్వమూ హాయీ వెల్లువారే అతని కావ్యము మనకు మిగిలింది- అంటూ, అతను రచించిన 'ఆతిథ్యము' అనే పద్యం చదివారు:

> ఆగు మాగుము తెరువరీ ఆ
> యాస ఖేదము నపనయింపుము
> మా గృహాంగణ కుసుమ సముదయ
> మఘువు లియ్యవిగో!

## నా స్మృతిపథంలో ...

నీరజాప్త నిశాత కిరణో
న్మీలితములై పరిమళించెడు
వారిరుహముల గుమ్మరిలిన తు
షార మియ్యదియే !

మావి పూగుచ్ఛముల నసకృ
న్మత్తమధుపచయమ్ము లాడగ
ప్రోవు పడిన పరాగమృదుల వి
భూతి ఇయ్యదిగో !

తూరుపున సింధూర రాగము
లొలుక, తొయ్యలు లేరి తెచ్చిన
పారిజాత ప్రసవమాలా
బహుళ మియ్యదియే !

ఆగు మాగుము తెరువరీ, ఆ
యాసఖేదము నపనయింపుము
మా గృహాంగణ కుసుమ సముదయ
మధువు లియ్యవిగో !

పద్యం వింటూ పరవశుణ్ణయిపోయాను. మళ్ళా మళ్ళా చదువమన్నాను. చిరస్మరణీయమైన ఆనందానుభూతి అది.

నవ్యసాహిత్య ప్రచారంకోసము శివశంకరశాస్త్రి ప్రభృతులు నెలకొల్పిన సాహితీసమితివారి 'సాహితి' పత్రిక మొదటిపేజీలో ఉందట ఈ రచన.

సాహిత్యసీమలో త్రోవకోసము వెతుక్కుంటూన్న బాటసారికి ఇంతకంటే హాయినిచ్చే ఆతిథ్యం ఉంటుందా అనుకున్నాను.

చామర్తి రాజశేఖరరావును గురించి కూడా విన్నాను అప్పుడే. భాగవతాది కావ్యాలనుబట్టి బృందావనసీమ ఎంతో అందమైనదని వూహిస్తాము మనము. రాజశేఖరరావు ప్రత్యక్షంగా నేటి బృందావనము చూచి, భరింపలేని ఆశాభంగముతో అంటాడు:

ఆ యమునా నదీ పరిసరాగత మందసమీరవార మే
చాయల బోయెనో దశదిశావృత తుంగతరంగ మాలికా
తోయకణంబు లేకడల దూరములై పరతెంచు చున్నవో
మాయురె, రమ్యవస్తు చయమంతయు కృష్ణుని వెంటనంటెనే!
ఆయువుపట్లు తూలునటు లశ్రులు రాల్చిరి గొల్లవారు, లే
బ్రాయులు నన్నపానములు బాసి తపించిరి జాలిపుట్ట నం
బాయని మోర లెత్తుకొని యావులు దూడలు నంగలార్చె,
కృష్ణా ఇకనైనగాని కరుణా మతివై ప్రభవింప నొల్లవో!

కొన్ని ఊహాలు ఊహాలుగానే ఉండిపోతేనే మంచిది. కొన్నేళ్ళ తర్వాత, నాకూ ఇటువంటి అనుభవమే కలిగింది. డిల్లీనుంచి కార్‌లో ఆగ్రా వెళుతూ బృందావన్‌వద్ద స్నేహితుని కారు ఆపమని, మేమిద్దరము యమునానదివైపు వెళ్ళాం. ఎందుకు ఆగామా అనిపించింది పాడుబడిన నేటి బృందావనసీమ చూసేసరికి, నిస్పృహతో కుమిలిపోయాను.

పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావు రచించిన 'కవితా సామగ్రి' పద్యాలు వినిపించారు వెంకటరత్నం. తెలుగువాణికి ప్రబంధశైలి కల్పించిన బంగారపు సంకెళ్ళను తెంచివేసే తెగింపు, ఆత్మవిశ్వాసము కనుపించాయి ఆ రచనలో నాకు. కవితారంభ ప్రియులౌ భావుకులకు కావలసిన వస్తువులను చూపిస్తాడు, ఒక వర్తకుడు. మామిడి చిగుళ్ళను మేసే కోకిల కంఠస్వరమూ క్రొత్త క్రొత్త అందాలను కల్పించే కుందనపు తళుకూ

తామరరేకులలోని అతిమార్దవత్వమూ, మలయపర్వత సానువులనుంచి వీచే కమ్మ తెమ్మెరలూ—ఇవన్నీ చూపి,

తీయుదుర ? దీని వెన్నెల తేటనిగ్గు;
ఒరయుదుర ? దీని పచ్చకపురపు తావి;
కోరి కొందుర ? దీని పటీరజలము;
త్రావిచూతుర ? తీయని పూవు దేనె;

అని అడుగుతాడు.

కాని, పూర్వసంప్రదాయంలో పెరిగిన కవులకు ఇవి పనికిరావు. "పచ్చ కర్పూరము, తుషారజలము, కలువలు, కోకిలస్వనము, చందనము, పూవుదేనియలు, వెన్నెల, చల్లగాలి-ఇవా కవితాసామగ్రి ? పిచ్చివాడా ! నీవద్ద ప్రౌఢ సమాసకల్పన ఉంటే చూపించు; శ్లేషకవిత్వ మంజూషకావాలి. నాకు గొప్ప ప్రబంధాలు వ్రాయడానికి పనికివచ్చే రసాయనము ఏదైనా ఉంటే ఈ బుడ్డి నింపు, ఆశుకవిత్వము అల్లగల మంత్రము తెలిస్తే నా చెవులో ఊదు" అంటారు ఒకొక్కరూ. "అవి ఏమన్నా ఉంటే చూడు; కాని, మంచినీళ్ళా కవనదాహం తీర్చేవి?" అని ఆక్షేపిస్తారు.

వారి అజ్ఞాన ధోరణికి విసిగి, వర్తకుడు:

"నా వద్ద మందుమాకు లేమీలేవు. నన్ను పోనీయండి బాబూ, కవితా లతను అలంకరించే కలువపువ్వు మీ చేతిలో నలిగిపోతుంది. ఎంత పుణ్యము చేసుకుంటే లభిస్తుంది, మీ కృతికన్యలకు ఈ చందనపు నగలను ధరించే భాగ్యం ? ఈ చల్లనిగాలి మీకు హాయినివ్వదు సరికదా, మంటలు రేపుతుంది. తియ్యని కోకిలగానము వెగటుగాతోచే మీ చెవులకింక ఏమి రుచిస్తుంది ? ఈ మంచిముత్యాలు మీ చేతులు తగిలి మలినమైపోతాయి. నేను మరో పేటకు పోతా" నని అక్కడనుంచి వెళ్ళిపోతారు.

ఆనాడు పూర్వ సంప్రదాయ ధోరణికీ, ఆధునిక రచనా విధానానికీ మధ్య జరుగుతున్న సంఘర్షణలను ఇంతకన్నా రసవంతంగా చిత్రించడానికి

పిలవుతుందా! ఉత్తమ కవిత్వానికి కావలసిన లక్షణాలన్నీ తేటపరిచారు ఈ కవిసోదరులు, ఈ తమ రచనలో.

అందుకే, వీరి రచనలు కొన్ని కలిసిన 'తొలకరి' అనే పుస్తకానికి 'తొలిపలుకు' వ్రాస్తూ రసిక శిఖామణీ, నిర్దాక్షిణ్య విమర్శకుడూ ఐన కట్టమంచి రామలింగారెడ్డి అంతవారు, ఈ పద్యములోని వీరి మాటలనే ఉదహరిస్తూ:

సుకవి భోగ్యమ్ము లిచటి వస్తువులు, వీని

నలిపివేయకు డటు నిటు కలచివై చి-

అన్నారు.

శిష్ట వ్యవహారభాషనుగురించి వెంకటరత్నంవల్ల నేను సవిస్తరంగా తెలుసుకున్నాను. పూజ్యులు గిడుగు రామమూర్తి ప్రియశిష్యులు వెంకటరత్నం; ఆయన సందేశాన్ని లోకానికి చాటుతున్నారు.

ఆ తరువాత నేను యత్నించిన 'నాగులచవితి' అనే కథలో ఈ భాషే వాడాను. ఒకచిన్నారి పాపను గురించి ఆమె సవతి తల్లి హృదయంలో కలిగిన వింత పరివర్తనాన్ని వర్ణించాను. మనస్సులో రేకెత్తిన భావాలను ఉన్నవి ఉన్నట్లు పొందుపరచడమూ దగ్గరఉన్న ఎవరితోనో మాట్లాడుతూన్నట్లె వ్రాయడమూవల్ల, శైలి అతిసహజముగానూ, ఎంతో ఆప్యాయంగానూ కుదిరింది. సున్నిత భావాలున్నూ చక్కగా అమరినవి. అందుచేతనే ఈ కథను కృష్ణాపత్రికలో చదివిన కవి విశ్వేశ్వరరావు తన సహజ చమత్కృతితో,' తోటకూరకాడకు తేలును కుట్టించి కరుణరసము ద్రవింపజేశావు' అన్నాడు.

శిష్టవ్యవహారభాషే మనభాష, ఆ శైలిలోనే మనమందరమూ వ్రాయాలి, అనే దీక్ష అప్పుడు వెలువడుతూన్న 'శారద' పత్రికలోని కొన్ని రచనలను చూచాక మరింత దృఢమైంది నాలో. 'అంతరాత్మ' అనే శీర్షికను ఎవరో నాటి తెలుగువారి నిత్యజీవిత దృశ్యాలను ఎంతో చక్కగా వర్ణించారు. సంస్కారముగల ఒకానొక యువకుని మనోభావాలను అతి సన్నిహితంగా వ్యక్తపరిచారు. గణగణమ్రోగే గంటల సవ్వడితో సాగిపోయే రెండెడ్లబండిలో ప్రయాణము, అల్లనేరేడు చెట్లమధ్య. పంటకాలువ గట్టున షికార్లు— ఇటు

వంటివి నాలో ఎన్నో మధురస్మృతులను కలిగించాయి. ఆ రచయిత ఎవరో ఇప్పటికీ తెలియదు.

విజయనగరంలో ఆ రోజులలో జట్కాబండి ఒక్కటుండేది; అంతే. తతిమ్మా కిరాయిబండ్లన్నీ ఒంటెద్దుబండ్లే. కమానుబండి అనేవారు ఒంటెద్దు బండిని. రంగురంగుల కుచ్చులతో అమరిన అందమైన బండిని తోలే ఒక బండిఅతను నాకు స్నేహితుడయ్యాడు. నేనెప్పుడు ఊరువెళ్ళినా, ఆ బండి లోనే వెళ్ళేవాడను. మెడికల్ కాలేజీలో చదువుతూన్న మా బావను చూడడానికి తరచు విశాఖపట్నం వెళుతూండేవాణ్ణి. తెల్లవారుజామున రైలుఎక్కితే సూర్యోదయపువేళ వాల్తేరు చేరేది. బండిఅతను సరిగ్గా వేళకు వచ్చేవాడు మాహాస్టల్‌కు. ఒకప్పుడు రాత్రేభోంచేసి వచ్చి అక్కడే పడుకుని రైలువేళకు బండికట్టి నన్ను లేపేవాడు. హాస్టల్‌నుంచి స్టేషన్‌కి ఇరవైనిమిషాల ప్రయాణం. మేము తాపీగా అరగంటలో చేరేవారము.

ఆ అరగంటసేపూ తోలినపొడుగునా అతను బండిపాట పాడేవాడు. ఎప్పుడూ "చల్ మోహనరంగా" పాటే పాడేవాడు. ఎన్నిసార్లు ప్రయాణము చేసినా ఆ పాటే పాడమనేవాణ్ణి. ఆపాట వినాలని, నేను రాత్రి రైలులోనే వెళ్ళేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు కటిక చీకటి. ఒకప్పుడు పండువెన్నెల. ఎప్పుడూ ఆ పాట మనోహరంగానే ఉండేది. కాస్త మంచుకురుస్తూ ఉంటే, మరీ బాగుండేది-మరేదో లోకంలోంచి వినవచ్చే దివ్యగానంలాగ. అతనెంతో అనుభవిస్తూ పాడేవాడు. "గదరా నీ గుండె బెదురా-మధురా వెన్నెలరేయి నిదురాకు నేరమంటిని గదరా" అనే మాటలు మగనాలి చేసే సవాలుగా పలికేవాడు. మళ్ళీ "కన్నీటా కడవ నిండెను గదరా" అన్నచోట జాలితో గుండె నీరయ్యేది. 'చల్ మోహనరంగా' అంటూ చల్! చల్! అని యెద్దును అదలికించినప్పుడు యెద్దుమెడలో మువ్వలన్నీ ఒక్కసారి ఘల్లుమనేవి. "నీవు నాకు జోడువైతే ఏటిఒడ్డున ఇల్లుకడదాం" అన్నప్పుడు 'జోడువైతే'కాదు; 'జోడుఐతే' అనాలి అని ఎన్నిసార్లో అతనిని దిద్దాలని ప్రయత్నించాను. లాభంలేకపోయింది. "మల్లెపూల తెప్పగట్టి తెప్పపైనా తేలిపోదాము" అని పాడుతూ ఉంటే శృంగార

రసము వెల్లువారేది, ఒక్క అక్షరంముక్కరాని ఆ బండివాని గొంతులో. ఎంత భావుకుడో అతను, ఇప్పు డెక్కడున్నాడో.

విశాఖపట్టణంలో ఉన్న ఒక పూటో, మూడురోజులో, ప్రతినిమిషమూ కవితా వ్యాసంగంతో గడిచిపోయేది. తాను చదివిన క్రొత్త పుస్తకాలను గురించీ, క్రొత్త రచనలను గురించీ, తాను కలుసుకొన్న క్రొత్త కవులను గురించీ ఎంతో ఉత్సాహంతో చెప్పేవాడు మా బావ. ఎంతో ఆసక్తితో వినే వాణ్ణినేను. విజయనగరంలోని విశేషాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పేవాణ్ణి నేను. ముప్పదిఐదు ఏళ్ళక్రితము అతని తండ్రికి, మా నాన్నగారికీ ఎంతో స్నేహం, ఎంతో కలిసిమెలసి ఉండేవారు. రాజమహేంద్రవరంలో మా అమ్మ పోయి నప్పుడు మా నాన్నగారికి ఆసరాగా నిలిచి అపరిమితమైన సానుభూతితో కొంత ఉపశమనము చేయగలిగారు శ్రీరాములుగారు. వారియందు నాన్నగారికి స్నేహ భావమే గాకుండా తనకంటే పెద్దవారు కాబట్టి పూజ్యభావమున్నూ ఉండేది. ఆ వారి స్నేహం ఈ తరంలో మా కిద్దరికీ అబ్బింది. కొన్ని కొన్ని విష యాలలో మాత్రం మా ఇద్దరిమధ్య కాస్త అభిప్రాయిబేధం లేకపోలేదు. అతను పూర్తిగా గాంధీ అనుచరుడు. నేను పూర్తిగా అడయార్ వాతావరణంలో పెరి గిన వాడను. అప్పటికే, గాంధీ-బిసెంట్ల మధ్య రాజకీయ ఆశయాలలో చాలా బేధం ఏర్పడిఉంది. ఐనా, రాజకీయాలను గురించి నేను ఎక్కువ పట్టించు కోలేదు. కాబట్టి అంతబాధ లేకపోయింది. పైగా, స్నేహమే ముఖ్యమని పాటించేవారి మధ్య అన్యోన్యాంగీకారమైన విషయాలే ఎక్కువగా ఉంటాయి. బేధాభిప్రాయానికి తావునిచ్చేవి అల్పములైతే, అసలు కనబడవుకూడా. మా ఇద్దరిమధ్యగల రక్తస్పర్శ వల్ల కలిగిన అపరిమితమైన అనురాగమే గాకుండా కొన్ని సమాన ఆశయాలు ఉండబట్టి మా స్నేహం నానాటికీ వర్ధిల్లి, కాలాను గతంగా రాకపోకలు సన్నగిల్లినా, ఆనాటి సహవాసం ఒక మధురస్మృతిగా ఉండిపోయింది.

మేమిద్దరమూ వాల్తేరు, విశాఖపట్టణం పరిసర ప్రాంతాలలోని సృష్టి వైచిత్ర్యాలనుచూచి ఆనందిస్తూ ఊరికే తిరుగుతూ ఉండేవారము. వాల్తేరు కొండల దిగువను సముద్రమెంతో రమ్యంగా ఉంటుంది. విశాఖపట్నం ఇవ

తల ఉప్పుటేరు దాటివెళితే లోయతోట కనిపించేది. ఆతోట కొంతభాగము ఇప్పుడు హార్బర్ ఆవరణలో కలిసిపోయి, రూపుచెడిపోయింది కాని, ఆరోజులలో భూలోక నందనవనంలా ఉండేది.

రెండు కొండలమధ్య రమ్యమైన లోయ. లోయలో ప్రవహించే ఒక సెలయేటికి అక్కడక్కడ ఆనకట్టలు కట్టి అందమైన ఆరామము ఏర్పరిచారు తోటమాలీలు. వసంత ఋతువులో వసురాజు చూచినది ఇటువంటి తోటే అనుకునేవారము మేము. అక్కడక్కడ అందమైన పొగడచెట్లు. మలుపు తిరిగితే కట్టెదుట సాక్షాత్కరించేది, ఎన్నడో విడిపోయి, నేడు పునర్దర్శన భాగ్యమిచ్చే పూర్వ స్నేహితురాలులా తలనిండా పువ్వులు పెట్టుకుని, చంపకము. రకరకాల పక్షులు ఆప్యాయంతో పలుకరించేవి. ఈ ఆనందాన్ని అంతా తనలో ఇముడ్చుకొనే కాబోలు కొన్నాళ్ళయినాక, మా బావ 'లోయతోట' అనే చక్కని కథ వ్రాశాడు. అది కృష్ణా పత్రికలోనే అచ్చు అయింది. ఆ తరువాత 'పడ వెళ్ళిపోతున్నది' అనే పల్లెపదము వరుసలో 'శివుని శిఖరముపైన చెలువొందుదానా' అంటూ చంద్రరేఖను గురించి గేయం వ్రాసి అదీ ఆ పత్రికలోనే ప్రచురించాడు. ఆ గేయం వినిపించడానికి పనిగట్టుకు నాకోసం విజయనగరం వచ్చాడు అతను.

దినము దినమంతా ఆసుపత్రిలోనూ, శల్య పరీక్షలోనూ, గడిపినా, కాస్త తీరిక ఉన్నప్పుడల్లా ఇటువంటి సాహిత్య వ్యాసంగంలో నిమగ్నుడయ్యేవాడు అతను. రసాయన శాస్త్రంలో విశేష పరిశోధనలు చేస్తున్నాను అని చెప్పుకుంటూ తెలుగు ప్రబంధాలలోని రమణీయమైన రచనలను పదిలపరచడం, తెలుగు తోటలో పుష్పిస్తూన్న క్రొత్త క్రొత్త పువ్వులను సేకరించడం-ఇదే అభిమాన వ్యాపకంగా పాటిస్తూ ఉండేవాడను నేను.

లోయతోటలోంచి ఇంక కొంచెము పైకి వెళ్ళితే, చాల ఎత్తయిన కొండ వస్తుంది. ఓపికతో ఆ కొండ ఎక్కగలిగితే పడ్డ శ్రమఅంతా ఫలిస్తుంది. అద్భుతమైన దృశ్యం చూడవచ్చును. పడమటను, అట్ట అడుగున, ఎక్కడో పాతాళలోకంలో ఇందాక మనం చూచిన లోయతోట. తూర్పున, కను

చూపు మేర, మహాసముద్రం. కాని, సూర్యాస్తమయవేళ అలుముకొనే సంజ చీకటిలో, సముద్ర మెక్కడ అంతమవుతుందో ఆకాశ మెక్కడ ప్రారంభమో చెప్పలేము.

ఆ కొండపైన ఒకవింత. ఎక్కడ చూచినా కరివేప పొదలే! అడవిలా పెరిగిపోయాయి. కరివేప ఆకుకోసం ప్రక్కనున్న పల్లెలోంచి ఇంత ఎత్తు కొండనూ ఎక్కివస్తారు పల్లెప్రజలు. చిత్రం: ప్రక్కనే ఉన్న పట్నంలో తెల్ల వారి లేస్తే డబ్బుయిచ్చి కొనుక్కొంటాము కరివేపాకు. కానీ ఇస్తే నాలుగు దెబ్బలు చేతిలో పెడతారు ఇక్కడ కొండకొండతా కరివేపాకే! అలాగే, కొన్నేళ్ళ తరువాత వింధ్య పర్వతాల మధ్యఉన్న కైమోర్ అనే ఊరికి వెళుతూ మూడు కొండలుదాటి వెళ్ళాను. ఆమూడు కొండలూ అంగుళ ప్రదేశం వెత్తి లేకుండా, అంతా పారిజాతపు చెట్లమయమే. అదృష్టవశాత్తు, నేను వేసవిలో వెళ్ళాను: శ్రావణ ఆశ్వయుజాలలో ఐతే మత్తు కలిగించే పారిజాతపుష్ప మహార్ణవంలో ఉక్కిరిబిక్కిరి ఐపోయి అక్కడే పడివుండేవాణ్ణి!

బసవరాజు అప్పారావు రచించిన 'లోకముతో మనకేటికి లోలాక్షి! రా పోదము' అనేగేయం మాబావా నేనూ చదివాము ఆరోజులలోనే. ఆ పాటకు మాతృకఐన ఉమర్ ఖయాం ఆంగ్ల అనువాదం కంటే ఈ రచనలో ఎక్కువ సాహసం కనిపించింది. ఈ మాటకు ఇంగ్లీషులో 'ఆబాండన్' అంటారను కుంటా.

ఈ క్రొత్త కవులు ఇదివరకు మన ప్రబంధంలో ఎక్కడాలేని భౌతికా తీతమైన ప్రేమను వర్ణిస్తూ, మనస్సుకు ఎంతో హాయినిస్తారు అనుకున్నాము. అప్పుడే, అబ్బూరి రామకృష్ణారావు కాపుపాట మమ్మల్ని ఎంతో ఆనందింప జేసింది.

పాడుట కొప్పవేని, పడవల్నడిపించెడు
నేటి త్రోవలే చూడగవద్దు, లేత మనసుల్
తడిసేసెడు చెట్ల చాటునన్ కూడిన మేను లానుకొన

## నా స్మృతిపథంలో ...

కొమ్మల నాకులవోలె, నొక్క మాటాడక
కూరుచుండ మనువైన పొలమ్ముల గట్టు నీడలన్!

'లేతమనస్సులు' 'కొమ్మల నాకులవోలె, ఒక్క మాటాడక కూరుచుందము'- ఎంత అందంగా ఉన్నాయి! ఇది చదివిన పాతికఏళ్ళ తరువాత, ఇటీవల, నేటి సాహిత్యరీతులను గురించి విమర్శిస్తూ, 'ఆంధ్ర ఖండకావ్య సంపుటిని ఎవరు కూర్చినా ఆ గ్రంథములో అబ్బూరివారి ఈ గేయం తప్పకుండా ఉంటుంది' అని వ్రాశాను.



ఏదో విద్యుత్ప్రభా పుంజ మిపుడు దోచె
నేదో భవ్యవాద్యస్వన మిపుడు దోచె
నేదో సుకుమార మారుత మిపుడు దోచె
నేదో దివ్యపరిమళ మిపుడు దోచె !

—వేంకట పార్వతీశ కవులు

సింహాచలం :

నరసింహాలయంలోని గుడిగంటలు మ్రోగుతున్నాయి. పూచిన పోక మొక్కలపై రాత్రి రాలిన మంచు ముత్యాలు ఆకు కొనలను నిలచి ఉదయ భానుని లేత కిరణాలతో ధగ ధగ మెరుస్తున్నాయి. గంగధార ధనధనారవము చెవులకు ఇంపైన మ్రోతగా వినిపిస్తోంది. అటునుంచి వచ్చే పిల్లవాయువులు విరగపూసిన సంపెంగ వృక్షాలను తాకి మైమరపించే సువాసనతో ఇటు వీస్తు న్నాయి. వర్ణింపనలవికాని ఉత్సాహమేదో మమ్మల్ని ఆవరించింది. స్నేహి తుడు కృష్ణమూర్తి మళ్ళా పఠిస్తున్నాడు 'ఏకాంత సేవ':

ప్రాగ్బహిద్వార ఘంటారవంబు తోడ
మింటి ఘంటా రవంబులు మేళవించె
ఘనతరంబైన ఉదయ రాగంబుతోడ
నాత్మ రాగ ప్రభాపుంజ మైక్యమయ్యె
భావ విద్యుల్లతా ప్రదీపంబు తోడ
భాను దివ్య ప్రభారాశి లీనమయ్యె !

నిజంగా అంత ఆహ్లాదకరంగానూ, అంతటి అందమైన అనుభవం గానూ ఉన్నది, మేము అప్పుడు కొండ ఎక్కడము. మా బావ కృష్ణారావు,

స్నేహితులు సంపత్తూ, కృష్ణమూర్తీ నేను. కుడివేపున లోయలో గులాబీతోట. అన్నీ పువ్వులే! ఇంక ఆ స్వామికేమి కొదువ!

స్వామిదర్శన మయ్యాక, ఇంకా కొండ పైకివెళ్ళి అక్కడనుంచి సముద్రాన్ని చూచాము. 'ఎవరు ముందు సముద్రాన్ని చూస్తారో వారికి తులసిమాల' అనిన మా బావ వగర్చుకుంటూ వచ్చి నా చేతిలో ఉంచాడు, గుడి ముందర తానుకొనిన తులసిమాలను. నిజానికి ఎంతో దూరాన ఉన్నా, సముద్రం ఇట్టే చెయిచాచి ముట్టుకోవచ్చు ననేటంత సమీపంగా కనిపించింది. అప్పుడు ఒక చిన్న వాదన జరిగింది మాలో. ఇంకా కొంచెం కొండపైకి వెళ్ళి అటువైపున ఉన్న మెట్లుదిగి మాధవధార జేరి, ఆ త్రోవనే వాల్తేర్ వెళదామన్నారు మా బావా, సంపత్. దేవాలయం ఇంకా సరిగ్గా చూడనేలేదు, ఆ సంపెంగ చెట్ల మధ్య, లోయలో గులాబీ తోటలోను ఇంకా కొంచెంసేపూ ఉండాలి, అన్నాము కృష్ణమూర్తీ, నేనూ. ఇంతట్లోకి మా నలుగురికీ ఒకేసారి జ్ఞాపకం వచ్చింది, మాకు స్వామిప్రసాదం ఇయ్యడానికి పేష్కార్ కనిపెట్టుకుంటారని. తిరిగి, దేవాలయమంతా మరొక్కసారిచూచి, పొగడచెట్టు నీడను కూర్చుని పేష్కార్ పంపిన ప్రసాదం ఆరగించాము. మేము కూర్చున్న చోటినుండి చూస్తే కొండ పైకి వచ్చే మెట్లన్నీ కనబడతాయి. ఆ త్రోవను బారులు బారులుగా పైకివస్తున్నారు యాత్రికులు ఎందరో ఎడతెరిపి లేకుండా, 'సింహాద్రి అప్పన్న'ను దర్శించడానికి. ఎన్నెన్ని ఆశలు పెట్టుకు వస్తున్నారో, ఏమేమి ముడుపులు చెల్లిస్తారో వీరు!

కొండచుట్టూ చాలా అందంగా ఉంది. ఎటు చూచినా అనాసతోటలు, పనసమొక్కలు. అక్కడక్కడా కొండనేల చదునుచేసి జొన్న వగయిరా పంట పండిస్తున్నారు రైతులు. పూర్వం ఇక్కడ అడవి దట్టంగా ఉండేదట. ఇప్పుడిది చక్కని ఆరామ ప్రదేశంగా మారింది. గులాబీతోటలో చాలాసేపు ఉన్నాము. ఇక్కడ స్వామికి చక్కని కల్యాణమంటపం కూడా ఉంది. విడువలేక, విడువలేక విడిచి వచ్చాము సింహాచలాన్ని.

విజయనగరం రావడానికి ముందు రాజమహేంద్రవరంలో ఉన్న మా చెల్లిలిని చూడడానికి వెళ్ళాను. అప్పుడే మా బావకు మధుర బదిలీ ఐ వారు

ప్రయాణం సర్దుకుంటున్నారు. అతను తనకు కావలసిన పుస్తకాలన్నీ ఒక పెట్టెలో పెట్టుకుంటున్నాడు. "ఈ పుస్తకం కవులు నాకు ఇచ్చారు. నాకంటే నీకే ఎక్కువ ఉపయోగమేమో నీ దగ్గర ఉంచుకో" అని ఒక చిన్న పుస్తకం ఇచ్చాడు. అతను చెప్పినట్టే నా దగ్గరే ఉంచుకున్నాను కాని, పుస్తకం చదువ లేదు. పుస్తకాన్ని అసలు చూడకుండా అలా ఉంచేశాను చాలాకాలం. తర్వాత తెలికిచెర్ల వెంకటరత్నం ఈ పుస్తకం రచించిన కవులను గురించి చెప్పగా తీసి చదివాను, నా ఆనందానికి మేరలేదు. ఉత్సాహంతో కృష్ణమూర్తికి చూపించాను. అతను పుస్తకం విప్పకుండా అందులోని పద్యాలు వల్లించడం మొదలు పెట్టాడు:

అలరు నెమ్మేన చందన మలదినట్లు
కనుల కర్పూరంపు కాటుక నునిచినట్లు
చెవుల నమృత రసంబున జేర్చినట్లు
జిహ్వపై దేనె సోనలఁ జిలికినట్లు

'ఏకాంతసేవ' ! ఇంత మంచికావ్యం చదువకుండా ఇన్నాళ్ళెలా ఉన్నానో అనుకున్నాను. అన్నిటికీ సమయం రావాలి కాబోలు. కొన్ని విలువైన వస్తువులు మా పిన్ని బొట్టుపెట్టెలో దాచుకునేది. అవి తనవద్ద ఉన్నట్టే ఆమెకు జ్ఞప్తిఉండదు. ఎప్పుడో, సమయం వస్తేగాని, అవి బయటపడేవి గాదు.

ఎంత మంచి పుస్తకం చదువుతున్నా నాకు చాలానచ్చిన పంక్తుల క్రింద గీతలుపెట్టే అలవాటు ఎన్నడూలేదు. 'ఏకాంతసేవ' చదువుతూన్నప్పుడు మాత్రం, అల్లా గుర్తుపెట్టకుండా ఉండలేకపోయాను. సెలవులకు మాఊరువెళ్ళినప్పుడు మా పినతండ్రి నా పుస్తకం చూడడం తటస్థించింది. "అబ్బాయీ ! ఇన్ని గీట్లేమిటి ? గీట్లు లేని పంక్తులే ముఖ్యమేమో అని తోస్తుంది !" అన్నారు.

ఆ పుస్తకాన్ని అడయార్ పంపి, వసంతాప్రెస్‌లో ఇంగ్లీషు పుస్తకాల పద్ధతిని ఎంతో వెలయిచ్చి, చక్కని బైండు కట్టించాను. ఊదారంగు 'కిడ్‌స్కిన్' పైన బంగారపు అక్షరాలు. ముద్దొస్తూ ఉండేది. పనిగట్టుకు

కాకినాడ వెళ్ళి వెంకటపార్వతీశ్వరకవులలో ఒకరైన బాలాంత్రపు వెంకట్రాయ కవిని కలుసుకొని పుస్తకం లోపలిపేజీపైన వారి సంతకం తీసుకున్నాను. వారు రచించిన అద్భుతమైన కావ్యం గురించి వారితో ఎంతో చెప్పాలి అనుకున్నాను, సాగలేదు—వారు మరేదో వ్యాపకంలో ఉండిపోయారు.

సింహాచలం వెళ్ళివచ్చిన కొన్నాళ్ళకి మేము పార్వతీపురం వెళ్ళాము. కృష్ణారావుబావ, కృష్ణమూర్తి, నేనూ. అక్కడ మా బావ సహపాఠి శాస్త్రి ఉండేవాడు. చెంతనే, తోటపాక అనే అందమైన ప్రదేశముంది చూపిస్తాను రండి అని తీసుకువెళ్ళాడు మమ్మల్ని. ఆ కొండలన్నీ తిరిగాము. ఒక కొండ నెత్తాన ఉండగా, దూరాన ఉన్నమరేదో కొండశిఖరాన్ని చూపిస్తూ "చూడండి, ఎంత గొప్పగా ఉందో!" అంటూ తనవద్ద ఉన్న టెలిస్కోప్ అందిచ్చాడు నాకో, మా బావకో సరిగ్గా జ్ఞాపకంలేదు. అందుకోవడంలో కాస్త అజాగ్రత్తవల్ల విలువైన ఆ టెలిస్కోప్ చేయిజారి ఆ అగాధంలో పడిపోయింది. మేము నలుగురమూ క్రిందకు దిగి కొండ కొండంతా వెతికాము. కాని, లాభం లేక పోయింది. ఎంత వెతికినా కనబడలేదు. ఏ చరియలో పడిపోయిందో టెలిస్కోప్. అది వాళ్ళ అన్నయ్యది. ఆయన ఏమి కోపగిస్తాడో అని బెంగ. నిరాశులమై దిగాలుపడ్డ ముఖాలతో ఇల్లుచేరిన మమ్మల్ని చూచి, సంగతి తెలిసి, భోజనపువేళ అతిక్రమించి ఆయాసపడ్డామని కించపడ్డారే కాని వాళ్ళ అన్నయ్య విలువైన వస్తువు పోయినందుకు తమ్ముణ్ణి కూకలు వెయ్యలేదు. "ప్రమాదం ఎవరికీ తప్పదు" అని ఊరుకున్నారు. మా కిద్దరికీ చాలా స్నేహమైంది, ఆ తర్వాత. ఇప్పటికీ ఎప్పుడైనా కనిపిస్తే, 'టెలిస్కోప్ దొరికిందా' అని నేనంటే, 'ఇంకెక్కడి టెలిస్కోప్' అంటాడు. మేమిద్దరమూ నవ్వుతాము— ఆ రోజులు జ్ఞప్తికి వచ్చి.

సాయంత్రం, మేరంగి దివాన్ పూజ్యులు ఆచంట వేంకటసాయంభొట్లయన శర్మను చూడడానికి వెళ్ళాము. వారికి అప్పుడు డెబ్బది ఏళ్ళకు పైగా ఉండవచ్చును. కాని, మాకన్నా ఎక్కువ చలాకిగా, ఎక్కువ ఉషారుతో కనుపించారు. రసికసంపన్నులు. అతి కులాసాగా కబుర్లు చెప్పగలరు. నిజంగా ఆయనతో మాట్లాడుతూ ఉండడమే ఒక గురుకులవాసం వంటిది.

## నా స్మృతిపథంలో...

మేము వెళ్ళేటప్పటికి ఆయన జనమంచి శేషాద్రి కవితో కావ్యగోష్ఠిలో ఉన్నారు. ఇదివరకు పండితులెవ్వరూ గుర్తింపని ఏదో విషయం గురించి ఆయనతో చెపుతున్నారు. మేమున్నూ శ్రద్ధతో విన్నాము. ఏదైనా విషయాన్ని గురించి చెప్పుకుపోతూ, పదేపదే శ్రోతలకేసి చూసి చిరునవ్వుతూ, 'ఏమంటారు ?' అని ప్రశ్నించడం వారికో సరదా. ఎదుట పళ్ళెంనిండా కర్పూర కిళ్ళీలు. మాటల సందర్భంలో ఎన్ని కిళ్ళీలు నమిలేవారో లెక్కలేదు. ప్రసంగ వశాత్తు ఆధునిక కవిత్వ ప్రస్తావన వచ్చింది. నేను ఆంగ్లసాహిత్య విమర్శనా ధోరణిలో కొంత తెలుగులో, కొంత ఇంగ్లీషులో మాట్లాడుతూ, ఆనాటి నవ్య సాహిత్యం గురించి చూచాయగా చెప్పాను. కృష్ణమూర్తి స్వచ్ఛమైన తెలుగులో తన అన్నగారిలాగే, చక్కగా వివరించాడు. శేషాద్రికవి ప్రబంధ పక్షపాతిగా ఉండటంవల్ల 'ఇదంతా పాశ్చాత్య రీతుల అనుకరణ, ఇందులో విశిష్టత ఏమీలేదు' అని, కొట్టివేశారు. సంస్కృత భాషాజ్ఞానం లేకపోవుటవల్లా, మన ప్రబంధాలలోని అందాలు తెలుసుకొనే తాహతులేక, ఈనాటి యువకులు అర్థం లేనిభావకవిత్వంలోకిదిగారన్నారు. అప్పుడు, కృష్ణమూర్తి అతనికి వసుచరిత్రాది ప్రబంధాలు కంఠాపాఠము కాబట్టి, వానిలోని కొన్ని విశేషాలను వివరిస్తూ, పదజాల సంపదతో, భావస్ఫురణతో తులతూగగల అందాలున్నాయి నేటి భావ కవిత్వంలో- అని నిరూపిస్తూ ఆ రచనలలోని రమ్యతను వ్యక్తపరచాడు. శృంగార, భక్తి, శాంతరసాలను ఎంతచక్కగా పోషించవచ్చో 'ఏకాంత సేవ' లోని కొన్ని ఘట్టాలను ఉదాహరిస్తూ నిరూపించాడు. అతని మాటలు సావధానంగా విని, సాయంఖ్యాయన శర్మ 'ఈ కుర్రవాని వాదన సహేతుకంగా ఉన్నట్లుంది, నాకా కావ్యం చూడాలని ఉన్నది' అంటూ వారి అబ్బాయిని మా బసకు పంపి, మా పెట్టెలో ఉన్న ఆ పుస్తకం తెప్పించారు, అప్పటికప్పుడు. తనే చదువడము మొదలుపెట్టారు. గంభీరమైన కంఠస్వరము, ఎంతో భావయుక్తంగా చదివారు.

ఈ శైలవాహిని యింకిపోకుండ
నమృతార్ణవము జేరె నంతియేచాలు,

ఈ మల్లెల విరిదండ యెండిపోకుండ
నమృతమూర్తి వహించె నంతియేచాలు.

ఇటువంటి పంక్తులలో మాకు తెలియని అందాలను ఎన్నో చూపిస్తూ ఆయన శేషాద్రి కవితో 'ఈ పుస్తకం గొప్ప పుస్తకం, శ్రద్ధగా చదువతగినది' అని చెప్పారు. ఐతే,

భావంబుచేనైన బలుకులనైన
గాయంబుచేనైన గార్యాలనైన
నెరిగియో నెరుగకో యేజేసినట్టి
తప్పులుండిన మది దలపగా బోక

అనే పంక్తులు చదివి, 'మనోవాక్కాయ కర్మల నేను చేసిన తప్పు' అనే భావం ఇక్కడ; మనోకర్మ, వాక్కర్మ, కాయకర్మ—కార్యాలు అనేమాట ఈ మూడింటికీ వర్తించాలి; అంతేకాని, 'కార్యాలనైన' అని వేరే ఉండరాదు అన్నారు. అంత సూక్ష్మంగా పరిశీలించారు కావ్యాన్ని.

మరునాడు వారింటిలో ఏదో సందర్భాన విందు జరిగింది. ఆ విందుకు రావలసిందన్నారు మమ్మల్ని. మేము సంతోషంతో అల్లాగే అన్నాము. కాని, వారింటికి బయలుదేరేముందు అక్కడ అందరూ శ్రోత్రియులు, మాకు పట్టు పంచెలు లేవుకాబట్టి బాగుండదు అని, కాస్త అలస్యంగా వెళ్ళితే మేము మాత్రం వేరే పంక్తిని కూర్చోవచ్చు ననుకుంటూ ఆలసించాము. మీ కోసము దివాన్‌గారు వేచివున్నారు, అని కబురు వచ్చింది. ఇదిగో వస్తున్నాము అన్నాము కాని, వెళ్ళలేదు. ఈసారి ఆయన కుమారుణ్ణి పంపారు. అతను అసలు విషయం తెలుసుకొని తండ్రిగారితో చెప్పగా, ఆయన మరేం ఫరవా లేదు. నేను రమ్మంటున్నాని చెప్పి తీసుకురమ్మని మళ్ళా అబ్బాయిని పంపారు. మేము అక్కడకు జేరేసరికి, ఆయన ఇదివరకు తాను ధరించిన పట్టుతాబితాలు తీసివేసి, సాదా నూలు బట్టలు కట్టుకుంటున్నారు. ఆ బట్టలతోనే మా సరసన కూర్చున్నారు.

తరువాత కొన్నాళ్ళకు, ఆయన ఎస్టేట్ పనిమీద విజయనగరం వచ్చినప్పుడు, తామున్న బసకు రమ్మని మాకు కబురుచేశారు. ఈసారి మళ్ళీ, ఏకాంతసేవనే చదివి వినిపించమని కోరారు, కృష్ణమూర్తిని. మాటల సందర్భంలో వసుచరిత్రలోని ఒక పద్యం గురించి చెబుతూ, మిక్కిలి రసికత్వం కల స్త్రీలు విడెము సేవించేటప్పుడు, పెదవులు మరీ ఎర్రగా పండాలనే ఉద్దేశ్యంతో, ఆకులకు, ముత్యాలు కాల్చిచేసిన సున్నము ఒకపాలు ఎక్కువగా రాచుకుంటారు అన్నారు. నేనూ, అల్లాగే సున్నం ఎక్కువ రాచుకోవడం మొదలు పెట్టాను. కాని గుల్లసున్నం, తరచు నోరుపొక్కుతూ ఉంటుంది! చక్కని సువాసనగల, ఎంతో హాయినిచ్చే తాంబూలము ఎలాఉండాలో సాయంఖ్యాయన శర్మ చూపించారు, మాకు ఆరోజు. పచ్చకర్పూరం, జాజికాయా, జాపత్రీ, ఏలకులూ, లవంగాలూ, చలువ మిరియాలూ ఏవి పాళ్ళలో ఉండాలో చూపించారు. ఇప్పుడూ ఆకుపైన కర్పూరపుపొడి చల్లుతూఉంటే ఆయన నవ్వుమొగం కనిపిస్తుంది. అంతవరకు నేను వ్రాసినకథలు నాచే చదువించుకు విన్నారు ఆయన. "పంతులు బాగా వ్రాస్తాడు. ఆచంటవారింటి బిడ్డ, సామాన్యుడా" అన్నారు, గర్వంతో!

ఒకరోజున కళా వెంకట్రావు వచ్చారు మా హాస్టల్‌కి. అప్పుడే ఆయన మహాత్ముని ఆదేశం ప్రకారం కాలేజీ చదువు మానినట్టు జ్ఞాపకం. జాతీయోద్యమ విషయంలో విద్యార్థుల కర్తవ్యం గురించి చక్కగా ఉపన్యసించారు. నాగపూర్‌లో జరుగనున్న అఖిలభారత విద్యార్థిసభకు కావలసిన విరాళాలు పోగుచేశారు. కాస్త సంశయిస్తున్నవారిని సైతము ఆయన నేర్పైన మాటలతో ఒప్పించడము నాకు బాగా జ్ఞప్తి. ఇప్పుడూ నా కళ్ళ ఎదుట ఆ రూపమే కనబడుతూ ఉంటుంది. అతిఉత్సాహవంతుడైన యువకుడు తన ఆత్మవిశ్వాసాన్ని ఇతరులపై కమ్మివేయడము స్ఫురణకు వస్తుంది.

మా హాస్టల్‌లో ఒక ముస్లిమ్‌అబ్బాయి ఉండేవాడు. అతనిపేరు హఫీజ్ అందాము. కాని, అందరూ అతనిని అబద్ధాలరాయుడు అని పిలిచేవారు.

అభూతకల్పనల పోటీలో అతనికే అగ్రతాంబూల మియ్యాలి. అతని అబద్ధాలకు హద్దూపద్దూలేదు. "మా నాన్నకు నెలకు పదిహేనువందలు జీతము" అనేవాడు—అది ఏడాది జీతము అని తేలేది. "మా పినతండ్రి హైకోర్టుజడ్జి" అనేవాడు—ఆయన బెంచిగుమాస్తా అని తేలేది. ఇల్లాగే, తెల్లవారిలేస్తే, లక్ష అబద్ధాలు. ఎప్పుడైనా పొరబాటున నిజంజారినా, వెంటనే సర్దుకుని, అబద్ధము చెప్పి అదే సత్యమని వాదించేవాడు. నా వద్దకు తరచూ వస్తూఉండేవాడు. ఎంచేతనో, నేను అంటే అతనికి పరమలక్ష్యము. నా ముందు మాత్రము ఎప్పుడూ నిజమే చెప్పేవాడు. ఇదితెలిసి, ప్రతినిమిషమూ అతనిమీద వెయ్యి పితూరీలు వచ్చేవి నా వద్దకు—బాలకృష్ణుని గురించి యశోద వద్దకువచ్చే గోపికల సొదలాగ. ఒకసారి, అతను ఆడిన మరీ విపరీతమైన అబద్ధానికి మండిపోయి నలుగురూ అతనిని కొట్టవచ్చారు కూడా. నేను వెళ్ళి వారింపకపోతే, ఆ కాస్త శాస్తీ జరిగిఉండేది. అతని తండ్రికి విజయనగరం దగ్గరే సముద్రపు ఒడ్డున ఉప్పు డిపోలో మానేజర్ పని. శనివార అదివారాలకు అక్కడకు వెళుతూ ఉండేవాడు. ఒకసారి ఏదో మాటల సందర్భాన హాఫీజ్‌తో నాకు బర్ఫీ చాలా ఇష్టమన్నాను. ఈసారి ఇంటికి వెళ్ళినప్పుడు "రంజాన్ పండుగకు మా ఇంట్లో చేశారు, మా అమ్మ మీకు ఇయ్యమన్నది." అంటూ గులాబీఅత్తరు చల్లిన ఇంత బర్ఫీ నాచేతిలో పెట్టాడు. "నిజమేనా? త్రోవలో ఎక్కడైనా కొన్నావా" అని అడిగాను. అతనికళ్ళు గిర్రున నీళ్ళుతిరిగాయి; "ఎంతమాట! మీ ముందు అబద్ధమాడతానా!" అన్నాడు.

* * * *

నాన్నగారి వద్దనుంచి ఉత్తరం వచ్చింది, ఆప్తమిత్రులూ, ఆయన సహచరులూ, ఐన కొమర్రాజు లక్ష్మణరావు చనిపోయారని వ్రాశారు.

"ఇదివరకే వీరేశలింగముపంతులను కోల్పోయిన మనకు లక్ష్మణరాయ నిర్యాణము మరింత తీరనిలోటు. భాషావిషయంలోనూ చారిత్రక పరిశోధనలోనూ లక్ష్మణరావు చేసిన కృషి అప్రతిమానము. పూర్తిఐన వారి పరిశోధనా విషయాలు ఇంకా ప్రచురించవలసినవి ఎన్నోఉన్నవి. విజ్ఞానసర్వస్వపు పని

చాలా ఉన్నది. ఈ బాధ్యత నిర్వహించడానికి మనవారు పూనుకోవాలి. వారి స్మృతిచిహ్నంగా లక్ష్మణరాయవ్యాసావళి కూరుస్తున్నాము. ఇది త్వరలో ప్రచురిస్తాము" అంటూ వ్రాశారు.

మనము ప్రేమించి గౌరవించినవారు అమర్త్యులు అని మనము అనుకుంటాము. బహుముఖమైన వారి ప్రతిభలో పెరుగుతూ ఉన్న మనము వారు లేని ప్రపంచము ఉండగలదని ఊహింపనైనా ఊహింపలేము. కొమర్రాజు లక్ష్మణరావు అటువంటివారు. ఎంతటి ఆవేశము, ఎంతటి కార్యదీక్ష, ఎంతటి ప్రేమ! నాయందు వారికి అమితమైన పుత్రవాత్సల్యము. అడయార్‌లో ఉంటూఉండి అప్పటి మనవారి రాజకీయ ఆశయాలకు దూరంగాఉన్న నన్ను "ఏమికలలు గంటున్నావు" అని ఆక్షేపించేవారు, నవ్వుతూ. కాని, అపరిమితమైన ఆపేక్ష నేనంటే వారికి. హాస్టల్‌లోఉంటూన్న మాఅక్కచెల్లెళ్ళనూ,నన్నూ శనివార ఆదివారాలకూ, పండుగలకూ, బండి పంపి వారింటికి తీసుకునివెళ్ళేవారు. భార్యాభర్తలు మమ్మల్ని ఎంతో ఆదరించేవారు. తలంటినీళ్ళు పోయించి విందు చేసేవారు. వారి కుమార్తె, కుమారుడూ మాకు బాల్యస్నేహితులు. అచ్చమాంబ ,ముమ్మూర్తుల తండ్రిపోలికే. ఆ వయస్సులోనే తండ్రి ఆవేశము, పట్టుదలా, ఆమెలో కనిపించాయి. అబలాసచ్చరిత్ర రత్నమాల రచించి ఖ్యాతి గాంచిన ఆమె మేనత్త బండారు అచ్చమాంబ ఆమెకు ఆదర్శస్త్రీ. ఆపేరే ఈమెకు పెట్టారు. ఎంతో ఉత్సాహంతో మాట్లాడేది అచ్చమాంబ. అసలు తాపీగా మాట్లాడడం ఆమెకు చేతగాదు. ముంచుకుపోతున్న రాజకీయసమస్యల గురించి ఐనాసరే, బడిలోని ఆటనీ విషయమైనా సరే, ఒకే ఉద్రేకము. ఏకధాటిగా మాట్లాడేది. ఒకఆదివారము వారింటికి వెళ్ళినప్పుడు "మహనీయులు కొండా వెంకటప్పయ్య వచ్చారు మా ఇంటికి, నేను ఆయనకు సాష్టాంగ నమస్కారము చేశాను, ఆయన దీవించారు నన్ను" అని ఎంతో ఉత్సాహంతో చెప్పింది. నేనుంటూన్న వాతావరణనుబట్టి ఆ ఉత్సాహాన్ని నేను పంచుకోలేకపోయాను. కాని, దరిమలాను కొన్నిఏళ్ళ తర్వాత, దేశభక్తుని దర్శించి, కొంతవరకు శుశ్రూషచేసి, వారియెడ నాకు కలిగిన పూజ్యభావము వెల్లడింపగలిగాను.

ఆ నిలువుబొట్టూ, వృద్ధాప్యంలో కూడా అతికాంతివంతమైన వారి కళ్ళూ మరువరానివి.

లక్ష్మణరాయ నిర్యాణము నాలో చాలా కలత కలిగించింది. మనము శాశ్వతములని భావించేవి ఏవీ శాశ్వతములు కావేమోసుమా అనిపించింది. ఎప్పుడేమి జరుగుతుందో చెప్పలేము. 'ఆటగా బ్రతుకు గడిపే సౌఖ్యజీవనం' నావంటి జీవనం, ఉక్కున ఏ నిమిషం సమాప్తి ఐనా కావచ్చును అను కున్నాను. అది భయముకాదు, అతి తీవ్రమైన ఆలోచన, చిత్తావేదన. ఇలా చింతిస్తూన్న నాకు మాననీయురాలైన ఒకవ్యక్తి ఒకప్పుడు చెప్పినమాట జ్ఞప్తికి వచ్చింది. ఆమె చాలా విద్యావంతురాలు, తాతా, తండ్రీ కూడా పండి తులు. తన యెనిమిదవ యేటనుంచీ తండ్రివద్ద సంస్కృతమూ, తెలుగూ అభ్యసించారు. నిజానికి, నాకు తెలుగులో ఎక్కువ అభిరుచి కలగడానికీ, నాకు తోచినది వ్రాయడానికీ కావలసిన ఆత్మవిశ్వాసము కలగడానికి ఆమె ప్రోత్సా హమే కారణం. నాకు వరుసకు, పినతల్లి ఆమె. మావాళ్ళ ఇంట్లో పెళ్ళిలో కలుసుకున్నాను ఆమెను మొదట నేను. ఆమెకుగల భాషాజ్ఞానమూ, విద్యా సంపదా, సంగీతాభిరుచీ చూచి ఆశ్చర్యపోయాను. ఎన్నో విశేషాలు చెప్పారు నాకు, కృష్ణ కర్ణామృతమూ భర్తృహరి సుభాషితమూ గురించి. ఆమె చెప్ప గానే విని నేను ఆ గ్రంథాలను చదువసాగాను. ఒకరోజు మాటల సందర్భంలో ఆమె తనకు కొన్నేళ్ళ క్రితము కలిగిన భర్తృ వియోగం గురించి చెపుతూ, పిడుగువంటి వార్తను ఆమెకు తెలియజేసేముందు మహాజ్ఞాని అయిన ఆమె తండ్రి "యధా కాష్ఠంచ కాష్ఠంచ " అంటూ ఆమెకు బోధింప యత్నించారు అన్నారు ఆమె. ఆ మాట భావమేమి అని నేను అడుగగా, అరణ్యవాసంలో ఉన్న శ్రీరామునికి దశరథ నిర్యాణము గురించి తెలియజేయగా, తమ్ముడు భరతునితో శ్రీరాములు చెప్పినమాట, వాల్మీకి శ్లోకము అంటూ శ్లోకం చదివారు.

యధా కాష్ఠంచ కాష్ఠంచ
సమయేతాం మహోదధౌ
సమేత్యచ వ్యపేయేతాం
తద్వద్భూత సమాగమమ్.

'సముద్రంలో కొట్టుకువస్తూన్న రెండుకట్టెలు తడిసి, ఒకదాని నొకటి అంటుకుపోతాయి. అల్లా కొంతదూరం జంటగా వెళ్ళాక, అలలమోదుకో, విపరీతపు గాలివల్లనో అవి విడిపోతాయి. ఒకటి కొకటి దూరమైపోయి ఇంక మళ్ళాకలుసుకోవు. ఈలోకంలో మన సంయోగ వియోగాలు ఇలాగేఉంటాయి' అన్నారు ఆమె.

ఈ ఉపమానం చిరస్థాయిగా ఉండిపోయింది నా మనస్సులో. మరి కొన్నాళ్ళకి, ఎన్నో ఏళ్ళకి, కథ వ్రాస్తూ ఆ దృశ్యాన్నే వర్ణించాను కూడా. అనేక విషయాలు గురించి మానసికంగా తీవ్రమైన ఆందోళనకు లోనైన సుకుమార్ ఆప్త స్నేహితునితో సహవాసంవల్ల కొంత ఉపశాంతి కలుగుతుందేమో నని మిత్రుడు సంపత్‌ను చూడడానికి వెళతాడు శ్రీరంగం. సంపత్తూ, అతని భార్య మంగళం ఆదర్శ దంపతులు, సుకుమార్ దృష్టిలో. అతను శ్రీరంగం చేరేసరికి సంపత్ పనిమీద పొరుగూరికి వెళ్ళి ఉంటాడు. కాని, ఆమె తనభర్త ప్రాణస్నేహితుని ఉచిత రీతిని ఆదరిస్తుంది. వారిద్దరూ ఊరు చూడడానికి వెళతారు. శ్రీరంగానికి కొంచెము ఎగువని ముక్కొంబు అనేచోట అఖండకావేరీ నది రెండు పాయలై ఒకపాయ కొల్లడంగాను, ఒకపాయ కావేరిగానూ ప్రవహిస్తుంది. అది చాల అందమైన ప్రదేశము. చూడడానికి అందరూ వెళుతూ ఉంటారు. సుకుమార్, మంగళము, నదులు రెండూ పాయలయ్యేచోట గట్టు అంచున నిలబడతారు. ఇక గట్టులేదు. ఎదుట అఖండ కావేరి. కుడివేపు కొల్లడం పాయ; ఎడమవైపు కావేరిపాయ. గలగలమంటూ నీరు ప్రవహించి పోతోంది. చటుక్కున ఆమె, "అటు చూడండి.! అటు చూడండి!!" అంటూ అఖండ కావేరికేసి చూపుతుంది:

రెండు వెదుళ్ళు కొట్టుకు వస్తున్నాయి. పైన యెక్కడో నీటిఒడ్డున ఉన్న వెదురుడొంక గట్టు కోసుకుపోయింది కాబోలు, రెండు వెదుళ్ళూ ఒక దానిని ఒకటి అంటిపెట్టుకొని వస్తున్నాయి అతి వయ్యారంగా.

"జంట వెదుళ్ళు! ఎంత దూరాన్నుంచి వస్తున్నాయో?" అంటాడు సుకుమార్.

"చూడండి ! చూడండి !!" అంటూ, ఆమె మరీ నీటి అంచుకు పరు గెత్తుతుంది. ఆమె వెనకాల, గబగబ వెళ్ళిన అరని కళ్ళకు వింత దృశ్యం కన బడుతుంది.

నదీ ప్రవాహంలో సరిగా తమవైపే వస్తూన్న ఆ జంటవెదుళ్ళు ఇక వదిబారలు కలిసివచ్చి, ఒక్క క్షణం నిదానించినట్టు ఆగి, చటుక్కున విడి పోతాయి.

ఓ గడ కొల్లడంలోకి వెళుతుంది.

ఓ గడ కావేరిలోకి వెళుతుంది.

చూస్తూవుండగా వాటి రెండింటి మధ్య ఒకగోడ, పెద్దగోడ-అంత కంతకూ మైళ్ళ పర్యంతం వెడల్పయ్యే గట్టు.

ఇది సుకుమార్‌కి గొప్ప గుణపాఠంగా తోస్తుంది. ఎంతో మనోబలం ఇస్తుంది. ఆ తరువాత ధైర్యంతో జీవిత సమస్యలను ఎదుర్కోగలుగుతాడు.

* * * *

మైలవరం నాటకం వచ్చింది. ఈ రాత్రి సావిత్రి నాటకం, చూద్దాం రండి అని కూడాఉన్నవారు బలవంతం చేసి తీసుకువెళ్ళారు. నాకు మాత్రం ఏ మాత్రమూ వెళ్ళాలని లేదు. కాని, హాస్టల్‌లో నిత్యమూ ప్రతిధ్వనించే 'పోవుచున్నాడే' అనే రాగమాలికా 'ఈశ్వర సంకల్పము' 'పోయేనయ్యో ఇపుడు నను బాసి' అనే సత్యవంతుని పాటలూ అసలు నటులు పాడుతూఉంటే ఎలా ఉంటుందో చూద్దురుగాని అంటూ ఒప్పించి తీసుకువెళ్ళారు. నాటకం చూచినకొద్దీ, నాకు కొండంత కోపమూ ఎంతో దుఃఖమూ వచ్చాయి.

మన రంగస్థలము ఇంతటి హీనస్థితిలో ఉన్నందుకు దుఃఖము, ఈనటులు ఏమాత్రమూ ఔచిత్యం పాటింపకుండా నటిస్తున్నందుకు కోపము. ఇక పాటలు: గుంయ్‌మనే త్రొక్కుడుహార్మోనియం శ్రుతితో కలియడానికి గొంతు చించుకుంటూ పాడే ఆ పాటలు ఏ మాత్రం అభినయ సంపద ఉన్నా రూపుమాపుతున్నాయి. కథ విషయంలో, అసలు పురాణంలో ఎలా ఉన్నదో గాని, ఇక్కడ మాత్రం, పతివ్రతామతల్లికైన సావిత్రి, తన మహిమవల్ల

గాక, కేవలం ఒక లా పాయింట్ మీద, యముని సాధించడం నాకు ఏమీ సబబుగా తోచలేదు. ఈమె విడువకుండా రాగమాలిక పాడుతూ అతనిని వెన్నాడుతూ ఉంటే, ఎల్లాగైనా వదలించుకోవాలని వరాలిస్తాడు. ఒక్కొక్క వరం కృతజ్ఞతతో అందుకుంటుందిగాని యముని మాత్రం విడువదు. మూడవ వరం తనకు పుత్రులు కావాలని. ఈవిడ వెళ్ళిపోతే చాలని, ముందు వెనకలు ఆలోచించకుండా ఆమె అడిగీ అడగడముతోనే 'సరే, ఇచ్చాను; ఇక వెళ్ళు' అంటాడు. 'ఆగు! యముడా!!' అంటుంది ఆమె. ప్రేక్షకవర్గంలో ఎవరో కేక వేసినట్లు. యముణ్ణి బలేటోపీవేసిందిసావిత్రి! పరమసాధ్వి-భర్తలేనిదే ఆమెకు పుత్రులెలా కలుగుతారూ ? సర్వసాక్షికి ఈ మాత్రం తెలియకపోవడం ఆశ్చర్యమే. ఐనా, ఈ పన్నాగము నాకు నచ్చలేదు.

ఈ నాటకంకంటే ఇంకా, ఆ రోజులలోనే గుడిపాటి వెంకటచలం వ్రాసిన సావిత్రి చాలా బాగుంది. రచన, సంభాషణా గమకము అలా ఉండగా అతను అద్భుతమైన ఊహ చూపించాడు. సావిత్రికి భర్తపైన ఉండే నిశ్చలమైన ప్రేమను పరీక్షిస్తాడు యముడు. నరకం అవీ చూపించికాదు; ఒక ప్రమదావనం సృష్టించి అందు సత్యవంతుడు మరెవరో అందకత్తెతో సరససల్లాపాలు ఆడుతూన్నట్టు సావిత్రికి చూపిస్తాడు. కాని, అంతమాత్రం చేత ఆమె ప్రేమ చలించదు. అవసరమైతే, యముని చంపి ఐనా, తన భర్తప్రాణం సంపాదించాలనే దీక్ష ఉన్న వీరవనితగా చిత్రిస్తారు వెంకటచలం. వెంకటచలం కథ చిరపరిచిత గాథల చాలా దూరమై, కొన్నిచోట్ల చాలా విప్లవాత్మకంగా ఉన్నా ఈ రచనే బాగుంది అనిపించింది నాకు.

"గుడిపాటి వెంకటచలం వ్రాసిన క్రొత్తనాటకం, 'పద్మరాణి' తీసుకు వస్తున్నాను, నీకు చదివి వినిపించడానికి" అని వ్రాసి, ఆ సాయంత్రానికి విశాఖపట్నంనుంచి నా వద్దకు వచ్చాడు, మా బావ వెంకటకృష్ణారావు. స్టేషనులో రైలుదిగి బండి ఎక్కగానే మొదలుపెట్టాడు వెంకటచలాన్ని గురించి చెప్పడం. తెల్లవార్లూ అతని ప్రస్తావనే మా ఇద్దరికీ. పద్మరాణి చాలా ఆధునిక ధోరణిని నడచిన నాటిక. రంగస్థల నిర్దేశంకూడా బర్నాడ్‌షా, ఆస్కార్ వైల్డ్‌ల పద్ధతిని ఉంటుంది. ఇంక పాత్రలు మాట్లాడే భాష జీవకళ ఉట్టిపడుతూ

ఉంటుంది. మనలాగే ఆలోచిస్తూ, మనలాగే బాధపడుతూ, మనలాగే జీవిత సంగ్రామంలో జయాపజయాలు పొందుతూన్న వ్యక్తులను రంగస్థలంపైన చూడకలిగితే నాటకం ఎంతో రాణిస్తుంది, అనుకున్నాను.

పద్మరాణితోబాటు, వెంకటచలం చిత్రాంగి కూడా తెచ్చాడు మా బావ. ఈ నాటకానికీ ధర్మవరంవారి ధర్మమా అని మనకు అలవాటైన విషాద సారంగధర నాటకానికీ అన్నివిధాలా తేడా ఉంది. అసలు వెంకటచలం నాటకం పేరులోనే ఉంది అతని ప్రతిభ! ఈ గాథ నిజంగా సారంగధర గాథకాదు— ఇది చిత్రాంగి విషాదగాథే. ఉత్తమ నాటికకు కావలసిన లక్షణాలన్నీ కనుపించాయి నాకు వెంకటచలం రచనలో. తగిన నటులు తగిన రంగస్థల పరికరాలతో నటిస్తే ఎంతో గొప్పగా ఉంటుంది అనుకున్నాను. తను పోషించిన పాత్రలలో ఎంతో విశ్వజనీనత చూపించగలిగారు. పాశ్చాత్య సాహిత్య సంపదతో మన భాషలో, మన భావాలలో ఎంతటి అగత్యమైన మార్పు తేవచ్చునో నిరూపించారు వెంకటచలం. అందుకే మహనీయులు గిడుగు రామమూర్తి పంతులు ఆయనను అంతగా మెచ్చుకున్నారు.

కొన్నేళ్ళ క్రితం ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో చిత్రాంగి పాత్రను విమర్శిస్తూ తణికెళ్ళ వీరభద్రుడు వ్రాసిన వ్యాసం గురించి చెప్పాను మా బావతో. నిజంగా, చాలా గొప్పగా వ్రాశారు ఆయన. ఆ అభాగ్యురాలి మనోగత భావాలను చాలా చక్కగా చిత్రించారు. సాహిత్య సీమలో పాత్రలుగా వెలసిన వ్యక్తులను గురించిన విమర్శల ప్రస్తావన వచ్చినపుడల్లా వీరభద్రుని విమర్శ ఉదాహరింపక తప్పదు.

ఇక, సంఘ సంస్కర్తగా వెంకటచలం ఆశయాలను గురించి కూడా చాలా సేపు మాట్లాడుకున్నాము, మా బావా నేనూ. గీచిన గీటుదాటి వెళుతూ ఉండడంవల్ల వెంకటచలమూ అతని స్నేహితులూ పడుతూన్న ఇబ్బందులను గురించి చెప్పాడు మా బావ. ఆ సందర్భంలో మా బావ వర్ణించిన వ్యక్తులను ఎవరినీ కూడా నేను ఇదివరలో కలుసుకోకపోయినా, నాకు వారు పరాయివారుగా తోచలేదు. వారి అభిప్రాయా లన్నిటితోనూ నేను ఏకీభవించి ఉండక

పోవచ్చు. కాని, వారి సాహసం నాకు నచ్చింది. సాహసంలో బాధ ఉంటుంది, తప్పకుండా. కాని, సాహసంవల్ల నిజమైన సాధన అలవడితే అది మెచ్చుకోవలసిందే.

ఉదయపు బండిలో మాబావ విశాఖపట్నం వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం నా బల్లపైన ఉన్న పద్మరాణి, చిత్రాంగి పుస్తకాలు చూచి: 'ఓహో వెంకటచలం పుస్తకాలా!' అన్నాడు స్నేహితుడు, రామచంద్రరావు. అరిపిరాల కొంతకాలం బ్రహ్మసమాజికులతో కలసిమెలసి ఉండడమువల్ల వెంకటచలాన్ని గురించి విన్నాడతను. కాని, అతనికి వెంకటచలం దెస అభిమానానికి బదులు వ్యతిరేకమైన భావం కలిగించి. అతను ఏమిటేమిటో చెప్పాడు. రామచంద్రరావు అబద్ధమాడాడు. గడచినరాత్రి మాబావ చెప్పిన సంఘటనలే. ఇంచుమించు అన్నీ అవే ఇతనూ చెప్పాడు. కాని, వానిని గురించిన విమర్శలోనే తేడా కనిపించింది. మన దృక్పథాన్ని బట్టి, మనం జరిగిన విషయాన్ని గురించి అభిప్రాయపడుతూ ఉంటాము. అదీగాక, పూర్తిగా నిష్పక్షపాతమైన దృష్టితో వ్యక్తుల చర్యలను పరిశీలించడము చాలా కష్టము. ఆ సాధన అప్పటికి మాబావ వెంకట కృష్ణారావుకు అలవడి ఉన్నది. పదేళ్ళయ్యాక రామచంద్రరావును మళ్ళా కలుసుకున్నాను. అతను ఏమీ మారలేదు. ఆ తీవ్రవిమర్శ అల్లాగే ఉంది అతనిలో. ఐతే, అతను చాలా సుఖపడుతున్నాడు.

ఇంతకూ జీవితపు దారులలో మనతో కలిసి నడుస్తూన్న వారికంటే వో అడుగు ముందుకు వెయ్యాలని ప్రయత్నిస్తే మాత్రం తతిమ్మావారు ఒప్పుకోరనే అభిప్రాయం మరింత దృఢమైంది నాలో. తెల్లనికాకులు లేవని సామెత. దీనికి కారణమున్నది. తెల్లని కాకిని తతిమ్మా కాకులు బ్రతకనియ్యవు; చంపివేస్తాయి.

క్రొత్తగా పత్రికలేమైనా ఉంటాయేమోనని రీడింగు రూముకి వెళ్ళాను. టౌన్‌హాలులో సంగమేశ్వరశాస్త్రి వీణ వాయిస్తున్నారు. వినాలని కుతూహలంతో కూర్చున్నాను. ఏదోకీర్తన వాయిస్తున్నారు. కాని, నేను గుర్తింపలేకపోయాను. వేగవాహినిలా ఉంది వాద్యము. నాకు అలవాటైన దాక్షిణాత్య పద్ధతికీ ఈ పద్ధ

తికీ చాలా తేడావుంది. వీణకూడా, అడ్డంగా గాక, నిలబెట్టి వాయిస్తున్నారు ఆయన. చాలా సేపు విన్నా. కాని, నాలో రసన చాలదేమో, దాక్షిణాత్య సంప్రదాయ సంగీతంలో నేను అనుభవించిన లాలిత్యం, మాధుర్యం కనబడలేదు నాకు ఇక్కడ. ఐతే, అసాధారణ ప్రతిభ కనిపించింది. తానంలోకి వచ్చేసరికి అద్భుతంగా పలికించారు. తంత్రులు ఏవో వింత ప్రభావం తమ్మావరించినట్లు ఒళ్లు తెలియక తుళ్ళింతలాడాయి ఆయన వేళ్ళక్రింద. ఇటువంటి తాన ప్రదర్శనం వింటూనే కాబోలు, ఒక పర్యాయం గురుదేవుడు రవీంద్రుడు, తన్మయుడై సంగమేశ్వర శాస్త్రిని అనూంతంగా కౌగలించుకున్నారట, పిఠాపురంలో!

*                    *                    *                    *

ఆనాడు శుక్రవారం. లేబరేటరీ నుంచి హాస్టల్‌కు బయలుదేర బోతూండగా, మా డైరెక్టర్ ఏచూరి వెంకట్రామయ్య, "మాష్టార్ ఇంటికి వెళదాం రండి" అని తనతో తీసుకువెళ్ళారు. తోవలో, మాష్టార్ ఎవరని అడుగగా "నాయుడు మేష్టార్; చూపిస్తాగా" అన్నారు నవ్వుతూ. కొన్ని సందులు దాటాక, నిరాడంబరమైన ఒకచిన్న ఇంట్లో, తోటలో వయొలిన్ వాయించుకుంటూన్న నాయుడుగారి ఎదుట నిలబెట్టారు నన్ను. నన్ను వారికి పరిచయం చెయ్యబోయారు గాని, నేను వారించి, వో ప్రక్కన కూర్చున్నా. ఇదివరకే అక్కడకు వచ్చిఉన్న సంగీతప్రియులు, పది పన్నెండుగురు చుట్టూ కూర్చొని వింటున్నారు. వెంకటస్వామి నాయుడుగారు సావేరిరాగం కాబోలు వాయిస్తున్నారు. వాయిస్తున్నారు అనడం సరికాదేమో. మా కళ్ళకు కనబడని ఎవరితోనో ఆయన, వయొలిన్ ద్వారా, ఏదో చెప్పుకుంటున్నారు. ఏదో ఆర్ద్ర హృదయగాథ ఆలాపిస్తున్నారు ఆయన. నా మనస్సులో ఒకటే ఆలోచన. సాధారణదృష్టితో నేను చూడలేని విశేషాలు మానసికంగా, హృదయంతో, వీరు ఏమేమి చూస్తున్నారు, ఎవరితో చెప్పుకుంటున్నారు తమగాథ అనే. నాకు అనుభవాతీతమైన విచిత్రానుభవాలు ఏమేమి అనుభవిస్తున్నారో వీరు, అనుకున్నాను. రాగం ఆలాపిస్తూ ఆయన, అప్పుడప్పుడు, ఒక రాగచ్ఛాయకూ, మరో రాగచ్ఛాయకూ మధ్య ఒకక్షణం, ఒకేఒక క్షణం, ఆగేవారు. ఆ నిశ్శబ్దం ఒక అమోఘమైన విరామము. నిరంతర సముద్రఘోషలో, ఉన్నట్టుండి,

కెరటానికీ, కెరటానికీ మధ్య కలిగే క్షణిక నిశ్శబ్దం వంటిది. ఇది ఒక అతీత మైన ఆత్మానుభూతి. దీనిని సుప్రసిద్ధ జర్మన్ రచయిత, వేదాంతి. రిల్కే ఇలా వర్ణించారు:

I am the rest between two notes;
... in that dark pause trembling,
the notes meet, harmonious;
And the Song continues Sweet.

'రెండు రాగచ్ఛాయల మధ్య ఉండే విశ్రాంతి నేను. ఆ క్షణిక విరామంలో, వణికిపోతూ, కలియవచ్చిన ఆ రెండు రాగచ్ఛాయలూ మేళవించి, ద్విగుణితమైన మాధుర్యంతో గానము సాగిపోతుంది.'

ఆ రోజు నాకు చాలా ఇష్టమైన 'ఓ రంగశాయీ' 'జయ జయ గోకుల పాలా' కూడా విన నోచుకున్నాను నేను. ఎంత వినినా ఇంకా వినాలి, ఎంత అనుభవించినా ఇంకా అనుభవించాలి అని ఉంటుంది ఇటువంటి కళాకృషిని. ఆయన ధన్యజీవి.

## ౧౦

శ్రుతులు సరిజేసి యుష్మదంకితములైన
కృతులు పాడగ వీణ పట్టితిని గాని
కటకటా, ఏమి చెప్పుదు, కంఠమునకె
కాక హస్తమునకును గాద్గద్య మొదవె;
ఎగిరి నీపాదముల చెంత కెట్లో వచ్చి
వ్రాలుదునో యన్న యుత్సుకత్వమ్మె గలదు;
సాధ్య సాధనమైన పక్షముల జంట
హృదయమున కుండి, లేదు శరీరమునకు!

మన మనస్సులోని మాట మనకంటె మధురంగా మరొకరు చెప్తా రంటే మితిమీరిన ముదము కలుగుతుంది. వారు మనకెంతో సన్నిహితు లవు తారు—మన భావాన్నే మనకంటె బాగా పల్లించినందుకు! 1923 లో కృష్ణా పత్రిక సారస్వతానుబంధము 'రసమంజరి' తొలి సంచికలో ఒకమూల కనిపించాయి అందమైన ఈ మాటలు. ఆప్యాయంతో జ్ఞప్తి ఉంచుకున్నానిన్నాళ్ళూ. కాని, వ్రాసిన కవిపేరు తెలియదు. అసలు అచ్చు వేయలేదో, నేను సరిగా చూడ లేదో, మరి. తరువాత, కవి మిత్రులను పలువురను అడిగాను ఈ పద్యాలు ఎవరు వ్రాసినవని. ఎవరూ చెప్పలేకపోయారు. రవీంద్రుని ఛాయ వ్యక్తమవు తోంది అనేవారు గాని, ఫలానా కవి వ్రాశారనిగాని, వ్రాసి ఉండవచ్చుననిగాని చెప్పలేకపోయేవారు.

ఆధునికులలో కొందరి రచన ఇట్టే పోల్చుకోవచ్చు. వంద పంక్తులలో కలిసిపోయి రెండుపంక్తు లున్నాసరే కృష్ణశాస్త్రి మాటలు ఇట్టే ఆనవాలు పట్ట వచ్చు. "నింగి మూలల నీలిపండిళ్ళు పరచి, ఎంత తెలిమల్లె తోట వేయించి నానో!" ఇంకెవరైనా అనగలరా ఇలా? ఇంతకంటె ఎక్కువగా ఊహింప

వచ్చును. ఇంతకంటె ప్రౌఢంగా పలుకవచ్చు, ఇంత లాలిత్యం, ఇంత ఆర్ద్రత ఉండదేమో.

"దాని అక్షయ ప్రేమసేవకీ లతాంతాల ముత్తాలు చాలునోయి" —అత నొక్కడే అనగల డిలా. అలాగే వేదుల పద్యాలు: "ఈ వెడయూర్పు గాడ్పు టలయింపుల గ్రుచ్చిన దండ ఛిన్నమై పూవులు రేకులూడి పడిపోయె, మిగి ల్చితి ప్రేమవాసనా ప్లావితతంతువు" నిద్రలో ఉన్న నన్నులేపి, సగం మెలకు వలో ఉన్న నేను వినేట్టుగా, "ప్రేమవాసనా ప్లావిత తంతువు" అంటే చాలు; చటుక్కున లేచి కూర్చుని, వేదుల అన్నాడు; ఎంత బాగా అన్నాడు—అంటా. వేదుల వ్యూహం, వేదుల శిల్పం ఇట్టే పోల్చుకోవచ్చు.

ఇటీవలనే తెలుసుకున్నాను నేను ఆప్యాయంతో జ్ఞప్తి ఉంచుకొన్న పద్యాలు రచించినది పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వర్లు అని. కాని చిత్రమేమిటంటే, వారి ఇతర పద్యాలతో కొద్దో గొప్పో పరిచయమున్న నాకు ఆ రచనలకీ ఈ పద్యాలకీ ఎంతో తేడా కనుపించింది. ఎప్పుడో ఏదో విశేష మైన అనుభవంవల్ల ఇవి అవతరించి ఉండాలి అనుకున్నా. లేదా, నా ప్రకృ తికి ఈ భావం మరీ సన్నిహితంగా ఉండాలి. హృదయానికి సాధ్యమైనది శరీ రానికి సాధ్యము కాకపోవడము సున్నిత హృదయులకు అనుభవమే. ఆ భావం ఇంత చక్కగా ఇమిడ్చి చెప్పడంలోనే ఉంది కవి విశేషప్రజ్ఞ.

రసమంజరిని నెలకొల్పి సాగించినది పూజ్యులు ముట్నూరి కృష్ణారావు కుమారుడూ నాకు ఆప్తుడూ ఐన నాగభూషణం. రసమంజరి మొదటి ప్రతి తీసుకుని విజయనగరంవచ్చాడు. అతను నన్ను వెతుక్కుంటూ వచ్చాడనవచ్చు. చూచీ చూడడంతోనే అతనిని నా వానిగా భావించాను. అతనికీ నామీద ఎంతో అభిమానం కలిగింది. అందువల్లనే కాబోలు ఒక ఆరేళ్ళ తర్వాత అతనికి ఒంట్లో స్థిమితంగా లేదని తెలిసి చూడడానికి వెళ్ళిన నాతో అతని తల్లిగారు "వెళ్ళి చూడు నాయనా, తరుచు మీమాటే చెపుతూ ఉంటాడు. నువ్వుకూడా ఉంటే మావాడి ఒళ్ళు త్వరలో నయం కావచ్చు" అన్నారు.

నాగభూషణం నడిపిన రసమంజరివల్ల, మన సాహిత్యంలో అప్పుడే మొలకెత్తిన కవితాలత తీగ అల్లుకొని, మొగ్గ తొడుగసాగింది. పువ్వులు

పుయ్యడం చూడకుండానే అతను వెళ్ళిపోయాడు. ఒక్క కవిత్వం విషయం లోనే కాదు. నాట్యంలో, నాటకంలో, సంగీతంలో, కథానికారంగంలో, నవలా రచనలో, విమర్శకళలో-ఆనాడు కలిగిన చైతన్యానికి సుందరమైన రూప మియ్యడమే గాకుండా, రసమంజరి ఆ కృషికి ఎంతో దోహదమిచ్చింది. మన భాషను ఉద్ధరించడానికి ఈ విధంగా కృష్ణాపత్రిక చేసిన సేవ అమోఘము.

* * * *

"మా అన్నయ్య, పెద్దాయన కుర్దారోడ్‌లో రైల్వే ఉద్యోగి. ఆతనిని చూడడానికి వెళుతున్నా, నువ్వూ నాతో రా" అని కృష్ణమూర్తి తనతో తీసుకు వెళ్ళాడు నన్ను. అక్కడనుంచి, పూరీ జగన్నాధ్ వెళ్ళాము. త్రోవలో భువనేశ్వరిలోని శిల్పసంపద చూచి విస్మయంతో నిశ్చేష్టితుల మయ్యాము: ఎలా చెక్కగలిగారో మనుష్య మాత్రులు, రాతిలో అంతటి సుందర విగ్రహాలను! ఎలా నిర్మింపగలిగారో ఆకాశాన్ని అంటుకునే బ్రహ్మాండమైన ఆ గోపురాలను! ఏ కాలపు శిల్పంలో ఆ కాలపు నాగరికత వ్యక్తమవుతుంది అంటారు. అదే నిజమైతే, అప్పటివారు ఎంతో నాగరికులై ఉండాలి. లేదా, ఆ శిల్పులకు ఏదో ప్రత్యేకమైన ఉపాసన ఉండి ఉండాలి.

పూరీలో రైలు దిగగానే మాకు కనపడ్డది అప్పటి సామాన్యుల నిరుపేదరికము. ఇంత దారిద్ర్యము నేను ఇదివరకు ఎక్కడా చూడలేదు. నమ్మడానికి శక్యంకాదు. రెండెడ్లు లాగవలసిన బళ్ళను మనుష్యులే లాగుతున్నారు, బండి నిండా యాత్రీకులను కూర్చోబెట్టి. శల్యావశిష్టులైన వీరిలా బళ్ళు లాగుతూ ఉండడము చూస్తే, నరకపటాలు జ్ఞాపకం వచ్చాయి. ఏదో ఒక రకపు పాపం చేసిన జీవులచేత ఇలాగే బళ్ళు లాగిస్తారు. ఎటొచ్చీ కొరడాలతో మోదే యమభటులు లేరిక్కడ. మన ప్రాంతంలో రిక్షాలున్నా, అవి మనిషి లాగడానికే నిర్మించారు కాబట్టి అంత ఎబ్బెట్టుగా తోచదు. ఇక్కడ ఎద్దుల స్థానంలో మనుష్యులుండటము చూస్తే మాత్రం ఒళ్ళు జలదరిస్తుంది.

ఊళ్ళోకి వెళ్ళాక, జోడు గుర్రాల బళ్ళలో వెళ్ళే శ్రీమంతులు కనిపించారు. అక్కడ మంచి లైబ్రరీ కూడా వుంది. ఒరియా భాషలోనూ, హిందీ,

బెంగాలీ భాషలలోనూ మాసపత్రికలెన్నో ఉన్నాయి. చాలామంది చదువుకుంటు న్నారు స్త్రీ పురుషులు. ఇక్కడే హిందీ 'హంస' పత్రిక చూచాను, చాలా బాగుంది.

పూరీ జగన్నాధ్ ఉత్కళ దేశమైనా కలకత్తాకు చేరువైనందున బెంగాలీ సంపర్కం ఎక్కువగా కనబడింది. సముద్రపొద్దున ఉన్న విశ్రాంతి భవనాలూ హోటళ్ళూ, ఊళ్ళో పెద్ద పెద్ద షాపులూ, అన్నీ బెంగాలీవారివే. స్త్రీలు కూడా ఎక్కువగా బెంగాలి వేషంలోనే వుంటారు. సంపన్నులకూ, సాధారణులకూ మధ్య ఇక్కడ ఉన్నంత తేడా ఇదివరకు నేను ఎక్కడా చూడలేదు. సంప న్నులు, లక్షాధికారులు; సాధారణులు కటిక దరిద్రులు. మన ప్రాంతంలోని మధ్యతరగతి లేనేలేదు ఇక్కడ, అనుకున్నా.

దేవాలయ వాతావరణ, వింత వాతావరణ. మేఘాలను తాకుతూ ఉన్న గోపురాలు, తాడిచెట్టంత స్తంభాలు, మైదానమంత కొలువు కూటాలు, ఏను గులు వెళ్ళడానికే నిర్మించిన ద్వారబంధాలు. ఇంక భక్తుల ఉత్సాహానికి మేర లేదు. దేశ దేశాలనుంచీ వచ్చారు జగన్నాధభక్తులు. వారిలో చాలమంది ఒట్టి అమాయకులు. వీరిని పీడించే పండాలనుచూస్తే అసహ్యమేస్తుంది. ఇటువంటి చోట దేవుడింకా ఎలా ఉన్నాడు అనిపిస్తుంది. అంతటి ధనాశ, మోటుతనం.

పూరీనుంచి తిరిగివస్తూ, అక్కడకు పదిమైళ్ళ ఇవతల ఉన్న సాక్షి గోపాల్‌లో ఆగాము. ఇచ్చట ఉన్న గోపాలస్వామిని చూచి వెళ్ళాలట. మన జగన్నాధ దర్శనానికి ఆయన సాక్ష్యము, అందుచేతనే సాక్షిగోపాల్ అంటారు. మేము రాత్రి పదిగంటలకు రైలుదిగి, ప్లాట్‌ఫారం మీదనే పడుకున్నాము. తెల్లారి లేచేసరికి మా ఒంటినిండా పడక నిండా పొగడ పువ్వులే! స్టేషన్ ఆవరణంతా పొగడచెట్లే. ఒక్క స్టేషనేమిటి? ఊరు ఊరంతా పొగడ తోటల మయమే! ఒకపెద్ద పొగడ తోటలో హిందీపాఠశాల ఉంది. చక్కటి గురుకుల ఆశ్రమంలా కనిపించింది. వేణుగోపాలస్వామి ఆలయం చాలాబాగుంది. ఎంతో ప్రశాంతంగా ఉంది. అక్కడే ఉండిపోవాలనిపించింది.

కృష్ణమూర్తి కుర్దారోడ్‌లో ఆగిపోయాడు. నేను పర్లాకిమిడి వెళ్ళాను స్నేహితుడైన ఉలపల్ భద్ర దొరను చూడడానికి. పర్లాకిమిడికి నౌపడానుంచి

చిన్న రైలులో వెళ్ళాలి. అగ్గిపెట్టెలాంటి బళ్ళు. ఇంజన్ బొమ్మఇంజన్లా ఉంటుంది. రైలు ఎక్కడపడితే అక్కడ ఆగుతుంది. అంటే పెద్ద చెరువే దైనా ఉంటే ఆ చెరువులోంచి బొక్కెనలతో తెచ్చి నీళ్ళు పోస్తారు ఇంజన్‌లో. ప్రక్కనేవున్న అడవినుంచి కట్టెపుల్లలు తెచ్చివేస్తారు బాయిలర్‌లోకి. కొంచెం రాక్షసిబొగ్గు, ఎక్కువ కట్టెపుల్ల వాడుతారు, ఈ లైన్‌లో. ఈ రైలుకు గార్డ్, టికట్ ఇన్‌స్పెక్టర్ ఒకతనే. రైలు ఆగినప్పుడల్లా, ఈగార్డే ప్రతి పెట్టెవద్దకూ వెళ్ళి టికెట్లు తనిఖీ చేస్తాడు. నాతోకలిసి కొంతదూరం ప్రయాణం చేశాడు. అచటి విషయాలు చాలా తెలుసుకున్నాను. అతనితో మాట్లాడి. అతనూ నన్ను గురించి అన్ని వివరాలు కనుక్కున్నాడు. ఎవరింటికి వెళుతున్నారు అని అడిగి, ఫలానా వారింటికి అనేసరికి, 'దొరా ? దొర నా పినతల్లి కొడుకు !' అన్నాడు సంజీవరావు. తరువాత దొరతో ఈ మాట చెపితే, అతను నవ్వి, 'నాకు పిన తల్లి లేదుగాని, సంజీవరావు బలే సరదామనిషి.' అన్నాడు.

పర్లాకిమిడిస్టేషన్ పక్కనే ఉంటుంది, బ్రహ్మాండమైన చెరువు. ఈ చెరువునిండా తామర పువ్వులే; నీరు కనబడనంత దట్టంగా పూశాయి పువ్వులు. మన ప్రాంతం తామర పువ్వులలా గులాబిఎరుపుగాదు. నిగనిగలాడే కెంపువర్ణము. పూవులుకూడా చాలాపెద్దవి. ఈ చెరువును రామసాగర్ అంటారు. ఊరికి ఇంకా కొంచెం అవతల లక్ష్మణ సాగర్ ఉంది. అక్కడ అన్నీ తెల్లతామరులు. ఇదీ—సంజీవరావే చెప్పాడు.

ఉలవభద్ర దొర చాలా సంస్కారి. రవీంద్రు డతనికి అభిమాన కవి. అతనికి పుస్తకాలంటే చాలా ఇష్టం. బ్రహ్మాండమైన లైబ్రరీ సేకరించాడు ఎక్కడెక్కడనుంచో విలువైన పుస్తకాలు తెప్పించి. వైకుంఠరావూ షణ్ముఖ రావూ అతనికి ఆప్తమిత్రులు. ముగ్గురూ కలిసి ఈ పుస్తకాలన్నీ చదివారు. వారివద్ద చాలా పుస్తకాలున్నాయి. వైకుంఠరావు రవీంద్రుని రచనలు కొన్ని టిని తెలుగుచేశారు. వారికి బెంగాలీ బాగా వచ్చును. వీరు ముగ్గురూ కలిసి మాట్లాడుకుంటూ ఉంటె మనలాగ ఈ మాటా ఆ మాటా చెప్పుకోరు. సైకా లజీగురించీ లలితకళల గురించీ సాంఘిక సమస్యల గురించీ వారి ప్రస్తావన. ఎప్పుడూ వ్యక్తి భూషణగాని, వ్యక్తి దూషణగాని ఉండదు. వారి మాటలలో.

ఫ్రాయిడ్, ఇబ్‌సన్, టాల్‌స్టాయ్, టాగూర్, ఇంగర్‌సాల్, షాపెన్‌హోర్, బర్ట్రెండ్ రసెల్‌వంటి పేర్లు తరుచు వినవస్తూ ఉంటాయి.

దొర నన్ను వారికి పరిచయం చేసినప్పుడు వారు ఇటువంటిదే ఏదో విషయం గురించి ఆసక్తితో మాట్లాడుకుంటున్నారు. నేను వారి సంభాషణలో పాల్గొనలేదు. వింటూ, కూర్చున్నా. తర్వాత వైకుంఠరావు నన్ను పలుకరించారు. చిన్నప్పుడు నన్ను మద్రాస్‌లో చింతాద్రిపేటలో మా ఇంట చూచానన్నారు. ఆ సంగతి చెబుతూ మా నాన్నగారి క్షేమం అడిగారు. మరునాడు వారి ముగ్గురితోటీ తిరుగుతూ నాకు తెలిసిన విషయాల గురించి వారితో ప్రస్తావించాను. ప్రసంగ వశాత్తూ "మీకు తెలిసిన ఆధ్యాత్మిక విషయాలను గురించి కొంత ప్రాపగాండా చేస్తూంటారా"అని ప్రశ్నించాను. వారిద్దరూ ఉలిక్కిపడ్డారు. "ప్రాపగాండానా:" అన్నారు ఆశ్చర్యంతో. తరువాత తెలిసింది "ప్రాపగాండా" అంత మంచిమాట కాదని.

మరునాడు ఉదయమే పూజ్యులు గిడుగు రామమూర్తి పంతులును చూడడానికి వెళ్ళాను. వారి కుమారుడు సీతాపతి ఆ వేళ ఊళ్ళో లేరు. సీతాపతి అల్లుడు ఉమామహేశ్వరరావు నాతో హాస్టల్‌లో ఉంటున్నాడు. సెలవలలో అత్తవారింటికి వచ్చిన అతను నన్ను పంతులుగారికి పరిచయం చేశాడు. ఆ సమయంలో ఆయన రాయప్రోలు సుబ్బారావు రచించిన తృణకంకణం చదువుతున్నారు. కాదు—పరిశీలిస్తున్నారు, రాజమహేంద్రం నుంచి వచ్చిన ఎవరితోనో కలిసి. తృణకంకణం వ్రాస్తూన్నప్పుడు, రాయప్రోలువారి ప్రక్కనే కూర్చొనేవాణ్ణి, చిన్న పిల్లవానిగా, నేను మద్రాసులో మా ఇంట. నాకు ఆ పుస్తకం బాగా తెలుసు; ఐతే, ఆ కావ్యంలోని అర్థ్రితే నాకు అవగాహన కాని, భాషా విషయంకాదు. రామమూర్తి పంతులు భాషా విషయం గురించే చెపుతున్నారు. ఇప్పుడు సరిగా జ్ఞాపకం లేదు కాని, మండుటెండలో అడుగులు బొబ్బలెత్తే వేడినేలపైన నడుస్తూ, క్రిందకు జీరాడే చీరకుచ్చెళ్ళను ఆ అమ్మాయి ఒక చేతితో ఎత్తి పట్టుకున్నదనే వర్ణనను గురించి ఏదో చెపుతున్నారాయన. నన్నుచూచి, నాన్నగారిని గురించి ఎంతో ఆప్యాయంతో అడిగారు. మద్రాస్ విశేషాల గురించీ, నా చదువు గురించీ, మా అక్క చెల్లెళ్ళ గురించీ

ఎంతో దయతో ప్రశ్నించారు, నేను నాలుగు మాటలన్నానో లేదో, ఆయన ఆ రాజమండ్రీ ఆయనతో "ఇదుగో, ఇతనిది పశ్చిమగోదావరిజిల్లా మాట, చూశారా!" అన్నారు. నావైపు చూచి, "కాదు: మాది మద్రాస్ అంటావేమో—నర్సాపురం దగ్గరకామా ఆచంట? మీ వాళ్ళంతా అక్కడివాళ్ళే; నాకు తెలుసు" అన్నారు. నన్ను కాళ్ళు కడుక్కోమని వారి పంక్తినే భోంచెయ్యమన్నారు. ఎన్నెన్ని విషయాలు చెప్పారు! ఎంత చక్కగా మాటాడేవారు! వారివద్ద సెలవు పుచ్చుకుంటూ ఉంటే, బల్లమీద ఉన్న శబ్దరత్నాకరం చూచాను. యథాలాపంగా పేజీలు తిరగవేస్తినికదా మాటమాటకూ పెన్సిల్ సవరణే. ఎన్ని తప్పులు పట్టారో నాడు తెనుగువారు ప్రమాణ గ్రంథముగా పాటిస్తున్న ఆ నిఘంటువులో! నా ముఖంలో కనపడ్డ ఆశ్చర్యభావం గమనించి, ఆయన "ఏం? డిక్షనరీలో తప్పులుండవా? చూడు! అన్నీ తప్పులే!!" అంటూ ఒక కొన్ని చదివి, విశద పరచారు. అప్పుడే వచ్చింది, ఎలా వచ్చిందో, చిన్నయసూరి మాట. ఆయన తెచ్చారో, ప్రక్కన ఉన్న రాజమండ్రీ ఆయనే తెచ్చారో ఆ ప్రస్తావన. ఇంతవరకూ ఎంతో సౌమ్యభావంతో ఉన్న పంతులుగారి ముఖాన ఆ పేరు వినేసరికి, కోపపు రేఖలు తోచాయి. "ఆ చిన్నయసూరి చేసిన అపకారమే ఇప్పుడు మనం అనుభవిస్తున్నాము. ఎన్ని ఏళ్ళు పడుతుందో, ఆ తప్పులు దిద్దడానికి" అన్నారు. "చూడండి, ఈ రాయవాచకం ఎంత స్వచ్ఛమైన తెలుగో" అని చిన్నయసూరికి చాలా పూర్వం, అప్పటి వ్యావహారిక భాషలో ఉన్న రాయవాచకం చదివారు. ఎంత చక్కని శైలి! వచనం ఎంత మృదువుగా నడిచింది! తెలుగువాణి అప్పటికింకా ముచ్చి బంగారపు నగలు తొడుక్కోలేదు.

* * * *

నవంబర్ 17, తుపాను. సాయంత్రమే తెలిసింది, రాత్రి తుపాను వస్తుందని. దీపాలు పెట్టకముందే భోంచేసి, వారి వారి గదులలో జేరారు హాస్టల్ పిల్లలందరూ. ఏడు ఏడున్నరకల్లా హోరుగాలి అందుకుంది. నిమిష నిమిషం అతిశయించింది. అంత గాలివిసురు నేను ఎన్నడూ చూడలేదు. రాత్రి పది గంటలకు కాబోలు తలుపు తీసుకుని బయట అడుగుపెట్టానో లేదో నా కాళ్ళ

అమాంతంగా తేలిపోయాయి, పాదాలు భూమిపై మోపలేనంత ఝుంఝూ మారుతము. చప్పున లోపలికిపోయాను. ఆ రాత్రి మాకెవరికీ నిద్దర్లు లేవు. కాని, అదీ ఒక సరదాగానే ఉంది. కుంభవృష్టిగా వర్షం కురుస్తోంది. కృష్ణ మూర్తి, గుప్త, కామేశ్వరరావు నా గదిలో ఉండిపోయి పద్యాలు పాడు తున్నారు. నాటకంలో పద్యాలూ భావగీతాలూ మనుచరిత్ర పీఠికలోని ఉత్పల మాలికా చాటు పద్యాలూ ఇష్టమొచ్చినట్టు విసిరారు.

అర్ధరాత్రివేళ, ఫెళ ఫెళమంటూ పెద్దధ్వని వినిపించింది. ఊరికీ రైల్వే స్టేషన్‌కీ మధ్య ఉన్న పెద్దచెరువు గండి పడిందన్నారు. గట్టు తెగ్గించుకు ప్రవ హించే నీరు సముద్రఘోషలా వినపడ్డది. వెళ్ళి చూద్దామన్నాను. "నీకేం మతిపోయిందా! తెల్లవారనీ వెళదాం" అన్నారు. తెల్లవారేసరికల్లా గాలి, పూర్తిగా సద్దుకుంది. వర్షమూ ఆగిపోయింది. ఆకాశం అతి నిర్మలంగా ఉంది. అందరం ఒక జట్టుగా వెళ్ళి చూచాము. ఆ భీభత్సం అతి భయంకరంగా తోచింది. కోట గోడలాఉండే చెరువుగట్టు రెండు ఫర్లాంగుల మేరకు కోసుకు పోయింది: రాతికూర్పు ఎంతో దూరం కొట్టుకుపోయింది, అవతలకు జరపిన ఇంటి గోడలాగ. అగాధమైన ఆ గండిలోంచి చెరువులోని నీరు నీరంతా పండిన పొలాలపై విరుచుకుబడింది. కనుచూపుమేర, బంగారపు పంటపండిన వరిచేలన్నీ నాశనమైనాయి. కొన్ని వందల ఎకరాల పంటపైన నిలువెత్తున ఇసుకమేట వేసింది వరదనీరు.

హాస్టల్‌కి తిరిగి వచ్చేసరికి ఉప్పెన వచ్చి విశాఖపట్టణం కొట్టుకు పోయింది అన్నారు. వెంటనే మా బావ వెంకటకృష్ణారావు జ్ఞాపకమొచ్చాడు. "ఊరంతా పోలేదు. ఒక్క వెలమపేట మాత్రం మునిగిపోయింది. మహారాణి పేటకేం రాలేదు" అన్నారు మరొకరు. "ఏమైతేనేం తక్షణం వెళ్ళి చూడాలి. వరదబాధితులకు మనం చేయకలిగిన సహాయం చెయ్యాలి" అన్నాను. కృష్ణ మూర్తి, సంపత్, ఇంకా పదిమందీ నాతోకూడా వస్తామన్నారు. కాని, రైళ్ళు లేవు; బస్సులు నడవడంలేదు. ఎలా అక్కడకు జేరడం? "వెళ్ళకలిగినంత దూరం బండిలో వెళదాం. ఆ పైన నడుద్దాం"అన్నారు. ఈమాటలు వింటూన్న పాలమనిషి అప్పలనరసయ్య "నావద్ద రెండెడ్లబండి ఉంది; గిత్తలు బాగా

నడుస్తాయి, నాకూ మీతో రావాలనిఉంది. నేనూ బండీవున్నా"మన్నాడు. కాని, ఏదో ఆటంకం వచ్చి, దీపాలు పెట్టేవాకా ప్రయాణం సాగలేదు. ఈపాటికి మొదటి ఆవేశం తగ్గి ఒక్కొక్కరే చల్లగా జారారు. కృష్ణమూర్తి, సంపత్, మీనన్, బక్షీ నారాయణ మాత్రం మిగిలారు. మేం ఐనుగురం అప్పలనర్సయ్య బండిలో బయలుదేరాము. గిత్తలు మంచివే. కాని, ప్రయాణం చురుకుగా సాగ లేదు. అడుగడుగునా, రోడ్డుకి అడ్డంగాపడ్డ చెట్లే. ఎంతో కష్టంమీద పది మైళ్ళు దాటి కోరుకొండ శివారుకు జేరాము. రాత్రి పదయింది. కోరుకొండ సమీపించామో లేదో, రోడ్డు కడ్డంగా పెద్ద కందకం; ఏభై గజాలు రోడ్డు లేదు. 'ఇంకేం బండిప్రయాణమ'ని బండిదిగి, అడ్డదారిని రైలు కట్టకేసి నడిచాము, ఈ ప్రక్క ఆ ప్రక్క నిలువెత్తు గడ్డిలోపడి. దూరాన ఉన్న రైల్వే సిగ్నల్ ఎఱ్ఱదీపం మాకు "త్రోవచూపించు విద్యుద్దీప కళిక"లా ఉంది. ఎలాగో స్టేషన్ జేరాము. స్టేషన్‌మాస్టర్ కృష్ణమూర్తి అన్నగార్కి పరి చయం. "ఈ రాత్రి ఏం వెళుతారు? తెల్లవారుఝామున లేపుతాను. ఆ బల్ల మీద పడుకోండి!" అన్నాడు. "కాదూ కూడదు వెంటనే బయలుదేరాలి. నడచినంతదూరం రైలుపట్టాల ప్రక్కనే నడుస్తాము" అన్నాను నేను. "రైలు పట్టాలపైన రాత్రివేళల త్రాచుపాములు సాగి పడుకుంటాయి. మీకు తెలియ దేమో" అన్నాడాయన. "నిజమే, ప్రమాదం!" అన్నాడు మీనన్. "మరేం ఫరవాలేదు, వెళదాం పదండి; చప్పుడు చేసుకుంటూ వెళదాం. అవి పారి పోతాయి" అన్నాను. స్టేషన్ మాష్టరు "టెలిఫోన్లు, టెలిగ్రామ్ తీగలూ తెగి పోయాయి. పద్మనాభం అవతల పెద్ద వంతెన ఉన్నదో పోయిందో భోగట్టా లేదు. తీరా, అంత దూరమూ వెళ్ళి అక్కడే ఆగిపోవాలి. ఈ అంధకారంలో ఎందుకు వెళ్ళుతారు, నా మాటవిని ఇక్కడే పడుకోండి" అన్నాడు. అందరికీ ఆ మాటే నచ్చింది. నాకు మాత్రం ముందుకు వెళ్ళాలి అనే ఆత్రుతే. కాని, అది ఫలించలేదు. తెల్లవారుఝామున నడక ప్రారంభించాము. సరదాగానే ఉంది. భక్షీ నారాయణరావు బలే కులాసా మనిషి; ఏవో కబుర్లుచెప్పి, పాటలూ పద్యాలూ చదివి, మార్గాయాసం తగ్గించాడు. పదిగంటలయేసరికి పెందుర్తి స్టేషన్ చేరాము. చాలా బడలికగా ఉన్నాము. అక్కడ కాఫీ దొరకదు సరిగదా

వచ్చి పాలు కూడా దొరకవు. పెట్టెదుకాణంలో ఉన్న వేరుసెనగపప్పు కొను క్కొని, ఇంత బెల్లంకలిపి అదే ఆహారంగా తిని, కాసిని మంచినీళ్ళు త్రాగాము. "గాంధీగారికి ఇదే ఆహారం.మంచిపుష్టి నిస్తుంది!" అన్నాడు మీనన్. "తగని పైత్యం!" అన్నాడు సంపత్. మేము మాట్లాడుతూ ఉండగా లైన్ క్లియర్ గంట మ్రోగింది. అదేమిటో కనుక్కుందామని వెళ్ళిన కృష్ణ మూర్తి స్టేషన్ మాస్టర్‌ని మా వద్దకు తీసుకువచ్చాడు. ఆయనా, కృష్ణమూర్తి అన్నగారిని ఎరుగును. "విజయనగరంనుంచి రిలీఫ్ ట్రెయిన్ వస్తోంది. ఇంకో గంటలో రావాలి. ఇప్పుడు మీరు నడచివెళ్ళడమేమిటి; రైలు వచ్చే దాకా ఆగండి" అన్నాడు. కాని, ఇదుగో రైలు అదుగో రైలు అన్న రైలు మూడుగంటలకుగాని రాలేదు. ఆ రైలెక్కి, ప్రాకుకుంటూ వెళ్ళి సాయంత్రా నికి జేరాము వాల్తేర్. ఉప్పెనకు కొట్టుకుపోయిందనుకున్న స్టేషన్ అలాగే ఉంది కాని, తుపానువల్ల స్టేషన్ బిల్డింగ్‌లపై ఒక్కరేకు లేదు; ఒక్క పెంకుముక్క లేదు. స్టేషన్ ఆవరణ అంతా చిందరవందరై ఉంది. ఉప్పు ఏరు పొంగినప్పుడు ప్లాట్‌ఫారం పైన ఓ అడుగెత్తున నీరు నిలిచిందట. ఊరే మైంది అంటే, "మరేం ఫరవాలేదు. వెలమపేటలో మాత్రం కొన్ని ఇళ్ళు పోయాయి. జననష్ట మేమీలేదు" అన్నారు. తుపాను బాధితుల సహాయార్థం వచ్చిన యోధులులా గాక, బంధువులను చూడడానికి వచ్చిన బడి పిల్లల్లా ఊళ్ళో ప్రవేశించాము. మా బావ హాస్టల్ మహారాణిపేట కొండపైన. మమ్మల్ని ఐదుగురినీ చూచి "ఇదేమిటి! ఇలా వచ్చార"న్నాడు, ఆశ్చర్యపడుతూ.

"ఉప్పెనకు మీ ఊరు కొట్టుకుపోయిందని విన్నాము. ఉన్నవారిని రక్షించడానికి వలంటీర్లను తీసుకొచ్చాడు మీ బావ" అన్నాడు బక్షీ నారాయణ రావు, నవ్వుతూ.

## ౧౧

మాణిక్య వీణా ముపలాల యంతీం
మదాలసాం మంజుల వాగ్విలాసాం,
మాహేంద్ర నీలద్యుతి కోమలాంగీం
మాతంగ కన్యాం మనసా స్మరామి॥

చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమ రాగశోణే,
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేక మాతః॥

మధుర మీనాక్షి దేవాలయంలో పంచ పంచ ఉషః కాలాన భక్తుడు దేవిని స్తుతిస్తున్నాడు. మా చెల్లెలిని చూడాలని మధుర వచ్చిన నేను ఈ ఉద యార్చనను గురించి విని తెల్లవారుఝామున లేచి స్నానంచేసి వచ్చాను, ఆల యంలోకి. దేవికి ఇరుప్రక్కల ఉన్న నిలువెత్తు దీపపు పెమ్మాల నుంచి వెలుగుతూన్న ఒత్తులు దివ్యకాంతిని వెదజల్లుతున్నాయి. కర్పూరహారతీ సాంబ్రాణీ ధూపమూ ఒక వింతవాతావరణను కల్పిస్తున్నాయి. వేకువనే, ఎంతో రమణీయంగాఉంది, ఈ అర్చన.

మాతా మరకత శ్యామా మాతంగీ మధుశాలినీ,
కుర్యాత్కటాక్షం కల్యాణీ కదంబవన వాసినీ
జయ మాతంగ తనయే జయ నీలోత్పల ద్యుతే
జయ సంగీతరసికే జయ లీలాశుకప్రియే॥

నేను వింటున్న కాళిదాస కవి వర్ణనలవల్ల ఆ ప్రతిమలో దివ్యత్వం అతిశయించిందో ఆ దివ్యమంగళ విగ్రహమే కాళిదాసుని మాటలలో నవ

జీవనం పోసిందో చెప్పలేను. కళ్ళు రెండూ అప్పగించి ఆ రూపము వైపే చూస్తున్నాను. విగ్రహారాధన అంటే మానసికంగా అంత ఉత్సాహంలేని నా హృదయంలో కూడ ఈ రమణీయత పెల్లుబికి ఏదో పట్టరాని ఆవేశం కలుగజేస్తోంది. చూడగా చూడగా, దేవి పలుకరించినట్లు తోస్తుంది. ఆ కన్నులలో ఎంతటి జీవకళ ఉంచకలిగాడో శిల్పి! నాలో ఎక్కడో దాగి ఉన్న భక్తి భావం అనిర్వచనీయమైన ఆనందాతిశయంగా మారిపోయింది.

ఇంత అద్భుతంగానూ, ఇంత మహదానందకరంగానూ ఉంటుంది రామేశ్వరములోని సంధ్యార్చన. అదీ ఒక అపూర్వమైన అనుభవమే. అప్పుడే సూర్యాస్తమయమయింది. కొద్ది కొద్దిగా చీకట్లు వ్యాపిస్తున్నాయి, ఆకాశాన్ని ఆవరించి ఉన్న అరుణరేఖలు ఒక్కొక్కటిగా కరిగి నీలిమలో కలిసి పోతున్నాయి: ఆ కనుచీకటిలో, ఉన్నట్టుండి శివార్చన గంటలు మ్రోగి, స్వామి ముందట వెలిగిన లక్ష వత్తులు ధగధగ లాడుతూ మనలను మరేదో స్వప్న లోకములోనికి తీసుకొనిపోతాయి. అర్చకుడు సాధారణమానవుడైనా, దీపపు వెలుగులో అతని ముఖములో ఏదో వింతకాంతి కనిపిస్తుంది. ఒకప్పుడు అనుకుంటూ ఉంటాను, చర్విత చర్వణంగా ఒక విధిగా అర్చన చేస్తున్న వీరు, భక్తులుగా మనము అనుభవిస్తున్న ఆనందం అనుభవింపగలరా అని. అలాగే, జీవనాధారంగా, గులాబీ పువ్వులను దండలు గ్రుచ్చి అమ్మేవారికి ఆ పువ్వుల లోని వింతపరిమళమూ రమణీయతా తెలుస్తుందా అనీ దినవెచ్చానికై దంతపు నగిషీ పని చేస్తున్నవారు తాము సృష్టిస్తూన్న ప్రతిమలలోని అద్భుత కళా స్వరూపమూ అప్రతిమాన సౌందార్యమూ గురించి ఆనందింపగలరా అనీ అనుకుంటాను. మళ్ళా, నాకింత అహంభావ మేమిటి అనుకుంటాను.

ఆ ప్రయాణంలో ధనుష్కోటికి కూడ వెళ్ళాను. ఉదయాన్నే రైలుదిగి మళ్ళీ ఓ గంటలో బయలుదేరే ఆ రైలులోనే తిరిగి రావలసి ఉంది. స్టేషన్నుంచి తీర్థ ప్రదేశానికి మూడుమైళ్ళు పరుగెత్తుకుంటూ వెళ్ళాను. నేలబారునే రంయ్యమంటూ వీస్తున్న విపరీతపు గాలికి ఇసుక రేణువులు పైకిలేచి, సూదులు లాగ గుచ్చుకుంటున్నాయి పాదాలపైన. అలాగే పరుగెత్తుకుంటూ వెళ్ళాను.

రెండు సముద్రాలు కలుస్తాయి ఇక్కడ. కుడివైపు పెద్ద పెద్ద కెరటాలతో రత్నహారి అల్లకల్లోలంగా ఉంటుంది. ఎడమవైపు అన్ని కెరటాలు లేవు. చెరువులా ఉంటుంది మహోదధి. ఈ రెండు సముద్రాలకు హద్దుగా ఉంటుంది పదిబారల చెలియలికట్ట. ఈ సన్ననిగటు రెండు మహాసముద్రాలను యుగ యుగాలుగా అదుపులో ఉంచటం ఆశ్చర్యంగానే ఉంటుంది.

ఇక్కడ బక్కచిక్కిన కర్రిఆవు ఉంటుంది. ప్రక్కనే ఎక్కడో ఒక పాకలో కట్టిఉంచి ఉదయమే తోలుకువచ్చి మళ్ళా సాయంత్రమయేసరికి తోలుకుపోతారనుకుంటాను. రూపాయో రెండో ఇచ్చి ఆ ఆవును కొనుక్కుంటారు ఒకరి తర్వాత ఒకరు, యాత్రికులు. మళ్ళా పావలాకానో, అర్ధ రూపాయో చేతిలో పెట్టి ఆ ప్రక్కనే ఉన్న పేదబ్రాహ్మడికి దానం చేస్తారు ఆ ఆవును. గోదానఫలం ఎంత టూకీగా దక్కుతుందో అనుకున్నాను. ముందు ముందు వైతరణీ నదిని దాటటానికి తెప్పగా ఉపకరిస్తుంది ఈ గోవే అని విమర్శగా చెప్పాడు నాతో ఆ బ్రాహ్మడు.

శ్రీరంగంకూడా వెళ్ళాను, ఆ ప్రయాణంలో. ఆనాడు వైకుంఠ ఏకాదశి. ఇసుకవేస్తే రాలని ఆ జనసమూహంలో స్వామి దర్శనం సరిగా కాలేదు. కాని, కావేరీ స్నానం చాల హాయి కలిగించినదని జ్ఞాపకం. ఇక్కడ ప్రకృతి రామణీయకం ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. రాజమహేంద్రవరం వద్ద గోదావరిలో స్నానం చేశాను. కాని, అక్కడ నదీతీరం అంత అందంగా ఉండదు. ఇక్కడ కావేరి ఎంతో సుందర ప్రదేశంలోంచి ప్రవహిస్తుంది. గట్టుకు ఆనుకునిఉన్న పెద్ద పొగడచెట్లనుంచి పువ్వులు రాలుతూ ఉంటాయి నీళ్ళలోకి. పూచిన అల్లనేరేడుచెట్లు, గట్టు పొడగునా, మధ్య మధ్య వెదురు పొదలు, మొగలి డొంకలు. రకరకాల పక్షులు ! దేవాలయంకంటే నదీతీరమే బాగున్నదనుకున్నాను.

మధ్యాహ్నపువేళ కాసేపు విశ్రమించి, నాలుగు ప్రాకారాల మధ్య ఉన్నఊరు చూడటానికి వెళ్ళాను. మా బావ సంస్కృతం బాగా చదువుకున్నారు. అది ఆయన అభిమానభాషకూడాను. సంస్కృత గ్రంథ ప్రచురణకు ప్రఖ్యాతి పొందిన వాణీవిలాస్ ప్రచురణాలయంలోకి తీసుకు వెళ్ళారు నన్ను. విలువైన ఎన్నో సంస్కృత గ్రంథాలను ఎంతో అందంగా

అచ్చువేసి ప్రచురించేవారు ఇక్కడ వాణీవిలాస్ సంస్థవారు. కాళిదాసుని ఋతుసంహార పుస్తకం చూచాను, చక్కని ప్రచురణ, ముద్దులొలుకుతూ ఉంది. చిన్న పుస్తకం. నాకు దేవనాగరి లిపి అక్షరాలు బాగా తెలియకపోయినా, ఆ పుస్తకం కొనుక్కున్నా. మద్రాసువచ్చి మాన్యులైన మల్లంపల్లి సోమశేఖరశర్మ చేతిలో ఉంచాను ఆపుస్తకాన్ని. అప్పుడెప్పుడో నా సహపాఠి అయిన ఒక అందకత్తె దోసిలిలో ఇన్ని గులాబీ పువ్వులూ, ఇన్ని తీగెసంపెంగ పూవులూ ఉంచినపుడు ఆమె యెంత మురిసిపోయిందో అంతటి విభ్రమము, అంతటి ఆనందం చూపారు, అన్నగారు. "ఎంత రమ్యంగా వుంది, ఎంత గొప్ప గ్రంథం ఇది!" అన్నారాయన. ఆ కావ్యం గురించి వివరాలు వారి నడిగి తెలుసుకొన్నాను, ఆ తర్వాత.

*   *   *   *

కాకినాడ కాంగ్రెస్. నేల ఈనినట్టు జనమంతా ఎక్కడినుంచివచ్చారో! రవీంద్రుడు చెప్పిన పంజాబు,గుజరాత,మరాఠా, ద్రావిడ. ఉత్కళ,వంగా దేశ ప్రజలందరూ గుమి గూడారు ఇక్కడ. మా తల్లిగారి ఊరినుంచి వచ్చిన పంతం సుబ్బన్న, మా ఊరినుంచి వచ్చిన మడికే సుదర్శనం, మా మేనత్త గారి ఊరినుంచి వచ్చిన రుద్రరాజు నారాయణరాజుగారు కనబడ్డారు ఆ జన సమూహంలో. నాన్నగారితో అన్నానుకూడా ఆ మాట , "వీరందరూ వచ్చారే" అని. "వీరి కోసమే కాంగ్రెస్, నీకోసమూ, నాకోసమే అనుకున్నావేమో!" అన్నారాయన. మరునాడు కాంగ్రెస్ అనగా, కాంగ్రెస్‌శిబిరం, ఆవరణ అంతా చుట్టి వచ్చాము నాన్నగారూ నేనూ. కేసరీ రంగు యూనిఫారంలో ఉన్న దేశ సేవికలను తరిఫీదు చేస్తున్నారు ఉన్నవ లక్ష్మీబాయమ్మ. వారిలో నా చిన్ననాటి చెలికత్తె, చెల్లెలు, అచ్చమాంబ కూడ కనబడింది. ఆ అమ్మాయి ముఖం యింతైంది నాన్నగారినీ, నన్నూ చూచి. ఆ సంతోషం, ఆ గర్వం చూచి ఆనందించడానికి ఆమె తండ్రి లక్ష్మణరాయలు లేకపోయారే అనుకున్నాను మనస్సులో. మరునాడు మహాసమావేశంలో వాలంటీర్‌గా ఎక్కడచూచినా అచ్చమాంబే! ఎంతమందికి మంచినీళ్ళు ఇచ్చిందో! గ్లాసుకో నిమిషం పుణ్యం

వస్తుందని అంచనావేసినా, జన్మ జన్మాలకూ ఉపకరించే పుణ్యఫలం సంపాదించుకొంది ఆమె ఆ నాలుగురోజులూ.

గదాధరుడైన భీమునిలాగ చేతిలో బెత్తం పుచ్చుకుని ఆజానుబహుడు కోడేటి రాజు ముందు నడువగా, మహమ్మదాలీ, షౌకతాలీ సోదరులు మావేపే వస్తున్నారు. వారి వెనుక నల్లని బురఖాలలో వారి స్త్రీ జనం. చటుక్కున చూస్తే, ఆలీ సోదరులు కవల పిల్లల్లా ఉంటారు. కాని, కాస్త నిదానించి పరిశీలిస్తే, ఇద్దరి ముఖాలలోను ఎంతో తేడా ఉన్నట్టు తెలుస్తుంది. తెల్ల గులాబీ పుష్పానికీ ఎర్రగులాబీ పుష్పానికీ మధ్యఉన్న తేడా కనబడుతుంది వారిలో. మహమ్మదాలీలో ఎంతో సౌమ్యత, అతని సోదరుని ముఖంలో ఎంతో తీక్షణత.

విష్ణుదిగంబర వందేమాతర జాతీయ గీతంతో సభా కార్యక్రమం ప్రారంభమైంది. ఆయన గానము ప్రారంభించేసరికి మహమ్మదాలీ చప్పున లేచి నుంచున్నారు. అది చూచిన లక్ష జనమూ ఒక్కసారిగా లేచేసరికి ఒక బ్రహ్మాండమైన కెరటము ఉవ్వెత్తుగా లేచినట్టనిపించింది.

మూడుగంటలు ఏకధోరణిని మాట్లాడారు మహమ్మదాలి. కొంతవరకు అతను వ్రాసిన ప్రసంగం చదివారు. కాని, వ్రాతప్రతి చదవడము ఆయన ఆవేశాన్ని అరికట్టుతోంది. కాస్సేపయాక చేతిలో పుస్తకాన్ని కిందపెట్టి, "అచ్చు అయిన నా ప్రసంగం చదువుకోవచ్చు మీరు. నేను చెప్పవలసినది ఇంకా ఉన్నది" అని మాట్లాడడము మొదలుపెట్టారు. అంతా గాంధీని గురించే. చివరకు అన్నారు ఆయన:

"ఎరవాడ జైలు తెరిచే తాళముచెవి మీ చేతిలోనే ఉన్నది, మీరు గట్టిగా తలుచుకొంటే, ఈ నిమిషం తెరువగలరు, ఆ జైలు తలుపులు మీరే. ఆమహనీయుడు కారాగారంలో తపిస్తూ వుండగా, ఉదాసీనతతో ఎలా వుండగలరు మీరు? అన్నం సహిస్తుందా మీకు?" అన్నారు. ఇక మాట్లాడలేకపోయారు. కళ్ళనీళ్ళ తిరిగాయి. నమస్కరించి కూర్చున్నారు. అరనిమిషము గాఢ నిశ్శబ్దం. ఉత్తరక్షణం, అనేక సహస్ర కంఠారవంలో జయజయ ధ్వానాలు మిన్ను ముట్టినవి.

మాబావ కృష్ణారావూ నేనూ కలిసి అన్ని సభలూ చూచేవారము; అన్ని ప్రదర్శనాలూ చూచేవారము. ఖాది ప్రదర్శనమువద్ద ఏమి జనము! ఏమి జనము! ప్రపంచంలో ఇంక మనుష్యులే లేరా, అంతా ఇక్కడికే వచ్చారా అనిపించింది. కాని, ఇంతటి ప్రజాసమూహం కెరటంలా గేటుమీద విరుచుకు పడకుండా స్త్రీలకు, పాపలకు ఏమాత్రం ఆపదా కలుగకుండా అందరూ ఒకరితరువాత ఒకరే లోపల ప్రవేశించేట్టు ఎంతో నేర్పుతో ఎంతో ధీమాతో ఎంతో ఓపికతో ఒక యువకుడు వారిని నడుపుతున్నాడు. నయానా భయానా, బ్రతిమాలీ బెదిరించీ, వారందరినీ ఒక త్రాటిపై నడుపుతూన్న అతనివేపే కళ్ళు అప్పగించి చూస్తూ ప్రదర్శనం లోపలికి వెళ్ళటం మరిచిపోయిన నాతో మాబావ అన్నాడు: "అతనే మొసలికంటి తిరుమలరావు, గొప్ప కార్యసాధకుడు" అని, నా కన్నులలోని ఆశ్చర్యం, ప్రశంసలను కనిపెట్టి.

నాన్నగారి మకాంవద్ద నిలిచి నేను వారితో మాట్లాడుతూ ఉండగా, బెంగాలీ పద్ధతిని పైముసుగుగా వేసుకొని, ఎర్రంచు తెల్ల ఖద్దరు చీరతో, భుజాలపై కాశ్మీరపు పట్టురుమాలున్న ఒక అమ్మాయి నాన్నగారిని చూడడానికి వచ్చారు. ముఖాన చిన్న కుంకుమబొట్టు, బంగారపు ఫ్రేము సులోచనాలవెనుక చెదిరిపోతున్న లేడికళ్ళు; నాన్నగార్కి వంగి నమస్కరించారు. ఆమె ప్రక్కనే తల్లి, తండ్రి, వారి స్నేహితులు దండు నారాయణ రాజుగారుకూడా ఉన్నారు. నారాయణరాజుగారు ఆమెను నాన్నగారికి పరిచయం చేశారు: "ఈవిడే మాగంటి అన్నపూర్ణాదేవి, మీవద్దకు వైద్యనిమిత్తం తీసుకువచ్చాను" అన్నారు. నాన్నగారు ఆమెను కూర్చోమని, విషయమంతా విశదంగా కనుక్కొని, చేయి చూచి తగిన సలహా ఇచ్చారు. ఆమెను గురించి తరుచూ వింటూఉండేవాడిని ఆ రోజులలో. పిన్నవయస్సులోనే రచయితగా, ప్రజాసేవకురాలుగా ప్రఖ్యాతి గాంచినది మాగంటి అన్నపూర్ణాదేవి.

మునగాల రాజాగారిని చూచివద్దాము రమ్మని వారి మకాముకు నన్ను కూడా తీసుకు వెళ్ళారు నాన్నగారు. రాజాగారికి నేనంటే చాలా ప్రేమ. మద్రాస్‌లో ఉన్నప్పుడు, ఏ పండుగ వచ్చినా, వారి ఇంటిలో ఏ శుభ కార్యము జరిగినా రాణీగారూ, ఆయనా మా అక్కచెల్లెళ్ళనూ నన్నూ ఆహ్వా

నించి ఎంతో ఆదరించేవారు. విందుచేసి మా మెళ్ళో పూలదండలు వేసేవారు రాణీగారు. అంత ప్రేమ వారికి మాపైన! నాన్నగారికి కుడిభుజం వంటి వారు రాజాగారు. ఏ పని తలపెట్టినా, ఎంతటి కష్టకార్యమైనా "కానీయండి. కూడానే వున్నాను, నేను" అంటారు ఇప్పటికీ రాజావారు. విజ్ఞానచంద్రిక, విజ్ఞాన సర్వస్వము, తెలుగు సాహిత్య పరిషత్తు, ఒకటేమిటి? ఎన్నో, ఎన్నో ఉద్యమాలు రాజావారి ఔదార్యంవల్లనే నెంకొల్పగలిగారు నాన్నగారు. వారిద్దరి స్నేహానికీ కీలకం అన్యోన్యానురాగం కంటే ఎక్కువైంది ఇద్దరూ సరి సమానంగా పంచుకొంటూ ఉన్న దేశసేవానురక్తి.

నాన్నగారు వారితో మాట్లాడుతూండగా ఎవరో ఒకాయన కాళ్లకూరి నారాయణకవిని తీసుకు వచ్చారు వారి వద్దకు. "వీరే, చింతామణి నాటకకర్త" అని పరిచయం చేశారు. రాజాగారు తమ సహజసౌమ్యంతో "అల్లాగా" అని ఊరుకున్నారు. "అత్తగారిచ్చిన అంటుమామిడితోట" వంటి పద్యాల్తో ఒకతరం తరం వారిని ఉర్రూత లూగించిన ఆ నాటకాన్ని గురించి "అల్లాగా" అని ఊరుకోవడం కవిగారి స్నేహితులను చాలా నిరుత్సాహ పరచింది. కాస్సేపు కూర్చుని సెలవు తీసుకు వెళ్ళిపోయారు వారుభయులు.

రాజావారు నా యోగక్షేమాలు విచారిస్తూ ఉండగా, కౌతా శ్రీరామశాస్త్రి గారు వచ్చారు వారివద్దకు. వారిని చాలా ఆదరించి కూర్చోమన్నారు రాజావారు. వెంటనే ఆయన తనసొద మొదలుపెట్టారు. శారద పత్రిక ప్రారంభించి ఏడాది నిండకుండానే, నాగేశ్వరరావు భారతి ప్రచురణ కుపక్రమించినట్టూ, కాస్త ఆగమని ఎంత వేడుకున్నా, తమ ప్రార్థన అంగీకరించలేదన్నట్టూ చెప్పారు. "ఇంకొక్క ఏడాది ఆగండి. అంతట్లోకీ ఈ పత్రిక బాగా నిల దొక్కుకుంటుంది. తరువాత మీ ఇష్టమొచ్చినట్లు చెయ్యొచ్చునన్నాను. ఆయన విన్నారుకారు" అన్నారు. పెండ్లీడుకు వచ్చిన తన మురిపెంపు బిడ్డకు కష్టపడి సంపాదించిన మంచి సంబంధాన్ని, ఇంకా ఎక్కువ కట్నమిస్తానంటూ ఎవరో భాగ్యవంతులు తన్నుకుపోయినట్టు బాధపడ్డాడు ఆ బ్రాహ్మణుడు. "సరే కానియ్యండి, చూద్దాము" అన్నారు రాజావారు. నాగేశ్వరరావు దేశసేవాపర తంత్రతను ఎవరు కాదనగలరు? కాని, కౌతా శ్రీరామశాస్త్రి సెలవుతీసుకునే

ముందు, రాజావారు ఆయన భుజముతట్టి "దిగులుపడకండి, మీరు చేస్తూన్నది యెంతో మంచికృషి, ఎక్కడనుంచో తగిన సహాయం రాకమానదు" అని ధైర్యం చెప్పారు.

రాజావారి మకాంలోనే, ఉన్నవ లక్ష్మీనారాయణగారిని కూడ కలుసుకున్నట్లు జ్ఞాపకం. అంతకుముందే, మా బావ నాకు చాటుగుండా ఇచ్చిన మాలపల్లె నవలను ఎంతో శ్రద్ధతో చదివి ఆనందించాను. ఆ రోజులలో ప్రభుత్వం ఆ గ్రంథాన్ని నిషేధించారు. చాలా గొప్పగ్రంథము, టాల్‌స్టాయ్ ఉత్తమ రచనతో పోల్చతగినది. నిజానికి తెలుగునాటను వెలసిన మొదటి నవల (స్వతంత్ర రచన) ఇదే. పుస్తకం చదువుతూన్నప్పుడు నేను ఊహించుకొన్న గ్రంథకర్త రూపానికీ, ఇప్పుడు నన్ను పలుకరిస్తున్న ఉన్నవ లక్ష్మీనారాయణ గారి రూపానికీ మూడు మూర్తులా సరిపోయింది. ఇది చాలా అరుదు.

కాంగ్రెస్ సందర్భంలో మంచి మంచి పుస్తకాలు అమ్మకానికి వచ్చాయి. సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత రోమేన్‌రోలా మహాత్ముని గురించి వ్రాసిన పుస్తకం ఒక్కటి కొనుక్కున్నాను. ఆ రోజులలో నేను అతను రచించిన జీన్ క్రిస్టాఫర్ మహాగ్రంథాన్ని చదువుతున్నాను. కొత్తపుస్తకం కొనుక్కొని వస్తుండగా, పూర్వం అడయార్‌లో నా సహపాఠి అయిన సబర్మతీ ఆశ్రమ నివాసి సురేంద్రుడు కనిపించాడు. నేను అతనితో మాట్లాడి, నా తోవను వెళ్ళబోతుంటే, "ఉండు. నాతో రా!" అని చెయ్యి పట్టుకొని తీసుకువెళ్ళి, తనకోసం ఆగినవారితో పరిచయం చేశాడు. వారిలో పెద్ద ఆమెను చూచి "మాయ్‌జీ! ఇతను ఫలానా, అడయార్‌లో నేనూ, దేవదాసూ ఉన్నప్పుడు, నన్ను ఎంతో ఆదరించేవాడు" అన్నాడు. వంగి నమస్కరిస్తున్న నన్ను దయతో చూచి "అల్లాగా! చాలా సంతోషం" అన్నారు ఆమె. ఆమెను చూచిన కొద్దీ, ఎక్కడలేని భక్తి, అనురాగం పుట్టుకొచ్చాయి నాలో. ఎంత శాంతివంతంగా ఉన్నాయి, ఆమె చూపులు! క్షమా ధాత్రి అనే మాట జ్ఞాపకం వచ్చింది, ఆమె ముఖంకేసి చూస్తూఉంటే. అప్పటికే, నట్టి ఆదర్శజీవి అయిన మగనితో, అష్టకష్టాలుపడిన గుర్తు కనిపిస్తోంది ఆమె నుదుట. వారితో కలిసి, వారి శిబిరానికి పది అడుగులు నడిచి వెళ్ళాను. ఆమె

విశ్రమించాక, మళ్ళీ వంగి నమస్కరిస్తూ, నా చేతిలో ఉన్న పుస్తకం ఆమె చేతికి అందిచ్చాను. ఆ పుస్తకాన్ని గురించి సురేంద్రుడు ఆమెకు విశదపర చాడు. సురేంద్రునివద్ద ఉన్న కలం అడిగి పుచ్చుకొని రోమెన్‌రోలా వ్రాసిన ఆ పుస్తకం లోపలపేజీ పైభాగాన కుడివైపున, ఆమె తనపేరు వ్రాశారు గుజరాతీ భాషలో: కస్తూర్‌బా గాంధి.

కాకినాడ కాంగ్రెస్ మరొకందుకు జ్ఞాపకం ఉంది. చిరకాలం అజ్ఞాత వాసంలో ఉన్న ఒకవ్యక్తి తిరిగి అవతరించి, బంధువులనూ, స్నేహితులనూ సంతోషపెట్టారు. కాంగ్రెస్ సమావేశంలో నేనూ మా బావా కలిసి శిబిరమంతా తిరుగుతూ ఉండగా, మద్రాస్‌లో నాతో కలిసిమెలిసిఉన్న సూర్యనారాయణ కని పించాడు. అతనిది విశాఖపట్టణం. మా బావనుకూడా బాగా యెరుగును. దూరా న్నుంచే మమ్మలను గుర్తించి, మావైపు వచ్చాడు. దగ్గరకు వచ్చి, చాలా ఉత్సాహంతో మమ్మల్ని పలుకరించి ఎంతో ఆవేశంతో, "మా అన్నయ్య కనిపించాడు. మా అన్నయ్య కనిపించాడు!" అన్నాడు. వాళ్ళ అన్నయ్య గొప్ప మేధావి. చిన్నవయసునే తనతోటివా రందరికంటె గొప్పగా విద్య నభ్యసించి ఎన్నో బహుమానాలు పొందేడు కూడాను. ముందు ముందు ఎంతో వృద్ధిలోకి రాతగ్గవాడు. అతనికి చిన్నప్పటినుంచి ఆధ్యాత్మిక ధోరణి ఉండేది. ఆ ధోరణి అతిశయించడం మూలానననో, ఎవరికీ తెలియని ఏదో వైరాగ్యభావం వల్లనో అతను ఉన్నట్టుండి మాయమయ్యాడు. అతను ఎటు వెళ్ళాడో ఎవ్వరికీ తెలియదు. ఎంతో వెతికారు. హరిద్వారంలో ఉన్నాడని అన్నారు ఒకరు. అరవిందుని శిష్యు డయినాడని అన్నారు మరొకరు. కాని, ఎంత వెతకినా లాభం లేకపోయింది. తుదకు నిరాశ చేసుకున్నారు. అట్లాంటిది ఈనాడు ఈ మహా జనసముద్రంలో అతను తిరిగి అవతరించాడు. అంచేతనే "మా అన్నయ్య కనిపించాడు, మా అన్నయ్య కనిపించాడు" అని అంత ఉత్సా హంతో శుభవార్త చెప్పాడు మాతో మా స్నేహితుడు.

ఆ అన్నగారే తెన్నేటి విశ్వనాధం; తరువాత, నాకు స్నేహితులై, సన్నిహితులై, ఆప్తులయ్యారు. భారతీయ ప్రపంచమంతా ఆదరించే కొద్దిమంది

తెలుగువారిలో ఈయన ఒకరనే పేరు సంపాదించుకున్నారు- తమ ధీశక్తివల్లా, త్యాగసంపదవల్లా.

*　　　　*　　　　*　　　　*

కాకినాడ కాంగ్రెస్‌లోనే అవతరించింది, 'భారతి' మాసపత్రిక. శారదా పక్షపాతులమైనా, మేము సర్వాంగ సుందరమైన భారతిని ఆప్యాయంతో ఆహ్వానింపక తప్పినది కాదు. ఈ సందర్భంలో రవీంద్రుని ప్రవచనము తిరిగి ఒక మారు జ్ఞాపకానికొచ్చింది. "పుష్పపు త్యాగ సంపదే ఫలమునందు ఇమిడి ఉన్నది" అని. కాలక్రమేణ, శారద స్థానాన్ని ఆక్రమించుకొన్నది భారతి. అవితర లభ్యమైన ధనాది సౌకర్యాలవల్లా, అపరిమితమైన కార్యదీక్షవల్లా దేశోద్ధారకుడు భారతి ద్వారా, కొంతవరకు భాషోద్ధారకుడు కూడా ఐనాడు. ఒక్క-భాషే కాదు; చారిత్రక పరిశోధన, ఆర్థిక రాజకీయ విషయ పరిశీలన, సంఘ సంస్కరణ—ఇవన్నీ కూడా భారతికి అభిమాన విషయాలే. నవ్యసాహిత్య రీతులలోని క్రొత్తపోకడలను ఎంతో ప్రోత్సహింపసాగింది భారతి.

ఏమి చేసేదండి బాబు,
నేనేమీ చేసేదండి బాబు ?
నామాటా మంతీలేక-మత్తోరింటి కెళ్తె
ఏమి చేసేదండి బాబు...
ఎల్లా ప్రేమించానో
ఎల్లా లాలించానో
చల్లా వెలుగూ చంద్రుడెరుగు!

అంటూ, అడవి బాపిరాజు ఆప్యాయం వెల్లువారుతూ రచించిన గేయాల లాంటివి భారతిలో కనుపించి ఎంతో ఆనందం కలిగించాయి నాకూ మా మల్లవరపు కృష్ణారావు బావకూ. అతనే నాకూ ఒకరోజున చూపాడు మాకిద్దరికీ అభిమాన కావ్యమైన ఏకాంతసేవను గురించి భారతిలో ప్రచురమైన విమర్శ. ఈ గ్రంథము "భాగవతమువలె శిరసావహింపవలెన"ని దేవులపల్లి కృష్ణశాస్త్రి

## నా స్మృతిపథంలో ...

తన పీఠికలో ఇక విమర్శ కూడదని 144వ సెక్షన్ జారీ చేసినా, "ఈ కావ్యం లోని అందాలను పాఠకలోకానికి తెలియజేయక తప్పదు. కాబట్టి శాసనోల్లంఘనము చేస్తున్నాను" అంటూ వ్రాశారు, బసవరాజు అప్పారావు, అనుకుంటా.

భారతిలో తొలుదొల్త ప్రచురమైన నండూరి సుబ్బారావు యెంకి పాటలున్నూ చాలా ఆనందం కలిగించాయి.

నన్ను తలుసుకు యెంకి కన్నుమూయాలి
కనుబొమ్మ సూడాలి కరగిపోవాలి
నన్ను కలలోసూసి నవ్వుకోవాలి
కనుబొమ్మ సూడాలి కరువు తీరాలి
నిదరలో సిగపూలు సదురుకోవాలి
కనుబొమ్మ సూడాలి కమ్మగుండాలి
పిలుపేదో ఇనగానే తెలివిరావాలి
కనుబొమ్మ సూడాలి కతలు సూడాలి

ఈ యెంకి పాటలను నిరసిస్తూ విమర్శకూడా వచ్చింది. ఈ విమర్శపై ప్రతివిమర్శ, తదుపరి సంపాదకుల విమర్శ, ఇంకా విమర్శలూ - ఇవన్నీ 'యెంకి పాటల గాలిదుమారం'గా పరిణమించాయి. ఇదంతా ఎంతో ఆసక్తితో గమనిస్తూండేవారము, ఆ రోజులలో.

'రాధ వలపంత' అంటూ మంగిపూడి వేంకటశర్మ రచనలోని భావం నాకు చాలా నచ్చింది.

గొల్లవారింట నేను రేపల్లెలోను
రాధనై పుట్టకుండ నరణ్యమందు
వెదురు పొదలోన బుట్టిన బ్రదికిపోదు
విరహవేదనలోబడి వేగకుండ;

వెదురునై యుంటినా, ప్రాణ విభుడునన్ను
వేణువుగ జేసికొని యెల్ల వేళలందు
గేలగొని మాధురీ గాన లోలుడగుచు
విడిచిపెట్టక కడు గారవించును గద !

ఈ ధోరణినే ఇంకా ఎంతో హృద్యంగా వేదుల సత్యనారాయణ కూడా వేణువును వర్ణించారు. అదీ భారతిలోనే చూచాను.

ఈ నవ వేణుదండ మిటు లేటికి చెక్కెదవేల చిల్లులై
పో నొగిలించెదం చడలి పోయితి, వ్యర్థపు టూర్పు గాడ్పులన్
గానముగాగ మార్చుటకె గాయని యిప్పుడు నే గ్రహించితిన్
గాని, విశీర్ణ మీ హృదయ నాళ మెటుల్ పలికింతువో ప్రభూ !

అప్పటికే, వేదుల ప్రతిభ మావంటి వారిని చాలా ఆకర్షింపసాగింది.

మా హాస్టల్ వార్డెన్ చాలా మంచివారు. చాలా చదువుకున్నవారు; యోగ్యులు; అపరిమితమైన సౌజన్యం కలవారు. 'కౌటిల్యుని అర్థశాస్త్రం'వంటి మహా గ్రంథాలను వ్రాసి అప్పటికే విజ్ఞాన రంగంలో ప్రఖ్యాతి గాంచారు. వారే మామిడిపూడి వెంకటరంగయ్య. వారిని గురించి 'రంగయ్య మాష్టారు' అని ఆప్యాయంతో చెప్పుకునే వారము మేము. నేనంటే ఆయనకు ప్రత్యేకమైన అభిమాన ముండేది. రోజూ సాయంత్రం హాస్టల్ తనిఖీకి వస్తూ, ఆయన నా గది ముందర వసారాలో కూర్చొని ఏదో వ్రాసుకుంటూనో, ఏదో చదువు కుంటూనో ఉన్న నాతో కబుర్లు చెపుతూ అలాగే కూర్చుండి పోయేవారు చాలాసేపు. నాకు బాగా జ్ఞాపకముంది, వేసవి సెలవలని హాస్టల్ మూశారు. నేనుమాత్రం ఇంకా వెళ్లలేదు. అప్పుడు వారి అమ్మాయి పెళ్లి హాస్టల్ భవనం లోనే చేశారు. అప్పుడే విశాఖపట్నంనుంచి మా బావ వచ్చాడు నన్ను చూడడానికి. 'రంగయ్య మాష్టారు' మావద్దకు వచ్చి "నీవు, మీ బావ ఈ ఐదు రోజులూ మాతోనే పెండ్లి పందెలలో భోంచెయ్యాలి, తప్పదు" అన్నారు.

## నా స్మృతిపథంలో ...

పెండ్లి భోజనాలలోని పంచభక్ష్య పరమాన్నాల ఆధిక్యత అటుండగా, మా బావా నేనూ ఎంతో హర్షించినది అప్పుడు మేము చూచిన పెండ్లి వేడుకలు. ఎంతో సరదాగా ఉన్నవి. ముఖ్యంగా, బువ్వపు బంతి అప్పుడు నెల్లూరు సీమనుంచి వచ్చిన సీమంతినులు పాడిన అద్భుతమైన పాతకాలపు పాటలు. రక రకాల పువ్వులను ఎంతో రమ్యంగా వర్ణించే రగడ ఒకటి మరీ మరీ నచ్చింది నాకూ మా బావకూ. తరువాత, ముప్పది ఏళ్ళ తర్వాత, వెంకటరంగయ్యగారి ఇంటికి వెళ్లినప్పుడు ఆయన సతీమణికి జ్ఞాపకంచేశా కూడా అందమైన ఆపాట మాట.

భారతి క్రొత్త సంచిక వచ్చింది. మాఘమాసపు సంచిక. నాకు చాలా ఇష్టమైన ఉమర్ ఖయ్యామ్ రుబాయిలకు ఇంకో తెలుగు తర్జుమా కనపడింది. 'మధుకలశము' అను పేర రాయప్రోలు సుబ్బారావు రచన. సిద్ధహస్తులూ, రసిక హృదయులూ ఐన వీరి రచన భాషాంతరీకరణలాగాక, నవకవిత గానే తోచింది:

జను లతికాంక్షతో వలచు జంగమ భోగము లొక్క వేళ పం
డిన తెగ పండవచ్చు, నవనిన్ బడి యెండిన నెండవచ్చు, మో
హన శిశిర ప్రభాతసమయంబుల శుష్కవనీముఖస్థలిన్
మినుకు మెరుంగు లీనవె నిమేషము రాలు తుషారబిందువుల్!

పారశీకభాషలో ఎల్లావుందోగాని, ఇంగ్లీష్‌లోలేని రమ్యత కనిపించింది ఈ రచనలో. అది మన భాషలోని ప్రత్యేకత అనుకుంటా. అంతేగాక, చిర పరిచిత భావాన్నే ఎంతో నవ్యతతో ప్రస్ఫుట పరచగలిగారు ఈ కవి పుంగవులు.

## ౧౨

ప్రాణసఖుడె నాకోసమై పంపినాడు
పల్లకీ అన హృదయము జల్లుమనియె;
వీడని వియోగమున వేగుమ్రోడు మేను
తలిరు తోరణమై సుమదామమాయె !
బెదరు చేతుల నెటో కయిసేసుకొంటి
మొయిలు వసనమ్ములో, ప్రొద్దుపొడుపు నగలో
ఏదో కాలుచు హాయియో ఏదు వేల్చు
భారమో యేమొ సైరింప నేరనైతి;
కొసరు నడల తూగాడుచు కూరుచుంటి
పూల పల్లకిలో పూలమాల నేను.
'ఓయనగ, నోహో' యనబోయవాండ్రం
దారిబడి నిల్చిచూచె నూరూరు నాడు !

తలిరుతోరణమై సుమదామమాయె, మొయిలు వసనమ్ములో పొద్దుపొడుపు నగలో—అంతకంటె ఎక్కువైనది, పూలపల్లకిలో పూలమాల నేను: అవును, ఈ మాటలు దేవులపల్లి కృష్ణశాస్త్రివే. ప్రపంచసాహిత్య కుసుమావళికి పరిమళమిచ్చే పారిజాతాలు.

పూల పల్లకిలో పూలమాలగా కూర్చున్న ఆ సుకుమారిని కళ్ళారా చూడాలని ఉంటుంది. మరొక్కసారి పద్యం చదివితే చూడవచ్చునేమో కూడా.

విచిత్రమైన ఈ పల్లకీ ప్రయాణంలో ఒక్క మనమేకాదు మేల్కొనేది; ప్రకృతి అంతా మేల్కొంటుంది.

'ఓ' యనగ, 'నోహోహో' యన బోయ వాండ్రు
దారి వెలుపల మేల్కాంచె తోట తెరువు!
'ఓ' యనగ 'నోహోహో' యన బోయవాండ్రు,
తోట పొలిమేర కాలువ తొనకె నిదుర!

పల్లకీ మోసితవిని, ఉద్యానవన వీధులు మేల్కొన్నాయట; సుఖనిద్రలో ఉన్న పంటకాల్వ కాస్త కదిలి, ఒత్తిగిలి పడుకుందట; ఇంగ్లీష్‌లో 'ఇమేజరీ' అంటారు, ఇటువంటి అందమైన రూపకల్పనను. దానితోపాటు అద్భుతమైన 'సింబాలిజమ్' కూడా మిశితమై ఉంటుంది. పల్లకీ వట్టిపల్లకీకాదు; తోట తెరువు వట్టి ఉద్యానవీధి కాదు. ఇవి మరి వేరే ఏదో భౌతికాతీతమైన అనుభవానికి సంకేతము, అంతే.

సంవత్సరాదికి కొందరు స్నేహితులకు, ఆప్తులైనవారికి ఆశీస్సులు పంపుతూ, లేత వంగపువ్వు రంగు కాగితంపైన స్వహస్తంతో ఈ పంక్తులు వ్రాసి పంపాను, కాగితం మడతలో ఇన్నిన్ని పొగడపువ్వులు దాచి:

ప్రణయ వల్లకి పల్లకీ! ప్రసవభర వ
సంత వల్లిక పల్లకీ! శక్రచాప
వక్రరేఖ పల్లకీ! మధు స్వప్నశాఖ పల్లకీ!

"మధు స్వప్నశాఖ! ఎంత చక్కని ఉగాది కానుక" అన్నారు అందు కున్న స్నేహితులు.

కృష్ణశాస్త్రిని నేను మొదట టిప్లికేన్ హైరోడ్‌లో ట్రాంబండిలో కలుసుకున్నాను. అతడు దిగుతున్నాడు ట్రామ్‌నుంచి - నేను ఎక్కుతున్నాను. నాతో ఉన్న బండారు వీరరాజేశ్వరరావు అతనిని చెయ్యిపట్టుకు ఆపి, "ఇతనే కృష్ణశాస్త్రి" అన్నాడు నాతో. "ఇతనే, ఫలానా" అన్నాడు కృష్ణశాస్త్రితో. ట్రామ్ కదిలిపోతూ ఉండగా, "సోమశేఖర శర్మగారి ఇంట్లో కలుసుకుందాం, రేపు ఉదయం పది గంటలకు, తప్పకుండా వస్తావుకదూ" అన్నాడు రాజేశ్వర

రావు. "అల్లాగే" అన్నట్టు తలఊపాడు, కృష్ణశాస్త్రి. అతను చూడడంమాత్రం నా వైపే చూస్తున్నాడు; ఈ హటాత్సమావేశం నుంచి ఇంకా తేరుకోలేదు. వెలిసిపోయిన నల్ల ఆల్పకాకోటు తొడుక్కొనిఉన్న అతని చూపులో ఏదో ప్రత్యేకత కనపడింది. ఇప్పటికీ అంటూఉంటాను, "అతనిచూపులో ఏదో నిరంతరాన్వేష స్ఫురిస్తుంది. భూలోకానికి వచ్చి, త్రోవ తప్పిపోయిన గంధర్వుని చూపులులాఉంటాయి అతని చూపులు" అని.

అదేమిటో గాని, ఎక్కడ కలుసుకున్నా అతను బండి దిగుతూ ఉంటాడు; నేను బండి ఎక్కుతూ ఉంటాను. లేదా, నేను బండి దిగుతూ ఉంటాను; అతను బండి ఎక్కుతూ ఉంటాడు. నిన్నటికి నిన్న, హైదరాబాదులో, నేను దిగబోతున్న బండి ఎక్కాడు అతను!

అప్పు డెప్పుడోమాత్రం, రెండుసార్లు ఇద్దరమూ కలిసి ప్రయాణము చేశాము రైలులో; మా ఊరినుంచి రాజమహేంద్రవరం ఒకసారి; పిఠాపురం నుంచి తుని ఒకసారి, ఈ రెండవ ప్రయాణము ఊరికే, కులాసాగా నాతో కొంచెం దూరం కలిసివుండాలని. మరోసారి నేను కలకత్తా వెళుతూండగా, పిఠాపురం స్టేషన్‌కి వచ్చాడు అతను నన్ను చూడడానికి. అక్కడ మూడు నిమిషాలే ఆగుతుంది మెయిల్. నా కంపార్ట్‌మెంట్ సరిగ్గా అతను నుంచున్న చోటనే ఆగింది. ఒకరి నొకరు కళ్ళతో పలకరించుకున్నాము.

వేరే కుశలప్రశ్న లేదు; "ఏమి క్రొత్త పద్యాలు వ్రాశావు?" అన్నాను.

> ప్రేయసి సోయగమ్మునకు లేదు శరీరము;
> లేదు మేను నా తీయని ప్రేమకేని, కలదే
> ఎడబాటిక మాకు!

అంటూ చదివాడు. చక్కని కంఠస్వరం. ఎంతో భావయుక్తంగా చదువుతాడు. తెలుగులో ఎంత క్రొత్తగా ఉన్నాయి ఈ భావాలు! అష్టాదశ వర్ణనలతో నిండిన మన ప్రబంధ దోరణికీ ఈ భావానికీ ఎంత వ్యత్యాస మున్నదీ!- అనుకున్నాను.

ఔర ! ప్రభాత శైల సానూపల నీలపాళికల
నొత్తకయే స్రవియించు నా హిమానీ
పరగాయనీగళ వినిస్రుత మాధురి మంటి
కీర్తురా——

అంటాడు.

ఎంత సేపట్లో ఐపోతాయీ, మూడు నిమిషాలు ! అతను నాతో కూడా, వస్తాడనుకున్నాను. "బ్రిహ్మర్షి వెంకటరత్నంనాయుడు నన్ను రమ్మని కబురు చేశారు. ఈసారి నీతో రాలేను" అన్నాడు. రైలు కదిలింది.

ఇక్కడ మద్రాస్‌లో ట్రామ్‌బండి ఎక్కుతూ దిగుతూ కలుసుకొన్న మరునాడు, అన్నట్టుగానే పది గంటలకు మల్లంపల్లి సోమశేఖర శర్మ ఇంటికి వచ్చాడు కృష్ణశాస్త్రి. అందరూ ఆశ్చర్యపోయారు. అతను అనిన సమయానికి రావటం అదే మొదటిసారిఅట ! నా వైపు చూపుతూ, 'అది అతని ప్రభావం' అన్నాడు అడవి బాపిరాజు బావ.

ఐతే, నిన్నటి వెలిసిన అల్పాకా కోటులేదు. చక్కని మల్లెపూవులాంటి తెల్లని మల్లు లాల్చీ, కంటిమెడ; ప్రక్క బొత్తాములు. బొత్తాములు ఉన్నాయి కాని, అవి పెట్టుకోడు. మెడపట్టీ అలా గాలిలో రెప రెప లాడుతూ ఉండ వలసిందే! మొఖాన అగరుచుక్క. కనుబొమలకు పునుగు రాచుకున్నాడు. మెరుస్తూన్న కళ్ళల్లో ఆ చూపే: ఇంతమంది ఎదుట కూర్చున్నా, ఎవరికోసమో, ఎందుకోసమో, వెతుక్కుంటున్నట్టి చూపు. కూడా తెలికిచర్ల వెంకటరత్నం. కూడా, ఎవరన్నా ఉంటేగాని, ఇల్లు కదలడు కృష్ణశాస్త్రి; ఈ సంగతి లోక ప్రసిద్ధము.

తరువాత, బాగా పరిచయమయ్యాక- అంటే ఇంకో పది నిమిషాలలో, అడిగేశాను: "నిన్న ఆ వెలిసిపోయిన కోటెందుకు తొడుక్కున్నావు"అని.

"అదా !.... ఎవరో, 'నీకు ఉద్యోగం ఇస్తాను రమ్మ'న్నారు. వెళ్ళక తప్పింది కాదు. వారు అన్నంత పనీ చేస్తారేమోనని జడిసి, నేను ఆకోటు తొడుక్కు వెళ్లాను. ఉద్యోగం రాలేదు" అన్నాడు.

ఉద్యోగమంటే తగనిభయ మతనికి.

సరస్వతీ నిలయమైన సోమశేఖరశర్మ ఇంటిలో క్రొత్త నగలు సింగారించుకొని నాట్యమాడింది వాణి, ఆనాడు. కృష్ణశాస్త్రి వచ్చేవేళకు నండూరి సుబ్బారావు యెంకిపాటలు పాడుతున్నారు. శ్రోతలలో పది పన్నెండుగురు స్త్రీ లున్నారు. తుర్లపాటి రాజ్యేశ్వరమ్మ, ఆమె చెల్లెలు విశాలాక్షి; కొమ్రరాజు అచ్చమాంబ, ఆమె తల్లిగారూ; మా అక్కయ్య, ఆమె స్నేహితురాలు శ్రీదేవి; కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి భార్య, 'అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి' సోమశేఖరశర్మగారి భార్య - వీరంతా విన్నారు యెంకిపాటలు ఆ రోజున. వీరంధరూ యెంకిపాటలను ఇంత శ్రద్ధతో, ఇంత మనసిచ్చి, వింటూవుంటే నాకు ఒకరు జ్ఞాపకం వచ్చారు- ఆరోజులలో విపరీతంగా యెంకిపాటల గాలి దుమారాన్ని రేకెత్తించిన పొక్కులూరివారు. వారే ఈ సభ చూస్తే, 'ఈ రచనలో కులస్త్రీలు వినరానిభావాలూ మాటలూ ఉన్నాయి' అనగలరా అనుకున్నాను. గ్రంథకర్త చదువ మరచిపోయిన 'ఆరిపెయ్యవే దీపము' అనేపాట వినాలని ఉన్నదన్నారు రాజ్యేశ్వరమ్మ! ఆమె మా అక్కయ్య వీపుమీద చెయ్యివేసి 'విను, లక్ష్మీదేవీ చాలా బాగుంటుంది' అన్నారు. ఇంతకంటె ఏమికావాలి, ఎటువంటి కవికీ !

యెంకిపాటలు విన్నతర్వాత, విశ్వనాథ సత్యనారాయణ తాము క్రొత్తగా రచించిన అనార్కలీ నాటకం చదివారు. ఆయన నన్ను దయతో పలుకరించారు; కాని, వెల్లివిరిసే ప్రేమ చూపలేదు, ఆ మొదటి పరిచయంలో. ఆయన స్నేహం అంత సులభంకాదు. కొంత పరీక్షించి, ఆ పరీక్షలో ఆరితేరినవారినే, వారు స్నేహితులుగా భావిస్తారు. మంచి మార్కులు సంపాదించ కలిగేవారు బహు కొద్దిమంది; కాలక్రమేణా ఆ కొద్దిమందిలో ఒక్కడను అయ్యాను నేను అనేగర్వం ఉంది నాకు ఇప్పుడు.

అనార్కలీ నాటకము ఒక గొప్పరచన. చదువడమూ అలాగే చదివారు ఆయన, అతిగొప్పగా. నాటకంలాగే పఠించడము కూడా నవరస భరితంగా ఉంది. వింటున్నవారిని బట్టికూడా ఉంటుందేమో — ఆయన ఆవేళ మరీ

చక్కగా చదివారు. అన్ని రసాలు ఉన్నా ఆ నాటకంలో ముఖ్యమైనది కరుణరసం. అనార్కలీ గాథ స్త్రీ హృదయగాథ; కాబట్టి స్త్రీ జనమంతా సాను భూతితో మెచ్చుకున్నారు.

నాటకము చదివి ముగించేసరికి, భోజనాల వేళయింది — లేవచ్చునని పిలుపు వచ్చింది. అందరూ లేచారు, నాటకం గురించి మాట్లాడుకుంటూ.

అప్పుడే అనుకుంటా నాకు ఒక ప్రక్క నాయని సుబ్బారావు, ఒక ప్రక్కన కృష్ణశాస్త్రి కూర్చున్నారు. ఈవేపు 'కృష్ణపక్షం'; ఈవేపు 'ఫలశ్రుతి' అన్నాను నేను నవ్వుతూ.

భోజనాలయ్యాక ఆకులు వేసుకుంటూ విశ్వనాథవారు తమ నర్తనశాల చదివారు. చక్కని పాత్రపోషణ. సంభాషణలో ఎంత కవిత్వం కనిపించింది! చిరపరిచితమైన సైరంధ్రీ గాథలోనే ఎంతో క్రొత్తదనము; తిక్కన రచనకూ తిక్కన ఊహకూ మెరుగునిచ్చే క్రొత్త ప్రతిభ.

అచ్చమాంబకు కిన్నెరసాని పాటలు చాలా ఇష్టం. ఇదివరకు వినివున్నా, "మళ్లా ఒకసారి వినాలనిఉంది, చదువండి" అని అడిగింది విశ్వనాథవారిని. ఆయన కంఠమెత్తి చదివారు, ఎంతో గొప్పగా :

> తొలి వెన్నెల చివుళ్ళు తెలినిగ్గు విరజిమ్మ
> వెలది కిన్నెరపాట విరిసిపోవుట చూసి
> తెలుపులో వెన్నెలా
> మలుపులో రేచాన
> సిరివెల్లి పచరించెనో
> విరిపూల నెరతావి తరమెంచునో...

ప్రబంధకవుల ప్రౌఢత్వమూ; ఆధునికుల లాలిత్యమూ కూడా కనుపించాయి నాకు ఈ రచనలో. చాలా ఆనందిస్తూ విన్నాను.

కంచు గీసినయట్లు కదలు తరగలతోన
మించె కిన్నెరపాట మేలిపోంకలుపోవు
విగ్గులో, అందంపు
జగ్గులో, వనమొల్ల ఒక
పాట మైపోయెనో—తనుదాన
మెరుగలేకేపోయెనో !

ఇంతటి ఆర్ద్రతతో పద్యం చెప్పగల ఆయన, పైకి చూడడానికి మాత్రం కొంచెం పెడసరంగా కనిపిస్తారు. క్రొత్త స్నేహితులను కలుపుకోవాలని ఆత్రుత లేనేలేదు సరికదా, అలా చేయిచాచినవారిని చటుక్కున ఆదరించరు. నాకు బాగా జ్ఞాపకముంది: ఆమరునాడు డిసెంబర్ ఇరవై మూడు. మా అక్కయ్యా, ఆమె స్నేహితురాలు శ్రీదేవీ, మా అందరికీ ఎంతో ఆప్తుడు బండారు వీర రాజేశ్వరరావూ, నేనూ న్యూ ఇయర్ కార్డ్‌లు కొందామని రాక్ హౌస్ బుక్ షాప్‌కి వెళ్ళాము. అక్కడ విశ్వనాధ సత్యనారాయణా వారితోకూడా నాయని సుబ్బారావూ కనిపించారు. గబగబా వెళ్ళి "హాపీ న్యూ ఇయర్ టు యూ" అన్నాను. సుబ్బారావు నన్నుచూచి చిరునవ్వు నవ్వారు. కాని, వారి స్నేహితుడు నా అభివందనము విన్నట్లులేదు. నాకుచాలా ఆశాభంగమైంది. వాడినముఖంతో వెనుకకు వచ్చిన నావేపు చూచిన మాఅక్కయ్య చూపులో 'అంతేకావాలి నీకు' అన్నట్లు స్పష్టంగా కనపడింది. కాని, తర్వాత రాజేశ్వరరావు చెప్పాడు, "పైకి అలా ఉంటారు, కాని, అయనిది చాలా మెత్తని మనస్సు. నవనాగరికపు పైపై వేషాలు అయనకు నచ్చవు; అంతే!" అని. కొన్నేళ్ళ తరువాత గుంటూరులో ఆయనను చూడడానికి వెళ్ళినప్పుడు ఆయన తాను క్రొత్తగా రచించిన మహా కావ్యం నాకు ఒక్కడికీ చదివి వినిపించినపుడు రాజేశ్వరరావు మాట నిజమే అనిపించింది. సాయంత్రం నాలుగుగంటల నుంచి రాత్రి ఎనిమిదింటివరకు ఆ క్రొత్తరచన విన్నాను, మధ్య మధ్య వారి సంభాషణతో. భార్యా వియోగంలో ఉన్న ఆయన తమ సతినిగురించి చెప్పిన కావ్యమిది. గొప్ప

రచన. కొన్ని సున్నితభావాలను ఆయన అతిసున్నితంగా వ్యక్తపరిచారు. అయితే, సముద్రమంత అనురాగముతోపాటు మేరువంత వైరాగ్యమూ చూపగలిగారు.

*　　　*　　　*　　　*

ఆరోజులలో, బెంగుళూరులో విశేష రసాయనిక పరిశోధనలో నిమగ్నుడను కావలసిన నేను, మారిస్ మాటర్లింక్ రచనలను తెలుగు చేస్తున్నాను. మాటర్లింక్ రచించిన 'ఇంటీరియర్' అనే ఏకాంకిక చాలా బాగుంటుంది. ఒక గదిలో కిటికీముందు నిలుచున్న ఇద్దరు అమ్మాయిలు బయట జరుగుతున్న విషయాలు ఒకరితో ఒకరు చెప్పుకుంటూ ఉంటారు. నాటి ఉదయమే వారితో కలిసి ఆడుకుంటూ ఉన్న సావాసకత్తె నదిలోపడి చనిపోయినట్లూ, ఆ మృత కళేబరాన్ని ఊరివారు ఇంటికి తీసుకువస్తున్నట్టూ ఆ పిల్లల సంభాషణవల్ల తెలుస్తుంది మనకు. మరణమంటే ఆ చిన్నపిల్లల మనస్సులో ఉన్నట్టు అవ్యక్తమైన భీతిని తెలియజేస్తూ అగాధమైన జీవితపు లోతులను వ్యక్తపరుస్తాడు సిద్ధహస్తుడు మాటర్లింక్. కాని, "హాయిగా సుఖనిద్రలో ఉన్నట్టు ఉంది కాదూ మన సావాసకత్తె" అని అనిపిస్తాడు పెద్ద అమ్మాయిచేత, పూలతో అలంకరించిన శవపేటిక కిటికీ దగ్గరకు వచ్చేసరికి.

ఈ ఏకాంకికను 'అంతరంగము' అను పేరట తెలుగుచేసి మారిస్ మాటర్ లింక్ ఇంటీరియర్‌కు అనువాదమని తెలియజేస్తూ, ఒక్కొక్కరంగంగా కృష్ణా పత్రికలో ప్రచురించాను. కావ్యవస్తువు విశ్వజనీనమైనది కాబట్టి భాషాంతరీకరణ చక్కగానే కుదిరింది. వాతావరణ కూడా మన వాతావరణకు సన్నిహితంగా అమరింది. చదివినవారు మెచ్చుకున్నారు. ఈ అనుభవంతో మాటర్లింక్ ఇతర రచనలున్నూ తెలుగు చేద్దామని అనుకుంటూ ఉండగా, కృష్ణాపత్రిక సంపాదకుని వద్దనుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంతో మరి ఒక ఉత్తరం జతపరచి ఉంది :

## నా స్మృతి పథంలో...

శ్రీ కృష్ణాపత్రిక సంపాదకులకు. రాజమహేంద్రవరం

అయ్యా,

కొన్ని వారాలుగా 'అంతరంగము' అనే పేరట శ్రీ ఆచంట జానకిరామ్ అనే ఆయన రచన కృష్ణాపత్రికలో చూస్తున్నాను. ఇది మారిస్ మాటర్లింక్ ఏకాంకికకు అనువాదమని వారే అంటున్నారు. మారిస్ మాటర్లింక్ రచనలు అన్నింటికిన్నీ తెనుగుచేసే ప్రపంచపు కాపీరైట్ నాకు ఉన్నదని శ్రీ జానకి రామ్‌గారికి తెలుసునో తెలియదో. ఈ విషయమై మీరు వారికి ఒకముక్క తగి లించవలసినదని కోరుచున్నాను. వారు కాదు కూడదూ అంటే, లావాదేవీలు వ్రాసే వున్నాయి.....

సంతకము భమిడిపాటి కామేశ్వరరావు, అంటూ, ఉన్నది ఆఉత్తరంలో.

'లావాదేవీలు' అనే మాట నాకు కొత్త. తెనుగు వచ్చిన ఒకరిని అడిగి తెలుసుకున్నాను కోర్టుద్వారా జరిగే వ్యవహారకాండకు ఆ పేరని. వెంటనే, ఆ ఉత్తరాలు రెండూ అన్నగారు పల్లంపల్లి సోమశేఖరశర్మకు పంపుతూ, ఏమి చేయమంటారని అడిగాను. పత్రికలో అచ్చు అగుతున్న రచనకుగాను పత్రిక వారివల్ల నేను ఎటువంటి మూల్యమూ పొందడము లేదని కూడా చెప్పాను. తిరుగు టపాలో జవాబు వ్రాశారు అన్నగారు. "మీ రచనకు మూల్యం పొందుతున్నా లేకపోయినా, అది ఒక ప్రశ్న కాదు. తానుగాని, తన పూర్వీకులుగాని ఆర్జించిన ఇల్లూ పొలమూవంటి ఆస్తే ఈ కాపీరైట్. మాటర్లింక్ తన రచనల విషయంలో తన కున్న హక్కును తెనుగు తర్జుమాకు శ్రీ కామేశ్వరరావుకు దఖలుపరచి ఉండడమువల్ల నీవు వెంటనే వారి పేర ఉత్తరం వ్రాస్తూ ఇప్పటి నీ యత్నం విరమించుకున్నట్లు తెలియజెయ్యవలెను. ఈ పని వెంటనే చెయ్యి" అంటూ వ్రాశారు.

నేను వెంటనే భమిడిపాటి కామేశ్వరరావుకు ఉత్తరం వ్రాశాను. పత్రిక వారికి నకలు కూడా పంపాను. ఇంగ్లీష్‌లో వ్రాశాను ఉత్తరం. మాటర్లింక్ పుణ్యమా అంటూ నాకు శ్రీ కామేశ్వరరావు పరిచయం లభించినందుకు చాలా సంతోషిస్తున్నాననీ, ఉత్తమ రచయిత మాటర్లింక్ రచనలలోని అందాలను తెలుగువారికి తెలియపరచడమే నా ఆశయమనీ, ఆర్థికంగా నాకు ఎటువంటి ఆశా లేదనీ, ఈ యత్నంలో ఇదివరకే, ఒకవేళ నాకంటే ఇంకా బాగా, వారు కృషి చేస్తున్నారు కాబట్టి నేను విరమించుకుంటున్నాననీ వ్రాశాను. "కొద్ది

రోజులలో రాజమహేంద్రవరం వస్తున్నాను. మిమ్ములను తప్పక కలుసు కుంటాను." అని కూడా వ్రాశాను. అల్లాగే కొన్నాళ్ళయినాక వారిని కలుసుకుని వారి స్నేహం కూడా సంపాదించాను. ఈ స్నేహం ఎటువంటిదిగా పరిణమించింది అంటే, తర్వాత, పాతిక ఏళ్ళతర్వాత, ఉద్యోగ రీత్యా వారితో సంబంధం ఏర్పడ్డప్పుడు, ఇతరు లెవ్వరు చెప్పినా ససేమిరా విననివారని ప్రఖ్యాతి గాంచిన వారు, ఎప్పుడూ, నా మాట త్రోసివెయ్యలేదు. "మాష్టారండీ! ఇలా చేస్తే బాగుంటుంది" అంటే, "సరే కానివ్వండి!" అనేవారు, చిరునవ్వు నవ్వుతూ. కూడా వున్నవారు ఆశ్చర్యపోయేవారు ఆయనకు నామాటంటే అంత విలువ ఏమిటని!

* * * *

సెలవల్లో మా అక్కయ్యా ఆమె స్నేహితురాలు శ్రీదేవీ, నేనూ మా స్వగ్రామం మాధవరం వెళ్ళాము. మా ఊరు చాలా బాగుంటుంది. ఇంటి చుట్టూ కొబ్బరి తోటలు, దొడ్లో మల్లెపందిరీ, మాలతీలత. మా పిన్నీ, పిన్ని కూతురూ, మా పినతండ్రీ మమ్మల్ని ప్రాణంగా చూసేవారు. మా పినతండ్రి సంస్కృతాంధ్రములు బాగా చదువుకున్నారు. నేను ఎప్పుడూ ఆయనతో సాహిత్య వ్యాసంగంలో గడిపేవాడను. ఎప్పుడైనా పొలంకూడా వెళ్ళేవాడను ఆయనతో.

ఒకరోజు ఉదయాననే వీధి అరుగుమీద కూర్చొని దంతధావనం చేసుకుంటూ ఉండగా, ఆ కనుచీకటిలో కాస్త మంచు పడుతూండగా గూడులేని రెండెడ్ల బండి వచ్చి ఆగింది మా ఇంటిముందు. ఎవరు చెప్మా ఇంత వేకువనే వచ్చారు మన ఇంటికి-అని మా పినతండ్రి అంటూ ఉండగా, బండిలోంచి ముగ్గురు దిగారు. ఆకుపచ్చని శాలువా వల్లెవాటుగా వేసుకుని ఒకరు; తోపురంగు శాలువా తలనిండా కప్పుకుని ఒకరు; శాలువా లేకుండా ఒకరు. శాలువా తలనిండా కప్పుకున్నవారు దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఆకుపచ్చ శాలువా తెలికిచర్ల వెంకటరత్నం; మూడవ అతను నేస్తం కృష్ణమూర్తి. వీరిల్లా అనుకోకుండా అవతరించడం చూచి, పట్టరాని సంతోషంతో ఒక్క పరుగున లోపలికి వెళ్ళి మా అక్కయ్యను కేకవేసి చెప్పాను "కృష్ణశాస్త్రీ వాళ్ళూ

వచ్చార"ని. మా అక్కయ్య చాలా నెమ్మదైన మనిషి. "అలాగా! ముందరి గది సర్దుతా వారికోసమ"ని ఆ వేపు వెళ్ళింది. శ్రీదేవిమాత్రం నాలాగే హడావుడి మనిషి; నాలాగే ఆమెకు ఏక "వలపు తొందర". "ఆయన వ్రాసిన పద్యాలన్నీ చదివిస్తాను, ఈవేళ, ఆయనచేత" అంటూ మిడిసిపడుతూ వారి కాఫీ విషయమై చూడడానికి మా పిన్నివద్దకు వెళ్ళింది.

నేను మళ్ళా వీధిలోకి వచ్చేసరికి మా పినతండ్రి వారికి తగిన అతిథి సత్కారంచేసి వారితో ముచ్చటిస్తున్నారు. "ఇంకేం! నీ స్నేహితులొచ్చారు నిన్ను వెతుక్కుంటూ; మన పల్లె పావనమైంది, వారి రాకవల్ల" అన్నారు.

ఆనాడు మా ఇంట కవితాగోష్ఠి. వెంకటరత్నం మళ్ళా ఒక్కసారి పింగళి—కాటూరివారి కవితా సామాగ్రీ, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య ఆతిథ్యమూ, చామర్తి రాజశేఖరరావు బృందావన స్మృతీ- ఇటువంటి రచనలు చదివి వినిపించారు. పొలము వెళ్ళబోతున్న మా పినతండ్రి ఆగిపోయి, పెద్ద నామాత్యుని ఉత్పలమాలిక చదివారు గంభీర కంఠస్వరంతో; సంస్కృత భాగం మరీ గొప్పగా చదివారు. కృష్ణశాస్త్రీ, వెంకటరత్నం విస్తుపోయారు.

సాయంత్రం మల్లెపందిరవద్ద కూచుని మేమంతా కృష్ణశాస్త్రి రచనలు విన్నాము. ఒకొక్కటీ ముందు కొంత ఉపోద్ఘాతంతో, మధ్య మధ్య వివరణలతో చక్కగా చదివాడు అతను. కవి తన అనుభవాలన్నిటినీ మరి ఒక పర్యాయం అనుభవిస్తూన్నట్టు ఉంటుంది, ఇలా సహృదయుల ఎదుట తన రచనలు ఒక్కొక్కటీ తీసి చదువడము. చదివేవారికీ, వినేవారికి కూడా ఎంతో ఆనందం కలిగిస్తుంది.

> చల్లగా నున్నదీ సుప్రశాంత వేళ
> చల్లగా సాగు నీ సుప్రశాంత పథము
> బయలు దేరుము సూరంపు బయనమునకు
> వలదు తడయగ, దవ్వేగ వలయు నేడు !

అని చదివాడు. "వలదు తడయగ దవ్వేగ వలయు నేడు" అంటు న్నాడు; కాని అప్పటికప్పుడే రైలువేళ దాటిపోయినట్టు, మా పినతండ్రిగారు పొలమునుంచి వచ్చి చెప్పేదాకా మా కెవరికీ తెలియదు. "అయ్యో! ఇంకె ల్లాగ! ఈ రాత్రి రాజమండ్రిలో చింతా దీక్షితులను కలుసుకుంటామని చెప్పామే" అన్నాడు కృష్ణశాస్త్రి. ఆ రాత్రి చాలా ముచ్చటగా గడిపాము. శీతకాలం, తేగలు, ఊచబియ్యం తిన్నాము, మండువాలో కూర్చొని. ఎన్నో పాత కబుర్లు చెప్పారు మా పినతండ్రి. అంతకు ఒకరోజుముందే దొడ్లో ఆవు ఈని నది అనుకుంటాను, జున్నుకూడా వండిపెట్టినది మా పిన్ని మాకు.

ఎంత పనిఉన్నా సరే, కృష్ణశాస్త్రి సూర్యోదయమైతే గాని లేవడు లేచాక ముస్తాబుతో సరిపోతుంది అరగంట. అక్కడికీ పాపం మా పిన్నీ శ్రీదేవీ కాఫీ ఉప్మాలు చప్పు చప్పున తయారుచేసి సమకూర్చారు. గుర్రపు బండివచ్చి వేచివుంది. కాని, చెప్పులలో కాళ్ళు పెట్టుకున్న కృష్ణశాస్త్రిని చూచి శ్రీదేవి " 'నా విరులతోట' అనే పద్యం ఇంకొక్కసారి వినాలని ఉంది" అన్నది.

## ౧౩

నా విరుల దోట పెంచికొన్నాడ నొక్క—
పవడపు గులాబిమొక్క—; నా ప్రణయజీవ
నమ్ము వర్షముగా ననయమ్ము గురిసి.
కొన్నినాళ్ళాయె; సుకుమార కుసుమ మొకటి
నవ్వె కలకల మని నా వనమ్ములోన.
అంత దానినె నాజీవితాశయమ్ము
పూవుగా వింతగా మారిపోయినటులు
వలచికొన్నాడ; నా ప్రసవమ్ము నేను
నన్ను మనసార నా ప్రసూనమ్ము కనులు
విచ్చి కాంచుచు గాలము పుచ్చినాము
ఎదల నిశ్శబ్దముగ బల్క—రించుకొనుచు...

కృష్ణశాస్త్రి చదువుతున్నాడు ఈ తన రచనను—మా స్వగ్రామమైన మాధవరంలో. నన్ను చూడడానికి వచ్చారు స్నేహితులు: తెలికిచర్ల వెంకట రత్నం, అతని తమ్ముడు కృష్ణమూర్తి, దేవులపల్లి కృష్ణశాస్త్రి. అంతకుముందు రోజు కవితాగోష్ఠి జరిగింది. ఈ ఉదయం వారు రైలుకు వెళ్ళబోతూండగా చెప్పులలో కాళ్ళు పెట్టుకొని ఉన్న కృష్ణశాస్త్రిని చూచి, " 'నా విరులతోట' ఇంకోసారి వినాలని ఉన్నది"అన్నది శ్రీదేవి.

ఇంకేముంది! అందరం నడవాలోకి వచ్చాము. ఓ పద్యం తర్వాత ఇంకో పద్యం; ఆ తరువాత ఇంకో పద్యం-అన్నీ మరోసారి వినాలనిపించేవే! బండి అతను హుసేన్ సాహెబ్ కేక వేయబట్టిగాని, ఆ పూటా ప్రయాణం ఆగిపోవలసిందే. ఎలాగో జట్కా—లో పడ్డాము—నేను కూడా తయారయ్యా వారితో రాజమహేంద్రం వెళ్ళడానికి.

## నా స్మృతిపథంలో...

మా ఊరికి స్టేషన్ ఐదు మైళ్ళు. జట్కా త్వరగానే వెళ్లింది పాపము. కాని, ఏమి లాభం? మేము స్టేషన్‌కి ఇరవై గజాల దూరాన, మలుపు తిరిగేసరికి రైలు స్టేషన్‌లో ఉంది. గబగబ దిగాము మేము ముగ్గురమూ; కృష్ణశాస్త్రి తాపీగా దిగాడు. పరుగెత్తి రైలు అందుకుందామన్నా కృష్ణశాస్త్రి కదలడే! కొండ విరిగి నెత్తిమీద పడుతున్నాసరే, అతి ప్రశాంతంగాఉంటాడు అతను, పద్యాలలో అతని మనస్సు పరుగులెత్తుతుందేగాని, అతను భౌతికంగా ఒక్క అడుగువెయ్యలేడు. తొందరగా అలాచూస్తూ నుంచున్నాము నలుగురమూ. మనం ఎక్కవలసిన రైలు మనం లేకుండా వెళ్ళిపోవడం చూస్తూ నుంచోవడము ఒక వింత అనుభవమే. ఇది తరుచు జరుగుతుంది కొందరి జీవితాలలో.

స్టేషన్‌లో ఉన్న తీగ సంపెంగ పందిరి చూపించాను వారికి. పువ్వులు విర్రగబూసింది ఆ తీగ. స్టేషన్‌కి కాస్త అవతల ఉన్న పడవల కాలవవద్దకు వెళ్లి కూర్చున్నాము కాసేపు. తెల్లని తెరచాపలతో మా ముందు సాగిపోతున్న పడవలను చూస్తూ అక్కడే ఉండిపోయాము. కాని, కాస్సేపటికి ఆకలేసింది అందరికీని. తిరిగి స్టేషన్‌లోకి వచ్చి పన్నెండు గంటల రైలులో వెళ్ళే జనం కోసం పెట్టె దుకాణమతను చేసి ఉంచిన ఫలహారమంతా కాజేశాము. ఎంత! - ఆ స్టేషన్‌లో ఒక్క రెండు నిమిషాలు ఆగుతుంది రైలు. ఎంతో ఫలహారం లేదు.

అప్పుడు నాకో ఆలోచన తట్టింది. స్టేషన్‌కి ఒక పావుమైలు దూరంలో ఉన్న వూళ్ళో, పెద్దింటాయన కంట్రాక్టర్ నాయుడుగారు జ్ఞాపకమొచ్చారు. పోర్టర్‌ని పిలిచి, అతని చేతిలో ఒక పావలా ఉంచి ఈ చీటీ నాయుడుగారికి ఇయ్యమనిచెప్పి అతనిద్వారా నాయుడుగారికి ఉత్తరం పంపాను. ఇదివరకు నేను వారిని ఎరుగను. కానీ మా నాన్నగారిని గురించీ మా పినతండ్రిగారిని గురించీ ఆయన తప్పకుండా విని ఉంటారని నా ధైర్యం. నాయుడుగారు తమ కుమారుణ్ణి పంపారు మావద్దకు. ఆనాడు వారింట రాజభోగంగా జరిగింది మాకు. అంతకు నాలుగు రోజులముందే వారింట పెండ్లి జరిగింది. ఆఏర్పాటు లన్నీ అలాగే ఉన్నాయి. స్నానానికని నూతివద్దకు వెళ్ళగా ఊరంత కాగులో వేన్నీళ్ళు మసులుతున్నాయి. తలంటుకో శూనె; వాసన సున్నిపిండి; కుంకుడు

కాయలూ అమర్చి ఉంచారు. వడ్డెమంగలి సిద్ధంగా ఉన్నాడు. కృష్ణశాస్త్రి సరదాగా తలంటుకున్నాడు. అరగంటో గంటో పట్టింది అతని అభ్యంగ స్నానము. పంచభక్ష్య పరమాన్నాలతో విందారగించి, కొంతసేపు విశ్రమించి సాయంత్రం రైలు వచ్చేవేళకు స్టేషన్‌కి జేరుకున్నాము, నాయుడుగారి అతిథి సత్కారాన్ని ఎంతో మెచ్చుకుంటూ.

ఆ రాత్రి చింతా దీక్షితుల వద్దకు తీసుక వెళ్లాడు నన్ను కృష్ణశాస్త్రి. ఎంతో దూరం వెళ్లాము. ఒంటెద్దు బండిమీద, వారింటికి. ఈసారి కృష్ణశాస్త్రి ఒక్క ఇరవైనాలుగు గంటలే ఆలస్యంగా వస్తే! అప్పటికే నేను దీక్షితులు రచనలు చదివి ఉన్నాను. వారితో కులాసాగా కబుర్లు చెప్పుకొని రాత్రి పదింటికి కాబోలు మొక్కపాటి రామమూర్తి ఇంటికి వెళ్ళాము. ఆయన అప్పుడు సెంట్రల్ జయిల్‌లో పెద్ద ఉద్యోగిగా ఉన్నారు. ఇంత రాత్రివేళ వారిని లేపడము ఎందుకన్నాను గాని, కృష్ణశాస్త్రి వినలేదు. ఆయన మమ్మల్ని ఎంతో దయతో ఆహ్వానించారు. చాలాసేపు ఈ మాటా ఆ మాటా మాట్లాడాము. "నేను ప్రొద్దున్నే పది గంటలకు పిఠాపురం వెళుతున్నా. ఇతను రేపు మధ్యాహ్నం వస్తాడు మళ్ళా" అన్నాడు కృష్ణశాస్త్రి, నన్ను ముందు అడగకుండానే. రాత్రి పన్నెండింటికి కాబోలు ఊళ్ళోకి వచ్చి మెయిన్ రోడ్‌లో ఉన్న ఏదో ప్రెస్‌లో ఆ బల్ల మీద పడుకున్నాము.

ఉదయాన్నే గోదావరీ స్నానంచేసి, కాఫీ హోటల్‌కి వెళ్లాము. ఒక బల్ల వద్ద అదివరకే ఇద్దరు కూర్చొని ఉన్నారు. ఒకరు స్ఫురద్రూపి. కళ్ళకు ఫ్రేములేని "పాన్స్‌నే" ఉంది. ఆయనను చూస్తేనే నమస్కరింప బుద్ధి వేస్తుంది. రెండవ అతను పొట్టిగా, నల్లగా ఉన్నారు. ముఖాన స్ఫోటకపు మచ్చలు. కాని, ముఖం మాత్రం ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది, కృష్ణశాస్త్రీ నేనూ వెళ్లి వారి ప్రక్కనే కూర్చున్నాము. మేము కూర్చోగానే, మావద్దకు వచ్చిన సర్వర్‌తో ఆ నవ్వు మొఖము ఆయన బిగ్గరగా "నాకు ఇడ్డెనలు వల దనినాను!" అన్నారు. కృష్ణశాస్త్రి రచించిన "నాకు మరణంబు వలదనినాను" అనే పద్య పాదానికి పారడీ ఇది. కృష్ణశాస్త్రి: "ఇతనే వేదుల సత్యనారాయణ శాస్త్రి" అన్నాడు. వేదులనుగురించి విని ఉన్నాను. అతని రచన నాకు చాలా

ఇష్టము. ఐతే. ఎంత సంకరమైన విషయమును వర్ణిస్తున్నా, అతను వ్యక్తిగా చాలా బాధపడుతూన్నట్టు తోస్తుంది. అటువంటి మనిషి ఇంత నవ్వుతూ, ఇంత సరదాగా ఉండడము నా కెంతో ఆశ్చర్యమైనది. లోలోపల కుమిలిపోతున్నా, పైకి ఇంత ఆనందంతో ఉండడము చాలా కష్టం.

ఫ్రేన్స్‌నే పెట్టుకున్న స్ఫురద్రూపికి నన్ను పరిచయంచేస్తూ "వీరే తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి" అన్నాడు కృష్ణశాస్త్రి. సాహితీసమితి స్థాపకులూ వీరందరికీ గురువులాంటివారూ ఆయన, నమస్కరించాను. కాని, ఈసారి ఆయనతో ఎక్కువగా మాట్లాడలేదు.

మధ్యాహ్నం, అనుకున్న ప్రకారం మొక్కపాటి రామమూర్తిని చూడడానికి వెళ్లాను.

ఆయనతో కలిసి జైలులో భోజనశాల, కర్మాగారము అవీ చూశాను. ఎన్నో విషయాలనుగురించి మాట్లాడాను ఆయనతో. కృష్ణశాస్త్రి అన్నట్టు రామమూర్తి ఎంతో స్నేహశీలి. అనేక విషయాలలో ఆయన అభిప్రాయాలు సమకాలిక అభిప్రాయాలకు భిన్నమైనా, నా ఉద్దేశంలో ఎంతో సమంజసంగా తోచాయి. మాటల సందర్భంలో టాల్‌స్టాయ్ ప్రసక్తి వచ్చి, ఆ రోజులలో నేను చదువుతూన్న 'రిసరెక్షన్' అనే టాల్‌స్టాయ్ రచన గురించి చెప్పాను ఆయనతో. "చాలా గొప్ప పుస్తకమట గదా, నేను చదువలేదు ఇంకా" అన్నారు. "బెంగుళూర్ వెళ్ళాక నా కాపీ పంపుతాను" అన్నాను. కాని, ఏ కారణంవల్లనో పంపలేకపోయినా. జీవితంలో నేను చేసిన విషయంగురించి గాని, చేయని విషయంగురించిగాని, దేనినిగురించీ నేను అంతగా చింతించను. రామమూర్తికి ఈ పుస్తకం పంపలేదనిమాత్రం ఇప్పటికీ చింతిస్తూ ఉంటాను.

ఈ మా సమావేశం జరిగిన రెండేళ్ళలోగా ఆయన చనిపోయారు. ఆ సమయాన నేను మరో పుస్తకం చదువుతున్నా. "ది ఉమన్ హు డైడ్" అనే గ్రంథం. కేవలం ఆదర్శజీవి, ఐన ఒక ఆమె తన అభిప్రాయాలు లోక సంప్రదాయానికి విరుద్ధమైనా, అవి మార్చుకోక, అవే సత్యమని నమ్మి ఆ ప్రకారమే నడచుకుంటుంది. కాని, ఆమె కని, పెంచి, పెద్దదానిని చేసిన కుమార్తెకు మాత్రం ఈ అభిప్రాయాలు నచ్చవు. కూతురుమతం మార్చ

డానికి తల్లి ప్రయత్నింపదు సరికదా, తనవల్ల కూతురు భావిసౌభాగ్యానికి ఆటంకం కలుగుతుంది అని దృఢమైనప్పుడు, నిశ్చింతగా ప్రాణత్యాగం చేస్తుంది ఆ తల్లి. తన అభిప్రాయాలకు తానే బలి అవుతుంది — కూతురు సుఖాన్ని ఆపేక్షించి.

ఇంచుమించు ఇటువంటి ఆకస్మిక మరణమే పొందాడు ముక్కపాటి రామమూర్తి. నేను అనేక పర్యాయాలు అనుకున్నాను: అతను ఇంకొక్క ఏబది ఏళ్ళ తర్వాత పుట్టిఉంటే అతని అభిప్రాయాలు అంత లోక విరుద్ధంగా కనపడి ఉండవేమోనని. ఆ మాట అల్లా ఉండగా, ఎంతో మంచివాడు అతను; వెన్నవంటి మనస్సు. ముమ్మాటికీ స్నేహశీలి. అందుకే కృష్ణశాస్త్రి తన 'ప్రవాసాన్ని' అతనికి అంకితమిస్తూ ఇలా అంటాడు: "ఈ పాటబ్రతుకు నీకేపాటిదోయి, నా నెచ్చెలీ!" —అని, రామమూర్తి ఆఖరి నిమిషాలను తలపిస్తూ, రామమూర్తి అన్నట్లే, ఇలా అంటూ, కావ్యం ముగిస్తాడు :

నేను మరణించుచున్నాను; ఇటు నశించు
నా కొరకు చెమ్మగిలు నయనమ్ములేదు.
పసిడి వేకువ పెండ్లిండ్ల పడిన ఎవరు
కరుగనేర్తురు జరఠాంధకార మృతికి !

అరుణోదయపు బంగారపు కాంతిలో పెండ్లిసందడిలో ఉన్నవారు, అయ్యో! పాపము! ముసలిదై, నిశాతన్వి చనిపోతోందే! అని, చింతిల్లరుగా, అని.

ఆనాడు పూల పల్లకిలో పూలమాలలను కూర్చోపెట్టిన కవే ఈనాడు స్నేహితుని మరణ శయ్యను చిత్రిస్తాడు.

ఇదే కాబోలు జీవితమంటే!

*　　*　　*　　*

ఏకాకియగు నా యెడద కెంతొ అశ గొలిపెడి
నిర్మల నీలాంబరంబు దేదీప్యమానమగు దివ్య

## నా స్మృతి పథంలో...

వర్ణములతోడ నీ కనుల మిరుమిట్లు గొలుపునంచు...
అతిదూర మైనట్టి యా నీల నగమంటి
నిమిష మాత్రములోన నింగివీడి
అరుణ కాంతులతోడ నదృశ్య మగునట్టి
కమల మిత్రుడు నీ కనుల యెదుట
సాగరాంతర మందుండి స్నానమాడుచు లేచి
ప్రకృతిని మేల్కొలుపు ప్రభల తోడుత
పొడసూపునంచు...
ఇచటగల వింత సుందరానందకర సర్వ వస్తుచయము
నీ దెసనె యున్న అద్భుతానందమయ మహాప్రపంచమునకు
ప్రతిబింబమే యంచు......
ప్రభుని యానతిచే బగలు రేయి
తమ తమ విధుల దప్పక చరించు
చుక్కగుంపులు, చంద్రుడును కూడ
నీదు చల్లని సేమవార్తను దెచ్చు
దూతలే యంచు......తంచినపు డంత,
నీవు నేనును కూడ, నిఖిల లోకముల నావరించి యట్టి
ఆ బ్రహ్మాండ తేజమందలి బాల కిరణాల మంచు
బోధపడదె సఖియ!

నాలో అవతరించిన మొదటి ప్రేమగీతము ఇదే అనుకుంటాను, 'సఖి' ఎవరో చెప్పడం మాత్రం కష్టం. ఇరవైయేళ్ళ వయస్సులో వ్యక్తులకంటె గుణాలు మనలను ఎక్కువగా ఆకర్షిస్తాయి. సౌజన్యము, త్యాగము, దయ, ఆదరణ, ఇటువంటి గుణగణాలు మన ప్రేమకు పాత్రమవుతాయి. అవి చాలా ప్రస్ఫుటంగా ఒక వ్యక్తిలో కనిపిస్తే ఆ గుణాలకొరకు ఆ వ్యక్తి మన ఆరాధ్య

దేవత కావచ్చు. కాని, తానొక పూజావేదికపై ప్రతిష్ఠితమైనట్టు ఆ వ్యక్తికి తెలియకపోవచ్చు కూడా.

1924 లో బెంగుళూరు సైన్స్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరిన కొద్ది రోజులకే నా జీవితంలో కొన్ని విశేషానుభవాలు కలిగాయి. భారతదేశంలోనికెల్లా గొప్ప సంస్థ ఈ పరిశోధనాలయం. నాన్నగారు మిక్కిలి మనసుంచిన వనమూలికలను గురించిన రసాయనిక శాస్త్ర పరిశోధనలో నిమగ్నుడనయాను. ఇది వారుచెప్పి నట్టు, అంతులేని మహాసముద్రము. జీవితమంతా ధారపొయ్యవచ్చు ఈ పరి శోధనకు. మా ప్రొఫెస్సర్ డాక్టర్ జె. జె. సడ్‌బరో మిక్కిలి ప్రజ్ఞావంతుడు. ఆయన నాయందు విశేషమైన శ్రద్ధ తీసుకుని నాకు త్రోవ చూపించారు. కాని, కొద్ది నెలలలోనే, ఇరవై ఏళ్ళకు పైగా ఈ సంస్థకు సేవ జేసిన ఆయన పింఛను తీసుకుని స్వదేశానికి వెళ్ళిపోయారు. వారికి వీడ్కోలుగా గొప్ప సభ జరిగింది. ఆ సభలో ఆయన శాస్త్ర పరిశోధకుల విధులను గురించి ఉపన్య సిస్తూ అన్నారు: "నిరంతర కార్యదీక్షతో మీరు సాధించవలసినది ఎంతో ఉన్నది. సత్య స్వరూపాన్ని సాక్షాత్కరింప జేసుకొనడము అంత సులభం కాదు. ఉత్సాహము, నేర్పు, ఒక్కొక్కప్పుడు ఎంతో త్యాగము అత్యవసరము. దీనికి తోడు 'కాలము' అనేది ఒకపెద్ద ఆటంకంగా కనపడవచ్చు. కొన్ని కొన్ని విషయాలు నిర్ణీతకాలములో చేసితీరాలి. లేకుంటే మనశ్రమ వృథా అని పిస్తుంది" అన్నారు. ఈ విధంగా ఉద్బోధించి, మాకు తమ ఆశీస్సులను అందిస్తూ అన్నారు: "ఎక్కడ ఉన్నా, ఇక్కడ నాతో కలిసి పనిచేసిన ఒకవ్యక్తి నాకు మరీ మరీ జ్ఞాపకం వస్తూ ఉంటాడు. నా విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చడములో అతడు నాకెంతో మార్గదర్శకు డయ్యాడు. ఎండనక, వాన నక, పగలనక, రాత్రిఅనక అతడు ఈ పనియందు పూర్తిగా నిమగ్నుడయ్యాడు. అతనిని నేనెన్నడూ మరువను. ఎప్పుడూ అతనినిగౌరవిస్తాను. అదుగో ఆ వైపు కూర్చున్న వ్యక్తి అతనే!" అంటూ చేయెత్తి చూపారు మా ప్రొఫెస్సర్. అందరూ ఆ వైపు చూశారు, అక్కడ ఉన్న నలుగురైదుగురు విద్యార్థులూ ప్రొఫెస్సర్ తమ్మని గురించో ఏమో అని ఉత్సాహంతో లేచి నిలబడ్డారు, కాని,

వారిని ఒకరి తర్వాత ఒకరిని 'నీవుకాదు', 'నీవు కాదు' అని కూర్చోపెట్టి, చిట్టచివర బెంచిలో కడాన కూర్చొన్న వ్యక్తిని వేలుపెట్టిచూపారు ప్రొఫెస్సర్. అతడు అతివృద్ధుడైన లాబరేటరీ బంట్రోతు, డేవిడ్. ఏమి జరుగుతున్నదో అతనికి తెలియదు. విద్యార్థులు అతనిని చేయిపట్టుకు తీసుకువెళ్ళి ప్రొఫెస్సర్ ముందు నిలబెట్టారు. ప్రొఫెస్సర్ వి డేడ్ చేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుని, తన జ్ఞాపకార్థంగా ఒక బంగారపు పతకం బహూకరించాడు అతనికి, తరువాత, చాలా కాలము పనిచేశాడు డేవిడ్. అప్పటికి అతనికి ఏ అరవై యేళ్ళో ఉంటాయి. ఓ పదిఏళ్ళ తర్వాత, నేను మళ్ళా ఓనాడు ఇన్‌స్టిట్యూట్‌కి వెడితే, ఇంకా అక్కడే తన పనిని తాను యథావిధిని నిర్వర్తిస్తూ ఉన్నాడు. సడ్‌బరో ఇచ్చిన పతకం తన మిలిటరీ మెడల్స్‌తోపాటు కోటుకు తగిలించుకు ఉన్నాడు, డెబ్భైయేళ్ళ డేవిడ్.

ఊళ్ళో ఏమి జరిగినా ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులైన మమ్మల్ని పిలిచేవారు. భారతీయ చిత్రకళా ప్రదర్శనానికి నాకు ఆహ్వానము వచ్చింది. ఎంతో అందమైన బొమ్మలు వచ్చాయి ప్రదర్శనానికి. అడివి బాపిరాజువి కొన్ని, కౌతా ఆనందమోహన్‌వి కొన్ని, మహనీయుడు ప్రమోదకుమార్ చటర్జీవి కొన్ని, ప్రదర్శనానికి ఎంతో వైభవమిచ్చాయి. బాపిరాజు బావా వచ్చాడు. అప్పుడే ఆనందమోహనుని కలుసుకొన్నాను. సౌజన్య శీలుడు, నిగర్వి, అతి ప్రతిభావంతుడు ఆనందమోహన్. ఆ తరువాత అహమ్మదాబాద్ వెళ్ళి అక్కడ ఒక కళాకేంద్రం స్థాపించాడు. అక్కడ ఉండగానే జబ్బుచేసి, పిన్న వయసులోనే చనిపోయాడు ఆనందమోహన్. అతను పోవడము మన కళా ప్రపంచానికి ఒక తీరని వెల్తి.

చిత్రకళా ప్రదర్శనతో బాటే, హరీంద్రనాథ్ చటోపాధ్యాయ, అతని సతీమణి కమలాదేవీ- వీరి వెరైటీ ఎంటర్‌టెయిన్‌మెంట్ కూడా జరిగింది. హరీన్‌ను ఐదారేళ్ళ క్రితం మద్రాస్‌లో చూచాను. తాను రచించిన 'అబూహసన్' సంగీత నాటికను అద్భుతంగా ప్రదర్శించాడు. తరువాత ఒకసారి విశాఖపట్టణం టౌన్ హాలులో మా బావ మల్లవరపు వెంకటకృష్ణారావు, నేనూ అతని సంగీతము విన్నాము. అంత శ్రావ్యముగాని హార్మోనియమును కూడా

అతడెంతో నిపుణతతో వాయించేవాడు. అతని హార్మోనియం వింటూఉంటే, అచ్చంగా వయొలిన్ వింటూన్నట్లు ఉంటుంది, అంతటి ప్రజ్ఞా చూపిస్తాడు. ఈరోజు వా రుభయులూ కలసి కొన్ని కళాఖండాలను చక్కగా ప్రదర్శిం చారు. 'తరుణ అరుణసే' అనేపాట ఎంతో అందంగా పాడుతూ అభినయిం చాడు హరీన్. ఎక్కువ రంగస్థల పరికరాలు లేకుండా కేవలం కళాకృషి వల్ల విపరీతంగా రంజింపచేయ గలిగారు వారిద్దరూ. ప్రదర్శనానంతరం నాకు వారిద్దరితోనూ పరిచయమైంది. హరీన్ విషయంలో పరిచయమంటూ లేదు, అది వెంటనే స్నేహంగా పరిణమిస్తుంది. ఏమాత్రం సహృదయత్వమున్నా ఇట్టే తనతో కలుపుకుంటాడు మనలను హరీన్. "ఉదయం మా యింటికిరా, పాట విందువుగాని" అన్నాడు. ఉదయమే వెళ్ళాను. అప్పటికే తంబూర శ్రుతి చేసుకొని హాయిగా పాడుకుంటున్నాడు హరీన్. హిందూస్థానీ భైరవ్ కాబోలు ఆలపిస్తున్నాడు. గంటన్నర కూర్చొని ఏకాగ్రతతో విన్నాను, అతని గానము.

తరువాత మా కిద్దరికీ చాలా స్నేహమైంది. నాకేకాదు. నన్ను చూడడానికి బెంగుళూరు వచ్చిన దేవులపల్లి కృష్ణశాస్త్రి, గుడిపాటి వెంకటచలముకూడా అప్పుడే హరీన్‌ను కలుసుకుని అతనికి ఆప్తమిత్రు లయ్యారు. కృష్ణశాస్త్రి రచనలను కొన్నిటిని హరీన్ ఇంగ్లీష్‌లో వ్రాయ ప్రయత్నించాడు. వెంకట చలం హరీన్‌ల మధ్య అతిగాఢమైన పరస్పర సానుభూతి ఏర్పడింది. ఒక రోజు ఉదయం షికారుకని వెళ్ళి, మధ్యాహ్నం రెండు దాటాక కాని, తిరిగి రాలేదు వారిద్దరూ. ఎక్కడికి వెళ్ళారూ అంటే,. పార్కుగోరీలవద్ద గులాబీ తోటలో కూర్చున్నాము, మాట్లాడుకుంటూ ఉండిపోయాము అన్నారు. ఆనాడు ఇద్దరూకూడా కొంతవరకు సంఘశత్రువులే. "సంఘం చేతులో తాము పడిన గాయాలను గురించి ఒకరిని ఒకరు పరామర్శించుకొన్నారు కాబోలు" అన్నారు కమలాదేవి.

* * * *

ఇన్‌స్టిట్యూట్‌లో అందరితోనూ నాకు స్నేహమైనా, నలుగురు నాకు చాలా ఆప్తులయ్యారు. సింద్ దేశస్థుడు మీర్‌చందానీ, గుజరాతీ యువకుడు

శుక్లా, కన్నడ బాలుడు గోపీనాద్, కేరళకుమారుడు పనిక్కర్. మేము ఐదు గురం ఎక్కడికి వెళ్ళినా కలిసి వెళ్లేవారము. అనేక విషయాలలో మా అభి ప్రాయాలు ఎంతో ఏకీభవించేవి. ముఖ్యంగా మీర్‌చందానీ, శుక్లా నాకు కాసా అన్నదమ్ములకంటె ఎక్కువ ఆప్తులయ్యారు. కాలక్రమేణ, కొన్ని ఏళ్ళ తర్వాత, శుక్లాకు జబ్బుచెయ్యగా, అతనిని చూడడానికి బొంబాయి వెళ్ళిన నేను, ప్రమాద స్థితిలో ఉన్న అతనిని విడువలేక అక్కడే ఉండి అతనికి పరిచర్య చేశాను. విధి బలీయమై, ఎంతటి గొప్ప వైద్యమూ ఫలింపక, నా చేతులలోనే అతను కళ్ళు మూశాడు. మృత్యువును అంత సమీపంగా చూడడము అదే మొదటిసారి, నా జీవితంలో. ఆప్త స్నేహితుని పోగొట్టు కున్నాను అనే దుఃఖభారము కంటే ఎక్కువగా, ఎడతెగని శారీరకమైన బాధనుండి అతని ఆత్మకు విముక్తి కలిగినందుకు ఎంతో శాంతి కలిగింది, నా మనస్సుకు. మరునాడుగాని తెలియలేదు, అతను లేని వెల్తి.

మీర్ చందానీ అతి స్నిగ్ధ హృదయుడు. పురుషశ్రేష్ఠుడు అనడం అతిశయోక్తి కాదు. యుక్తాయుక్త విచక్షణ అతనివద్ద నేర్చుకోవాలి ఎవరన్నా. కేవలం సంతోషప్రియుడనైన నాకు అనేక పర్యాయాలు కలిగిన సమస్యలను అతని ముందు ఉంచే వాడను. మనస్సు ఒక మార్గం చూపిస్తే, హృదయం మరో మార్గం చూపిస్తూ ఉండేది నాలో. అప్పుడూ, ఇప్పుడూ కూడా, అంతే. ఏమి చెయ్యాలో తెల్సుకోలేక, అతని వద్దకు వెళుతూ ఉండేవాడను. అతను సవిమర్శగా ఆలోచించి, ఇలా చేస్తే నీకు ఇష్టం, ఇలా చేస్తే నీకు మంచిది, అని చెప్పేవాడు. చివరకు నాకు మంచిదైన విధంగా గాక, నాకు ఇష్టమైన విధంగానే నిర్ణయించేవాడను. అంతమాత్రంచేత అతనికి నాపై ప్రేమ తగ్గ లేదు. నన్ను ఎంతో దయగా చూచేవాడు. నా సంతోషమే అతని సంతోషంగా భావించేవాడు. అందుచేతనే గాబోలు, సెలవు రోజులలో నన్ను చూడడానికి బెంగుళూరు వచ్చిన మా అక్కయ్య, అతని సుగుణాలు వెంటనే గ్రహించింది. తరువాత పదేళ్ళకు అతనిని పెండ్లాడింది. రత్నమాణిక్యాలలాంటి కూతురూ కొడుకూ పుట్టారు వారికి.

నాలో ఏదో మార్పు వచ్చింది. ఇది పూర్తిగా ఒక వ్యక్తి ప్రభావంవల్ల అనలేను. అది నిమిత్తమాత్రమో ఏమో కాని, నియమంగా ఖద్దరు- ముతక ఖద్దరు, కట్టసాగాను. వేషభాషలలో మిక్కిలి పాశ్చాత్య పద్ధతులకు అలవాటైన ఇన్‌స్టిట్యూట్‌లో అందరికీ ఇది చాలా వింతగా కనిపించింది. శ్రద్ధగా నూలు వడకడం ప్రారంభించాను. నూలు వడకడము ఒక విచిత్రానుభవము. వీలైనంత త్వరలో నూరో నెంబరు నూలు వడకాలని వుండేది, ఆవేశం. కదురునుంచి నూలు సన్నగా చేతిలోకి వచ్చేటప్పుడు- చిన్నప్పుడు, మా ఇంట, మా పిన్నికి వీలుకానప్పుడు, ఆమె పెంపుడు ఆవును నేను పాలు పితికే అనుభవం జ్ఞాపకం వచ్చేది. ఈ నూలు ఆ సన్నని పాలధారగా ఉండేది. పాదరక్షలు మాని, పావుకోళ్ళు తొడుక్కోసాగాను. గాంధీజీ తత్వానికి ఇంకా దగ్గరగా వుండాలని.

ఇదంతా ఒక వ్యక్తిపై ఉండే గౌరవంవల్లనే కావచ్చు. ఇదివరకే ఉన్న పరోపకార చింత నాలో మరీ అతిశయించింది. అదీ ఒక వ్యక్తిని ఉద్దేశించినది ఐనా, ప్రతి చేష్టలోనూ, మేలుకొన్నా నిద్రిస్తున్నా: "నీ వెత హరింతు సుఖమెల్ల నీకె యుంతు" అనే ఆశయం ఆవహించింది నా ప్రతి ఆలోచననూ.

ఐతే, ఎవరిమీదా అంత అపేక్ష ఉండరాదు. అపేక్ష మన దృష్టిని తప్పకుండా సంకుచిత పరుస్తుంది. పైగా, అపేక్షవల్ల ఎంతో బాధ కలుగుతుంది. మనం ప్రేమించినవారు నిరంతరం మన సమక్షాననే ఉండాలనిపిస్తుంది. అది సాగక, వారు మనకు దూరమవటమేగాక, వారి సాంగత్యం మన ఊహాంచలాలకుకూడా అందనిదిగా పరిణమించినప్పుడు పట్టరాని ఆవేదన కలుగుతుంది. ఆ స్థితిలోనే ఒకనాటి సాయంత్రం, చీకట్లు క్రమ్ముతున్న ఆకాశాన వెలసిన చుక్కను చూడగానే నా పేదహృదయం ఇలా వాపోయింది:

When the Heart is heavy with thoughts of Thee,

When the home- coming bird calls in divine motherhood to the eager nursling in her nest,

When all Creation, dumb, weary and spent, seeks for a night's repose,

Then, I, a homeless beggar, drop a silent, painful tear in which gleams the distant star of Love !

ఈ అనుభవంలోని సత్యత గుర్తించో, ఈ పంక్తులలో ఉన్న లేశము రమ్యతవల్లనో, నా యందలి అపారమైన అభిమానం వల్లనో, ఇది పంపిన వెంటనే త్రివేణిలో ప్రచురించారు. ఆ ఇంగ్లీషు మాటల భావము ఇది :

నీ నిరంతర స్మరణ నా యెద వేగునపుడు
మమతతో కూయుచు మునిమాపువేళ
గువ్వ తల్లియు తన గూడు చేరునప్పుడు
సొమ్మసిల్లిన సృష్టియు సుషుప్తి పొందునపుడు
నిలువ నీడేలేని నిరుపేద బిక్షుకుడ నేను
బాధతో రాల్చిన మౌన బాష్ప కణమ్మునందు
దూరమున దీపించు నా దివ్యతార
ప్రేమ కాంతుల బరవుచు ప్రజ్వరిల్లు.

కొన్నాళ్ళు నా రసాయనికపరిశోధనలలో పూర్తిగా నిమగ్నుడ నయ్యాను. ఇంతలో దసరావచ్చి, మా కన్నడ స్నేహితుడు గోపీనాథ్ మమ్మల్ని నలుగురినీ తనతో మైసూరు తీసుకువెళ్ళాడు. అతని పితామహుడు గొప్ప ఇంజనీర్ పదవిలో ఉండి పింఛన్ తీసుకున్నాడు. వారంతా మమ్మల్ని చాలా ఆదరించారు, పూటకో వింతచూస్తూ చాముండేశ్వరీ ఆలయం. రాజ దర్బారు, కళా నికేతనం, మహారాజావారి విజయదశమి ఊరేగింపు- అన్నీ చూచాము. పది రోజులు చాలా సంతోషంగా గడిపి తిరిగి ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చాము. తిరిగి ఎప్పటి కృషే.

కానీ నాలో పెద్ద బెంగ ఏర్పడింది. నేను ఎవ్వరికీ అక్కరలేదు అనే భావము నిమిష నిమిషమూ దృఢమైంది. ఆ దిగులే ఇలా వెలిబుచ్చాను:

One drop of woter, fast asleep in the Ocean's mighty depths:

One grain of sand, glistening through heat, in the Desert's endless sands;

## నా స్మృతి పథంలో ...

One speck of dust, floating through Time in the Universe's stupendous expanse;

One lost Phantom, of a myriad that figure in the pitiless play of Life and Death !

అగాధ సాగర గర్భాన, దీర్ఘ నిద్రలో మునిగిఉన్న ఒకే ఒక జల బిందువు; అంతులేని మండుటెడారులలో, మిలమిల మెరయు ఒకే ఒక ఇసుక రేణువు; అనంత విశ్వాన, కాలవాహినిలోబడి తేలిపోవు ఒకే ఒక చిన్ని నలుసు; అనుకంపారహిత జీవన్మరణ మహా నృత్యమున నటించు అసంఖ్యాక ప్రేత గణములలో, దారి తప్పిన ఒకే ఒక ప్రేతమూర్తి!

ఆపేక్ష మంచిదే. కాని, ఆ ఆపేక్షవల్ల ఎవరిపైనా మన కేదో ప్రత్యేకమైన హక్కు ఉన్నదని అనుకోకూడదు. మన ప్రేమ నిర్మలాకాశ పథంలో వీచే చలువ తెమ్మెరలా ఉండాలి గాని, బంధించివేసే, బంగారపు సంకెళ్ళలా ఉండకూడదు.

నన్ను చూడడానికి వచ్చిన మా అక్కయ్య, అప్పుడు నేను చదువుతూన్న కృష్ణశాస్త్రి కృష్ణపక్షంలో ఒక పద్యం ప్రత్యేకంగా గుర్తు పెట్టుకొని ఉంచుకోవడము చూచి, నా కొరకు చాలా బాధపడింది — ఆమెకు చాలా సున్నిత హృదయం కాబట్టి :

> ఏనొ దీనుడ నే నీడనైన నోదిగి
> అడుగిడగలేక నిట్టూర్పు విడువలేక
> పొరలు కన్నీటి కాల్వలు గురియలేక
> ఏనొ దీనుడ నే నీడనైన నోదిగి
> కాంచెదను నిన్ను కనులార, గరవుదీర.

"నీలో ఇంత బాధ కలిగించే భావము ప్రేమ కాదేమో, అది చాల వరకు మమకారమేమో!" అన్నది అక్కయ్య. ఆ మాటే నిజము.

## ౧౪

పరమపావని నా ప్రేమరాణిని
పాడుకోటలో పట్టి కట్టిరి పాపులెవ్వరో
అతి పరాక్రపు టంగరక్షకు
లనుసరింపకయె, అంగనామణి
నే దెచ్చెదన్ ...

పట్టణంబులు పాడుపడనీ
కట్టడంబులు కరగి చననీ
తుదకు మనకీ వింత తోటయె
మిగిలేనుగా !

హరీంద్రనాద్ చటోపాధ్యాయ సావాసంవల్ల నాకు లేశపు కవిత్వధోరణి అబ్బిన లక్షణము అనుకుంటాను ఆ పంక్తులు. అవి అప్రయత్నంగానే అవతరించాయి.

బలే సరదా మనిషి హరీన్. ఇట్టే నవ్వించేవాడు. రంగస్థలమున అయినా, నలుగురు స్నేహితులతో కలిసి కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఉన్నా, ఎన్నో కథలు చెప్పేవాడు, వాళ్ళ అక్క సరోజనీదేవి గురించీ, తాను సీమలో కలుసుకున్న ప్రముఖులను గురించీ. ఒకసారి అతను సరోజినీదేవితో కలిసి మన ప్రాంతాలలో ప్రయాణం చేస్తుండగా, నిడుదవోలు స్టేషన్‌వద్ద మెయిల్ ఆగగా కిటికీలోంచి స్టేషన్ పేరు చదువుతూ ఆ కవయిత్రి "నిడా డవోల్ 'నిడాడవోల్!" అని దీర్ఘం తీస్తూ "ఎంత మాధుర్యంగా ఉన్నది ఈ పేరు. అచ్చంటా ఇటాలియన్ భాషలా ఉన్నది కాదూ?" అంటూ ఎంతో మెచ్చుకుంటున్నారట. ప్రక్కనే ఉన్న హరీన్‌వారి కంపార్ట్‌మెంట్‌కు ఎదుటనే నుంచుని వారివైపు నిదానించి చూస్తున్న వాకలిని పిలిచి "అబ్బాయి! ఇదేవూరు?"

అన్నాడట. వెంటనే, ఆ చాకలి నోరు బారెడు తెరచి "నిడదోలండే!" అన్నాడట అతి గ్రామ్యంగా. సరోజనీదేవి ఉచ్ఛారణలోని లాలిత్యానికీ, ఈ మోటుతనానికి గల తేడా గమనించి, కంపార్ట్‌మెంట్‌లో ఉన్న ఇతరు లందరూ ఫక్కున నవ్వారట.

ఇంగ్లండ్‌లో ఉండగా అతడు లారెన్స్ బునియన్, డబ్ల్యూ. బి. ఈట్స్- ఇటువంటి ప్రముఖ కవివర్యులను తరుచు కలుసుకుంటుండేవాడు. ఇతనంటే వారికెంతో అభిమానం. బర్నార్డ్‌షాను కూడా కలుసుకున్నాడు ఒకటి రెండు పర్యాయాలు. షాను గురించి హరీన్ ఒక కథ చెబుతాడు. మన దేశంలో నుంచి ప్రీవీ కౌన్సిల్‌లో ఒక అపీల్ విషయమై లండన్‌కు వెళ్ళిన ఒక ప్రఖ్యాత న్యాయవాది- అతను ప్రఖ్యాత నటుడు కూడా, బర్నార్డ్‌షాను దర్శించడానికి వెళ్ళి, షాతో తన నటనా కౌశల్యం గురించి చెప్పుకోసాగాడట. తను ప్రఖ్యాత న్యాయవాదిననీ, అయినా, నాట్యరంగంలో ఉండే అభిమానంకొద్దీ, షాను చూడడానికి వచ్చాననీ చెపుతూ, తనకు తన దేశంలో పెద్ద పేరు సంపాదించిన షైలాక్ పాత్రను అభినయించి చూపాడట షాకు. ఈ అభినయాన్ని ఓపికతో చూచిన షా, తన సహజ చమత్కృతితో "లాయర్‌గారూ! మీ చాకచక్యం న్యాయవాద వృత్తిలోనే రాణిస్తుందేమో సుమా!" అన్నాడట. ఈ కథ చెప్పి, అందరినీ నవ్వించేవాడు హరీన్.

ఉన్నట్టుండి, నలుగురిలోనూ నాకేసి తీవ్రంగా చూస్తూ "నువ్వు నా మనస్సు చాలా నొప్పించావు సుమా!" అనేవాడు. ఇదేం పాపమని కళవళపడుతూ "ఏం చేశాను? ఏమన్నాను?" అంటూ కారణమడిగేవాణ్ణి. చెప్పమని ప్రాధేయపడేవాణ్ణి. కొంతసేపు ఇలా నన్ను వేధించాక, "అబ్బే ఏమీలేదు; నీవు నన్ను నొప్పించావు అనేసరికి నీ నవ్వు మొఖంలో కలిగే విపరీతపు మార్పును చూడాలనిపించింది. ఎంతో బాధపడ్డావు పాపం!" అనేవాడు.

ఒకరోజు ఉదయాననే లేచి, అతనిని చూడడానికి వెళితే, ఎంతో ఆశ్చర్యంగా అప్పుడే రేడియోలో ఆ వార్త విన్నట్టుగానే, "విన్నావా! అమెరికాలో అందరూ హిందువులే అట!" అన్నాడు హరీన్. అదేమిటి అంటే "అమెరికాలో

ఎక్కడ చూచినా హరీయే!" అనేవాడు నవ్వుతూ. హర్రీ అంటే అతి తొందర.

"తేనె అంటే ఏమిటో తెలుసా?" అని అడిగేవాడు. "పునర్జన్మకై వేచివున్న పుష్ప సౌరభము కాదా?" అనేవాడు ఎంతో అందంగా.

ఒక్కొక్కప్పుడు ఎక్కడలేని నిస్పృహతో "ఎంతో చెప్పాలనివుంది. ఒక్కమాట రావటంలేదు" అని వాపోయేవాడు. ఒక్కొక్కప్పుడు కొండంత ఉత్సాహంతో "బ్రహ్మాండమైన రచనకు ఉపక్రమించాను; చూడు, ఈ పద్యం ఎలా కుదిరిందో" అని అద్భుతమైన క్రొత్త పద్యం వినిపించేవాడు. చేతులు జోడించి, నమస్కరించాలి, అనిపించేది. అంతటి భావసంపద, లాలిత్యం ఉండేవి ఆ కవితలో.

దేవులపల్లి కృష్ణశాస్త్రీ అతనూ కలిసి, కృష్ణశాస్త్రి రచనలను కొన్నింటిని ఇంగ్లీష్‌లో కూర్చడం చాలా తమాషాగానే ఉండేది. కృష్ణశాస్త్రికి ఇంగ్లీష్‌లో మంచి పాండిత్యమున్నా, అదో నియమంగా పాటించి కాబోలు, ఆ భాషలో ధారాళంగా మాట్లాడేవాడు కాదు. హరీంద్రనాధ్ చటోపాధ్యాయకు తెలుగు చక్కగా అర్థమవుతుంది; కాని, కొన్ని కొన్ని మాటలు తెలియవు. కాని, అతి కుశాగ్రమైన బుద్ధి. అద్భుతమైన కవితాహృదయం: కాబట్టి పద్యం వింటూ ఉంటేనే, భావం ఇట్టే గ్రహించేవాడు. వెంటనే రమ్యమైన ఇంగ్లీష్ మాటలతో అనేసేవాడు ఆ భావాన్నే, రెట్టించిన మాధుర్యంతో. ఉబ్బి తబ్బిబ్బయ్యేవాడు కృష్ణశాస్త్రి. అప్పుడప్పుడు మాత్రం, ఒకానొక అపరిచిత ప్రయోగపు అర్థం వెంటనే స్ఫురింపక, దానిని విపులంగా ఇంగ్లీష్‌లో చెప్పమనేవారు నన్ను. ఈ విధంగా నాకు వారిద్దరి రచనావిధానంతోనూ మరింత పరిచయం కలిగింది. ఒక్కొక్కప్పుడు ఆ తెనుగు రచనలో తనకు స్ఫురించినదానికి సాదృశ్యమైన ఇంగ్లీష్, హిందీ రచనలను జ్ఞాపకంచేస్తూ ఎన్నో క్రొత్త విషయాలు చెప్పేవాడు హరీన్. అతనికి చాలా గట్టి ఆశ ఉండేది తెలుగులో వెలసిన నవ్యసాహిత్యపు అందాలను, ఇంగ్లీష్ ద్వారా, లోకానికి తెలియజెయ్యాలని. కాని, ఇది సాగలేదు. భారతదేశపు అన్ని

ప్రాంతాల వారితోనూ పరిచయమున్నా, హరీన్‌కి తెలుగువాళ్ళంటే ప్రత్యేకమైన అభిమానం.

హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ఇంగ్లీష్‌లో తుకారామ్ నాటకం రచించి రంగస్థలమున ప్రదర్శించినప్పుడు అతనితో కలిసి పనిచేశాను నేను. అతను తన కావ్యాన్ని రంగస్థలాన రాణించే రీతిని మెరుగులు దిద్దడము చూచేవాణ్ణి. నాకేదో మహా తెలిసినట్టు, ఒకచోట 'ఈమాట బాగుంటుందా ?' అని అడిగే వాడు నన్ను. నాటకంలో పాల్గొనే వారి నందరినీ ఎంతో ఓపికతో తరిఫీదు చెయ్యడం చూచేవాణ్ణి.

ప్రదర్శనం ముందటి రోజున పట్నంనుంచి అతని అక్క మృణాళినీ, చెల్లెలు సుహాసినీ వచ్చారు. ప్రదర్శనాభారమంతా వారి చేతిలో ఉంచాడు. ఎంత నిపుణతతో పనిచేశారు వారు! హరీన్ భక్తాగ్రేసరుడైన తుకారామ్, తుకారామ్‌భార్య అవలాయీ వేషం కమలాదేవి. ఇద్దరూ ఎంతో చక్కగా అభి నయించారు. ఆ నాటకంలో, నా నటనాకౌశలం చూచికాదు, అతని ప్రక్కనే ఉండాలని, నాకూ ఒకపాత్ర ఇచ్చాడు. తుకారామ్ శిష్యుణ్ణి నేను. తంబూరా మీటుతూ తుకారామ్ అద్భుతంగా మరాటీ భక్తిగీతాలు గానం చేస్తూ ఉండగా, మధ్య మధ్య రమ్యమైన ఇంగ్లీష్ సంభాషణ గురు శిష్యులకు. నా కిచ్చినవి కొన్ని పంక్తులే. అయినా రంగస్థలానుభవం లేని నేను వలసినంత బిగ్గరగా అనలేకపోవడంవల్ల శిష్యునకు ఏదో ఉపదేశించడానికి దగ్గరగా వచ్చినట్టు నటిస్తూ తంబూరా ముఖానికి అడ్డంపెట్టికొని "ఇంకా బిగ్గరగా మాట్లాడు, ఇంకా బిగ్గరగా" అంటూ నన్ను హెచ్చరించినది నాకు బాగా జ్ఞాపకం.

నాటకమైన మరునాడు, అతను భార్యా సమేతంగా ఊటీ వెళ్ళాడు. నాటకంలో ఉపయోగించిన తుకారామ్ వ్రాతప్రతిని ఎంతో అందంగా టైప్ చేయించి, పుస్తకానికి రమ్యమైన ఆకుపచ్చ కాలికో బైండ్ కట్టించి, పైన బంగారపు అక్షరాలు ముద్రింపించి పంపాను నా కానుకగా వారికి.

రమ్యమైన వస్తువును సన్నిహితులకు ఇయ్యడంలో ఎంతో ఆనంద మున్నది.

* * * *

మా అక్కయ్య స్నేహితురాలు, శ్రీదేవి టెలిగ్రామ్ ఇచ్చింది బళ్ళారి నుంచి. "దేవులపల్లి కృష్ణశాస్త్రి మా ఊరు వస్తున్నాడు. నీవుకూడా తప్పకుండా రావాలి, వెంటనే" అని. ఆ రోజు టపాలోనే ఆమె మేనమామకూడా నా పేర ఉత్తరం వ్రాశారు. "మీ అక్కయ్య ఎప్పుడైనా వచ్చి మాతో నాలుగురోజులు ఉండి వెళుతుంది. కాని, నీవు వస్తావని ఇంకా ఎదురు చూస్తూనే ఉన్నాము. ఇదుగో వస్తున్నాదు, అదుగో వస్తున్నాడు అంటారేకాని, నీ రాక కానము. మీ స్నేహితుడు కృష్ణశాస్త్రి వస్తున్నాడు. అతనికి జతగా నీవూ ఇక్కడ రెన్నాళ్ళు ఉంటే మేమంతా చాలా సంతోషిస్తాము" అని వ్రాశారు. మాఅక్కయ్య తరుచు చెపుతూ ఉండేది, బళ్ళారిలో వారి ఆదరణ గురించి.

బళ్ళారిలో వారెంతో సంతోషించారు నా రాకవల్ల. రైలుదిగిన అర గంటకో గంటకో నన్ను బళ్ళారి రాఘవాచారి ఇంటికి తీసుకువెళ్ళారు. ఆయన చాలా ఆప్యాయంగా మాట్లాడారు. అచటివారికి మన తెలుగు వింతగా ఉంటుంది. అంచేత కొంతసేపటికి నేనూ ఆయనా ఇంగ్లిష్‌లోనే మాట్లాడ సాగాము. వారి స్నేహితులూ గురువూకూడా అయిన శ్రీ తారానాధ్‌కు నన్ను పరిచయం చేశారు. తారానాధ్ మహాజ్ఞాని; గొప్పవక్త; ఉపనిషత్సారం ఆస్వా దించిన మహావేదాంతి. పాశ్చాత్య తత్వశాస్త్రమున్నూ ఆమూలాగ్రం తెలుసు ఆయనకు. వందమందితో కలిసి మాట్లాడుతున్నాసరే ఆయన మాటలుప్రారం భించేసరికి రెండు నిమిషాలలో—లెక్క రెండు నిమిషాలలో — ఆ నూరు గురున్నూ తమ మాటలు మాని, ఆయన చెప్పేమాటలు వింటారు గంటలతర బడి. అంత చక్కగా మాట్లాడుతారు ఆయన. అట్టి వారితో నాకు పరిచయమూ తదుపరి స్నేహమూ కూడా కలిగింది. ఒకసారి అన్నారు ఆయన: "విద్య మనలో ఉన్న మానవత్వాన్ని ప్రస్ఫుటం చేస్తుంది; భక్తి మనలో ఉన్న దైవ త్వాన్ని ప్రస్ఫుటం చేస్తుంది" అని. ఇది ఎంతో నిజము.

ఉదయపు రైలులో కృష్ణశాస్త్రి దిగాడు. స్టేషన్‌లో నన్ను చూచి అతని ముఖం ఇంతైంది. నేను అతనికోసం రెండువందల మైళ్ళు వస్తాను అనుకో లేదు అతను—తాను ఒకరికోసం మూడులోకాలు తిరుగ కలిగినా; అతను ఊర్వశి కావ్యం వ్రాస్తున్న రోజులవి. కదిపితే కవిత్వం రాలేది అతనిలోంచి.

బళ్ళారిలోనే ఉన్న వారి దగ్గరబంధువుల ఇంటికి వెళ్ళి, వీలైనంత త్వరలో, పావుగంటలో, నే నున్నచోటికి వచ్చాడు.

వచ్చీ రావడంతోనే శ్రీదేవి అడిగింది అతనిని, "ఏమి క్రొత్తపద్యం వ్రాశారు?" అని. సన్నని చిరునవ్వుతో, బిడియపడుతూ బిడియపడుతూ తన జేబులోంచి మడచిన తెల్లకాగితం తీసి విప్పాడు. పెన్సిలుతో చెక్కి ఉన్నాయి అక్షరాలు. రైలులో అతను వ్రాసిన క్రొత్త పద్యం చదువ నారంభించాడు :

వెదకి వేసారి నా వెర్రి బ్రతుకెపుడేని
తుదిరేయి గనుమూయునా, బేలనై
నిదుర బరువుల క్రుంగునా!
మరపు మసకలదారి తెరచికొని కలయేదో
విరిసికొని పరతెంచును, కారు రా
తిరి కొనల మెరపించును!

కలగి, తొట్రిలుతూ, ఆకలి, తొందరల నోలుచూ, చేతులు ముందుకు సాచుతాడు; తన మందు కన్నులు తెరుస్తాడు. కాని, పాపము ఆ వింత కల కరగిపోతుంది, తన వంతకథే మిగుల్తుంది. 'వనరు చేద్వగలేను, చచ్చి చావగలేను' అంటూ, కనలేని ఆ వెలుగు కోసం, కనరాని దానికోసం, ఆ నిరాశా జీవితంలో అంటాడు:

ఒక క్రొత్త బరువుతో
ఒక క్రొత్త యాసతో
ఒకడనే పడిపోదును,
శూన్యమున
ఒకడనే కృశియింతునా!

శ్రీదేవీ ఆమె మేనత్తా మేనమామా అతనికేసి జాలిగా చూచారు. అతడు నాకేసి చూశాడు.

మరునాడు స్త్రీల సభ. శ్రీదేవి ఆ ఊరి స్త్రీ సమాజానికి కార్యదర్శి. ఆమె పిలిచినవారు చాలామంది వచ్చారు ఒక ఏభై మందిదాకా. కొందరు ఇంగ్లీషూ తెలుగూకూడా బాగా చదువుకున్నవారు. పూజ్యాలు, శ్రీదేవి మేనమామా నేనూ ఒక ప్రక్కగా కూర్చున్నాము. ఎత్తుగా అమర్చిన పీఠాన కవి కూర్చున్నాడు. గోష్ఠి ప్రారంభమైంది. సాహిత్య సమావేశంలో ఎప్పుడూ కృష్ణశాస్త్రి ఇతరుల పద్యాలు చదువుతాడు. మధ్యనో చివరనో తన రచనలు. సాధారణంగా విశ్వనాథ సత్యనారాయణ 'ఆంధ్ర పౌరుషం'లోని పద్యాలతో ప్రారంభిస్తాడు. ఆనాడు అతను

> ...యెన్నినాళ్ళయిన
> దో మన కృష్ణయు తుంగభద్రయున్
> బెన్నయు గౌతమీ నదియు
> విశ్వముప్రోగ నదించి యక్కటా !

అన్నప్పుడు అందరూ ఆశ్చర్యంతోనూ సంతోషంతోనూ చకితులయ్యారు. 'తుంగభద్రా సముత్తుంగ రావముతోడ, కవులగానము శ్రుతిగలయునాడు' అన్నప్పుడు వారందరూ చాలా మెచ్చుకున్నట్టు కనబడింది. విశ్వనాథవారివి ఇంకా కొన్ని పద్యాలు చాలా ఆసక్తితో విన్నారు. దేశభక్తి పూరితమైన పద్యాలు అవి అనేదే గాకుండా భాషకూడా తాము నిత్యమూ మాట్లాడుకునే. ప్రబంధాల తెలుగు భాషలా ఉంటుంది కాబట్టి వారికి చప్పున అర్థమైంది. తరువాత 'కవితా సామగ్రి' పద్యాలు శ్రద్ధగానే విన్నారు. కాని, ఆ పద్యాల అంతరార్థం వారు గ్రహించినట్లు లేదు. కృష్ణశాస్త్రి ఆ రోజులలో, తన పద్యాలు చదువవలసి వచ్చినపుడు తరుచు "శేటి వలపులో" పద్యాలు చదివేవాడు. కాని, ఈ రోజు ఆ పద్యం చివరి మాటలు వారు అంతగా హర్షించినట్లు లేదు. తరువాత అతను నండూరి సుబ్బారావు వ్రాసిన యెంకిపాటలు చదువసాగాడు. ముందు, కొంత ఉపోద్ఘాతం చెప్పాడు. మొదటి రెండు మూడు పాటలు విన్నాక, వారిలో కొంత అలజడి బయలుదేరింది. స్పష్టంగా గుసగుసలు వినబడ్డాయి. అతను నాలుగోపాట ప్రారంభింపబోతూండగా

భక్త సమాజం సెక్రటరీ నాగమణమ్మగారు "ఆయనను త్యాగరాజ కృతులు పాడమనండి" అని శ్రీదేవిని అడిగారు బిగ్గరగా. అందరూ అవును అన్నారు. శ్రీదేవికి తెలుసు, కృష్ణశాస్త్రి ఒకప్పుడు బ్రహ్మసమాజపు కీర్తనలు పాడిఉంటే పాడి ఉండవచ్చునేమో గాని త్యాగరాజకృతులు ఎన్నడూ సాధకం చెయ్యలేదని. ఏంచేస్తాడో అని ఉత్సాహంతో చూస్తున్నా నేను. కాని, అతను ఒక్క క్షణం తొణకలేదు. "ఎంతో భక్తుడు త్యాగయ్య. ఆయన రచనలన్నీ భక్తి ప్రధానములైనా, ఎంతో కవిత్వమున్నది, ఆ మహానుభావుని రచనలలో" అని మొదలుపెట్టి, కబీర్‌ను గురించీ మీరాబాయిని గురించీ ఎంతో చక్కగా చెప్పుకుంటూ పోయాడు. తరువాత, రాధాకృష్ణుల ప్రేమ, గీత గోవిందంలో జయదేవుని ప్రతిభ అద్భుతంగా వర్ణించి చెప్పాడు అరగంటసేపో, ముప్పావు గంటసేపో ! ప్రేమకూడా ఉత్తమోత్తమమైన భక్తి మార్గమని నిరూపించి, నమస్కరించి కూర్చున్నాడు. మహిళాసభ తరపున నాగమణమ్మగారు అతనిభక్తి భావమును గురించి ఉచితరీతిని ప్రశంసించారు. హెడ్‌మాస్టర్ భార్య, నాంచారమ్మగారు అనుకుంటూ, రేపు తమ పేటలో మీటింగు పెడదామని అడగటానికి ముందుకు వచ్చారు. కాని, "రేపు వారికి హంపీ ప్రయాణము,వీలుండదేమో" అని శ్రీదేవి వాయిదా వేసింది.

తరువాత, చాలాసేపు నవ్వుకున్నాము, కృష్ణశాస్త్రి సమయస్ఫూర్తిని మెచ్చుకుంటూ.

మరునాడు మా హంపీ ప్రయాణము చాలా చక్కగా సాగింది. హంపీ గ్రామకరణము శ్రీదేవి మేనమామకు దూరపు బంధువూ ఆశ్రితుడూను. అదృష్టవశాత్తు కరణంగారి అబ్బాయి ఆ రోజే వారిని చూడడానికి వచ్చాడు. ఆ అబ్బాయిని మాతోకూడా తీసుకువెళ్ళడంవల్ల మాకు చాలా సదుపాయాలు జరిగినవి.

ఐతే, హంపీ ఇవతల కామలాపురంవద్ద బస్‌దిగి, ఒక నాలుగు ఫర్లాంగులు నడవాలి. ఈ అరమైలూ నడిచేసరికి నాకు జ్వరం తగిలింది. ఇదివరకే లోన ఉన్నట్టుంది, ఈ ప్రయాణమువల్ల పైకి తోచింది జ్వరం. కరణంగారి అబ్బాయి కామలాపురం గవర్నమెంట్ ఆసుపత్రి డాక్టర్‌వద్దకు తీసుకువెళ్ళాడు

నన్ను. ఆయన, నాన్నగారి శిష్యుడు! శ్రద్ధతో పరీక్షించి మంచి మందిచ్చారు. దగ్గరనే ఉన్న రహదారీ బంగళాలో ఘడియసేపు విశ్రమించే ఏర్పాటుకూడా చేశారు. నాకు మంచి నిద్దురపట్టింది. నిద్దుర మేల్కొనేసరికి జ్వరం దిగజారింది. కాలినడకనే అందరమూ హంపీ క్షేత్రము జేరి పంపాపతి దేవాలయ ప్రాంగణంలో ఒకప్రక్కన మంటపంలో బసచేశాము. కరణంగారి అబ్బాయి మాకు ప్రసాదం, పాలు, పళ్ళు తెచ్చి ఇచ్చాడు. ఉదయమే హంపీచూడ ప్రారంభించాము.

చాలా ఆనందకరంగానూ ఉత్సాహకరంగానూ ఉంటుంది హంపీ. అడుగడుగునకూ, జీర్ణవిజయనగర సామ్రాజ్య చిహ్నాలూ, పవిత్ర రామాయణ గాథను స్ఫురింపజేసే ప్రదేశాలూ! ఇది రాయల విలాసభవనం అని ఆసక్తితో చూస్తూనే ఉంటాము. అదిగో! మాల్యవంతము!! అంటారు. ఇది దసరా మంటపము, ఇక్కడ రాయల సమక్షాన విజయదశమి వేడుకలు జరిగేవి అనుకుంటూ ఉంటాము. అదే ఋష్యమూకపర్వతం అంటారు. ఇవే తులాభార స్తంభాలు. శ్రీకృష్ణ దేవరాయలు తన జన్మదిన మహోత్సవమప్పుడు సామంతు లర్పించిన వజ్రవైఢూర్య గోమేధిక పుష్పరాగములతోనూ వెండి బంగారు నాణ్యములతోనూ తులతూగి, అవి కవిపుంగవులకూ విప్రోత్తములకూ కానుకలగా అర్పించేవారట అని భక్తితో చెప్పుకొని ఇటు వస్తూఉంటే, రాతిలో ఒక చిన్న గుంట చూపి ఇదే అమ్మవారు సీతాదేవి నగలమూట పడిన స్థలం అని చెపుతారు. కృష్ణశాస్త్రీ నేనూ నేలకు వంగి ఆ చోటును కండ్ల కద్దుకున్నాము. సీతమ్మ గాథ మనస్సు కెంతో బాధగా ఉంటుంది.

హజారస్వామి దేవాలయానికి ఒక ప్రక్కన అనుకుంటూ, అద్భుతమైన శిల్పచాతుర్యం చూచాము, జన్మ తరియించే సుందర దృశ్యము. ఒక మహా వలయాకారంలో రాసక్రీడ చిత్రించి ఉన్నది ఆ నల్లరాతిలో:

అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవాంతరేష్వాంగనా

# నా స్మృతి పథంలో...

ఇత్థమా కల్పితే మండలే మధ్యగ
స్సంజగౌ వేణునా దేవకీనందనా!

అనే, శ్రీకృష్ణకర్ణామృత శ్లోకము జీవకళ ఉట్టిపడుతోంది. ఏ మహాశిల్పి చిత్రించాడో!

"అబ్బా! ఎంతబాగుంది!! చచ్చిపోవాలని ఉన్నది!!" అన్నాను నేను.

"అవును! ఇంత అద్భుతమైన అనుభవం కలిగాక ఇంక బ్రతకడ మెందుకూ!" అన్నాడు కృష్ణశాస్త్రి.

## ౧౫

గంగా సంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే యమునతో నానందముం బొందునే
రంగ త్తుంగ తరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ !

స్నేహితుడూ నేనూ తుంగభద్రా నదిలో స్నానం చేస్తున్నాము. రాళ్ళ గుట్టలపై త్రుళ్ళింతలాడుతూ నది ప్రవహిస్తోంది. మన గోదావరిది ఒకఅందము; శ్రీరంగంవద్ద కావేరిది మరి ఒక అందము; ఇక్కడ హంపీవద్ద ఈ నది మరి ఒక అందమూ, మూడూ మూడువిధాల ఉంటాయి. చుట్టూ కొండలు, నదీగర్భాననే పెద్ద పెద్ద రాతిబండలు. రాతిమీదనుంచి పొర్లి క్రిందకు ప్రవహిస్తూ ఆ ఆయాసానికి కాబోలు, నురగలు గ్రక్కుతూన్నట్టు ఉంటుంది, ప్రవాహము. పైగా, ఇది చరిత్రప్రసిద్ధమైన స్థలము. ఎటువంటి విచిత్ర సన్నివేశాలను చూచిందో ఈ నదీమతల్లి ! ఎటువంటి అమృతతుల్య కావ్యరసానికి ప్రాణమిచ్చిందో ఈ నదీజలము !!

తెనాలి రామకృష్ణుని కవిత గురించి చాలా చెప్పాడు కృష్ణశాస్త్రి ఆ రోజున నాతో. ప్రబంధకవులగురించి మంచి అవగాహన ఉన్నది అతనికి. సాధారణంగా పండితు లెవ్వరికీ గోచరింపని ఎన్నో అందాలను అతను గుర్తింపకలడు, పూర్వకవుల రచనలలో. వానివి గురించి అతను చెపుతూ ఉంటే, ఇంకా ఇంకా వినాలని ఉంటుంది.

ఇంతగా పూర్వకవి పరిచయ మున్నవాడు, ఇంతగా ప్రబంధకవిత్వపు లోతులు తెలిసినవాడు క్షణంలో అధునాతనుడై పోతాడు. ఇదివరకు ఎవ్వరూ ఊహించనైనా ఊహించలేని ఒక క్రొత్త అందం సృష్టిస్తాడు తన కవితలో. కాని, ఒకప్పుడు అతని అనుభవపరంపరలలో నిస్పృహ ఎక్కువ; అంత మాత్రంచేత అతను ఆశాజీవి కాడు అనలేము. కన్నీటి కెరటాలలో వెన్నెలను

చూచేవాడూ నిట్టూర్పుగాడ్పుల నెత్తావిని ఆఘ్రాణించేవాడూ ఆశాజీవి కాకేమి ? ఆశాజీవి కాబట్టే, నిబిడ హేమంతరాత్రి కుంతలంలో నక్షత్రాన్ని చూడగలుగుతాడు. కవి కాబట్టే, శిథిల శిశిరమ్ములో చివురూ, పాషాణపాళిపై ప్రసవమూ కనిపిస్తాయి అతనికి.

అప్పుడతనికి చెప్పలేదు కాని, అలా అతను మాట్లాడుతూ ఉండగానే నా మనస్సులో అతని అందమైన రచనలో ఒకటి ఇంగ్లీష్ చేసుకున్నాను. ఎప్పుడో ఒకనాడు చలమ అరణ్య ప్రాంతంలో సంచరిస్తూ అతను అల్లిన గేయము. నా ఇంగ్లీష్ అనుసరణ త్రివేణిలో ప్రచురించారు :

A leaf within a leaf,
A flower within a flower,
A branch within a branch-
Into the downiest stemlet turned, shall I hide myself within this forest deep?
Shall I, here, forever stop !

అంటూ నడిచింది నా రచన. తెలుగు భాషలోని లయసంపద లేకపోయినా, అతని మాటల భావము కొంత స్ఫురింపవచ్చు:

High over tall tree-tops climbing, far above purple peaks ascending, into the blue wonder of a raincloud turned,
Shall I hide myself within this forest deep,
Shall I, here, forever stop !
Of hunger and thirst no more;
Sadness and vain regrets, no more;
Thus, lonely, like a madman, to wander,
Shall I hide myself within this forest deep,
Shall I, here, forever stop !

సాహిత్యరీత్యా, నీ జీవితంలో ఎక్కువ మార్పు తెచ్చిన దెవరి ప్రభావము అని నన్నెవరన్నా అడిగితే, తడుముకోకుండా చెప్పగలను, కృష్ణశాస్త్రి

కవిత్వమని. నన్నేకాదు; ఒక తరం తరంవారిని వింతగా ఆవహించింది అతని ప్రభావము.

హంపీ కరణంగారి అబ్బాయి వచ్చి, వంట పూర్తి ఐందట, భోజనానికి రమ్మంటున్నారు అని చెప్పాడు. పండు ముత్తైదువ, అచ్చపు పేదరాశి పెద్దమ్మా ఆమె భర్తా మాకు ఆపూట అన్నము పెట్టారు. కమ్మని వెన్నకరగించిన నెయ్యి, ముడిపెసలతో కాచిన ఘుమఘుమలాడే పులుసు, ఉసిరికాయ ఊరు పిండి, గట్టి పెరుగుతో-అప్పుడే, చెట్టునుంచి కోసి తెచ్చిన నిగనిగలాడే మర్రి ఆకుల విస్తళ్ళలో భోజనము. అన్నిటికంటే ఎక్కువ ఆ పురాణదంపతులు మాపై చూపిన విపరీతమైన ఆప్యాయము, మా హంపీ యాత్రను చిరస్మరణీయం చేశాయి. అచ్చటివారు "అప్పా!" అని సంబోధిస్తారు. మాటల మధ్య, పదే పదే, అప్పా! అప్పా! అంటారు మనలను. ఇది ఎంతో స్నేహపూర్వకంగా ఉంటుంది.

సాయంత్రం, పంపాసరోవరానికి వెళ్ళాము. గుండ్రటి తొట్టిపడవలలో నదిని దాటి అవతలి ఒడ్డుకు వెళ్ళాలి. తమాషాగానే ఉంటుంది ఈ ప్రయాణము. వీటిని నడపటానికి ప్రత్యేకమైన చాకచక్యం కావాలి. ఈ మాటా, ఆ మాటా చెప్పుకుంటూ నది అంచునే ఒక క్రోసెడుదూరం కాబోలు నడచాము. ఆ నడకలో రామాయణ కావ్య విశేషాలు చాలా విన్నాను, నా స్నేహితుని మాటలలో. అగాధమైన ఎంతటి కావ్యసముద్రముందో ఆ గాథలలో అనుకున్నాను. ఇప్పటికీ నాకు మహాభారతంకంటే రామాయణమే ఎక్కువ నచ్చుతుంది. భాగవతంలో కొన్ని భాగాలు చాలా బాగుంటాయి. రామాయణంలో అన్ని భాగాలూ చాలా బాగుంటాయి, నాకు. ఎంతో ఆర్ద్రత ఉన్నది రామాయణ గాథలో.

ఇంకా ఎంతదూరం నడవాలో అనుకుంటూ ఉండగా, కాలిబాట ఒక మలుపుతిరిగేసరికి కన్నెదుట ప్రత్యక్షమైంది, కళకళ్ళాడుతూ పంపాసరోవరము. పరమపావనమైన పంపా సరోవరము! కన్నులపండువైన తెల్లతామర కొలను. కొలను కొలనంతా తామరపువ్వులే!

"ఇదే మన కడపల!" అన్నాడు కృష్ణశాస్త్రి.

మెత్తని ఆ పచ్చికపైన విశ్రమించాము. ఎంతో ప్రశాంతంగా ఉన్నది. రకరకాల పక్షుల కిలకిలారవం తప్ప, వేరు శబ్దంలేదు. ఆ చెట్టే అంత పెద్దకొలను గాదు. చూడడానికి మాత్రం ఎంతో అందంగా ఉంది. మేమక్కడ విశ్రమించి ఉండగా అయోధ్య ప్రాంతాలనుంచి యాత్ర వచ్చిన ఇద్దరు ముసలి దంపతులు కొలనులో దిగి కాళ్ళూ చేతులు కడుక్కొని, శ్రీరామపాదస్పర్శచేత పవిత్రమైన దివ్య సలిలమును నెత్తిన చల్లుకున్నారు. రామనామస్మరణ చేస్తూ తమ యాత్ర తిరిగి సాగించారు. మా ఎదుటనే దండకారణ్యము.

ఒళ్ళు పులకరించే చల్లని గాలి వీచింది, "ఎంతచల్లగా ఉంది! ఈ చల్లటి గాలే భగవంతునికి ఎంతో బాధ కలిగించింది!" అన్నాను నేను. "ఎచటి సాకేత పురం ఎచటి కాన!" అన్నాడు కృష్ణశాస్త్రి.

*           *           *           *

బళ్ళారినుంచి బెంగుళూరు తిరిగివస్తూండగా కృష్ణశాస్త్రి నాతోకూడా అనంతపురంవరకూ వచ్చాడు. అసలు నాతో బెంగుళూరువరకూ కూడా రావల సిన వాడే. కాని, అనంతపురం స్టేషన్‌లో అతనినీ నన్నూ చూడడానికి వచ్చిన గుడిపాటి వెంకటచలం అతనిని బలవంతంచేసి దింపివేశాడు, "రేపు వెళుదువు గాని ఉండిపో!" అని. ఆ రేపు రేపై అతను ఓ వారంరోజులు కాబోలు ఉండిపోయాడు అనంతపురంలో.

"నువ్వు వస్తున్నావు కాబట్టి స్టేషన్‌కి వచ్చాను ఈ అర్ధరాత్రిని. ఈ ఊళ్ళో ఎవరూ దీపాలు పెట్టాక ఇల్లు కదలరు" అన్నారు వెంకటచలం.

"అదేమిటి! కాశీమజిలీ కథలలోలాగ బ్రహ్మరాక్షసి వస్తుందా రాత్రి వేళ?" అన్నాను.

"అబ్బే! అదికాదు. తేళ్ళు! ఈ ఊరు తేళ్ళమయం. అడుగు పెడితే చాలు పుటుక్కున కుడుతాయి" అని గట్టిగా నవ్వారు వెంకటచలం. ఆయన చక్కగా నవ్వుతారు, బిగ్గరగా, మనఃపూర్తిగా.

"అయ్యో! మీరు చాలా శ్రమపడ్డారే, ఈ రాత్రివేళ రావడం" అన్నాను.

"అబ్బే! ఇతనికోసం వస్తున్నాను కాబట్టి తేళ్లు నన్నేమీ చెయ్యవు— కాళ్ళకు చెప్పులుకూడా లేకుండా వచ్చాను." అన్నారు వెంకటచలం.

నిజమే ! ఆయన కాళ్ళకు చెప్పులు లేవు.

ఆ అర్ధరాత్రివేళ, మిణుకు మిణుకుమనే హరికేన్ లాంతరు చేతబుచ్చుకుని స్కూల్‌బంట్రోతు ముందు నడువగా, వారిద్దరూ ఒకరి భుజముపై ఒకరు చేయివేసుకుని, నడచిపోయారు ఆ చీకటిలోకి. ఆ దీపం అలా అలా దూరమై చీకటిలో కలిసిపోవడం చూస్తూ ఉండిపోయాను. వారిద్దరికీ చాలా స్నేహం. "ఇద్దరూ చెరోవిధంగానూ జీవితంలోని మాధుర్యాన్ని రుచిచూచారు— చేదును కూడా వారనుభవించే బాధే వారిని ఇంత సన్నిహితులనుగా జేసింది.ఆ స్నేహమే వారి మనుగడకు తీయదనాన్నిస్తోంది" అనుకున్నాను.

రైలు కదలి కొంతదూరం సాగాక, ఇటు తిరిగి చూచాను. నా ఎదుట ఒక క్రొత్త వ్యక్తి కూర్చుని ఉన్నారు. ఆ స్నేహితులు వెళ్ళిపోతూన్న సందడిలో నేను చూడలేదు, ఈయన నా ఎదురుగా కూర్చోడము. స్ఫురద్రూపి, తెల్లని కోటూ, తెల్లని తలపాగా—సరిగంచు తలపాగా అనుకుంటా. అర్ధరాత్రి ఐనా, ఆ తలపాగా తీయలేదు ఆయన. ముఖాన, మధ్యాహ్నం తీర్చి దిద్దిన శ్రీచూర్ణం నిలువుబొట్టు ఇంకా అల్లాగే ఉంది- ఒక అర్ధగంట ముందే దిద్దినట్టు! ఆ కళ్ళలో ఒక అనిర్వచనీయమైన శోభ కనిపించింది. సకల విద్యాపారంగతుడైన ప్రవరుని ముఖంలోని బ్రహ్మవర్చస్సు ఇలాగే ఉండేదేమో అనిపించింది. ఆయన ఏమనుకుంటారో అని సందేహించకుండా, ఆయనకేసి అలాగనే చూస్తూ ఉండిపోయాను. ఆ బండిలో మిగతావారంతా నిద్రపోతున్నారు. రాత్రి రెండుఝాములు దాటింది. రైలు వడివడిగా సాగిపోతోంది.

కొంతసేపటికి ఆయనే నన్ను పలుకరించారు అందమైన చిరునవ్వుతో! "ఆ వెళ్ళినవారు గుడిపాటి వెంకటచలమూ దేవులపల్లి కృష్ణశాస్త్రీ కారా?" అన్నారు ఆయన.

"అవును; కృష్ణశాస్త్రీ నేనూ బళ్లారినుండి కలసి వస్తున్నాము. అతను ఇక్కడ ఉండిపోయాడు" అన్నాను నేను.

ఆయన నన్నుగురించి అడుగుతారని తెలుసు నాకు. ఆయన అడుగకుండానే చెప్పాను నేను ఫలానావారి అబ్బాయిని అని- అలా చెప్పుకోవడము నాకు

ఒక గర్వకారణము. నాన్నగారి పేరు తెలియనివారు లేరు. ఏదో ఒక సంప ర్కంలో మనవారు చాలామంది నాన్నగారిని కలుసుకొని ఉంటారుకూడా. ఫలానావారి అబ్బాయిని అని తెలిశాక నన్ను మరింత ఆప్యాయంతో ఆదరిస్తారు అందరూ. అప్పుడప్పుడు చాలా దగ్గర స్నేహితులు ఆక్షేపిస్తూ ఉంటారు కూడా: "ఇన్నేళ్ళు వచ్చాయి. తండ్రిపేరే నీకింకా సర్టిఫికేట్టా!" అని. "అవును, నిజమే అది. ఇప్పుడేగాదు, జీవితాంతంవరకూ అంతే!" అంటాను నేను.

ఒక్కసారిమాత్రం, గుడివాడలో కాబోలు, నాన్నగారు ఒక సభకు అగ్రాస నాధిపత్యం వహించినపుడు సభ ముగిశాక అందరూ వెళ్ళిపోతూండగా పది పదహారేళ్ళ కుర్రవాడు నాన్నగారి వైపు వేదికవద్దకు వచ్చి నమస్కరించి కాస్త ఎడంగా నుంచున్నాడట. ఎటువంటి కొత్తవారినీ వెన్నెలవంటి చిరునవ్వుతో ఆదరిస్తారు నాన్నగారు. అతను మళ్ళీ నమస్కరించి అన్నాడట, మీరు ఫలానా వారి తండ్రిగారా అని. నాన్నగారు లోలోపల నవ్వుకుంటూ, "అవును. అతను మా అబ్బాయే! అతని స్నేహితుడవా నీవు?" అని, భుజంమీద చేయివేసి అతని కులగోత్రాలు, యోగక్షేమం విచారించారట. "ఆయనకు నేనంటే చాలా ఇష్టమండి. నాకు ఎన్నో మంచి విషయాలు చెప్పేవాడు. ఆయన మూలానే నేను పెద్దచదువు చదివి ఈఊళ్ళో యువజన సంఘానికి కార్యదర్శిగా ఉన్నాను. ఆయనను చాలా చాలా అడిగినానని చెప్పండి" అని నమస్కరించి, సెలవు తీసుకున్నాడట ఆ అబ్బాయి.

పట్నం వచ్చాక, నాన్నగారు నాతో ఎంతో గర్వంతో చెప్పారు: "గుడి వాడలో ఎవరో అడిగారు నన్ను 'మీరు ఫలానావారి తండ్రా' అని. నేను చాలా సంతోషించాను" అంటూ ఆ అబ్బాయి మాట చెప్పారు. "నీ ఉద్బోధన వల్లనే అతను వృద్ధిలోకి వచ్చాడట. ఆ ఊరు యువజన సంఘానికి కార్య దర్శిగా ఉన్నాడట" అన్నారు. నాకు జ్ఞాపకం వచ్చింది. పన్నెండేళ్ళ పిల్ల వాడు బలరామ్. తండ్రితో పోట్లాడి ఇంట్లో చెప్పకుండా బెజవాడ వచ్చేసి మా ఇంటికి రావడము, నేను అతనిని మా ఇంట ఉండమని, అతని తండ్రికి కబురుచేసి వారిద్దరికీ రాజీ చెయ్యడము. తరువాత ప్రతివారం నన్ను చూచి వెళుతూ ఉండేవాడు బలరామ్. క్రమంగా, కలకత్తా మెట్రిక్ ప్యాసై వాళ్ళ

తండ్రిపని అంతా తనే చూచుకోవడం మొదలుపెట్టి, చాలా ప్రయోజకు డయ్యాడు. ఆ తర్వాత నేను ఆ ప్రాంతాలనుంచి వచ్చివేశాను. ఇన్నాళ్ళకు అతను నాన్నగారికి కనబడడమూ నాన్నగారిని అలా వింతగా ప్రశ్నించడమూ నన్ను చాలా కదిలించింది. సిగ్గుతో తలవంచుకున్నాను.

ఇక్కడ, ఈ రైలులో ఫలానావారి అబ్బాయిని అనేసరికి ఆయన ముఖం ఇంతైంది. "అలాగా! నేనే అందామనుకున్నాను. నేను మీ చిన్నతనంలో శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారితో కలిసి మీ నాన్నగారిని చూడడానికి వచ్చాను. అప్పుడు మీరంతా చాలా చిన్నపిల్లలు" అన్నారు.

ఇలా మాటలు కలిసినాక, మేము తెల్లవార్లూ అలాగే మాట్లాడుకుంటూ ఉండిపోయాము. ఎన్నో విషయాలు చెప్పారు ఆయన. ఆట్టే అంత ఎక్కువ వయస్సుకూడా లేదు వారికి. ఇంత అపార జ్ఞానసంపద ఎలా పొందకలిగారా అని ఆశ్చర్యపోయాను.

"వెంకటచలం మీకు స్నేహితుడా?" అన్నారు.

"ఆ! ఆయన రచనలు నాకు చాలా ఇష్టం!" అన్నాను. "ఆయన చిత్రాంగి, సావిత్రీ చూచి ఉంటారు మీరు" అన్నాను.

"చిత్రాంగి చూచాను; సావిత్రీ చూచాను. చిత్రాంగి చాలా బాగా వ్రాశారు, కృష్ణమాచార్యులవారి నాటకానికి చాలా విరుద్ధమైనా. కాని, పూర్వ గాథలకు కొత్తపోకడలు కల్పింపవలసిన అవసరం నాకు కనుపింపదు. అంత కంటే వారు ఊహించి కొత్త కథలు కల్పించవచ్చుకదా!" అన్నారు. "చిర పరిచితమైన పౌరాణిక వ్యక్తులను మరోరీతిని చిత్రించడానికి మావంటివారింకా అలవాటు పడలేదు. ఆయన శైలిమాత్రం అద్భుతంగా ఉంటుంది,- కొంత ప్రాంతీయభాష ఐనా. ఐతే, కొన్ని సాంఘిక సమస్యలను అంత కటువుగా చిత్రించడము ఏదోలా ఉంటుంది. పైగా, ఆయనలో పాశ్చాత్యరీతి చాలా ఉన్నది" అన్నారు.

కృష్ణశాస్త్రి మాట వచ్చింది. "ఆయనను 'భావకవి' అంటారు కదా మీ రందరూ" అన్నారు నవ్వుతో. నేనేమీ అనలేదు.

"భావకవిత్వం అంటే ఏమిటి? అసలు భావములేని కవిత్వము అంటూ ఉంటుందా" అన్నారాయన.

"అది నిజమే; భావం లేనిది కవిత్వం కాదు. పూర్వపు ధోరణిలో ఉన్న కవిత్వం రూప ప్రధానమైన దనుకుంటా. కృష్ణశాస్త్రి వంటివారి రచన భావ ప్రధానమైనది" అన్నాను.

"అల్లాగా? ఈ పద్యం విన్నారా?" అంటూ ఆయన చక్కని కంఠ స్వరంతో ఎంతో భావయుక్తంగా చదివారు:

> కలగవు కమలంబులు, హం
> సలు కదలవు, చూడవమ్మ చక్కగ నెవరో,
> తలక్రిందుగ నాకాశము
> నిలిపినవా రత్త, చెరువు నీళులలోనన్!

ఎంతో బాగుంది పద్యం. నా ముఖంలో కనుపించిన పొగడ్త చూచి, అందమైన ఆ చిరునవ్వుతో ఆయన అన్నారు: "ఇందులో ఏది ప్రధానము? భావమా, రూపమా?" అని.

ఒక్క క్షణం ఆలోచించి, "భావమేకదా!" అన్నాను.

"ఇది, ఎప్పుడు వ్రాసిందో తెలుసా? శకకర్త శాలివాహనునికి ముందు, అనగా, దాదాపు రెండువేల ఏళ్ళకు ముందు. ప్రాకృతంలో ఉన్నాయి ఇటువంటివి వందలకొలది రచనలు" అన్నారు.

నేను చాలా ఆశ్చర్యపోయాను. నాకు వీని మాటే తెలియదు. రెండువేల ఏళ్ళ క్రితం ఇంత సరళంగా, ఇంతటి లాలిత్యంతో, పద్యం చెప్పేవారా, అనుకున్నాను. ఆయన మళ్ళా చదివారు:

> వ్రేళ్ళు సడలించి తిన్నగా నీళ్ళు త్రాగు
> చున్నవా డదె తెరువరి కన్నులెత్తి
> అట్టె చలిపందిరిని గాచు నతివ గూడ
> సన్ననౌ ధార నింకను సన్నగించు!

"చాలా చమత్కారంగా ఉన్నదండి. అంతేగాక, ఆ దృశ్యం చాలా స్వాభావికంగా కూడా ఉన్నది, కన్నులకు కట్టినట్టుగా" అన్నాను.

"వీనిలో చాలాభాగం జర్మన్ భాషలోకి అనువదించారు జర్మన్ విద్వాంసులు. కొన్నిటిని నేను తెలుగుచేస్తున్నాను. ఇవి వినండి:"

చిలుకల చాలదె కనుగొం
టే! లలిత రీతి దిగిమెడిని నేలకు, ని
మ్మ్మల గగనలక్ష్మి మేడ బ
చ్చల కెంపులకంటె తప్పి జారెడు ననగన్.

కొండ సెలయేటి సుడికి జిక్కుకొని కలగి
తిరుగుచును గేసరంబులు విరిగిపోవ
కొంత మునుగుచు, దేలుచు గొదమ తేటి
వెంట నంట, గడిమి పూవు వెళ్లి బోయె!

ఒక్క కవిత్వం గురించే కాదు, ఆ తెల్లవారుజామున మేము మాట్లాడుకున్నది. సంగీతము గురించీ నృత్యం గురించీ నాటకరచన గురించీ ధర్మశాస్త్రం గురించీ సాధనగురించీ ఎన్నో విషయాలు చెప్పారు నాకు ఆయన. సంగీతము మనకు శ్రవణానందకరమైన ఒక అద్భుత లలితకళే గాక, ఆత్మవికాసము కలిగించే మహాసాధన అన్నారు. ప్రతి మనిషికీ ఒక ఉన్నత లక్ష్యము ఉండాలనీ ఆ లక్ష్యాన్ని సాధించడానికి నిరంతర యత్నముండాలనీ అన్నారు. ఈ సందర్భంలో భర్తృహరి సుభాషితాలు కొన్ని చదివారు కూడా. మన మనస్సు అతి సున్నితమైన త్రాసులా ఉండాలి. ప్రతి విషయాన్నీ యుక్తాయుక్త విచక్షణకొరకు ఈ త్రాసులో తూచాలి అన్నారు. జీవితం ఒక తోకతెగిన గాలిపటము గాలిలో కొట్టుకుపోయినట్టు ఉండరాదు. ఆకాశంలోకి ఎంత దూరం వెళ్ళినా సూత్రపుపట్టు వదలరాదు మనము అన్నారు.

నా తరువాత జీవితంలో ఈ రైలులో పరిచయం గురించీ తెల్లవార్లూ జరిగిన మా సంభాషణ గురించీ చాలాసార్లు అనుకున్నాను. ఏదైనా ముఖ్య విషయం గురించి నిర్ణయించవలసి వచ్చినప్పుడు ఆయన మాటలు మరీ మరీ జ్ఞాపకం వస్తూంటాయి. ఇంతటి మానసిక ప్రగతి ఉన్న వారు చాలా అరుదు. వారు మన సంఘానికి దీపకళిక లంటివారు.

తెలతెలవారుతూండగా బెంగుళూరు సమీపించింది. నేను మనసారా నమస్కరించి ఎశవంతపూర్ వద్ద వారివద్ద సెలవు దీసుకొన్నాను. మైసూర్ వస్తే తప్పకుండా మా యింటికి రావాలి మీరు—అన్నారు ఆయన, రైలు కదులు తూంటే. ఆ శ్రీచూర్ణపు నిలువుబొట్టు చెక్కుచెదరకుండా అలాగే ఉన్నది ఆయన ముఖాన. ఆ తెల్లని జరీ తలపాగా, ఆ తెల్లని కోటూ, రాత్రంతా నిద్రలేనివానిలా లేరు ఆయన—నేనంటే తమలపాకులా వాడిపోయానేమో గాని.

ఎశవంతపూర్‌కి మా ఇన్‌స్టిట్యూట్ చాలా సమీపం. కాలినడకనే నా బస చేరాను. స్నానంచేసి నా పుస్తకాల అలమారవద్దకు వెళ్ళి అంతకు మూడేళ్ళ క్రితం కాబోలు, వచ్చిన ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో 'కుసుమగుచ్ఛము' చదివాను, 'పెనుగొండకొండ' మొదలైనవి నాలుగు నవరసభరితమైన పద్యాలు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ రచించినవి. 'పెనుగొండకొండ' పాటగా జగత్ప్రసిద్ధమైనది ఈనాడు. 'పరిహాసలీల' 'ముసలివీణ' 'సంధ్యావందనము' కూడా ఉన్నాయి ఆ కుసుమ గుచ్ఛములో. 'పరిహాసలీల' చాలా ఆర్ద్రత కలి గిస్తుంది:

> పూల బూజింపుమని నిద్ర మేలుకొలిపి,
> తట్టలో గాయ మొగ్గలు పెట్టినావు !
> నిశ్చలంబుగ మదిని ధ్యానింపు మనుచు
> కుంటి ముక్కాలి పీట జేకూర్చినావు !
> పరవశంబుగ గొంతెత్తి పాడు మనుచు
> తెగిన తంబుర జేతి కందిచ్చినావు !

## నా స్మృతి పథంలో ...

రెండువేల ఏళ్ళక్రితం ఉన్నవారు వ్రాసిన పద్యాలకు తన ఆంధ్రీకరణ గురించి చెప్పారే కాని, రైలులో రాత్రింతా నాతో మాట్లాడుతూ ఉన్నా, అనంత కృష్ణశర్మ తాము స్వయంగా రచించిన ఈ కుసుమగుచ్ఛములమాట చెప్పనే లేదు. అది వారి నిగర్వమునకు సాక్ష్యము.

౧౬

మామిడి చెట్టును అల్లుకొన్నదీ
మాధవీ లతొకటీ
ఏమూ రెండిటి ప్రేమ సంపదా
ఇంతింతనలేమూ
చూడలేక పాపిష్ఠ తుపానూ
ఊడబీకె లతనూ
మోడయిపోయా మామిడి చెట్టూ
మొగము వేలవేసీ
ముచ్చటైన ఆకులు కాయలనే
వెచ్చని కన్నీళ్లోడ్చి
పచ్చనాకులా బొమ్మరింటిలో
పండొక్కటి రాల్చి
మామిడి చెట్టూ మాధవి లతతో
మాయలో గలసిందీ
కామిత మిచ్చే మామిడిపండూ
కవులకు మిగిలింది !

—బసవరాజు అప్పారావు

తాజ్‌మహల్‌ను మొదటి పర్యాయం చూచినప్పుడు చాలా ఆశాభంగ మైంది. నాకు ఒక్కడకే కాదు నాతో ఉన్న నలుగురైదుగురు స్నేహితులకు కూడా. అంత మనస్తృప్తికరంగా లేకపోయింది. ఆ మధ్య ఒక ఆంగ్ల రచయిత అన్నాడు: గగనకుసుమమే మన చేతిలో రాలితే మనకు తగని ఆశా

భంగం కలుగుతుందని. మనం ఆప్యాయతతో పోల్చతగ్గ ఆదర్శం ఇక ఉండదు కాబట్టి. ఆ రచయిత ఉద్దేశ్యంలో, స్వర్గంలో ఎక్కడో పరిమళభరితమైన ఒక కప్ కాఫీ ఉంటుందట. ఆ కాఫీ పరిమళాన్ని మనస్సులో భావించుకుంటూ, ఉవ్విళ్ళూరుతూ, ఇక్కడ మనం రోజూ తాగే కాఫీని ఆనందిస్తూ ఉంటామట. భూలోకంలో మనకు లభించే ఎంత మంచి కాఫీ అయినా, ఆ ఆదర్శకాఫీ రుచికి కాస్త తక్కువగానేఉంటుంది, ఎప్పటికీ. అంచేతనే, ఆ ఆదర్శంతో పోల్చుకుంటూ ఇప్పటి అనుభవాన్ని ఆనందిస్తూ ఉంటాము. ఒకవేళ విధివశాన స్వర్గంలో పదిలపరచిన ఆ కాఫీయే మనకు లభించివేస్తే ఆ తరువాత ఇక ఎంతమంచి కాఫీని కూడా మనం ఆస్వాదించి ఆనందింపలేమట, పోల్చుకోడానికి ఆదర్శం లేదుకాబట్టి. ఇది ఎంతో నిజమనిపించింది. మన ఊహాలోకంలోని తాజమహల్‌కూ కట్టెదుట కనుపించే చలువరాతి రమ్య హర్మ్యానికీ ఎంతో తేడా ఉంది.

అంతేగాక, మేము తాజ్‌మహల్‌ను మొదటిసారి చూచినవేళ కూడా అటువంటిది. శీతాకాలం కదా, మిట్ట మధ్యాహ్నమైనా ఫరవాలేదని మంచి ఎండలో వెళ్ళాము. వెల్తురంతా ఆ చలువరాతిపై ప్రతిఫలించి కళ్ళు మిరుమిట్లు గొలిపింది. ఈ తప్పును దిద్దుకొనే నిమిత్తం రాత్రి లేత వెన్నెలలో మళ్ళీ ఒకసారి వెళ్ళాము. చాలా ఆనందించాము. జీవితంలో ఎన్నడూ మరపురాని మధురానుభవం అది. గుండ్రని ఆ నడిగోపురానికి ఒక వంకను నెలవంక. నెలవంకకు బెత్తెడు దూరాన ధగధగ మంటూ నక్షత్రం. నెలవంక షాజహాను. నక్షత్రం ముంతాజ్ అన్నాను నేను. ఈ రాత్రి అంత దగ్గరగా వచ్చి తమ ప్రేమ చిహ్నాన్ని కళ్ళారా చూచుకుంటున్నారు. రేపటికి మళ్ళీ దూరమైపోతారు. ఎల్లుండి ఇంకా ఇంకా. కాని, నెలరోజులకు మళ్ళా ఇలాగే ఇంత దగ్గరగానూ, కాలమే ఉన్నంతవరకూ కలుసుకుంటూ వుంటారు. ఆ వాతావరణ ఎంత నిర్మలమైనదీ ఎంత గంభీరమైనదీ అంటే ఆ సమయాన అక్కడ ఒక యాభైమంది స్త్రీపురుషులు ఉన్నా, చీమ చిటిక్కుమన్నా గట్టిగా వినిపించేటంత నిశ్శబ్దం. ఆ అద్భుతానందం వల్ల తన్మయులైన వారికి మాటలతో పనిలేకపోయింది.

రాత్రి అక్కడ ఎవ్వరూ ఆగిపోరాదని నిబంధన ఉండబట్టి గాని అందరూ రాత్రింతా అక్కడే ఉండిపోతే బాగుండును అనుకొనేవారే.

చక్రవర్తి అతని ప్రియురాలూ సుఖనిద్రలో ఉన్న సమాధివద్ద చందన ధూపం ఒక సన్నని తెల్లని లతగా పైకి ప్రాకుతూ ఉంటుంది. తొంభై ఏండ్ల ముసలి కాజీ ఖురాన్‌లోని మాటలు పెదవులతో అవ్యక్తంగా వల్లిస్తూ, నెమలి కన్నుల వింజామరలతో లేతగా విసురుతూ ఉంటాడు. ముందుకువంగి చేతితో సైగచేసి భరిణెలోంచి కాస్త చందనపుపొడి అడిగి పుచ్చుకున్నాను. చాలాఏండ్లు పదిలపరచుకున్నాను, ముంతాజ్ సమాధివద్ద లభించిన ఈ చందనపొడిని, కాశీ వద్ద ఏరిన గంగమట్టితోనూ, బుద్ధగయవద్ద మహాబోధి తరువునుండి కోసిన రావియాకుతోనూ, శ్రీరంగం రంగనాథస్వామి హృదయ సీమనుండి సంత రించిన లక్ష్మీ స్వరూపమైన శ్రీచందన ముద్రతోనూ, కన్యాకుమారివద్ద ఆ శాశ్వతబ్రహ్మచారిణి ముఖమునకు పూసిన హరిద్రపరాగంతోనూ కలిపి ఒక దంతపు పేటికలో దాచివుంచి.

అయితే, ఒక మరువరాని గుణపాఠంగా ఇంతటి మధుర స్మృతితోనూ మిశితమై ఉంటుంది ఒక భయంకర దృశ్యము. ఆ మధ్యాహ్నము మేము అయిదుగురమూ మొదటిసారి ఆ దివ్యభవనం చుట్టూ తిరిగి వస్తూ ఉండగా ఎడమవైపున ఉన్న పెద్ద మూడుతాళ్ళయెత్తు స్తంభంలాంటి గోపురంమీద నుంచి చూచాము మాకంటె ముందు ఆ గోపురాగ్రానికి చేరిన పిచ్చిమనిషి ఎవరో అమాంతంగా క్రిందకి దూకి తల పగిలిన దృశ్యము. ఇప్పటికీ, తలుచు కుంటే భయమేస్తుంది. స్వచ్ఛమైన ఆ చలువరాతి నేలపై ఇంత మేర ఎఱ్ఱని రక్తం. ఆ రక్తం మధ్య వ్రక్కలైన ఆ తల. భువన మోహనమైన సౌందర్య స్వరూపంతోపాటు ఈ దారుణ దృశ్యం మసులుతూనే ఉంటుంది, మనోవీధిని నిరంతరం, అమృతంతోపాటు హాలాహలంలా! ఎంతటి మానసిక వ్యధవల్ల వెర్రెత్తిపోయి క్రిందకి దూకాడో ఆ నిర్భాగ్యుడు పాపము అని చాలా బాధ పడ్డాము. దరిమిలాను తాజ్‌మహల్‌ను చూడడానికి మళ్ళా మళ్ళా అవకాశం కలిగినా- వెళ్ళబుద్ధయ్యేది కాదు. ఒక్కసారి మాత్రం స్నేహితురాలిని సంతోష పెట్టడంకోసం తీసుకువెళ్ళాను, పండు వెన్నెలలో ఆమెను అక్కడకు. ఎంత

వద్దనుకున్నా ఆ విషాద సంఘటన గురించి ఆమెతో చెప్పక తప్పినది కాదు. ఆమె "అబ్బా!" అని గుండెపై చేయివేసుకున్నప్పటి గాజుల చప్పుడు ఇప్పటికీ వినిపిస్తూ ఉంటుంది, ఏదో హెచ్చరికలా!

*    *    *    *

ఈ ఉత్తర హిందూదేశ యాత్రలో మేము ఐదుగురము - టహల్‌రామ్ మీర్ చందానీ, పజాభాయి శుక్లా, భాస్కర పనిక్కర్, నారాయణ అయ్యర్, నేనూ. ఆ సంవత్సరం జనవరినెలలో వారణాసిలో జరుగుతున్న సైన్స్ కాంగ్రెస్‌కు వెళుతూ తోవలో బొంబాయి, బరోడా, అబూ పర్వతం, జయపూర్—ఈ ఊళ్ళు చూస్తూ ఆగ్రా చేరాము. బెంగుళూరు ఇన్‌స్టిట్యూట్‌లో కృషిచేస్తున్నవారు ఏటేటా ఈ సైన్స్ కాంగ్రెస్‌కి వెళ్ళి అక్కడ తమ కృషి ఫలితాల గురించి ఇతరులతో చర్చిస్తూ, ఇతరులు చేస్తున్న కృషి గురించి తాము తెలుసుకుంటూ ఉంటారు. ఈ యాత్రలో మా మొదటి మజిలీ బొంబాయి.

చిన్నప్పుడు మదనపల్లెలో నాతో కలిసి చదువుకున్న సింధీ యువకుడు భవనానీ స్టేషన్‌కువచ్చి మమ్మల్ని తమ ఇంటికి తీసుకువెళ్ళాడు.

స్టేషన్ ఆవరణ దాటేమో లేదో, ఎదుట కార్‌లో వెళుతూ మహాత్మా గాంధీ, బులాభాయి దేశాయీ, మనీబెన్ పటేల్ ప్రత్యక్షమయ్యారు. "అరుగో గాంధిజీ!" అని కేకవేశాడు శుక్ల. చేతులెత్తి నమస్కరించడానికి వ్యవధి లేకుండా వారి కార్ మా ముందునుంచి వెళ్ళిపోయింది. మహాత్ముని ఆ నవ్వు ముఖం మాత్రం ఇప్పటికీ తాండివిస్తుంది మనోవీధిని. "ఉదయమే మైదానంలో పెద్ద సభ జరుగుతోంది, అక్కడకు వెళుతున్నారు" అన్నాడు శుక్ల.

శుక్ల తను వాళ్ళ అన్నగారి ఇంటికి వెళ్ళాడు. మీర్‌చందానీ ఆ ఊళ్ళో ఉన్న బంధువుల ఇంటికి వెళ్ళాడు, పనిక్కర్, నారాయణ అయ్యర్, నేనూ భవనానీతో వెళ్ళాము. అతను మమ్మల్ని ఎంతో ఆదరించాడు. పదేళ్ళకన్నా ఎక్కువై ఉంటుంది మేము ఇద్దరమూ మదనపల్లెలో కలిసి ఉండి. నిన్నలా తోచింది. జీవితంలో ఓ పదేళ్ళు లెక్కలేనట్టనిపించింది.

సింధీల భోజనం మనకు కొంత వింతగా ఉంటుంది. అన్నిటిలోనూ తీపే. అన్నం కూడా ఇంత నెయ్యి, బాదంపప్పు, ద్రాక్షపళ్ళు, ఇంత పంచదార వేసి వండుతారు. మరీ తియ్యగా ఉండకుండా కాబోలు, నాలుగు లవంగమొగ్గలు ఆద్దమేస్తారు. వారి ఊరగాయలు కూడా తియ్యగానే ఉంటాయి. "మీ ఊళ్ళో మిరపకాయలుకూడా తియ్యగానే ఉంటాయనుకుంటాను" అన్నాను నవ్వుతూ. "వారి ఆదరణలో అంత తీపి ఉన్నది" అన్నాడు భాస్కర పనిక్కర్.

మధ్యాహ్నం మేమంతా ఎలిఫెంటా గుహాలు చూడడానికి వెళ్ళాము, సముద్రంలో స్టీమరుపైన. శుక్ల, మీర్‌చందానీ స్టీమర్‌వద్ద మమ్మల్ని కలుసుకున్నారు. భవనానికి వేరే పనివుండి, అతను రాలేదు. ఆ స్టీమర్ ప్రయాణం చాలా బాగున్నది. అదే మొదటిసారి సముద్రయానము నాకు. అక్కడ సముద్రము ఏమంత అల్లకల్లోలంగా ఉండదు. కాని, కొంతదూరం వెళ్ళాక ఏవేపూ గట్టు కనిపించకపోవడం ఒక క్రొత్త అనుభవంగానే తోచింది. గట్టుకు అలవాటు పడ్డ జీవులకు కనుచూపుమేర గట్టు లేకపోవడం, ఎటు చూచినా ఆకాశాన్ని అంటుతూన్న జలార్ణవము ఎంతో గంభీరంగా కనిపిస్తుంది. స్టీమర్ వేగంగా ముందుకు సాగిపోతూంటే వెనుక చక్కని చాలు నురగలు క్రమ్ముతూ తెల్లని బాటలా అనుసరించి రావడము చూస్తూ ఉండిపోయాను అల్లాగనే చాలాసేపు.

ఎలిఫెంటాలో అతి పురాతనమైన శిల్పాలున్నాయి, ఎప్పటివో రాష్ట్రకూటుల నాటివీ అంతకు పూర్వపువీ కూడా. ఒకే ఒక పెద్దరాతితో మలచిన అద్భుతమైన త్రిమూర్తి రూపం ఉన్నది ఇక్కడ. ఇంకా ఎన్నో ప్రాచీన శిల్పపుటందాలు చూచాము.

ఎలిఫెంటానుండి తిరిగి వస్తూంటే, సముద్రంలో సూర్యాస్తమయ దృశ్యం చూచాను. ఇన్నాళ్ళూ, ఇన్నేళ్ళూ, సముద్రంలోంచి ఉదయిస్తూన్న సూర్యబింబం చూడడమే గాని, అస్తమయం చూడడం ఇదే మొదటిసారి. సూర్యోదయపు వేళ, ఎంత చూడాలని ఉన్నా, సూర్యబింబంకేసి ఆట్టే నిదానించి చూడలేము. అస్తమయ మప్పుడు మన చిత్తము; పాపము, సూదుల్లా కళ్ళుపొడిచే ఆ తీక్షణత ఇప్పుడు లేదు. సూర్యోదయ మయినప్పుడు క్షణ

క్షణమూ అతిశయిస్తూ ఉంటవి, ఆ కాంతీ ఆ వేడీ. ఇప్పుడు క్షణక్షణమూ క్షీణించిపోతూ ఉంటవి ఆ వెలుగూ ఆ ఉష్ణతా. ఎర్రని బింబమూ, నీటిలో ఆ నీడ, అలా అలా కలుసుకుపోయి, చటుక్కున మాయమైపోవడం అద్భుతంగా ఉంటుంది. వెంటనే ఆకాశమంతా ఊదాతో కలిసిన ఎరుపుతో నిండిపోతుంది. ఆ వింత వాతావరణ ఒక అపురూపమైన ఆధ్యాత్మికానుభవం కలిగిస్తుంది. ఎందుకో సూర్యునిపై పట్టరాని జాలి కలుగుతుంది. నీళ్ళల్లో అలా మాయమై పోతూంటే మనమీదా జాలికలుగుతుంది. రేపు ఉదయం మళ్ళా, విధిగా ఎప్పటి అప్యాయతతో కనిపిస్తాడనే దృఢవిశ్వాసం ఉండబట్టేగాని, లేకపోతే, ఏమైపోతామో మనము, ఇలా అతను మాయమైపోతే, అనిపించింది.

మరునాడు అడయార్‌లో, ఉంటూ ఉండగా నాకు స్నేహమైన పురుషోత్తమ దాస్‌కు ఫోన్ చేశాను, నేను ఊళ్లోకి వచ్చినట్టు. పురుషోత్తమదాస్ లక్షాధికారి. కాని, నిగర్వి. అతిస్నేహశీలి. నేనంటే ప్రాణంగా ఉండేవాడు. టెలిఫోన్‌లో నా గొంతు విని "నువ్వా! ఇక్కడున్నావా? ఎప్పుడొచ్చావు? తిన్నగా మన ఇంటికి రాలేదేం? ఎక్కడనుంచి మాట్లాడుతున్నావ్?"....అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు. నా స్నేహితులనుకూడా తీసుకుని వెంటనే మలబార్‌హిల్‌లో ఉన్న అతని భవనానికి వచ్చివెయ్యమన్నాడు. అతని సంభ్రమానికి ఎంతో చకితుడనయ్యాను నేను. ఆ రాత్రే మేము ప్రయాణము పెట్టుకున్నామనీ ఈసారి వచ్చినప్పుడు తప్పక అతనితోనే ఉంటాననీ ఒప్పించాను. కాని, సాయంత్రం అతనితో కలిసి భోంచేసి మరీ రైలు ఎక్కవలసిందని పట్టు పట్టాడు.

సాయంత్రం అతని భవనంవద్దకు వెళ్లేసరికి నడవలోకి వచ్చి నన్ను అమాంతంగా కౌగలించుకొని లోపలికి తీసుకువెళ్ళాడు పురుషోత్తమదాస్. అతని భార్య కుసుమాబెన్, అతిరూపలావణ్య. ఆమెకు పరిచయం చేశాడు నన్ను. "జ్ఞాపకంలేదూ! అడయార్‌లో నీకు అందమైన గులాబీ పువ్వులు తెచ్చి ఇచ్చేవాడు ప్రతి ఉదయమూ" అన్నాడు. సౌజన్యం వెల్లివారుతూ ఆమె అన్నది: "అతనిని ఎలా మరచిపోగలము!" అని. ఇలాంటిమాటలు ఏ భాషలోనైనా ఎంతో అందంగా ఉంటాయి. గుజరాతీభాషలో మరీ అప్యా

యంగా ఉన్నాయి. కొంతసేపు పూర్వ స్మృతులు నెమరువేశాక, పురుషోత్తమ దాస్ లేచి నుంచుని అతి దీనంగా నాకేసి చూస్తూ, "ఏమీ అనుకోవద్దు, నేను వెంటనే గవర్నమెంట్ హౌస్‌కు వెళ్లాలి. లేడీ విల్లింగ్‌టన్ నన్ను రమ్మని కబురుచేసింది. వెళ్ళక తప్పదు. మా తమ్ముడు నరేంద్రుడు నీతో కలిసి భోంచేస్తాడు. కార్ పంపుతా. నిన్ను రైలు ఎక్కించి వస్తాడు" అన్నాడు. "ఏమీ అనుకోవుకదూ" అని మళ్ళీ అన్నాడు. "అబ్బే! నరేంద్రుడు కూడా నాకు స్నేహితుడేగా! నువ్వు వెంటనే వెళ్లు" అన్నాను. అన్నగారు పిలువగా లోపలినుంచి నరేంద్రుడు వచ్చి నన్ను కలుసుకున్నాడు.

నరేంద్రదాస్‌ను కూడా నేను బాగా ఎరుగుదును. అతను తరువాత రెండుమూడేళ్ల వరుసగా అడయార్‌లో కన్వెన్షన్‌కు వచ్చేవాడు. ఒక పర్యాయం అతనితోకూడా, మిసెస్ జిన్నాకూడా వచ్చింది. మిసెస్ జిన్నా వింతమనిషి. చాలా అందమైన దుస్తులు ధరించేది. కాని, ఆమె మెడలో ఆభరణంగా పామును ధరించేది. బంగారపు పాము కాదు; సజీవమైన ప్రాకుతూన్న పాము! ఎటొచ్చీ నాగుబాము కాదు, విషసర్పముకాదు, పెంపుడు పాము. మనవాళ్ళు మాటిమాటికి మెళ్ళో కాసులపేరు సర్దుకున్నట్టు ఆమె మాటిమాటికీ ఆపామును సర్దుతూ ఉండేది మెడచుట్టూ. కాలేజీపిల్లల కందరికీ ఈ దృశ్యం బలే గమ్మత్తుగా ఉండేది.

"లక్షాధికారైన లవణమన్నమెగాని, మెరుగుబంగారంబు మ్రింగబోడు" అనే కవివచనం నిజమే గాని, అది అమర్చే విధంలో ఉంటుంది తేడా, మనకీ, వారికీ. వంట కొంతభాగం ముందు చేసివుంచినా, పూరీలు మనంవెళ్ళి పీటమీద కూర్చున్నాకనే పొంగిస్తారు. వేడి వేడి నేతి బుడగలతో ఆవిరి గమ్ముతూన్న పూరీలు వడ్డిస్తారు. బఠాణి గింజలూ బంగాళాదుంపలూ కలిసిన వేపుడు, ముట్టుగుంటే చెయ్యి చుర్రుమంటుంది......... చెయ్యి కడుక్కోడానికి వెళితే, ముగ్గురు పరిచారకు లుంటారు మందువాలో: గులాబీ అత్తరు కలిపిన గోరువెచ్చని నీరు చెయిమీద పోస్తాడు ఒకతను; కస్తూరిసబ్బు చేతికి అందిస్తాడు ఒకతను; తుడచుకోడానికి, వట్టివేళ్ళ అత్తరు చల్లిన చాకింటి మడత చేతితువ్వాలు అందిస్తాడు మూడో అతను.

ఇటు నడవలోకి వచ్చేసరికి, బంగారపు పువ్వులు తాపిన వెండిపళ్లెంలో కర్పూరపు విడెములతోనూ ఇంకో పళ్ళెంలో ద్రాక్ష గుత్తులతోనూ ప్రత్యక్షమైంది కుసుమాబెన్. "ఆయన ఇప్పుడు వెళ్లిపోవడమేమిటి? రెన్నాళ్లు ఉండమనరాదా మన ఇంట" అన్నది మరదితో.

మాధవరం ఏపేటా ఒంటెద్దు బండిలో వెళ్ళేవాడను నేను; స్నేహితుని రోల్స్‌రాయిస్ కార్‌లోంచి దిగాను బొంబాయి కొలాబాస్టేషన్‌వద్ద, క్షణిక వైభోగం అనుకుంటూ.

*　　　*　　　*　　　*

బరోడా, మైసూర్‌లాగా ఉంటుందో, మైసూరే బరోడాలాగ ఉంటుందో చెప్పలేము. గయక్‌వాడ్ తన ప్రధాన నగరం అమరపురిలా ఉండాలని ఎంతో అందంగా నిర్మించాడు. బరోడాను చూచి వచ్చి మైసూర్‌ని రమ్య తరిచారు మైసూర్‌దివాన్. ఎంతో విశాలమైన వీధులు, ఎటుచూచినా అందమైన భవనాలు, సుందరమైన ఆరామాలు, తోటగేటుకూడా భారతీయ సంప్రదాయంలోనే చెక్కబడి ఉంది. రెండురోజులు తాపీగా ఉండి చూడవలసిన ఆ ఊరు ఒక నాలుగు గంటలలో చూచి మళ్ళా రైలుకు బయలుదేరారు, మా వాళ్ళు. నాకు కోపం వచ్చిందికూడా, అంత చప్పున వెళ్ళిపోవడంవల్ల. కాని, వారు వేసిన టైమ్‌టేబుల్ ప్రకారం అంతకంటే ఎక్కువ వ్యవధి లేక పోయింది. కాశీకి చేరేముందు మేము చూడవలసిన చోట్లు ఇంకా చాలా ఉన్నాయి. ఐతే, ఇక్కడ ఒక వింత జరిగింది.

రైలు ఎక్కి కూచున్నాక, ఇంక ఒక క్షణంలో రైలు కదలబోతుంది అనగా చూచుకున్నాను, నా వోవర్‌కోట్ కనిపించలేదు. "అయ్యో! నాకోటు" అని అరచాను. అందరూ వెతికారు. మేము ఆగిన హోటల్లో మరచిపోయానని తేలింది. ఆ కోటు అసలు నాదికాదు, "శీతకాలం ప్రయాణం, నీవు చలి భరింపలేవు" అంటూ నా ఒంటిమీద కప్పాడు గోపీనాధ్ బెంగుళూర్‌స్టేషన్‌లో. ఆ కోటు పారవేస్తే ఈ జన్మలో గోపీనాధ్ ముఖం ఎలా చూడను అంటూ, కదులుతూవున్న రైలులోంచి క్రిందకు దిగేశాను నేను. కిటికీలోంచి నా టికెట్ చేతి కందిచ్చాడు భాస్కర పనిక్కర్. "మూడు గంటల రైలులో అహ్మదా

బాద్ రా. మేము స్టేషన్‌కి వచ్చి కలుసుకుంటాము నిన్ను" అని కేకలువేశాడు శుక్ల. "జాగ్రత్తసుమా!" అన్నాడు మీర్‌చందానీ ఎంతో జాలిగా. రైలు వెళ్ళిపోయింది.

ఇది రెండవమారు: నేను ఎక్కి వెళ్ళవలసిన రైలు నేను లేకుండానే వెళ్ళిపోవడం!

బరోడా టాంగావాలాలు బలే సరదాగా ఉంటారు. ఆజానుబాహులు. అందమైన దుస్తులు ధరిస్తారు. తెల్లని లాల్చీపైన ముఖమల్ వెస్టుకోట్. పెద్ద ఇంతకుచ్చుపగిడీ. గుర్రాలన్నీ అరబ్బీ జాతివి. బళ్ళు కళకళ్లాడుతూ ఉంటాయి. నే నెక్కిన టాంగావాలా బలే మాటకారి. ఊరంతా మరొక్కసారి కళ్ళారా చూచాను అతను ఎంతో ఉత్సాహంతో ప్రతిస్థలం వర్ణించి చెప్పగా. ఆ ఊళ్ళో జామపళ్ళు చాలాబాగుంటాయి. చేతిలో ఇమడనంత పెద్దవిగా ఉంటాయి. ఎంతో సువాసన. ఓ పదిపళ్ళు కొనుక్కొని అతనికో పండిచ్చి, నేనోపండు తిన్నాను. హోటల్‌కి వెళ్ళి నాకోటు తీసుకుని మెల్లిగా మూడుగంటల వేళకు స్టేషన్‌కి వచ్చాను. ఎవరో దగ్గరబంధువుని సాగనంపినట్టు నన్ను నా కంపార్టుమెంట్‌లో కూర్చోపెట్టి మరీ వెళ్ళాడు టాంగావాలా, జయసింగ్ అనుకుంటా అతని పేరు.

అహమ్మదాబాద్ స్టేషన్ చేరేసరికి నా స్నేహితులెంతో కంగారుతో నా కంపార్టుమెంట్‌వద్దకు వచ్చారు. వారి కంగారు నాకు అర్థంకాలేదు. నన్ను చూచి, ఎంతో బెంగతో అడిగాడు శుక్లా: "భోంచేశావా?" అని.

శుక్లా సాధారణంగా అందరితోనూ కాస్త ముక్తసరిగానే మాట్లాడుతాడని ప్రతీతి. అతను అంత జాలిగా నన్ను అడగడము నాకు ఆశ్చర్యమేసింది. "భోంచెయ్యకేమి? ఆ హోటల్‌లోనే భోంచేశాను. జామపళ్ళు కూడా కొనుక్కుతిన్నాను, ఇదిగో మీవంతు" అని నేను తెచ్చిన పళ్ళు ఉంచాను అతని ముందు. వారందరి ముఖాలలోంచి కొండంత బెంగ దిగజారినట్టు కనిపించింది. జామపళ్ళు చూచి అందరూ సంతోషంతో నవ్వారు కూడా. అప్పుడు చెప్పాడు మీర్ చందానీ, "రైలు కదిలిపోతూన్న కంగారులో భాస్కర్ పనిక్కర్ నీకు దారిఖర్చుకు కావలసిన పైకం ఇయ్య మరచిపోయాడు. నీవు ఏమి ఇబ్బంది పడ్డావో అని భయపడ్డాము. నీ కోసం టిఫిన్

కారియర్‌లో భోజనం తెచ్చాడు శుక్లా, ఈ ఊళ్ళోవాళ్ళ ఇంటినుంచి" అన్నాడు వారి కంగారుకు కారణం లేకపోలేదు. సాధారణంగా నా వద్ద పైకం ఉండదు. ఎల్లాగో ఈసారి మాత్రం వో అయిదురూపాయలు ఉండిపోయాయి నా పర్సులో. అది సరిపోయింది, టాంగావానికీ భోజనానికీ జామపళ్ళకీ. మిగిలిన రెండు రూపాయలూ పనిక్కర్ చేతికిచ్చా దాచమని.

రాత్రికి రాత్రే సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళాము. అసలు సాయంత్రమే వెళ్ళవలసినది మేము. ఆశ్రమంలో కొంతసేపు ఉందామనుకున్నాము కూడా. కాని, ఈనా బరోడా 'విష్కంభము' వల్ల అనుకున్నట్టు జరపలేకపోయాము. చీకటిలోనే చూచాము ఆశ్రమం. అప్పుడు మహాత్మాగాంధీ లేరు అచ్చట—ఇంకా బొంబాయిలోనే ఉన్నారు.

మహదేవ దేశాయ్ మమ్మల్ని కలుసుకొని ఆశ్రమమంతా చూపించారు మాకు. మీరాబెన్‌కు పరిచయం చేశారు మమ్మల్ని.

విదేశాలనుంచి వచ్చి, మన దేశపు వేషభాషలను అలవరచుకొని, మనతోనే ఉండిపోయిన వారిని కొందరిని ఎరుగుదును నేను, అడయార్‌లో. కాని, మిస్ స్లేడ్, మీరా బెన్‌గా మారిన ఉదంతము విన్నాక నాకు ఎంతో ఆశ్చర్యమైంది. "నేను ఇంతటి త్యాగం చెయ్యగలనా, ఎన్నడైనా" అన్నాను శుక్లాతో.

"ఏమో, ఎవరు చూచారు! ఆమె జీవితంలో ప్రసరించిన అంత గొప్ప ప్రభావం నీ జీవితంలోనూ కలిగితే, నీవు అంతకంటే ఎక్కువ త్యాగం చూపించి ఉందువేమో" అన్నాడు శుక్ల. అతను స్నేహరీత్యా అల్లా అన్నాడే గాని నాకుమాత్రం అంత నమ్మకం లేదు నాకో. కాని, అప్పుడప్పుడుమాత్రం తోస్తూ ఉంటుంది - కొన్ని క్షణాలో, కొంతసేపో, అన్నీ విడిచిపెట్టి, ఏదో మహాత్యాగం చెయ్యాలనే వెర్రి ఆవేశం కలుగుతుంది. అటువంటి నిమిషాల గురించే ఇలా వ్రాశాను బెంగుళూరు చేరాక:

> సారహీనమైన ఈ జీవయాత్ర యందుకూడ
> కొన్ని సమయాల నేను నిజముగ జీవించుచుందు ...

## నా స్మృతి పథంలో...

అట్టి వేళల నూత్న దృష్టి యొదవిన నా కనుల
యెదుట, భావికాలపు టద్దాల పైన, వింతరంగుల
తోడ నేమేమొ చిత్రించినటులె దోచు.
కవులు, రాజులు, కాంతామతల్లులు, యుద్ధ వీరులు,
రాజ్యాంగవేత్తలు, ప్రాణమును కూడ బలిసేయు
నేస్తగాండ్రు, అందరొక్క మహా నాటకాంకమందు
వింత దుస్తుల దాల్చి తమతమ కథలవర్ణించి నటులెజూతు.
వారి గనినంతె, నేను కూడ వారి వలెనే ఉన్నత ప
దవుల నందగా వలెనని యాశయము పొడము...
త్యాగసంపత్తి తోడుత, విమల సత్కీర్తి వలన
ప్రేమ సామ్రాజ్యాధిపతి గావలె ననెడి యుత్సుకత కలుగు...
కాని, అంతలోన, వర్తమానంపు టవస్థ లన్నియు,
నొక్కమారుగాను, ముసురుకొని వచ్చి నా కలల దుర్గాని
కలచివేయు; నా వింతరంగుల యద్దాల విరిచివేయు.
తెన్నుగానని, ఆశయే లేని, మండు ఎడారులందు,
నా నూతనాశయము లన్నియు నింకిపోవు.
భరింపగారాని ఈ నిస్పృహా భారంబు వలన
కృంగిపోవుచు, నిసుక తిన్నెపై నే గూలినపుడు
ఉన్నతంబైన యా యాకాశమండలంబు
వేయి కన్నుల తోడ ననుచూచి వెక్కిరించు !

అని వ్రాశాను. తరుచు కలుగుతూ ఉంటుంది, ఇటువంటి భరించరాని నిస్పృహ, ఎంతో ఆశావంతమైన ఈ జీవితంలోకూడా.

## ౧౭

అగర్ ఫిర్‌దౌస్
బారు-ఎ-జమీన్ అస్త్
తో హమీన్ అస్త్!
హమీన్ అస్త్!
హమీన్ అస్త్!!

[ఒకవేళ, స్వర్గమే
భూతలమున ఉన్నట్టయితే
అది ఇచటనే!
అది ఇచటనే!
అది ఇచటనే!!]

అని, చెక్కి ఉన్నది, మొగలాయి చక్రవర్తి కొలువుకూటపు చలవరాతి గోడపైన. ఈ మాటలలో అతిశయోక్తిలేదు. ఆనాడు, అల్లాగే ఉండేదని సమకాలిక వర్ణనలవల్ల తెలుస్తుంది. కొలువుకూటము, అభ్యంతర భవనము కూడా, అద్భుతమైన శిల్పసంపదను చాటుతున్నాయి. దేవతలు కాకపోయినా, దేవతలవంటి శిల్పులు ఊహించి, సృష్టించి ఉండాలి సౌందర్యసీమలో, ఇంతటి అమర సౌభాగ్యాన్ని.

ఇక, అటువైపు తోటలో, అందముపై అందము చూచి ఆనందిస్తాము. శ్రావణ మందిరంలో ఎంతో ఎత్తునుంచి చలువరాతి సోపాన పంక్తిపైన ధారగా ప్రవహిస్తూ ఉండేది యమునా జలము. ఆ ధారకు ఇరువైపుల బహు చమత్కారంగా అమర్చిన గూళ్ళలో పైనుండి క్రిందికి బారులు తీర్చిన దీప మాలికలు. అవి ప్రవహిస్తూన్న నదీజలంలో ప్రతిఫలిస్తూంటే చెదరిన నీటి

తుంపరలలో తళుక్కుమనే వజ్రపు తునకలాంటి కిరణాలను వర్ణిస్తూ, పాదుషా కుమార్తె రోషనార అద్భుతమైన కవనమల్లేదంటే, ఆశ్చర్య మేముంది! భూలోకస్వర్గములో నిత్యనివాస మేర్పరచుకున్న అచ్చరస్త్రీ జిహ్వలోగాక ఇంకెక్కడుంటుంది వాణి!

రోషనార గురించి హృదయ దారుణమైన గాథ ఒక టున్నది. ఆమె కవిహృదయం ఒకానొక కవిని ప్రేమించినదట. తండ్రి షాజహాన్‌కు ఆ సంబంధం నచ్చలేదు. కాని, వారిద్దరూ కలుసుకుంటూనే ఉండేవారు. ఒక నాటి ఉదయం వారు ఒండొరులు రచించిన ప్రేమగీతాలు వింటూ లోకాన్నే మరచిఉన్న సమయాన ప్రతీహారిణి పాదుషారాకను తెలియజేస్తుంది. ప్రియుడు ఆ సమయమున చక్రవర్తి కళ్ళబడితే తప్పక మరణదండనే. సమయస్ఫూర్తితో, రోషనార అతనిని చెంతనేఉన్న నీళ్ళకాగులో దాచివేస్తుంది. పాదుషా తన కుమార్తెను కౌగలించుకుని ఆమె రచించిన గీతాలను విని ఆనందిస్తాడు. క్షణంసేపు ఆగి వెళ్ళిపోవలసిన పాదుషా, పీఠముపై ఆసీనుడై ఆమెతో కవిత్వ విషయాలను గురించి ఆప్యాయంతో మాట్లాడుతూ అలాగే ఉండి పోతాడు ఎంతోసేపు. కొంతసేపటికి, "నీ ముఖపద్మము వాడినట్టున్నది. వెంటనే జలకమాడు" అంటాడు, ఆమె సవినయంగా, "ఇంకా తొందరలేదు." అని వారింప యత్నించినా వినక, కాగుక్రింద మంట పెట్టిస్తాడు పాదుషా. నీళ్ళు మసిలిపోయి, పొంగి కుతకుత లాడేవరకు అక్కడే ఉంటాడు, ఆ వజ్ర హృదయుడు. తరువాత వెళ్ళిపోతాడు.

లోకంలో కోటిమందిలో ఒకరుంటారేమో అటువంటి ప్రియులు. కిక్కురుమనకుండా కుమిలిపోయి ప్రియురాలి మర్యాదను కాపాడిన త్యాగశీలురు. కాని, ఎంతటి గుండెదిటవు కావాలో, ప్రియుడలా నశించిపోతూండగా తండ్రితో కవితాగోష్ఠిలో ఉండిపోవడానికి!

రోషనారా సమాధి ఢిల్లీలోని సమాధులలోని కల్లా అందమైనదిగా కనుపించింది నాకు. చక్రవర్తుల బిడ్డల అందరి సమాధులపైన చలువరాతి హర్మ్యాలు నిర్మించినా, రోషనారా సమాధి మాత్రం అతి నిరాడంబరంగా ఉంటుంది, గరిక పువ్వుల మధ్య సుఖనిద్రలో ఉంటుంది రోషానార. గోరీ చుటూ నాలుగు

గోడలే కాని, పైకప్పులేదు. "ఆకాశమే అంబరము నా గోరీకి" అన్నదట కవయిత్రి ఆమె చనిపోతూ. పగలంతా సూర్యరశ్మి తాకుతూ ఉంటుంది. రాత్రి వెన్నెల, చీకటి రాత్రులలో లక్ష నక్షత్రాలు పలుకరిస్తాయి రోషనారాను.

నటకావతంసుడు స్థానం నరసింహారావు పుణ్యమా అని, ఈ రోషనార రూపము ఒక పది పది హేనేళ్ళు సుపరిచితంగా మసిలింది లక్షలాది జనుల కళ్ళయెదుట. ఆ రోజులలో నేనూ వెళ్ళి చూచాను వారి నాటకాన్ని నరసాపురంలో ఒకసారి.

వేసవి సెలవలకు మా అక్కయ్యా నేనూ మా మేనత్తగారి ఊరు పోడూరుకు వెళ్ళి అక్కడ కొన్నాళ్ళున్నాము. నన్ను చూడడానికి, చిన్ననాటి అడయార్ స్నేహితుడు వక్కలంక అచ్యుతరావు విజయనగరంనుంచి పోడూరు వచ్చాడు నన్ను వెతుక్కుంటూ. అతని కోసమని మా బావా నేనూ స్థానంవారి నాటకానికి ప్రయాణమయ్యాము, పోడూరుకు పన్నెండుమైళ్ళ దూరాన ఉన్న నరసాపురం.

ఈ రోషానారా కథ ప్రకారం, ఔరంగజేబు చెల్లెలైన రోషనార బీగమ్ అతని జన్మశత్రువు శివాజీని ప్రేమిస్తుంది. శివాజీ హిందూ మతోద్ధారకుడూ, ఏకపత్నీ వ్రతస్థుడూ కాబట్టి ఆమె ప్రేమను నిరాకరిస్తాడు. తరువాత జరిగిన యుద్ధంలో గాయపడిన ఆమె, శివాజీ ఒడిలో తలపెట్టుకు ప్రాణం వదులుతుంది. ఈ గాథా ఇందలి సంభాషణలూ హిందూ మహమ్మదీయులమధ్య పరస్పర వైషమ్యాన్ని పెంచుతాయనే భ్రమవల్ల పశ్చిమగోదావరిజిల్లా కలెక్టర్ ఈ నాటకం నర్సాపురంలో ఆడకూడదని ఆంక్ష జారీచేశాడు. కాని, ప్రవర్శకులు సామాన్యులా? ఒకచిన్న కిటుకువల్ల తమ యత్నం సాధించారు. నరసాపురం వద్ద గోదావరిపాయ వశిష్ట. వశిష్టకు ఇద్దరిని నరసాపురం; అద్దరిని తూర్పుగోదావరి, రాజోలు తాలూకా; అద్దరిని పెద్ద డేరావేసి డేరాలో నాటకం. మరోజిల్లాలో జరుగుతున్న ఆ నాటకానికి పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టరూ వచ్చాడన్నారు; నిజమో కాదో. దీపాలవేళనుంచి నరసాపురప్రాంత పరిసర జనమందరూ. పడవలలోనూ, దోనెలలోనూ నదిని దాటి నాటకపు హాలు కిక్కిరిసి పోయారు,

## నా స్మృతిపథంలో ...

నరసాపురం జేరాక, జమీందారు అన్నగారు నా పాత స్నేహితుడు, శివరావును కలసికొని, అతనినీ నాటకానికి బయలుదేర దీశాము. అతని పలుకుబడి మాకెంతో ఉపకరించింది. అతను మాతో ఉండబట్టి గాని, లేకపోతే, మాకు పడవదొరికి ఉండేదికాదు, నది దాటడానికి, ఆ రాత్రి, ఎంత బ్లాక్ మార్కెట్ ధర కిరాయి ఇయ్యడానికి సిద్ధపడ్డా!— అంతటి జనసందోహం కలెక్టర్ నిషేధించిన నాటకం చూడటంకోసం. మే మెక్కిన పడవలో మునసఫ్‌గారి అబ్బాయి, తన అభిమాన ప్రేయసితో కలసి, తనూ ఎక్కాడు. నలుగురూ చూస్తారనే జంకులేకుండా, ఆ యువకుడు తన ప్రేయసిని అల్లా రాళ్ళపైనుంచి పదిలంగా చేయిపట్టుకు నడిపించుకు తీసుకువచ్చి, పూల సజ్జలా యెత్తి పడవలో కూర్చోబెట్టడం నా రసికహృదయానికి ఎంతో ఆనందమిచ్చింది. తిరునాళ్ళలోనూ ఇటువంటి నాటక సమయాలలోనేగా ప్రేమికులు ఇలా కలుసుకోడానికి వీలు అన్నాడు శివరావు.

పదహారేళ్ళప్రేయసిలా ముస్తాబయ్యాడు స్థానం. ఎంతో ఆకర్షవంతంగా కుదిరింది ఆ బీగంసాహెబా రూపం. నటన అద్భుతంగా కనిపించింది మా కళ్ళకు. శివాజీవేషం మాధవపెద్ది వెంకట్రామయ్య, ఆజానబాహుడు : అతని విగ్రహం ఎంతో ఠీవిగా ఉంది. వారిద్దరికీ చక్కగా సరిపోయింది. వారి సంభాషణ రసవత్తరంగా సాగింది. ఆఖరిరంగంలో, చనిపోతూన్న రోషనారాను ఛత్రపతి తన ఒడిలోకి తీసుకోవడం చాలా జాలి కలిగిస్తుంది. ఆ రాత్రి స్థానం నటనాకౌశల్యము మమ్మల్ని మంత్రముగ్ధులనుగా జేసింది. అతను పాడిన పాటలు కూడా మరీ మరీ జ్ఞాపకం చేసుకున్నాము, జట్కాబండిలో తిరిగి పోడూరునకు వస్తూ. మా బావకు సంగీతంవచ్చు, శయనాగార వర్ణనపాటా, 'ఆ పాషాణ హృదయుడు' అనే పాటా చాలాసార్లు పాడించాము అతనిచేత. ఇటువంటి నటనాచాతురిని ఎన్నడోగాని అనుభవింపజాలని అచ్యుతరావు ఆనందానికి మేరలేదు.

తరువాత కొన్నిఏళ్ళకు కృష్ణశాస్త్రిద్వారా స్థానం నరసింహారావుకూ నాకూ పరిచయముకలిగి, స్నేహం అంకురించింది మా ఇద్దరిమధ్య. కొన్ని విషయాలలో మాకు గల సమాన ఆశయాలు మమ్మల్ని ఇద్దరినీ చాలా దగ్గరకు

తీసుకువచ్చాయి. ఒకనాటి రేయి అతను పిఠాపురంలో చిత్రాంగి వేషం వేస్తు న్నాడని తెలిసి కాకినాడనుంచి కార్‌లో వెళ్ళాను నాటకం చూడడానికి. ముందరి వరుసలో కూర్చుని నాటకం చూచాను. నాటకమంతా ఎల్లావున్నా ఆఖరి రంగంలో అతను అద్భుతంగా నటించాడు. ఇది సరిగ్గా పాతికఏళ్ళ క్రిందటిమాట. ఈ రంగంలో కృష్ణమాచార్ల వారి రచన కొంత మార్చి వ్రాసు కున్నాడు స్థానం తనకోసరము. నిజము తెలుసుకొన్నరాజు కోపంతో తన మీదికి రాబోగా, చిత్రాంగి ఎదురు తిరుగుతుంది. "మోహావేశమున నన్ను మోసపుచ్చి, కోడలినైన నన్ను భార్యగా చేసుకున్నావు" అని చెడామడా తిట్టి "నా సారంగధరుడు పోయాక ఇంక నాకీ బ్రతుకెందుక"ని,బాకుతో పొడుచుకు చనిపోతుంది చిత్రాంగి. ఈ సన్నివేశంలో స్థానం రంగస్థలప్రతిభ అత్యు త్తమ స్థాయి నందుకున్నది. తన్మయుడనైపోయిన నేను తెర వాలగానే, గబగబ స్టేజి వెనుక గ్రీన్ రూమ్‌లోకి వెళ్ళి, చిత్రాంగి రంగు చేతులను నా చేతులలోకి తీసుకుని "అద్భుతంగా నటించారు! అద్భుతంగా !!" అన్నాను ఆవేశంతో. "ముందరి వరుసలో కూర్చుని ఉన్న మీ నవ్వుమొఖం చూశాక, అద్భుతంగా గాక మరెలా నటిస్తాను? అంతా మీ కన్నుల చలువ" అన్నా రాయన. ఎవరు ఎవరిని మెచ్చుకున్నట్టు? సరిగ్గా పాతిక ఏళ్ళ క్రిందటి మాట ఇది.

స్నేహితులతోకలసి ఢిల్లీ వస్తున్నానని, ఎందుచేతనో, అప్పుడు ఢిల్లీ లోనే ఉంటూన్న మాఅక్కయ్యకు ముందుగా వ్రాయలేదు నేను. లేడీ హార్డింజ్ మెడికల్ కాలేజీలో చదువుతూన్న ఆమెకు మా హోటల్‌నుంచి టెలిఫోన్ చేశాను. "ఇదేమిటి! ఇక్కడికెల్లా వచ్చావు!!"అన్నది అక్కయ్య ఆశ్చర్యంతో. సంగతి అంతా చెప్పి మధ్యాహ్నం నా నలుగురు స్నేహితులతో కలిసి వెళ్ళాను. మమ్మల్ని చూచి ఆమె చాలా సంతోషించింది. ఎంతో ఆసక్తితో ఆమె కాలేజీ ఆస్పత్రిలోని విశేషాలు అన్నీ మాకు చూపించింది. తన వైద్యశాస్త్ర అభ్యాసం లోనే పూర్తిగా నిమగ్నురాలై ఉన్న ఆమెను వీడ్కొని, స్నేహితులు ఐదు గురిలో ఒకడనుగా వచ్చివేశాను. ఇప్పుడు తలుచుకుంటే ఏదోలా ఉంటుంది. వెయ్యిమైళ్ళ దూరంనుంచి వచ్చిన తమ్ముడను, ఇంకా ఒక్కపూట ఆగి, ఆమెతో

మా ఊరి విషయాలు మాట్లాడి ఉండవచ్చు. ఆ ఈడులో స్నేహితులతో కలసి ఉండే సరదాలో మరేమీ తోచదు. ఇప్పుడు బెంగగా ఉంటుంది, తలుచుకుంటే. సోదరప్రేమ ఎంత మహత్తరమైనదో, మనకోసం ఎంత అలమటిస్తారో మన అక్క చెల్లెళ్ళు. తరువాత తరువాత నాకు అవగాహన ఐనది. మనం సుఖంగా లేకపోతే వారికెంతో బాధగా ఉంటుంది. మనకోసం అమ్మ పడినంత ఆవేదన అనుభవిస్తారు, అక్కయ్యా, చెల్లెలూ.

ఆ రాత్రి రైలులోనే మా బృందముతో అమృతసరానికి బయలుదేరాను. ఢిల్లీ దాటి కొంతసేపు సాగాక, మాలో ఒకచిన్న వాదన బయలుదేరింది. ఏదో ఒక ప్రస్తావనలో, నేను ఉమర్ ఖయ్యామ్ తత్వాన్ని వర్ణిస్తూ, అల్లాగే గడిపి వెయ్యాలి జీవితమంతా అని వాదించాను: నిరంతరానందంతోనూ, మధురానుభవంతోనూ జీవిత సర్వస్వాన్నీ చవిచూడాలి అన్నాను. శుక్లా చాలావరకు మహాత్ముని అనుచరుడు. "అంతేనా?" అంటున్నాడు కొంత తీవ్రతతో, అప్పుడు. ఇంతవరకూ మా మాటలు ఓపికతో వింటూన్న ఒక పెద్దమనిషి, సన్నంగా బక్కపలచగా ఉంటారు, తెల్లని కద్దరు బట్టలు, మల్లెపువ్వులాంటి తెల్లని గాంధీ టోపీ, నెరసిన గడ్డం, నవ్వు మొఖం చూస్తేనే మ్రొక్కాలని ఉంటుంది, అయన మా వాదనలో కలుగజేసుకుని, నన్ను చూచి "అబ్బాయీ! నీకు జనకమహారాజు కథ తెలుసా" అంటూ చెప్పడం మొదలు పెట్టారు. ఎంతో చక్కగా, ఎంతో ఆనందంగా మాట్లాడారు ఆయన. వచనంలో చెప్పినా ఆయన మాటతీరూ, భావప్రకటన, ఆయన చక్కని పద్యం వల్లించినటుల ఉన్నది: జనకమహారాజు ఒకకాలు మంచి గంధపు ముద్దలోనూ, ఒకకాలు అగ్నికుండంలోను ఉంచుకుని ఉంటాడు అని చెపుతూ, అంతరార్థం వివరించారు, ఆయన. చిన్నప్పుడు మా తాతగారి ఒడిలో కూర్చుని విన్నాను ఈ సంగతి. కాని, ఇప్పుడు ఈయన వివరించినపుడు ఈ దృక్పథం ఎంతో ప్రస్ఫుటంగా కనిపించింది నాకు. ఆయన యెడల చెప్పలేనంత గౌరవభావం కలిగింది నాకు. తదుపరి అనేక పర్యాయాలు ఆ జనకమహారాజు జ్ఞాపకం వస్తూ ఉంటాడు నాకు. జనకమహారాజుతో పాటు ఆయనా జ్ఞాపకం వస్తూ ఉంటారు మరీ మరీ. ఆయనే; పురుషోత్తమదాస్ టాండన్. దరిమిలాను కాంగ్రెస్ అధ్యక్షులయ్యారు.

ఆ రాత్రి చాలాసేపు చెప్పారు మాకు ఎన్నో విషయాలు. ఉపనిషత్ ధోరణిని ఆయన చేసిన ఉద్బోధన తదుపరి జీవితంలో నా తప్పులు దిద్దుకోడానికి చాలా ఉపకరించినది.

తెలతెలవారుతూండగా, "చూడు! చూడు!!" అంటూ లేపాడు నన్ను మీర్‌చందానీ. కళ్ళు నులుముకుంటూ కిటికీలోంచి చూతునుకదా, కనుచూపు మేర, యోజన పర్యంతం రైలుబాటకు ఇరువంకలా గులాబీ తోటలే! విరగ పూశాయి పువ్వులు!! భూదేవి కప్పుకున్న గులాబీ పచ్చడంలా కనిపించింది మైళ్ళ పర్యంతం అమృతసరం శివారు వరకూ. "అమృతసరం గులాబీలకు ప్రసిద్ధము, ఎరుగవా?" అన్నాడు మీర్‌చందానీ. ఐతే, ఒకవింత. ఈ దేశాచారం ప్రకారం ఇచ్చట స్త్రీలు తలలో పువ్వులు పెట్టుకోరు. రేకులు రేకులుగా దేవాలయాలలో అర్పిస్తారు, అంతే. ఈ తోటలలోని పువ్వులన్నీ పన్నీరుగా మారి, దేశదేశాలకూ వెళతాయి. మన ఇంటి శుభ కార్యాలలో చల్లే పన్నీరు ఈ అమృతసర ప్రాంత గులాబీల పన్నీరే.

అమృతసరము సార్థక నామముగల సరస్సు, చిన్న కోనేరు. కాని, చాలా అందంగా ఉంటుంది. కొలనిమధ్య బంగారపు రేకులు తాపిన విమానముతో ఉన్న దేవాలయ శిఖరముపైన సూర్యుని లేత కిరణాలు ప్రసరిస్తూ ఉండగా మేము అక్కడకు చేరాము. ఎంతో ప్రశాంతమైన వాతావరణ. వేలాది జనమున్నా పరమ నిశ్శబ్దము, వాద్యముల ఘోషా పురోహితుల ఆర్భాటమూ లేదు ఇక్కడ. మచ్చునకైనా బిచ్చగాళ్ళనుకానము. బారులుబారులుగా సాగి భక్తులు ఆలయంలోకి వెళ్లి, ఆరాధించి వస్తూ ఉంటారు. లోపల విగ్రహం లేదు. ఎత్తయిన పీఠంపైన ముఖమల్ దుప్పటిపై విప్పి ఉన్నది, గులాబీ పువ్వులమధ్య, సిక్కుల పుతగ్రంథము 'గ్రంద్‌సాబ్'. నెరసిన గడ్డములతో, శతవృద్ధులు వింజామరలు వీస్తున్నారు ఆ పవిత్ర గ్రంథమునకు. చుట్టూ ప్రదక్షిణముచేసి, మోకరిల్లి వెళుతూ ఉంటారు భక్తులు, ప్రసాదం పుచ్చుకోడానికి మరి ఒక చోటికి. ప్రసాదం చాలా బాగుంటుంది, అచ్చంగా మన సత్యనారాయణవ్రత ప్రసాదంలా. దానిని వారు 'క్షీరా' అంటారు. ఒక చిత్ర మేమిటంటే ఈ ప్రసాదం పుచ్చుకోడానికి భక్తులు ఒంటరిగా

వెళ్ళరాదు. దంపతులో, అన్నా చెల్లెలో, అక్కా తమ్ముడో చేయి చేయి పట్టుకున్నట్టుగా కలిసి కలిసివెళ్లి మరీ అందుకోవాలి ప్రసాదం. ఈ ఆచారం ఎంతో అందమైనదిగా కనుపించినది నాకు. పరదేశస్థులనే కారణంవల్ల మమ్మల్నిమాత్రం ఒక్కొక్కరుగా వెళ్లి ప్రసాదం పుచ్చుకోనిచ్చారు.

ప్రసాదం తీసుకుని బయటకు వస్తిమిగదా, కళ్ళు భ్రమిసిపోయాయి. కొండపైకి ఎగసిన సూర్యుని కిరణాలు పెల్లుబ్బి, బంగారపు గోపురాన్ని స్వర్ణ కాంతులలో ముంచెత్తాయి. కరుగబోసిన బంగారంలా తోచించి మెరిసే ఆ వెలుతురు. ఎదుట సరస్సులో ప్రతిబింబించి వెర్రి ఎత్తించింది మా కళ్ళకు. ఇంత అందం జీవితంలోఎన్నడూ చూడలేదేమో అనిపించింది. "బంగారానికీ సూర్యరస్మికీ ఎంతటి పొత్తో!" అన్నాను నేను. నీటిలో ఆ ప్రతిబింబంకేసి అలాగే చూస్తూ ఉండిపోయాను చాలాసేపు.

ఐతే, ఆనాడు తాజమహల్ అందంతోపాటు, గోపుర శిఖరంనుంచి క్రిందకుపడి తల పగిలిన భిక్షుకుని రక్తం చూచినట్లే, ఇక ఒక ఐదు నిమిషాలలో ఒకానొక దారుణ సంఘటనను జ్ఞప్తిపరుచుకోవలసి వచ్చింది. దేవాలయానికి సమీపంలోనే ఉంటుంది జలియన్‌వాలాబాగ్. తాజమహల్‌వద్ద మేము చూచినది ఆకస్మికాఘాతము; ఇక్కడిది ఘాతుకచర్య. మూడువేపులా ఎత్తయిన గోడల మధ్య ఇరికించి నిరాయుధులైన జనులపైన తుపాకీ గుండ్లు పేల్చారు డయ్యర్ అనుచరులు. చేతులెల్లా వచ్చాయో వారికి! ప్రాణ రక్షణార్థమై గోడలపైకి ఎగబ్రాకిన వారి గుండెలను దూసుకుపోయి గోడలో పూడి పోయిన తుపాకీ గుండ్ల గుర్తులు ఇప్పటికీ చూడవచ్చు నిరంకుశవిధానపు నిర్దాక్షిణ్యమునకు ఆనవాలుగా. భారతభూమిలో బ్రిటిష్‌వారు సంపాదించుకొన్న తీరని మచ్చ; సప్తసముద్రాల నీరూ చాలదు ఈ మచ్చను తుడిచివేయడానికి.

అమృతసరంలో రైలుఎక్కబోతూఉంటే కమలాఫలాలుకొనబుద్ధయింది నాకు. ఇక్కడ కమలాఫలాలు చాలా బాగుంటాయి. చాలా పెద్దవికూడా. నా చపలత్వాన్ని గురించి నవ్వుకుంటూ వారంతా ముందు వెళ్ళిపోయారు, నన్ను వెనుకరమ్మని. నేను కమలాఫలాలు కావాలనేసరికి నేను కోరిన పళ్ల

తీసి నా చేతి కియ్యడము బదులు పండ్లను త్రాసులో తూచడము మొదలు పెట్టాడు అంగడిఅతను! నేను ఆశ్చర్యంతో చూస్తూ అలాగే నిలువబడి పోయాను. తూనిక సరిగా కుదరక రాయిమార్చి రాయివేస్తూ కాలయాపన చేశాడు అతను. పండ్లను తీసుకుని పరుగెత్తుకుంటూ వెళ్ళి రైలు అందుకోవలసి వచ్చింది నేను.

మరునాడు ఉదయం హరద్వారం చేరాము. నాన్నగారు ముందుగా జాబు వ్రాయగా కాంగ్రీ గురుకులవాసంనుంచి, గురుమహారాజు ఆయన శిష్యులను పంపారు రైలువద్దకు. కృతయుగపు వ్యక్తులు ఆ శిష్యు లిద్దరూ. "ఈ ప్రదేశం గొప్ప యాత్రాస్థల మగుటవల్ల అంత శుభ్రముగా ఉండదు; హోటళ్ళలో భోజనము ప్రమాదము. మేమే వండిపెడతాము మీకు" అన్నారు ఆ సత్యకాలపు మనుష్యులు. వారి ఆదరణకు సంతసిస్తూ, కాస్త ఓపికతో వెతకి, మన ప్రాంతంనుంచి అక్కడకువచ్చి అక్కడే నివాస మేర్పరచుకున్న ఒక వెలనాటి బ్రాహ్మణ కుటుంబమువారింట భోజనాలకు ఏర్పాటు చేసుకున్నాము. మీర్‌చందానీ, శుక్లా, గోధుంరొట్టెలూ, పాలూ, పళ్లూ ఆరగించారు.

హరద్వారమున వెన్నెలరాత్రి జీవితంలో ఒక మరువరాని అనుభవము. ఎదుట గంగానదిపై విరిసిన ఆ దివ్యత్వమును వర్ణించడానికి సాధారణులకు సాధ్యంకాదు. అది అనుభవించాలి, అంతే. ఆ పున్నమ చంద్రుడు ఎంతో ఆప్యాయతతో పలుకరిస్తాడు మనలను. హృదయానికి కలిగిన ఎంతటి తీవ్రమైన గాయాలనూ మాన్పగలవు ఆ ప్రశాంతతా, వెల్లువయే ఆ వెన్నెలా!

హరద్వారంనుంచి ఋషీకేశ్ రోడ్ రైలుమీద వెళ్లి, అక్కడినుంచి ఋషీకేశము టాంగాలలో వెళ్ళాము దేవదారు వనాలలోంచి. ఋషీకేశ్ చాలా అందంగా ఉన్నా, నిరంతరమైన బిచ్చగాండ్ర రొద ఒక కొంత రోతను కలిగిస్తుంది. పండాల ధనాశకూడా చిరాకు కలిగిస్తుంది. అన్నిటికంటే ఎక్కువ బాధ అతి సుందరమైన ఆ ప్రకృతీ రమణీయకతను పాడుచేసే దిష్టి పిడతల లాంటి సీనారేకు పాకలు. పట్టరాని కోపం వస్తుంది ఈ అమానుష చర్యవల్ల. స్నేహితుడు కృష్ణశాస్త్రి చెప్పిన మాటలు జ్ఞప్తికి వస్తాయి:

## నా స్మృతిపథంలో ...

'దారి తలయెత్తు నిత్య సౌందర్య లవము
వదిలి పోలేరు చంపెడివరకు వీరు! ...' అని.

ఇంకా కొన్ని మైళ్ళు నడచి లక్ష్మణఝూలా చేరి, అచట పవిత్రమైన గంగానదిని తిలకిస్తే జన్మ తరియించినట్లు తోస్తుంది. ఏమి అందం! ఏమి అందం!! ఇక్కడే ఉండిపోవాలనిపిస్తుంది. ఇంతటి నిర్మలసలిలం సృష్టిలో ఇక దొరకదు. గ్రుక్కెడు నీరు త్రాగితే ఇక ఆకలిదప్పికలుండవు. ఈ నీట స్నానము చెయ్యడము ఒక అపూర్వమైన అనుభవం. విపరీతపు చలి. మంచు గడ్డ కరిగిన నీరు ఇంకెలా వుంటుంది మరి? మొదటి మునకకు కొండంత ధైర్యం కావాలి. తెగించి నీట మునిగిన తక్షణం, ఒక అరనిమిషం, హృదయం ఆగిపోయినదేమో అనిపిస్తుంది. కాని, ఉత్తర క్షణమే, ఒక అద్భుతమైన విద్యుత్ప్రభావం నఖశిఖ పర్యంతం మనలో ప్రసరిస్తుంది. అనిర్వచనీయమైన ఉత్సాహం ఆవహిస్తుంది ప్రతి నరంలోనూ. తెప్పరిలిన హృదయం మహదానందంతో నిండి తొణికిసలాడుతుంది. ఇక నీటిని విడిచి రావాలని ఉండదు. అక్కడే, అవతలఒడ్డున బదరీనాథ్‌కు వెళ్ళే త్రోవను చూస్తూ అంబరచుంబితమైన హిమవత్పర్వత సానువులపై వెలసిన దేవదారు వనాలపై దృష్టి నిలిపి తపస్సు చేసుకోవా లనిపిస్తుంది మిగిలిన ఈ ఆయుః పర్యంతమంతా.

ఇంత గొప్ప అనుభవం జీవితంలో ఒక్కసారే కలుగుతుంది అనుకుంటా. ఇటువంటి పవిత్రానుభవమును గురించే, తరుచు, నిత్యజీవితంలో సౌందర్యము దెస జనులు చూపే నిరసనను తెలుపుతూ అంటాడు కవి :

'ఔర! ప్రాభాతశైల సానూపల నీలపాళికల నొత్తకయే
స్రవించు ఆ హిమానీ పరగాయనీ వినిశ్రుత మాధురిమంటి
కీర్తు రా! ...' అని.

## ౧౭

స్నేహపూరిత మనసు
కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై
బ్రహ్మ తేజస్సు!
బోసినోర్విప్పితే
ముత్యాల తోలకరే
చిరునవ్వు నవ్వితే
వరహాల వర్షమే!!

—బసవరాజు అప్పారావు

ఈ ఇరవయ్యో శతాబ్దంలో జన్మించడంవల్ల నీవు పొందిన మహద్భాగ్యం ఏమిటని నన్నెవరైనా ప్రశ్నిస్తే, 'మహాత్ముని' పరిచయ భాగ్యం అంటాను తడుముకోకుండా. అది ఒకనాటి సంతోషం కాదు. శేషజీవిత పర్యంతము అలా ఉండిపోతుంది మనలో—పూవులో తావిలా.

శ్రీకృష్ణుడూ రామచంద్రుడూ బుద్ధుడూ జీససూ దైవాంశ సంభూతులై జన్మించి, మానవత్వానికి ఎంతో విలువ నాపాదించారు. మహాత్ముడు సాధారణ మానవునిగా జన్మించి, మానవునిలో ఉన్న దైవత్వాన్ని వికసింపజేశారు. ఇదే ఆయన మహిమ.

చిన్నప్పుడు అడయార్ స్కూలులో చదువుతూండగా వారితో కొన్ని నిమిషాలు గడిపే అవకాశం కలిగింది. తరువాత, ఒక పదేళ్ళ తర్వాత, బెంగుళూర్‌లో తిరిగి అటువంటి అవకాశం కలిగింది నాకు. ఈసారి ఒక వారం రోజులు ప్రతి సాయంత్రమూ వారి ప్రార్థనాసమావేశాలకు వెళ్ళి, నలుగురితో పాటు వారి ప్రసంగం వింటూ ఉండేవాణ్ణి. ఆరోగ్యం నయము చేసుకొనే

నిమిత్తం బెంగుళూర్ వచ్చి ఉన్న ఆయన ఎక్కువగా సభలో మాట్లాడే వారు కారు. ఈ ప్రార్థనా సమావేశాలు కూడా బహిరంగ సభలుకావు. ఒక్క పాతిక మందో, ముప్పైమందో జేరేవారు ప్రతి సాయంత్రం కుమారవనంలో, ఆయన ప్రసంగం వినాలనే కుతూహలంతో.

క్షణకాలం వ్యత్యాసం లేకుండా విధిప్రకారం సూర్యాస్తమయ్యేసరికి మహాత్ములు వచ్చి తమ వేదికపైన ఆసీనులయ్యేవారు. వెంటనే చిరునవ్వుతో, మరువరాని ఆ చిరునవ్వుతో, మమ్ములను ఆశీర్వదించేవారు. రామ్‌ధున్ అనంతరం ముచ్చటింప మొదలుపెట్టేవారు. మన నిత్యజీవితంలో ఏదో విషయాన్ని గురించి చెప్పేవారు. ఎంతో ఎంతో సన్నిహితంగా కనుపించేవి వారిమాటలు, ఇంత సునాయాసముగా ప్రస్ఫుటమయ్యే సత్యవచనాలకోసం ఎంత రాద్ధాంతం, ఎంత ఆర్భాటం లోకంలో!- అనిపించేది.

ఏడవరోజున, ధైర్యం చేసుకుని, వారితో ఉన్న చక్రవర్తి రాజగోపాలాచారిని అడిగాను, మహాత్ముని ఒక పర్యాయం మా ఇన్‌స్టిట్యూట్‌కు తీసుకు రమ్మని. ఈ యత్నంలో అప్పుడు బెంగుళూరు ఖాదీ వస్త్రాలయం పని చూస్తున్న సదాశివం నాకు చాలా సహాయపడ్డారు. సదాశివానికీ, నాకూ మంచి స్నేహము. తరువాత కొన్నేళ్ళకి వీరే ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మిని వివాహమాడారు. వివాహానంతరం వారిద్దరూ కూడా నన్ను చాలా ఆదరించే వారు. వారిద్దరూ కూడా మిక్కిలి స్నేహశీలురు. ప్రపంచమే ఆరాధించే ఉత్తమ గాయకి అనేమాట అట్లా ఉండగా, సుబ్బులక్ష్మి మూర్తీభవించిన సౌజన్య స్వరూపము! "మీ చెల్లెలి పెండ్లిలో, నే ఒచ్చి పాడతాను. ఇంకెవ్వరూ పాడకూడదు ఆ ఉత్సవంలో!"అనేది ఆమె ఎంతో ఆప్యాయతతో. సదాశివం, ఆమె, నేనూ వారి లోగిలిముందు నడవాలో కూర్చుని, నేను వారిద్దరూ అందిచ్చిన మంచిగంధాన్ని పూసుకున్నాక, ఆమె అతిసుతారంగా చీలుస్తూన్న లేత తమలపాకులను నములుతూ, ఈ మాటా ఆ మాటా చెప్పుకునే రోజులు జీవితంలో వెన్నెల రాత్రులను స్ఫురింపజేస్తాయి. లోకమంతా భక్తితో ఆరాధించే దేవతల వంటి వారు మన ఇంటిలో మన అక్కచెల్లెళ్ళ లాగ, మనతో ఎంతో చను

వుగా మసలుతూ ఉండడము ఎంతో వింతగా ఉంటుంది. ఎంతో ఆత్మానంద కరంగా ఉంటుంది, ఆ ఆప్యాయత.

మరొక ప్రఖ్యాత వ్యక్తితో కూడా నాకు ఇటువంటి సామీప్యం లభించ డము ఒక అమూల్య ఆత్మానుభవంగా పరిగణిస్తూ ఉంటాను నా జీవితంలో నేను. ఆమె రాజకీయవేత్త, చాలాసార్లు జైలుకుకూడా వెళ్ళింది. తన గంభీరమైన ఉపన్యాసాల ద్వారా వేలాది యువతీ యువకులను మాతృదేశ సేవా నిరతులనుగా చేసిన మహనీయురాలు. ఆమెతో ఈ సభలకూ ఈ ఉపన్యాసాలకూ వెళ్ళక పోయినా, ఎప్పుడూ ఆమెతో ఉంటూ ఉండేవాడను నేను, ఆమెకు ఏమి కావాలో కనుక్కుంటూ. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి, ఆమె మన గుడి వాడలో సత్యాగ్రహంచేసి, అక్కడే అరెస్టయింది. నాకు రాజకీయాలతో ఎన్నడూ ప్రసక్తిలేదు. అటువైపు నా మనస్సు పోదు. కాని, ఆమె యందు నాకున్న వ్యక్తిగతమైన అపరిమితానురాగంవల, ఆమెతోనే ఉండి,ఉద్యమంలో పాటుపడుతూన్న ఆమెకు కావలసిన సౌకర్యాలను గురించి శ్రద్ధతో చూస్తూ ఉండేవాడను. తీరికసమయాలలో పారశీక కవుల గురించీ రష్యన్ రచయి తలను గురించీ ఆమెతో ముచ్చటిస్తూ ఉండేవాడను. ఆమె నాయందు నిలిపిన విశ్వాసం నన్ను తరింప జేసిందనడము అతిశయోక్తి కాదు. నాకు పురమా యించిన పని తప్పక నెరవేరుతుంది అనే గట్టి నమ్మకము ఆమెకు. ఒక్కొ క్కప్పుడు, రాజకీయ విషయాలలో కూడా నాసలహా అడిగేది ఆమె. నిష్పక్ష పాతంతో, ముక్కుకు సూటిగా కనుపించే విధాన, నాకు తోచినది చెబితే "అదే నిజము" అని, ఆ ప్రకారం అవలంబించేది ఎంతో అనుభవజ్ఞురాలైన ఆమె. పదివేలమంది సమావేశమైన సభలో ఒక గంటన్నరసేపు విడువకుండా ఉపన్యసించి, ఆ జనసమర్దంలో అలసిపోయి, బసకు వచ్చిన ఆమె డస్సి పోయి, సోఫాపై వాలగా, ఆమె కోసం చేసి ఉంచిన నిమ్మకాయ రసం కలి పిన చల్లని పటికిబెల్లపు పానకము ఆమె చేతికందిచ్చేసరికి "అమ్మయ్య!" అంటూ పానకమును చప్పరిస్తూ, చల్లగాలికి తెప్పరిలిన, శోషిల్లిన శేఫాలికలా ఆమె చిరునవ్వుతో, ఉదయం మేము విడిచిపెట్టిన సాహిత్యగోష్ఠిని తిరిగి ఉప క్రమించేది. ఎక్కడి సత్యాగ్రహము, ఎక్కడి గులిస్తాన్! ప్రజలను తీవ్రంగా

కలిచివేస్తూన్న ఆనాటి రాజకీయ సమస్యల గురించి గాక, గులాబీ పువ్వులను గురించీ మన తెలుగు బాలికల సింగారింపు గురించీ స్నేహాన్ని గురించీ స్నేహితుల ఆదరణను గురించీ ముచ్చటించే వారము, మేము. ఇంకొక అర గంటలో, ఇంకో రాజకీయసభలో ఉపన్యసించడానికి తయరవుతూన్న ఆమె కార్ ఎక్కేవరకూ కూడా, నాతో సంభాషిస్తూనే ఉండేది, మొగలిపువ్వుల పరిమళం గురించీ, తెలుగు కవిత్వంలోని లాలిత్యం గురించీ.

ఒక మధ్యాహ్నం నాకు జరూరు కబురు రాగా, గుడివాడ జైలులోకి వెళ్ళి చూచాను ఆమెను. ఇనుప ఊచలవెనుక నిలబడి నా రాకకై నిరీక్షిస్తున్నది, అరెస్టయిన దేశసేవిక. నేను చిరునవ్వు నవ్వలేక పోయాను. ఆమె మాత్రం వెన్నెలలా నవ్వుతూ" తొందరలో నా దువ్వెన మరచిపోయాను; మరోదువ్వెన తెచ్చిపెడతావా!"అని అడిగింది."ఇదుగోతెచ్చాను." అని అందిచ్చాను,దంతపు దువ్వెనను. మేజస్ట్రిట్ నన్ను ఎరుగును. అతని అనుమతి పొంది, పటికిబెల్లపు పానకంలో నిమ్మకాయ రసము కలిపితెచ్చి, గ్లాసు ఆమె చేతికి అందిచ్చాను. "జైలులో నాకు చదువుకోడానికి ఉంటాయి, నీ వద్దవున్న 'పర్షియన్ లిరిక్స్' కూడాపట్టుకొస్తావా!" అని అడిగింది. నేను ముఖం అటు తిప్పుకున్నాను. "అబ్బే! కన్నీరా.... తప్పుకదూ!" అని మందలించినది నన్ను, ఆమె....

....ఒకసారి బెంగుళూర్ లో ఒక్కడనూ షికారు వెళుతూండగా, ఆమె, ఆమె స్నేహితులూ, కార్ లో నేనున్న చోటికివస్తూ, త్రోవలో నన్నుచూచి కార్ ఆపారు. ఆ వేళనే వచ్చిన త్రివేణిలో 'నేటి రష్యాలోని నాట్యరంగము'ను గురించిన ఆమె వ్యాసం చదివాను. "త్రివేణిలో మీ వ్యాసం చదివాను" అన్నాను. "నీవు వ్రాసిన పద్యమూ చదివాను, త్రివేణిలో" అన్నది ఆమె చిరునవ్వుతో. తొందర పనిమీద వారు వెళ్ళిపోయారు.

రెండు కొండల నడుమ సుందరమైన లోయలో, నిర్జన ప్రదేశాన ఒక చలువరాతి దేవాలయం నిర్మిస్తాడు భక్తుడు. మూన్నాళ్ళు ఉపవాసదీక్ష వహించి దివ్యనామ జపంచేస్తూ, చలువరాతి వేదికపైన, చలువరాతి పద్మంలోంచి వెలిసే చలువరాతి దివ్యమంగళ విగ్రహాన్ని ప్రతిష్ఠిస్తాడు, ఆ శిల్పి. ఆ చలువరాతి చప్పరముపైనా మంటపమంతటా, గోపుర ఉపరిభాగాన, అద్భుతమైన లతలతో

కలిసిపోయేట్టు, తన ఆరాధ్యదేవత దివ్య నామాక్షరాలు చిత్రిస్తాడు. ప్రతి వేకువను, పక్షుల కలకలారవంతో కలిసి, అతని ఉదయసంకీర్తనము, మేలుకొలుపుతుంది విశ్వప్రకృతిని. మంచుతడి ఆరని నందివర్ధనాలతోనూ ఉదయకాంతులలో మెరిసిపోయే పారిజాతాలతోనూ దేవిని పూజిస్తాడు, భక్తుడు. దినమంతా, తన ప్రతిమ పాదాల వద్దనే పద్మాసనమున కూర్చుని, తన హృదయాంతర్హృదయంలోంచి వెల్లువై వచ్చిన ప్రేమ గీతాలను భూర్జర పత్రాలపై లిఖిస్తాడు అతను. సంధ్యవేళల, చుక్కగుంపులు తొంగి చూస్తుండగా, తైల దీపమాలికల వెలుగులో నిలిచి, ఆ నిర్జన ప్రదేశంలో ఎలుగెత్తి కీర్తిస్తాడు, తన దేవి ప్రతిభను ఆ కవి! ఒకనాటి ఉషస్సమయాన, తలువని తలంపుగా, అతని ఆరాధ్యదేవత స్వయంగా ప్రత్యక్షమవుతుంది ఆ చలువరాతి దేవాలయ ప్రాంగణమున, అతనికి తెలియకుండానే, మందిరమును ప్రవేశించి, అద్భుత శిల్పసంపదతో మిళితమైన తన పేరును గుర్తిస్తుంది ఆమె, ముందుకువచ్చి, వేదికపై వెలసిన మూర్తి తన రూపమేనని పోల్చుకుంటుంది. ధ్యాననిమగ్నుడైన కవి భుజాన చేయివైచి, తర్జనితో విగ్రహము దెసచూపుతూ "ఇదేనా నీ దేవత!" అంటుంది ఆమె.

సిగ్గుతో తలవంచుకుంటాడు భక్తుడు. వినమ్రుడై, ప్రత్యక్షమైన తన దేవియెదుట మోకరిల్లుతాడు....ఇక, అంతరాయము లేకుండా అతని ఆరాధన సాగిపోతుంది.

ఇదీ, త్రివేణిలో ప్రచురితమైన పూజామందిరం అనే నా ఇంగ్లీష్ రచన. ఇలా ముగించాను:

he saw, what I could not hide; in the immobile image, a marvellous replce of her own sweet, angelic form, with brow and eyes, and lips all eloquent of the glorious soul she herself held within.

Then, half in wonder, half with joy, one arm imperiously held towards the marble image, to the dumbfounded devotee she spake:

"Is this your Diety?"

Ashamed, I hung my head; and, on bended knee, the hem of her garment I kissed.

And, once more, worship reigned within my Shrine.

* * * *

ఇక్కడ కుమారవనంలో శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిని అర్థిస్తున్నాను ఒక పర్యాయం మహాత్ముని మా ఇన్‌స్టిట్యూట్‌కి తీసుకురమ్మని.

"ఏమిస్తారు మీరు, ఆయన అక్కడకు వస్తేను?" అన్నారు ఆయన.

నాకు అర్థంకాలేదు: నా తరపున సదాశివన్ అన్నారు:

"వారందరూ విద్యార్థులు; నూటపదహార్లు ఇస్తారు" అన్నాడు.

"సరే! అల్లాగే; వచ్చే ఆదివారం సాయంత్రం ఐదు గంటలకు వస్తారు మహాత్మాజీ మీ ఇన్‌స్టిట్యూట్‌కు" అని చెప్పి, వెళ్ళిపోయారు శ్రీ రాజగోపాలాచారి.

ఆ నిమిషం ఆయనమీద కోపం వచ్చింది నాకు, నా అజ్ఞానంవల్ల. మహాత్ముని రాకకు ఆర్థికంగా విలువకట్టడం ఎంతో కటువుగా తోచింది నాకు. కాని, సదాశివం నచ్చచెప్పారు.

"ఈ వసూలైన మొత్తాలు ఎవరికోస మనుకున్నావు? నీవూ నేనూ సేవచేయలేని 'దరిద్ర నారాయణుని'కోసం. మహాత్ముని జీవితమంతా వారి కొరకే అంకితమైనది, నీకు తెలియదా? మీ వందమంది విద్యార్థులు ఆమాత్రం త్యాగం చెయ్యలేరా" అన్నారు.

ఎందుకు చెయ్యలేరు? సినిమాకు వెళ్ళితే, ఎంతలేదన్నా, తలా నాలుగైదు రూపాయలు ఖర్చు అయ్యేది, బళ్ళకనీ, ఐస్‌క్రీమ్‌లకనీ, ఇంకా ఏవేవో చిల్లర ఖర్చులకూ. ఒక్క పూటలో వసూలుచేశాను నూటపదహార్లు, మహాత్మునికి కానుకగా ఇయ్యడానికి. సంతోషంతో ఇచ్చారు నా స్నేహితు లందరూ.

తొందరలో శ్రీ రాజగోపాలాచార్యులపైన కోపగించుకున్నా. తరువాత వారికి చాలా ఆప్తుడ నయ్యాను నేను. కొన్నేళ్ళు గడచినాక, నేను ఏర్పరచిన

ఒక లలితకళాప్రదర్శనానికి అధ్యక్షత వహిస్తూ నన్ను చాలా ఆదరిస్తూ ప్రశంసించారు ఆయన, తలపెట్టినపని సాధించే అద్భుతమైన కార్యదీక్ష ఉన్నది ఇతనిలో-అంటూ.

ఇట్టే వచ్చింది ఆదివారం. శనివారం రాత్రి నాకు నిద్దురలేదు. రేపు సభ ఎలా పరిణమిస్తుందో అనే బెంగ. అన్ని ఏర్పాటులూ సరిగా ఆలోచించి ఎంతో శ్రద్ధతో చేసినా తృప్తిలేదు. "ఏమిచేయగబోయి ఏమి చేసెదనో!" అనే భయం!

సదాశివమును అడిగి, చక్కని, మల్లె పువ్వులలాంటి పొందూరు ఖద్దరు సంపాదించి, ఊళ్ళో ఉన్న మంగుళూరు మహిళాసేవా సమాజం వారిచేత, అందమైన లతలతో చిన్న సంచీ అల్లించాను, నూట పదహార్లు ఉంచడానికి. అన్నీ చక్కగా అమరినా, ఇంకా ఏదో బెంగ. "ఏమనబోయి ఏమంటానో" అనే భీతి!

అనుకున్న వేళకు, ఆ నిమిషానికి సరిగ్గా, అవతరించారు సభా భవనం వద్ద మహాత్ముడూ వారి అనుచరులు: సదాశివం, గంగాధరరావుదేశపాండ్యే, శ్రీ రాజగోపాలాచారి. కారు 'దిగీ దిగడంతోనే చకచకా వేదికవైపు నడచి వెళ్ళారు మహాత్ముడు.

పూలదండ వెయ్యకూడదు అని చెప్పారు సదాశివం. నేను స్వయంగా వడికి ఉంచిన నూరో నెంబరు సన్నని ఖద్దరు దారాన్ని దండగా అమర్చి మా తోటలోని గుప్పెడు సంపెంగ పువ్వులతో మహాత్ముల వారి ముందు ఉంచాను వణికే చేతులతో. పువ్వులను చూచి, వారు చిరునవ్వు నవ్వడము నాకు బాగా జ్ఞాపకమున్నది.

"ఈ నూలు నువ్వు వడికినదేనా?" అన్నారు, నన్ను చూచి. ఆ కంఠ స్వరము జన్మలో మరువరానిది. "చిత్తము!" అన్నాను.

కాస్త ముందుకువచ్చి, నా ప్రసంగము ప్రారంభించాను. చక్కని మాటలతో పొందుపరచి, ఒక వారం రోజులు సాధకం చేశాను, ఆ మూడు నిమిషాల ప్రసంగాన్ని! "పూర్వం అసంఖ్యాకులైన జనసమూహాలకు, కటికచీకటిలో

వైతము, ఆశగొలిపే మహనీయులను గురించి విన్నామేగాని ఈ నాడు మా పురాకృత సుకృతంవల్ల, అట్టి పరమ పురుషుడు మా కన్నుల ఎదుటనే మసలుతూ ఉండడము చూడకలిగిన మహద్భాగ్యము కలిగినది మాకు. "వారి అడుగుజాడలలోనే నడువటానికి యత్నిస్తాము. 'దరిద్ర నారాయణుని' ఉద్ధ రించడానికి మహాత్ములు పూనుకున్న సంకల్పంతో సాయపడాలనే ఆశతో 'చంద్రునికో నూలుపోగు'లా మా విద్యార్థుల తరపున ఈ చిన్న కానుకను అర్పిస్తున్నాను"అని, పువ్వులు అల్లిన పొందూరు ఖాదీ సంచీలోనూటపదార్లు వారి చేతిలో ఉంచాను.

నా 'గంభీర ఉపన్యాసము'ను చిరునవ్వుతో ఆలకించిన మహాత్ముడు నన్ను చూస్తూ ఒక్కమాట అన్నారు :

'ARE YOU SATISFIED ?

'ఇక చాలునా,' అని !

అందరూ నవ్వారు. పాతాళంలోనికి కృంగిపోయేటట్టు తల వంచుకున్నాను.

అప్పుడు, మళ్ళా నన్ను చూచి ముసిముసి నవ్వులు నవ్వుతూ, ఎంతో ఆదరంతో పలుకరించి, విద్యార్థుల నుద్దేశించి, నాలుగు మాటలు చెప్పారు ఆయన. "ఆధునిక విజ్ఞాన సంపద అంతా మీ అరచేతిలో వున్నది. ప్రస్తుత మానవ జీవితంలో ఎన్నో సౌకర్యాలను కలుగజేసే అవకాశం మీకు లభించినది. కాని, దీనివల్ల జీవితాన్ని ఇంకా ఇంకా క్లిష్టపరచడము బదులు, సాధారణ మానవుని నిత్యజీవితము ఇప్పటికంటే రవ్వంత ఆనందదాయకము చేయుట మీ విధి. ఎంత గొప్ప పరిశోధనలలో నిమగ్నులై ఉన్నా, ఒక్కపూట తిండికూడా లభించడానికి, పడరాని అగచాట్లు పడుచున్న మీ సోదరులను ఒక్క నిమిషమైనా మరువరాదు మీరు" అన్నారు.

అని, మహాత్ముడు వెళ్ళిపోయారు.

## ౧౬

రామ ! నీ సమాన మెవరు !
రఘు వంశో ద్ధారక !
భామా మరువంపు మొలక
భ క్తియను పంజరపు చిలుక !

పలుకు పలుకులకు తేనె లొలుక
మాటలాడు సోదరులు గల
హరి త్యాగరాజకుల విభూష !
మృదు సుభాష !
రామ ! నీ సమాన మెవరు !

శ్రీరామనామ సంకీర్తనము చేస్తున్నారు అబ్దుల్ కరీంఖాన్. అమర గాయకుడు, రామభక్తి పరవశుడై పాడుతున్నారు, బెంగుళూరులో మా ఇన్‌స్టిట్యూట్‌లో. మొదట, దాక్షిణాత్య సంప్రదాయంలో పాడి వినిపించారు, సంగతులతోను, స్వరకల్పనతోనూ, కచ్చేరి పద్ధతిని. ఒక క్షణం ఆగి "నేను పాడినపాట మీకు అర్థమయిందా?" అని అడిగి, "పాడవలసిన పద్ధతి ఇదికాదు; ఇది భక్తిగీతము, ఇలా పాడితే ఎలా ఉంటుందో వినండి" అని పాడ నారంభించారు, ఆయన. ఆయన వెలిబుచ్చిన భక్తిరసానికి శిలలు ద్రవిస్తాయనడం అతిశయోక్తికాదు. ఎంతో ఊహిస్తూ, ఎంతో ఊహింపజేస్తూ, ఎంతో అనుభవింపజేస్తూ, నిజమైన రామభక్తిని వెల్లడించారాయన, ఆ గానములో. ఏమి కంఠస్వరము!

తరువాత, ఆయన తనకు చాలా ఇష్టమైన యమన్ రాగమున ఆలాపన చేశారు; ఒక్క ముప్పావుగంట కాలము అనుకుంటా, మంత్రముగ్ధు లైనట్లు కూర్చుని విన్నాము-ఆయన ఆవేదన, అన్వేషణ, ఆశ, నిరాశ, ఆ ఆలాపనలో.

క్షణక్షణమూ ఏదో ఒక కొత్త అందము కనిపించేది ఆ రసవాహినిలో ఆయన మనుష్యమాత్రుడు కాదు అనిపించేటంతటి మాధుర్యం కురిపించారు. ఎంత హాయి! ఎంత తేజస్సు! ఆయన పాట వింటూఉంటే జన్మాంతరమందు ఎప్పుడో జరిగిపోయిన పూర్వగాథను గురించిన స్మృతులను ఆర్ద్రహృదయంతో పునశ్చరణ చేసుకుంటూ ఉన్నట్టు ఉంటుంది. ఏదో అపూర్వమైన స్వప్నసీమ లోకి తీసుకుపోతారు ఆయన. కాని అక్కడ విడిచిపెట్టరు. చటుక్కున మెలకువ వస్తుంది. ఉలిక్కిపడి, తిరిగి ఈ లోకానికి వస్తాము రాగబద్ధమైన ఆయన కేకతో, ఎంతో సేపయ్యాక. కొంతసేపు పాట నిలిపి, మాతో సంగీతాన్ని గురించి ముచ్చటింప నారంభించారు ఆయన. అనుభవించడమే, గానకళకు ప్రాణమన్నారు. శ్రీరాముని అచ్చంగా కళ్ళయెదుట సాక్షాత్కరింప జేసుకోలేనివారు ఆ పాట జోలికి రాకూడదన్నారు. తన రామనామ సంకీర్తనము విన తటస్థించిన నాస్తికులు సైతము పరమరామభక్తులనుగా మార్చ కలిగినప్పుడే తన గానకళ కళగా ఉపకరిస్తుంది అన్నారు.

అబ్దుల్ కరీంఖాన్ గానము వినుట ఒక అమూల్యానుభూతి; భక్తితో జ్ఞాపకం చేసుకోతగ్గది. హీరాబాయిబరోడేకర్ పాట వింటూంటే ఆ అమర గాయకుడు స్ఫురణకు వచ్చి, ఎంతో బెంగగా ఉంటుంది. అమూల్యమైన వస్తువును పారవేసుకున్న వెల్తి కనిపిస్తుంది, ఈ జీవితంలో, ఆనాటి రసానుభవమును జ్ఞప్తిచేసుకుంటే. కాని ఓ నిమిషం బాహ్యప్రపంచాన్ని మరచి పోగలిగామంటే, హీరాబాయి పాట వింటూనే ఆ అప్పటి ఆనందాన్ని మళ్ళా అనుభవింపవచ్చు, ఒక కొంతసేపు.

"అబ్దుల్ కరీమ్‌ఖాన్ మహనీయుడు తాన్సేన్ అపరావతారం తెలుసా" అన్నాడు, స్నేహితుడు పజూభాయిశుక్లా. నిజమే కాబోలు. అప్పుడే తాన్సేన్ గురించి చక్కటి కథ విన్నాను. అసమాన ప్రతిభావంతుడు తాన్సేన్. ఒకనాడు స్నేహితుడూ ప్రభువూ అయిన అక్బర్ ఆజ్ఞానుసారం దీపక్ రాగమును ఆలాపిస్తాడు. మొదట ఎంతో చెప్పిచూస్తాడు, ఆ రాగము పాడకూడదు ప్రమాదము అని. కాని, అక్బర్ పట్టినదే పట్టు. కొంతసేపు పాటసాగాక, చక్రవర్తి తన్మయుడై వింటూ ఉండగా, తాన్సేన్ సర్వాంగమూ భగ్గున మండిపోతుంది.

చక్రవర్తి భయకంపితుడవుతాడు. కాని, తాన్సేన్ పాటమానడు; ఇంకా, ఇంకా రసోద్రేకంతో గానము చేస్తూఉంటాడు. ఈ మంటలు చల్లార్చ నెవరితరమూ గాదు. కాని ఒక నిర్జన ప్రదేశంలో, కృష్ణపరమైన తన గీతికలు పాడుకుంటూన్న ఒక బాలయోగిని, జ్వాలామయుడైనా, పాట నాపని గాయకుని తాన్సేనుగా గుర్తించి మేఘమల్హార్ రాగమును పాడుతుంది. మండు వేసవి; నిర్మలాకాశాన, ఏ మూలనా మచ్చునకైనా మేఘశకలము లేని సమయాన, ఆ మేఘమల్హార్ రాగం సాగగా సాగగా, అష్ట దిక్కులనుండి మేఘాలు కమ్ముకువచ్చి, కుంభవృష్టిని వర్షం కురుస్తుంది! మంటలు చల్లారతవి!! మహనీయురాలైన ఆ బాలయోగినే, మీరాబాయి.

తాన్సేన్ గురించి [స్వర్గీయుడు] మా కొంపెల్ల జనార్దనరావు ఒక చక్కని ఏకాంకిక వ్రాశారు. చాలా అందంగా నడిచింది కథ. ఆ కథలో, తాన్సేన్‌ను మంటలు క్రమ్మకోవు. విపరీతపు దాహం ఆవరిస్తుంది అతనిని. చక్రవర్తి తెచ్చియిచ్చిన ఏ పానీయమూ ఆ దాహాన్ని తీర్చదు. ఆఖరుకు, ఒక అంచున నిలిచి, నీళ్లు తోడుతున్న భక్తురాలు చేదతో చేదితెచ్చిన నీరే ఆతని దాహాన్ని తీరుస్తుంది. ఆమె మీరా! ఈ కథ ప్రారంభంలోనే ఒక అందాన్ని చూపారు జనార్దనరావు. అక్బరూ, తాన్సేన్, తాన్సేన్‌గురువు హరదాస్ వద్దకు వెళతారు. హరదాస్ ఎన్నడూ ప్రభువుల సంతోషంకోసం పాడడు. అందుచేత అక్బర్ తన రాజచిహ్నాలు వదిలివేసి, ఒక భక్తునిగా, పాదచారిగా వస్తాడు తాన్సేన్‌తో ఆశ్రమానికి. అద్భుతమైన ఆ గానమును విని, ఆగ్రాకు తిరిగి వస్తూన్న అక్బర్, తాన్సేన్‌ను ప్రశ్నిస్తాడు, "అతనికంటె ఎక్కువ సాధన చేశావు నీవు, అతనికంటె ఎక్కువ ప్రతిభ ఉన్నది నీలో, మరి నీకంటె ఎక్కువగా అతనిపాటే నన్ను తన్మయుని చేసినదేమి?" అని. తాన్సేన్ అంటాడు: "ప్రభూ! అతను దేవుని ఉద్దేశించి, నేను చక్రవర్తిని ఉద్దేశించి గానము చేయుదుము. అందువలననే వ్యత్యాసం" అని!

* * * *

నాకు విపరీతంగా జ్వరం వచ్చింది, ఒళ్ళు సలసల కాగిపోయింది. హంపీనుండి తెచ్చుకున్న చలిజ్వర మన్నారు. అబ్బ! చాలా బాధ పడ్డాను.

స్నేహితులు మీర్‌చందానీ, శుక్లా, భాస్కర్ పనిక్కరూ ఒకరి తర్వాత ఒకరు వంతులుగా, రాత్రింబవళ్ళు నా ప్రక్కనే ఉండి, ఎంతో పరిచర్య చేశారు. ఐనా తగ్గలేదు. ఒకనాటి రాత్రి, నూటఐదు డిగ్రీలను మించింది జ్వరం. వారు భయపడ్డారు. శుక్లా పరుగెత్తుకుంటూ వెళ్ళి మా ప్రొఫెస్సర్ సైమన్‌సన్‌ను నిద్రలేపి తీసుకువచ్చాడు. వారు వచ్చేలోపల నేను విపరీతంగా ప్రలాపించసాగానట! కవిత్వం గురించీ కవుల గురించీ ఏవేవో వింతమాటలు పలికానట. సన్నని కంఠస్వరంతో, పద్యం వల్లింపసాగానట. మీర్‌చందానీని అడిగి పెన్సిల్ తీసుకుని, గోడమీద ఈ పంక్తులు వ్రాశానట:

ఎందులకు స్వామి! నన్నిట్లు తీవ్ర జ్వరతాప జ్వాలల
కాహుతి జేసెదంచు, దేవదేవుని నే నడిగినపుడు,
క్షుద్రుడను! ఇంచుకేనియు శాంతి యొదవని ఈ
యున్మత్త శిరము హృదయనాథుని హృదయాన
జేర్చినపుడు,
పతితుడను! శల్యావశిష్టమగు ఈ తనుపంజరంబు
పరమ పావనుని పాదరజమున పొర్లాడినపుడు,
దయాశీలి, కన్నతండ్రి, యతడు, 'తొల్లి నిశ్చింత తోడుత
నీ వొనర్చినట్టి పాపముల పరిహార మిది' యంచు
పలుకునేమొ!

అని వ్రాశానట గోడపైన!

ప్రొఫెస్సర్ సైమన్‌సన్ ఆదుర్దాతో తన కార్‌లో వచ్చారు. స్నేహితులు సందిట్లో ఎత్తుకువెళ్ళి నన్ను ప్రొఫెస్సర్‌గారి ప్రక్కనే ఉంచారు కార్‌లో. నన్ను అతిపదిలంగా తీసుకువెళ్ళి ఆసుపత్రిలో జేరిపించి, తగిన వైద్యం జరిగే ఏర్పాటుచేసి మరీ వెళ్ళారు డాక్టర్ సైమన్‌సన్. తరువాత వారం రోజులకు నిమ్మళించింది అప్పటి ఆ జ్వరం. ఈ వారం రోజులూ రోజు విడిచి రోజూ మా ప్రొఫెస్సర్, ఆయన భార్యా ఆసుపత్రికి వచ్చి నన్నుచూచి వెళుతూండే

వారు. వారి తోటలో పూసిన అందమైన ఎర్రగులాబీ పువ్వులు ఇన్ని, రెమ్మలతో తెచ్చి, నా ప్రక్క, చెంతనే ఉన్న బల్లపైన వాస్‌లో అమర్చి వెళ్ళేది ఆమె. అటువంటి హితుల ఋణము తీర్చుకోడానికి మరో జన్మ కావాలి !

ఒకప్పుడు అనిపిస్తుంది: ఎందుకు, అందరూ ఇంత దయగా ఉంటారు నాపైన అని. ఆలోచించి చూస్తే, లోకంలో నిర్దయకంటే దయే ఎక్కువగా ఉన్నట్టు స్పష్టమవుతుంది. ఏదో ఒక సందర్భంలో, అబ్బ ! ఎందుకు ఇంత నిర్దాక్షిణ్యంగా ఉంటారు జనము, అని అనిపించినా, మొత్తంమీద మనుష్యులు మంచివారు, స్వతహాగా దయాశీలురు అనే విశ్వాసం స్థిరమైనది- ఇన్నేళ్ళ అనుభవంలోనూ.

నాకు బాగా జ్ఞాపకం ఉంది: ఒక సందర్భంలో పూజనీయురాలు ఒకామె నా ఎడ అతి కఠినంగా ప్రవర్తించవలసి వచ్చింది—పరిస్థితులు అటువంటివి. అందుకు నేనే బాధ్యుడను. ఇకమీదట వారి గుమ్మం తొక్కరాదని శాసించారు ఆమె. అప్పటి సంఘటనలను బట్టి అంత తీవ్రంగా ఉండక తప్పినది కాదు, ఆమెకు. దిగాలుపడి, వాడిపోయిన ముఖంతో నేను లేచి వచ్చేస్తూండగా, ఆమె వారింటి ముత్తయిదువను నా వద్దకు పంపారు. కాళ్ళు కడుక్కో నీళ్ళూ, ముఖం తుడుచుకోడానికి తుండుగుడ్డా, ఇచ్చి, "మీ కోసం వడ్డిస్తున్నారు, భోంచేసి వెళ్ళమంటున్నారు, అమ్మగారు" అన్నది ఆమె. ఫాలనేత్రమూ నెలవంకా ఒకేముఖాన కనిపించాయి, ఆ నిమిషం, నాకప్పుడు.

ఆ జ్వరం అలా అలా మూడునెలలు పీడించింది నన్ను. ఈ సంగతి తెలిసిన శ్రీదేవి, మా అక్కయ్య స్నేహితురాలు, బళ్ళారినుంచి ఆమె మేనమామచేత ఉత్తరం వ్రాయించింది నాకు. "మూడు నెలలుగా జ్వరంతో బాధపడుతున్నావని తెలిసింది. ఇదేమి అన్యాయము ! మేమంతా ఇక్కడుండగా, నీవు ఒక్కడవూ అక్కడ అలమటించడము ఏమీ బాగులేదు. వెంటనే రావాలి. ఇక్కడ తగిన వైద్యము, పథ్యము ఏర్పాటు చెయ్యడము బాధ్యత మాది" అని వ్రాశారు. వారు ఆనతిచ్చిన ప్రకారమే వెళ్ళాను. సూర్యచంద్రులు ఒకవేళ తన గతి తప్పినా తప్పవచ్చు, చలిజ్వరం మాత్రం ప్రతిరోజూ గడియారంలో గంట కొట్టినట్లు, ఉప్పెనై రావలసిందే. ఉదయమూ మధ్యాహ్నమంతా

కులాసాగానే ఉండేవాడను. శ్రీదేవితోనూ, చూడడానికి వచ్చిన స్నేహితుల తోనూ సాహిత్యగోష్ఠిలో ఉంటి, చాలా సరదాగా గడిపేవాడను. మూడుగంట లకు ఐదు నిమిషాలున్నదనగా చలి ప్రారంభమయ్యేది మండువేసవిలో. ఎదుట గడియారపు పెద్దముల్లు మూడవ అంకెను దాటేసరికి ఒళ్లు సలసల కాగి పోయేది. పావుగంటలోకల్లా థర్మామీటర్ ఏ నూటఐదో చూపేది. ఆ జ్వరం, ఒక ఘడియసేపు ఉండి తనంతట అదే దిగజారిపోయేది. మళ్ళా ఎంతో నీర సంగా ఉన్నా, ఎప్పటిలాగా, నవ్వులూ పువ్వులూ !!

పాపం, నాకోసం చాలా శ్రమబడ్డారు, వారు ఇంటిల్లపాతీ. ఏ జన్మ లోనో పెట్టిపుట్టబట్టిగాని, ఈ జన్మలో వారివల్ల ఇంత ఉపచారం పొంద డానికి, నేను ఏ విధంగానూ అర్హుడనుగాను. నాకు మందు ఇస్తూన్న పండిత తారానాధులవారు ఈ వ్యాధికి అత్తిపళ్ళు మంచివి అనేసరికి, ఆమడ దూరాన ఉన్న తోటకు మనిషిని పంపి రోజూ నా కోసం తెప్పించేవారు, అప్పుడే చెట్టు నుంచి కోయించిన అత్తిపళ్ళు. ఆ బంగాళాలో నూతినీళ్ళు అంత తియ్యగాలేవని, ఎక్కడో ఉన్న మంచినీటి బావి వద్దకుపంపి నా కోసం వేరే ఒక బిందెడు నీళ్లు తెప్పించేది శ్రీదేవి మేనత్త.

పండిత తారానాధులవారు రోజూ నన్ను చూడడానికి వచ్చేవారు. వారు వచ్చేవేళకు జ్వరం దిగజారి ఉండేది. మంచముపై నుంచి లేచి, వారి ఎదుట పడకకుర్చీలో కూర్చొని, వారితో కబుర్లు చెబుతూ ఉండేవాడను. శ్రీదేవి మా మాటలు వింటూ, అప్పుడప్పుడు, తనూ ఒక మాట అంటూఉండేది. ఆ రోజు లలో నేను ప్రఖ్యాత అమెరికన్ తత్వవేత్త విలియమ్‌జేమ్సు ప్రతిపాదించిన 'ప్రాగ్మాటిజమ్' అనే సిద్ధాంతం గురించి చదువుతూ ఉండేవాడను. సర్వ కాలాలకూ సర్వ అవస్థలకూ అన్వయించే విధాయకమైన సత్యనిర్వచనము లేదనీ, అప్పటి సమయాన్నిబట్టి, ఆయా అవస్థలను బట్టి సత్య స్వరూపము మారుతుందనీ, ఆచరణయోగ్యమై, అనుభవనీయమైన సత్యనిర్వచనే సబబై నదనీ చెప్పేవాదము అది. ఈ సిద్ధాంతానికీ మనకు సుపరిచితమైన ఉపనిషత్ భావాలకీ, కొంత వ్యత్యాసము కనిపిస్తుంది. ఆధునిక తత్వశాస్త్ర సిద్ధాంతాలను కూడా ఎంతో చక్కగా అవగాహన చేసుకున్న తారానాధ్ నాతో చాలాసేపు

చర్చించేవారు ఈ విషయాల గురించి. ఇప్పుడు తలుచుకుంటే వింతగా ఉంటుంది: అటువంటి జ్ఞానసంపన్నులతో ముఖాముఖిని చర్చించడానికి నాకు ధైర్యం ఎలా వచ్చిందాఅని. నా తెలిసీ తెలియనిఅభిప్రాయాలు అంత ఓపికతో ఆలకించడము పెద్దల ఔదార్యమునకు తార్కాణము.

నలభైరోజులు కాబోలు ఉన్నాను బళ్లారిలో అప్పుడు. ప్రతిరోజూ వచ్చేది జ్వరం, కొన్నాళ్ళు. తర్వాత రోజు విడిచి రోజు; ఆ తర్వాత మూన్నాళ్ళ కోసారి. నలభై రోజులైనాక కూడా ఏమీ గుణం కనిపించలేదని తెలిశాక పట్నంనుంచి నాన్నగారు గట్టిగా జాబు వ్రాశారు. "ఇదేమి జ్వరం! నీవు వెంటనే నా వద్దకు రావలసినది" అని! ఆ రాత్రే ప్రయాణమై పట్నం వచ్చాను.

స్టేషనునుంచి ఇంటికి వచ్చి పడకపై వ్రాలిన మరునిమిషం ముంచుకు వచ్చింది జ్వరం. నాడిచూచి, నాన్నగారు "నాకు తెలుసు, ఈ జ్వరం ఇలాగే వస్తుంది" అని, అప్పటికప్పుడు మనిషిని పంపి, కొన్ని మూలికలు తెప్పించి కషాయం కాచి, మూడు మోతాదులు ఇచ్చారు, మూడుపూటలు.

టక్కున ఆగిపోయింది జ్వరం నాన్నగారిచ్చిన మూడు మోతాదుల మందుతో. తిరిగి మళ్ళా రాలేదు, ఎన్నేళ్ళకీ.

అది వారి చేతిచలువ!

* * * *

తిరిగి బెంగుళూర్ వెళ్ళాక, ఒకనాటి సాయంత్రం తిరువాలూర్ రాజాయి గానము విన్నాను శ్రవణపేయంగా. కోయంబత్తూర్ తాయి తర్వాత, తాయి అంత గొప్పగానూ పాడేది రాజాయి. ఆమెలో ఒక సుగుణము: ఎంత శాస్త్రయుక్తంగా పాడుతున్నా, ఎంతటి కఠినమైన మెళకువలు చూపవలసి వచ్చినా, ఆమె ముఖంలోమాత్రము వికృతపు కళ కేమీ కనిపించేవికావు. ఎప్పుడూ, ఎంతో అందమైన మందహాసము తాండవించేది. ఆమె ముఖ కమలమున. అటువంటి మూర్తి వైపు చూస్తూ సుశ్రావ్యమైన ఆ సంగీతాన్ని ఎంత సేపైనా వినవచ్చును. శాస్త్రపు కట్టుబాట్లను రవంతైనా మీరకుండా, ఎంతో

అనుభవిస్తూ పాడేది రాజాయి. 'క్షీరసాగరశయనా నన్నూ చింతలూ బెట్టవలెనా' అని ఆమె అంటూ ఉంటే, ఆమె దెస నావంటివాని గుండె కరిగి నీరయ్యేది. "అయ్యో! ఆటగా, పాటగా బ్రతుకు గడిపివెయ్యవలసిన ఈ అందకత్తెకు ఎందుకు ఇంతటి చిత్తావేదన!" అనిపించేది.

రాజాయి పాటవల్ల పేరుగాంచినపాట 'శివదీక్షాపరురాలనురా' అనే కుర వంజి రాగమున పాట. కొంతవరకు ఆ రాగంలోనే వున్నది మరువరాని ఆ మాధుర్యం. కాని, ఆ అందాన్ని వెయ్యిరెట్లు అతిశయింప జేసేదీ రాజాయి తన కంఠస్వరంవల్ల, తన మనోభావ ప్రకటనవల్ల, గాన రసమును అద్భు తంగా ఉప్పతిల్ల జేసేది రాజాయి. ఆమె ప్రతి వేకువను, పంచ పంచ ఉషః కాలాన, ఎండకాలమనక, వానకాలమనక ఒక గంటసేపు ఈ పాటనూ ఆ దేవగాంధారి కృతినీ సాధకం చేసేదనేవారు, ఆ రోజులలో.

రాజాయి గానములో దాక్షిణాత్య సంగీతకళ ఒక ఉత్తమస్థాయి నందు కొన్నది. నా మనస్సును, నా హృదయాన్ని చాలా ఆకర్షించింది ఆమె గానము, ఆమె పాడే తీరూ. అందుచేతనే ఆ రోజులలో స్నేహితులతో కులాసాకి ప్రఖ్యాత ఆంగ్లకవి బైరన్ కూర్చిన 'బంచ్ ఆఫ్ స్వీట్స్—మధుర వస్తువుల గుత్తి'ని గురించి చెపుతూ, ఆకవి జాబితాలో 'సందె చీకటిలో ప్రజ్వరిల్లే వేగు చుక్క' 'జవరాలి చిరునవ్వు' 'కెరటాలపై తేలివచ్చే రాగచ్ఛాయ-'ఇటువంటివి ఉంటే, నా జాబితా ఇది అంటూ, అంతవరకు నా జీవితంలో నేను చవిజూచిన మధురాతి మధురములైనవి, ఇవి, అనే వాడను:

కనౌజ్ కస్తూరీ అత్తరు, కలకత్తా రసగుల్లాలు,
సింహాచలం సంపెంగలు, సర్పవరం మల్లెలు,
ఢిల్లీ పిస్తాష్ హల్వా, లక్నో జిలేబీలు,
బందరు జహాంగీరుమామిడిపండు,

రాజాయిపాట!

అన్నిటికంటే మధురమైనది, రాజాయి పాట!

## ౨౦

నను పాలింప నడచి వచ్చితివో నా ప్రాణనాథ!
వనజనయన మోమును జూచుట జీ
వనమని నెనరున మనసున మర్మము దెలిసి ॥న॥

సురపతీ నీలమణినిభతనువుతో
నురమున ముత్యాపు సరుల చయముతో
కరమున శరకోదండ కాంతితో
ధరణి తనయతో, త్యాగరాజార్చిత
నను పాలింప నడిచి వచ్చితివో నా ప్రాణనాథ!

అందమైన ఈ పాటవింటూ నిద్రపోయేవాడను ప్రతిరాత్రీ; ఆహ్లాద కరమైన ఈ మేలుకొలుపుతోనే లేచేవాడను. ప్రతివేకువను దివ్యగాయకి కోయంబత్తూర్ తాయి రికార్డ్ స్టార్ట్ చేసి, నాచేతికి టీకప్పు అందిచ్చేవాడు, శంకరమీనన్. నేనంటే అతనికి ప్రాణము. ఎంతో శ్రద్ధతో చూచేవాడు నా పనులన్నీ, నా జబ్బులోకూడా, చాలా పాటుపడ్డాడు. మృదు మధురమైన కిన్నెర కంఠ స్వరంతో మిళితమై ఉంటుంది శంకర్‌ను గురించిన జ్ఞాపకము.

కోయంబత్తూర్ తాయి పాడిన ఇంకొక పాటకూడా తరుచు వినేవాడను, మరీ, మరీ. సావేరి రాగంలో 'శ్రీరాజగోపాల' అనే పాట. ఎంతో హృదయ రంజకంగా పాడినది ఆమె ఆ పాట. ఎన్నిసార్లు వినినా, ఇంకా వినాలని ఉండేది ఆ ఒక్కపాటే!

ఆ రోజులలో నాకు కలిగిన సంగీతమందలి ఆసక్తి వల్ల, నేనే వయొలిన్ నేర్చుకోవడం మొదలుపెట్టాను. ఒక సంవత్సరాది పండుగకు నాకు ఒక రిస్ట్‌వాచ్‌ని కొని ఇయ్యమని మీర్‌చందానీ పేర సొమ్ము పంపింది మా అక్కయ్య ఢిల్లీనుంచి. నా పేర పంపితే, నేను గడియారం కొనుక్కో

కుండా, ఏ పువ్వులకో, పుస్తకాలకో, మరి ఏ చిల్లర ఖర్చుకో ఖర్చుపెడతానని జడిసి, అతనిపేర పంపినది సొమ్ము. అతను నాతో ఆ మాట చెప్పేసరికి నేను అనుకుంటున్నాను వయొలిన్ ఉంటే ఎంతబాగుండును! చప్పున ఆ వాద్యమును అభ్యసించి నా ఆత్మగాథ నంతా ఆ వయొలిన్‌తో చెప్పుకుందునుకదా! అని. మీర్‌చందానీతో అన్నాను : "ఇన్‌స్టిట్యూట్‌లో నాలుగువేపులా, ఎక్కడ పడితే అక్కడ ఉన్నాయి గడియారాలు, నాకు రిస్ట్‌వాచ్ ఎందుకు, ప్రస్తుతం నేను చాలా కోరేది వయొలిన్" అని. అతనిని ఒప్పించి, ఊళ్లోకి వెళ్ళి, చక్కని వయొలిన్ కొనుక్కున్నాను. ఆ అంగడియజమాని మన తెలుగువాడే. అప్పుడతనికి ఇరవై ఏళ్ళకు లోపు. చురుకైనవాడు. సౌమ్యుడు. అతనితో మన గోదావరిజిల్లా తెలుగు మాట్లాడుతూ, అతనివద్ద ఉన్న వయొలిన్లలోకల్లా మంచిది ఎన్నుకొన్నాను. ఒక పదేళ్ళతర్వాత, ఆ అబ్బాయిని మళ్ళీ కలుసుకున్నాను, ప్రఖ్యాతగాయకి బెజవాడ రాజరత్నం రేడియోగానసభలో. బ్రహ్మాండమైన ఆర్కెస్ట్రా తరిఫీదుచేసి డైరక్ట్ చేస్తున్నాడు లంక కామేశ్వరరావు— అతనే! "జ్ఞాపకముందా? పదిహేనేళ్ళక్రితము బెంగుళూరులో నీవద్ద వయొలిన్ కొన్నాను" అనేసరికి, "నేను మరువలేదు, మీరే ఒకవేళ గుర్తింపరేమో అనుకున్నాను"అన్నాడు కామేశ్వరరావు! ఆ తరువాత, తరుచు కలుసుకునే వారము ఇద్దరమూ. ఆకారంలో చాలా మారినా, మా మనస్సులుమాత్రం మారలేదు.

ఎంతో శ్రద్ధతో నేర్పారు నాకు మా గురువు. పాఠము ప్రారంభించిన రెండవ రోజుననే అడిగాను ఆయనను. "నాకు 'శ్రీ రాజగోపాల' వయొలిన్‌పైన వాయించాలని ఉన్నది. ఎన్నాళ్ళు పడుతుంది నేర్చుకోడానికి?" అని. ఆయన చిరునవ్వుతో అన్నారు : "ఎన్నాళ్ళో, ఎన్నేళ్ళో నీవు చేసే సాధకాన్నిబట్టి ఉంటుంది. అదృష్టంకూడా కలిసి రావాలి. ఇప్పటి నీ ఆసక్తిని బట్టి చూస్తే చప్పునే రావచ్చు" అన్నారు.

"చప్పునే, అంటే?"

ఆయన కాస్త ఆలోచించి, చిరునవ్వుతోనే అన్నారు :

"రెండు, మూడేళ్లు - సరేనా?"

మూడేళ్ళే! అనుకున్నాను. ఇటువంటి ఆత్రుతే అన్ని విషయాలలోనూ. చెట్టు మొలిచేసరికి పువ్వులు పూయించాలని ఉంటుంది. వ్యాసం వ్రాయ నారంభించేసరికి, ఆఖరిమాట ఎలా ఉంటుందో అని చూడాలనే ఉద్వేగమే! కొన్నాళ్లయినాక, చిత్రకళను అభ్యసిస్తున్నప్పుడూ అంతే. బొమ్మ సరిగా గియ్యకుండానే, రంగులన్నీ మేళవించిన చిత్తరువు, నాచిత్తరువు నాయెదుట సాక్షాత్కరించాలనే తొందరే! అందుకే అన్నారు పూజ్యులు డాక్టర్ జేమ్స్ కజిన్స్, నా బొమ్మలు చూస్తూ: "ఇది ఒక్కొక్కటి ఒక ఖండకావ్యము, వీనిలో చిత్రకళ కంటే, కవిత ఎక్కువున్నది. పచ్చగడ్డిలో వికసించిన ఒక పువ్వు-ఆ బొమ్మ చూడు. 'ఆదర్శజీవి' అంటున్నావు, ఈబొమ్మను; మంచిదే. ఇదిఒక కావ్యము; కాని. చిత్రకళ రీత్యా ఈ బొమ్మలో ఇంకా ఎన్నోవిశేషాలు ఉండాలి. ఇవి నిరంతర చిరసాధనవల్లగాని సమకూరవు. నీవు ఇంకా ఎంతో అభ్యసించాలి" అన్నారు.

మా వయొలిన్ మాష్టర్ చాలా శ్రమపడ్డారు నా కోసం. ఓనమాలు రాకుండా నైషధం చదవాలనే ఈ శిష్యుని చూచి ఆనందించాలో, నవ్వాలో ఆయనకు తెలియలేదు గాని చాలా ఆసక్తితో నేర్పారు. శంకరాభరణంలో 'స్వామీ నిన్నేకోరి' అనే వర్ణం వరకు చాలా పాటుపడి నేర్చుకొన్నాను. నా అంతట నేను చాలా సాధకం చేశాను. కాని, ఇక్కడా, వెళ్ళవలసిన పద్ధతిలో వెళ్ళక, పంచమంలో పలికే తారస్థాయి స్వరాల కోసమే, ఆరాటపడేవాడను. అవేనాకు ఎక్కువ శ్రావ్యంగా ఉండేవి. ఎన్ని వందలసార్లు అయినా పలికించే వాడను ఆ స్వరాలనే! ఈ రీతిని ఎన్నేళ్ళు పట్టేదోగాని, తలవని తలంపుగా జీవితంలోకి ఏవేవో ఆఘాతాలువచ్చి, నా వయొలిన్ సాధకం 'సామీ నిన్నే కోరి'తో ఆగిపోయింది.

'అది ఒక శాపము' అనుకుంటూ ఉంటాను, మిక్కిలి నిస్పృహ కలిగిన సమయాలలో, ఇటువంటి ఆశాభంగాన్ని విమర్శిస్తూ. ఇది ఒక్కటే కాదు, ఇల్లాంటివే ఎన్నో! ఎంతో ఆసక్తితో, ఎంతో ఉత్సాహంతో పూనుకున్నవి. కొంతవరకు చక్కగా వచ్చి, ఆశ కల్పించి, చటుక్కున విఫలమైపోతాయి. యత్నలోపం కాదని నా ఆత్మకు తెలుసు. మరి యెందువల్ల నిష్ఫలం కావాలి?

గ్రీకుగాథ ఒకటి ఉన్నది 'టాంటలస్'ను గురించి. దైవశాపంవల్ల టాంటలస్ అనే యువకుడు కంఠం వరకు నీటిలో పాతుకుపోతాడు. అతని తలను తీరాడుతూ ఉంటాయి దోరగాపండిన పండ్లతో ఫలవృక్షపు కొమ్మలు. కాని, మంచినీళ్ళు త్రాగాలనుకున్నప్పుడు, నదీజలం అతని పెదవులకు దూరమై పోతుంది. పండ్లను అందుకోబోతే, కొమ్మ పైకెగిసిపోతుంది. పోనీ, ప్రాణమూ పోదూ! ఇలా యమయాతన అనుభవిస్తాడు, ఆకలి దప్పికతో. అందుబాటులో ఉన్న నీరూ ఫలములూ ఆశించినంతనే దూరమగుటవల్ల భరింపరాని నిస్పృహ! ఆజన్మాంతమూ అతని గతి అంతే! ఎంత పాపంచేసి ఉండాలి ఆ జీవి!!

* * * *

ద్విజేంద్రలాల్‌రాయ్ కుమారుడు దిలీప్‌కుమార్‌రాయ్ ఆ రోజులలో ఒక పర్యాయం మా ఇన్‌స్టిట్యూట్‌కు వచ్చి తన గానమాధుర్యంతో మాకెంతో ఆనందం కలిగించారు. తండ్రి ప్రఖ్యాత నాటకకర్త ఐతే, దిలీప్ గానకళా కోవిదుడు, రసికావతంసుడు. ప్రాచ్య, పాశ్చాత్య గానరీతులు చక్కగా అవగాహన అతనికి. కొన్నాళ్ళు ఇంగ్లండ్‌లో ఉండి వారి సంస్కారమున గల ఉత్తమ లక్షణాలన్నిటినీ తనలోకి తీసుకున్నాడు. ఆ రోజులలో ఆయన భారత దేశమంతటా పర్యటించి, ఆయా ప్రాంతాలలోని జానపద గేయాలను సేకరిస్తున్నాడు. గుజరాత్ దేశంలో ఆయన వినిన "గర్బా" అనే ఒక తీరు జానపదగేయపరంపరను గురించి ప్రస్తావించి, కొన్ని పాటలు ఎంతో రమ్యంగా పాడి వినిపించారు మాకు. "రమీయే! రమీయే !!"-"నాట్యమాడండి! నాట్యమాడండి" అనే పిలుపుతో ప్రారంభించిన ఒకపాట వెన్నెల రాత్రులలో పాడతారట యువతీ యువకులు, గోష్ఠిగాకూడి. మాటలు బాగుంటాయి. లయ విన్యాసమూ బాగుంటుంది. మీరాబాయ్ పాటలున్నూ, కొన్ని, ఎంతో భావయుక్తంగా పాడి వినిపించారు దిలీప్.

దిలీప్‌కుమార్‌రాయ్ ఎంతో సౌందర్యప్రియుడు. పూర్వజన్మలో, అతి సుకుమారుడైన ఏ రాజకుమారుడో అయిఉండాలి, అనుకున్నాము మేము; అంత లలితంగా ఉంటుంది అతని తీరూ సంభాషణలో అతని మృదుత్వమూ,

ప్రతి మాటలో ప్రస్ఫుటమయ్యే అతని కళాప్రియత్వం అందరినీ అతని దెస ఆకర్షిస్తుంది. తన గానవిద్యా నైపుణ్యంవల్ల ప్రపంచవిఖ్యాతి గాంచిన అతను భోగలాలసుడనే పేరు ఉండేది దిలీప్‌కు ఆ రోజులలో.

భోగికీ యోగికీ సాముద్రిక శాస్త్రరీత్యా ఒక్క చిన్న రేఖే తేడా అన్నాడు ఒక మిత్రుడు నాతో. ఇది నిజమే అనుకుంటాను. ఆ రేఖ అలా తిన్నగా పైకి వెళ్ళితే, అతడు మహాభోగి; రవ్వంత ఒక ప్రక్కకు మొగ్గితే అతడు మహాయోగి! కాలక్రమేణ, చేతిలోని రేఖలు మారుతవేమో ఏమో గాని, అంతటి అద్భుతంగా పాడుతూ, రసికావతంసునిగా మా కళ్ళకు కనిపించిన దిలీప్, మరి కొన్నేళ్ళకు అరవిందాశ్రమము ప్రవేశించారని విన్నాము. అక్కడికి వెళ్ళి చూచాను కూడా ఆయనను నేను ఆ తరువాత. మల్లెపూవు లాంటి మల్లుపంచా మల్లులాల్చీలకి బదులు కాషాయ వస్త్రాలతో ఉన్న అతనిని పలుకరిస్తూ నేను "రమీయే! రమీయే! అంటూ వెన్నెల పదము పాడారు ఆనాడు జ్ఞాపకముందా దిలీప్" అనేసరికి అతనికి వెంటనే ఆ రోజులు జ్ఞాపకం వచ్చి "అబ్బో! ఎప్పటిమాట! అదో పూర్వజన్మ!" అన్నారు, ఆయన.

నేను మాత్రం మళ్ళా ఆ ఒక్కపాటే కాదు, అటువంటివి ఎన్నో పాటలు విన్నాను, బొంబాయిలో, ఒకరాత్రి రాత్రంతా తరువాత కొన్ని ఏళ్లకు. పజూబాయి శుక్లా అన్నగారు, బొంబాయిలో ప్రఖ్యాత వైద్యులు. నేను కొన్నాళ్ళు వారింట ఉండగా, ఒకనాడు అట్లతద్ది పండుగ వచ్చింది. మన ప్రాంతంలో అట్లతద్ది పండుగలాగే, గుజరాతీవారున్నూ ఆ రాత్రి రాత్రంతా ఆ పాటలతో ఎంతో సరదాగా గడుపుతారు. డాక్టర్ శుక్లా, అతని భార్య ప్రభాబెన్ నన్ను ఎంతో మక్కువతో చూచేవారు. ప్రభాబెన్ నాతో గంటల తరబడి మాట్లాడుతూ ఉండేది, వారి స్వంతవూరు రాజ్‌కోట్‌ను గురించీ అచ్చట వారి ఆచార వ్యవహారాల గురించీ. ఆవేళ అట్లతద్ది అని నాకు తెలియదు. రాత్రి భోజనాలై మధ్య హాలులో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉంటే, డాక్టర్ శుక్లా భార్యను అడిగారు "పాలూ పళ్ళూ అన్నీ కావలసినవి సిద్ధం చేశావా?" అని. "అన్నీ సిద్ధముగానే ఉన్నాయి", అని భర్తతో అని, "ఎందుకోసము ఈ ప్రయత్నము" అని నేను ప్రశ్నింపగా, నావైపుజూస్తూ అన్నది ప్రభాబెన్:

"చూస్తావుగా! నీకోసం ఈరాత్రి వేడుకలు ఎన్నో ఏర్పాటు చేశాము!" అంటూ, నవ్వుతూ, "నేను గోరింటాకు పెట్టుకుంటున్నాను, ముందు నీకుపెట్టి తరువాత నేను గోరింటాకు పెట్టుకుంటాను." అన్నది ప్రభాబెన్. ఎప్పుడో నేనన్నాను, నాకు గోరింటాకు చాలా ఇష్టమని. అది ఆమె జ్ఞాపముంచుకొంది! నా చేతికి పెట్టి, తాను పెట్టుకుంది. చిన్నప్పుడు మా పిన్నిచేత గోరింటాకు పెట్టించుకొనేవాణ్ణి ఇల్లాగే. ఇంతట్లోకి, ఒక్కొక్కరే వచ్చారు వారి స్నేహితు లింటి ఆడపిల్లలు. అరగంటలో ఒక పాతికమంది మూగారు కళకళ్లాడుతూ. అందరి చేతినీ గోరింటాకు ఎరుపే! అందమైన గుజరాతీ దుస్తులు ధరించి, ఎంతో మధురంగా మాట్లాడుతూ వచ్చారు. ఒక్కొక్కరికి నన్ను పరిచయం చేశారు డాక్టరూ, ప్రభాబెనూ. వారు తమ తమ ఇళ్ళల్లో చేసి తెచ్చిన ఫలహారా లన్నీ బల్లపై ఉంచారు. కాసేపయ్యాక, ఆ బల్లను గది వో మూలకు సాయం పట్టి, గది మధ్య వలయాకారంగా కూడి, గొబ్బిళ్ళుపాడ నారంభించారు. అప్పు డెప్పుడో నేను విన్న "రమీయే రమీయే" అనే పాటతోనే ప్రారంభించారు. ఆ రాత్రి అట్లతద్ది వేడుకలు. రాత్రి తొమ్మిదింటికి మొదలుపెట్టిన ఆ ఆటలూ ఆ పాటలూ కోడికూసేదాకా సాగాయి! మధ్య మధ్య కాసేపు ఆగి, టీ తాగే వారు. టీ త్రాగుతూ, ఫలహారాలు చేసేవారు. ఫలహారాలు చేస్తూ, ఎంతో సర దాగా గడిపారు. వారిలో కొందరు కొన్నేళ్ళు రవీంద్రుని శాంతినికేతనంలో ఉండి వచ్చినవారు. అక్కడ శరదోత్సవ వేళ, వసంతోత్సవ సమయాల, ఫాల్గుణ మప్పుడు తాము పాడిన పాటలన్నీ నాకు వినిపించారు. జన్మలో మరువరాని అనుభవం అది.

ఎన్నో రకాల పాటలు పాడారు వారు. ఎన్నో రకాల జానపద నృత్యమూ వింత వింత అభినయమూ చూశాను నేను ఆరాత్రి. అత్తగారు పెట్టే అష్టకష్టాలను ఏకరువు పెడుతూ నూతివద్ద చేరిన కొత్తకోడలుగా, తన చెలికత్తెలతో, తన గొడవ చెప్పుకుంటూ అభినయించింది ఒక అమ్మాయి, ఎంతో జాలిగా. క్రొత్త పెండ్లికూతురుతో పరియాచకమాడే చెలికత్తెల పాటలు కొన్ని. ఇక, గోపికల పాటలు, గోపికల నృత్యాలూ ఎన్నో. వారి పాటలు ఎన్నో మన ప్రాంతాల జానపదగేయాలకి ఎంతో సన్నిహితంగా

ఉంటాయి. అన్నిటికంటే ముఖ్యం ఆ అంవరి పిల్లల ఆప్యాయత. డాక్టర్ శుక్లా, ప్రభాబెన్ వారికి పార్వతీ పరమేశ్వరుల వంటివారు. అంత భక్తీ ప్రేమా వారిద్దరిపైన వారికి. వారినిబట్టి, నా పైనా, అంత ప్రేమా, నాతో అంత చనువూ చూపించారు వారంతా, పరిచయమైన కాస్సేపటికే. ఇది ఒక జన్మాంతర సంబంధమే గాని, ఒకనాటి పరిచయము కాదని దృఢవిశ్వాసము నాకు. ఆ మాటే అన్నాను తర్వాత ఆ ఇద్దరి దంపతులతోనూ. అప్పటికి నా సహపాఠి, డాక్టర్ తమ్ముడు, పజూబాయ్ చనిపోయి ఏడాది అయింది. నేనతనికి అప్పుడు చాలా సేవజేశాను. నా చేతులలోనే కళ్ళు మూశాడు అతను. ఆ మాట జ్ఞాపకానికి తెచ్చుకుని ప్రభాబెన్, 'మా పజూబాయికి బదులుగా నీవు మాయింట ప్రవేశించావు. నీవు మాకు ఎలా క్రొత్తవాడవవుతావు? నీవు మావాడవే!" అన్నది, ప్రభాబెన్.

ఇక, లోకంలో, వీరు నావారు, వీరు నావారు కారు అనే తేడా ఎలా ఉంటుంది? ఉండదు!

*　　*　　*　　*

బెంగుళూరులో నేనున్న ఏడేళ్ళు పూర్తి అయ్యాయి. పూర్తి అయ్యాయి అంటే ఏళ్ళు పూర్తిఅయ్యాయి గాని ఇన్‌స్టిట్యూట్‌లో నా కృషి పూర్తి గాలేదు. ఆ కృషి అటువంటిది. రసాయనిక పరిశోధనకు పూర్తి అంటూ ఉండదు. ఐతే, మనం ఎన్నుకొన్న ఒకానొక విషయం గురించి కొన్ని కొన్ని విశేషాలు కనిపెట్టి విజ్ఞానాన్ని పెంపొందింపవచ్చు. కొందరు తద్వారా విశేషఖ్యాతీ ఉన్నత పదవీ సంపాదించవచ్చు. నాకా అదృష్టం లేకపోయింది. నామూలికల గురించిన పరిశోధన అటువంటిది. అంతేగాక, ఆ ఏడేళ్ళూ నేను రసాయనిక పరిశోధనలో ఏకాగ్రతతో కృషిచేశానని చెప్పలేను. నాకు లభించిన అవకాశాన్ని మరొకరయితే ఇంకా ఎక్కువ లాభకరంగా ఇంకా విజయవంతంగా ఉపయోగించుకొని ఉందురు. అందుకు సందేహం లేదు

కాని, ఈ యేడేళ్ళలోనూ ఎన్నో అమూల్యమైన అనుభవాలను పదిల పరచుకున్నాను నా జీవితంలో నేను. సాహిత్య ప్రపంచంలో, కళారంగంలో

ఎందరెందరు ప్రముఖ వ్యక్తులతోనో పరిచయ మైనది నాకు. ఈ ఏడేళ్ళలోనే నాకు కృష్ణశాస్త్రితో, వెంకటచలంతో స్నేహమైంది. ఈ ఏడేళ్ళలోనే కమలాదేవీ హారీంద్రనాధచటోపాధ్యాయులు నన్ను తమవానిగా పరిగణించారు. నా అదృష్టంవల్ల, ఆనాడు తెనుగునాట కవిత అల్లుచున్న యువకవులందరితోనూ పరిచయం కలిగింది నాకు. అతిరూప లావణ్య, నా ప్రేమంపు పెన్నిధి, నా ఆరాధ్య దేవత, నా జీవిత ప్రాంగణాన ప్రవేశించింది ఆ రోజులలోనే. ప్రేమకూ ఆపేక్షకూ గల వ్యత్యాసాన్ని, నిజమైన ప్రేమఅంటే త్యాగమే అనే పరమసత్యాన్ని తెలుసుకో గలిగాను అప్పుడే. "నీవెత హరింతు, సుఖమెల్ల నీకె యొంతు!" అని అనుకోవడమేగాక, జీవితంలో అలా అనుసరించడము కూడా నేర్చుకున్నాను. 'నేర్చుకున్నాను' — కాదేమో. 'నేర్చుకో మొదలుపెట్టాను.' నేర్చుకుంటూనే ఉన్నానేమో ఆనాటినుంచీ ఈనాటికీ.

అన్నిటికంటె అమూల్యమైన అనుభవము : మహాత్మునితో ఆ క్షణిక పరిచయము, శేషజీవితంలో, దీపకళికగా వెలిగే వారిమధుర సంభాషణ.

నాన్నగారి వద్దనుంచి ఉత్తరం వచ్చింది. ఉత్తరంకాదు; ఆర్డర్ : నన్ను వారి ఫార్మశీలో వారికి పర్సనల్ అసిస్టెంట్‌గా నియమిస్తున్నట్టు. రసాయనిక శాస్త్ర పరిశోధనలో నేను నేర్చుకున్న విషయాలు ఆయుర్వేద ఔషధములను గురించిన పరిశోధనకై వినియోగించాలని వారి ఆశ.

పదిహేనేళ్ళయింది నేను నాన్నగారితో కలసివుండి; ఎవరో స్నేహితులు కలుసుకుంటూన్నట్టు అప్పుడప్పుడు గంట, అరగంట కలిసి ఉండడమే గాని, వారిని విడిచిపెట్టి ఇన్నేళ్ళయింది. నా జ్వరంలోమాత్రం మూడు రోజులు ఉన్నాను వారివద్ద. ఇకనుండి వారితోనే ఉండి, వారికి కొంత చేయూతగా ఉండవచ్చుననే ఆశ ఎంతో ఉత్సాహాన్ని ఇచ్చింది. కాని, ఈ క్రొత్త బాధ్యతను ఎలా నిర్వహింపగలనా అనే బెంగకూడా ఆవహించింది నన్ను.

ఇన్‌స్టిట్యూట్‌లో మొదట నాతో కలసి కృషి చేసినవారందరూ ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. నా తరమువాడను నేను ఒక్కడనే. నేను తొలుత ప్రవేశించినపుడు మొక్కలుగా వున్న సంపెంగ మొక్కలు, చెట్లుగా పెరిగి మహావృక్షాలై పువ్వులు విరగపూస్తున్నాయి. ఇవతల, ఊళ్ళో, నాకు

## నా స్మృతిపథంలో...

ప్రతిరోజూ, విడువకుండా పువ్వులిచ్చే ముసలి పువ్వులమ్మి మాత్రం, ఇంకా పువ్వు లమ్ముతూనే వుంది అక్కడే. రైలుకు వెళుతూ, బండి ఆపి ఆమెవద్ద ఇన్ని పువ్వులు పుచ్చుకొన్నాను. రోజూకంటే మరిన్ని పువ్వులు ఉంచింది నా దోసిలిలో. ఆమెకు తెలుసో, యేమో, నేను మళ్ళీ ఆమెకు కనుపించనని. కాని, ఆమెను, ఆమె ఇచ్చిన పువ్వులను ఎన్నటికీ మరచిపోలేను; జీవితంలో ఒకానొక మధురఘట్టపు స్మృతిచిహ్నాలు, అవి, ఎప్పటికీ!

## ౨౧

అపూర్యమాణ మచల ప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్,
తద్వత్కామాయః ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి నకామ కామీ॥

భగవద్గీత, 2-70

నాన్నగారివద్ద ఆయుర్వేదం గురించి తెలుసుకుంటున్నాను నేను. 'సముద్రంలోకి ఎక్కడెక్కడినుంచో వచ్చి పడుతుంది నీరు. కాని, ఎంత నీరు వచ్చి పడినా, సముద్రం ఆకారం మారదు. అల్లాగే రకరకాల కోరికలు ప్రవేశించినా, ఎట్టి వికారమును పొందని జ్ఞానే చిత్తశాంతిని పొందును గాని, కోరికలను కోరునతడు చిత్తశాంతిని పొందజాలడు, అని చెపుతున్నారు నాన్న గారు. చిత్తశాంతికీ ఔషధ సేవకూ సంబంధం గోచరించలేదు నాకు వెంటనే. కాని, ఆయుర్వేదమంటే వట్టి మందులియ్యడమేకాదు. ధర్మార్థ కామ మోక్ష ములనే చతుర్విధ పురుషార్థములను సాధించడానికి ఆరోగ్యము అత్యవసరము. అటువంటి ఆరోగ్య సాధనకే ఆయుర్వేద ముపకరిస్తుంది అని తెలిసింది, వారితో కొంతసేపు మాట్లాడగా.

నాన్నగారికి పర్సనల్ అసిస్టెంట్ అని పేరైనా ఒక్క ఆఫీసర్ పనే కాదు నేను చూస్తుంట. వ్యాధుల లక్షణాలు తెలుసుకోవాలి. అవి నివారించే మార్గాలు తెలుసుకోవాలి. ఔషధాలు చేసే విధం తెలుసుకోవాలి. అవి దేశం మారుమూలలకు అందే విధం తెలుసుకోవాలి. ఆరోగ్య సాధన గురించి తెలుసుకోవాలి. ఆ పద్ధతులు జనులందరికీ బోధించే విధము తెలుసుకోవాలి. టపా తెరిచేసిరికి ఎక్కడెక్కడనుంచో ఉత్తరాలు :

'మా వూళ్ళో క్రొత్తగా లైబ్రరీ నెలకొల్పాము. ఇందుకు కావలసిన ఆయుర్వేద గ్రంథాలు ముఖ్యమైనవన్నీ పంపిస్తారా, మాకు ఉచితంగా' అని

ఒకరు వ్రాస్తే, 'ఎనిమిదేళ్ళక్రితం మీదగ్గర మందు పుచ్చుకొన్నాను. చాలా గుణమిచ్చింది. మంచి మందు. ఆ మందుపేరు మరిచిపోయాను. మావాళ్లకి ఒకరికి కావాలి. మళ్ళా ఆ మందే పంపుతారా?' అని ఒకరు వ్రాస్తారు. వాడవాడల నుంచి వచ్చేవి ఉత్తరాలు. వీటన్నిటికీ నాన్నగారివద్ద తగిన సమాధానం చెప్పించుకొని, నా బల్లవద్దకు వచ్చేవాడను. నాకు టైప్ చెయ్యడం వచ్చు. ఉత్తరాలన్నీ నేనే టైప్‌చేసి, సంతకానికి వారివద్దకు తీసుకువెళ్ళాలి, తొందర పనిమీద వారు ఎక్కడికో వెళ్ళిపోయేముందు. కాని, కూర్చుని టైప్ చేయడానికి తీరికేది? నా కుర్చీలో కూర్చునేవాడనో లేదో, మళ్ళీ పిలుపు నాన్నగారి వద్దనుంచి; "ఇదుగో! తిరువాన్కూర్ వైద్యమండలి వారి ఎదుట నేను చదువవలసిన అధ్యక్షోపన్యాసము, సరి చూచి, అన్ని పత్రికలకూ పంపు." అని చేతికిచ్చేవారు, వారు వ్రాసిన వ్యాసం, వెంటనే. 'సరే, బాగున్నది' అనలేను నేను, నాన్నగారు వ్రాసినదైనా సరే, నా అభిప్రాయాలను వివరించి, చేయవలసిన మార్పులు సూచించేవాడను. వారు ఎంతో ఓపికతో వినేవారు. ఒకప్పుడు కొంత చర్చ జరిగేది కూడా. చివరకు చాలాపరకు నా సూచనలు అంగీకరించేవారు. కాని, ఇలా వారితో చర్చిస్తూ ఉండేసరికి తతిమ్మా పని అంతా నిలిచిపోయేది. మూడు గంటలైతే మళ్ళీ వారు దొరకరు. ఎంత పని ఉన్నా సరే ఇక్కడ ఆ వేళకు ఆయన ఆవడి ఆరోగ్య ఆశ్రమానికి వెళ్ళవలసిందే! ఆయన కార్ ఎక్కేముందు ఆనాటి కాగితాలన్నీ పూర్తిజేసి వారి సంతకం తీసుకోవాలి. నిమిషాలమీద జరగాలి పని.

ఇంతసేపూ ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు. పూజ్యులు సాంబమూర్తి గారు, న్యాయమూర్తి సదాశివయ్యర్, మునగాల రాజావారు, దుర్గాబాయ్, కట్టమంచి రామలింగారెడ్డి, రాజా వెంకట రాయణింగారు, యామినీ పూర్ణతిలక- అందరూ ఏదో అత్యవసరమైన పనిమీద వచ్చేవారే. నన్ను వారికి చూపి, "మా వాడు! నావద్దనే ఉంటున్నాడు!" అనేవారు నాన్నగారు. వారు ఎంతో సంతోషించి, నన్ను ఆప్యాయంతో పలుకరించేవారు. వారు వచ్చిన పనిని గురించి నాతో చెప్పి అది వెంటనే జరిగేటట్టు చూడమని హెచ్చరించేవారు నాన్నగారు.

ఆఫీస్‌లో నారాక అందరికీ ఆనందాన్ని ఇచ్చింది. ముఖ్యంగా, అరవై ఏండ్ల హెడ్‌క్లార్క్ శాస్త్రిగారు "నీవు రావడంవల్ల నాన్నగార్కి సగం భారం తగ్గింది, నీవు చేయవలసినపని ఎంతో ఉన్నది. నీవు ఇక్కడ ఉండడం మాకూ ఎంతో మంచిది, మా కష్టాలు నీతో చెప్పుకుంటాము" అన్నారు. కాని ఆయన చెప్పినట్లు నాన్నగారి భారం నేను తగ్గించగలిగాను అనలేను. అది ఒకరు పంచుకొనే పని కాదు. చాలా వ్యక్తిగతమైన కృషి. ఐతే ప్రజకు రాజుపైకంటే యువరాజుపై అనురాగాతిశయం ఉండటం సహజమే. రాజు అంటే భక్తి. యువరాజు అంటే ప్రేమ. రాజుతో లేని చనువు వారికి యువరాజుతో ఉంటుంది, వారి యోగక్షేమాలు తెలుసుకోడానికి అతనికి ఎక్కువ అవకాశం ఉంటుంది కాబట్టి.

అవి అసహాయోద్యమపు రోజులు. మా పినతల్లి రుక్మిణమ్మగారు దక్షిణాదిని స్వాతంత్ర్య సమరయోధినిగా వేదారణ్యంలో కృషిచేస్తున్నారు. ఆమె కారాగృహానికి వెళ్ళబోయే సమయం. మా తమ్మునికి మూడోఏడు; అవడిలో ఆడుకుంటూ ఉండగా పనిమనిషి ఏమరపాటున అతని చేరువనే ఉంచిన కిరసనాయిల్ మంచినీళ్ళనుకుని తాగివేశాడు. ప్రాణాపాయ మయ్యేదే సమయానికి నాన్నగారు తగిన చికిత్స చెయ్యకపోతే. అందరూ నాన్నగారితో అన్నారు, రుక్మిణమ్మగారిని వెంటనే తిరిగి రమ్మనండి అని. అందరి అభిప్రాయమూ అదే. ఆ రాత్రి అమ్మగారిని చూడడానికి వేదారణ్యం బయలుదేరుతున్న ఆఫీస్ మేనేజర్‌తో అన్నారు నాన్నగారు: "ఆమెను కంగారు పెట్టవద్దు, విషయాలన్నీ చెప్పి, ఆమెనే నిర్ణయించుకోమను. ఎటు నిర్ణయించినా నాకు అంగీకారమే" అన్నారు. మానేజర్ కంటతడి పెట్టుకున్నారు. అమ్మగారిని అప్పటికి ఉద్యమంనుంచి విరమింప చేయాలనే అతని ఉద్దేశం. కాని, అది నెరవేరలేదు. ఆమె అరెస్టయి కారాగృహానికి వెళ్ళారు. ఈ వివరాలు తెలియవచ్చాక లోకానికి మరింత ఆదర్శప్రాయమైంది, ఆమె త్యాగము.

నాన్నగారి పద్ధతే అది. ఏ విషయంలోనూ తన అభిప్రాయం ఒకరు అనుసరించాలని నిర్బంధించరు ఆయన. అలా నిర్బంధింపకలిగిన అధికారం ఆయనకున్నా. మన సమస్యను గురించిన సాధక బాధకాలు రెండూ నిష్పక్ష

పాత బుద్ధితో వివరిస్తారు. ఆయన అభిప్రాయమూ చెపుతారు. కాని నిర్ణయించ వలసినది మాత్రం మనమే. ఒక పర్యాయం మాత్రము, ఒక చాలా ముఖ్య మైన విషయంలో నేను మరీ లోకవిరుద్ధంగానూ, వారి అభిప్రాయంలో, నా శ్రేయస్సుకు వ్యతిరేకంగానూ ప్రవర్తించబోతున్నాను, అని తెలిసి, విశాఖ పట్టణంలో ఉన్న నాకు వారు టెలిగ్రామ్ ఇచ్చారు; "కొంతకాలం ఆగవలసిన దని నా సలహా; తండ్రీ స్నేహితుడూ, లక్ష్మీపతి" అని ఉన్నది టెలిగ్రామ్‌లో. టెలిగ్రామ్ నా చేతికి ఇచ్చిన మా బావ మల్లవరపు వెంకటకృష్ణారావు చాలా జాలిగా చూచాడు, "ఆయన మాటను పాటించు" అన్నట్టు. 'తండ్రీ, స్నేహి తుడు' అని అనగలిగిన తండ్రులు ఎందరో లేరు, మనవారిలో; కాని, ఈ స్నేహము ఒక పురాకృత పుణ్యఫలము, అది ఆత్మ సంశుద్ధివలన అలవడినది. ఆ విషయంలో మాత్రం నేను అప్పుడు వెనుకంజవేయడానికి వీలులేక పోయింది. చేతిలో చెయ్యివేసి చేసిన వాగ్దానం ఉపసంహరించుకోడం నా వలన కాలేదు, నాన్నగారి సలహాను అనుసరించాలని ఎంత ఆసక్తిఉన్నా. అనుకున్న ప్రకారమే జరిగిపోయింది. కాని, వారి సలహాకు వ్యతిరేకంగా వెళ్ళానని వారికి నాపైన ఏ మాత్రం అసంతృప్తి కలగలేదు, నాపై వారికున్న అపార మైన ప్రేమ అవగింజంతైనా తగ్గలేదు.

ఆఫీస్‌పని ఒక్కొక్కప్పుడు, నేను భరించలేనంత ఎక్కువగా ఉండేది. కాని, ఎంతెంతో జనోపకారం చెయ్యడానికి వీలుఉండేది. తగిన సలహా ఇచ్చి కొందరికి, మందులిచ్చి కొందరికి, జీవితంలో కొత్త ఆసక్తి కలిగించడము ఒక గొప్పపని. ఈ పనిలో పాల్గొనడానికి నాకు కొంత అవకాశం కగిలినది ఒక అదృష్టమే. ఐతే, వ్యవహారరీత్యా కొన్ని సమస్యలు ఎదుర్కోవలసి వచ్చేది, ఆర్థికంగా ఫార్మశీ విషయాలలో.

ఒకరోజు మధ్యాహ్నం, ఆవేళ నాన్నగారు పొలంలో పనిఉండి, పది గంటలకు వెళ్ళిపోయారు ఆవడి. హెడ్‌క్లార్క్ శాస్త్రి ఎంతో బెంగతో నా వద్దకు వచ్చి "రేపు పది గంటలకు బ్యాంక్‌లో వెయ్యిరూపాయలు కట్టాలి. కట్టకపోతే ప్రమాదము. ఏమి చెయ్యాలో చెప్పకుండా నాన్నగారు పొలం వెళ్లి పోయారు. ఏమీ తోచడం లేదు" అన్నాడు. నేను వెంటనే రైలు ఎక్కి ఆవడి

వెళ్ళాను పదిహేను మైళ్ళ దూరం. స్టేషన్ నుంచి ఒక క్రోసుడు దూరం నడవాలి. మంచి ఎండలో వెళ్ళాను. చెరువ గట్టున నిలిచి పరకాయించి చూస్తే అల్లంత దూరాన మెరక పొలంలో పని చేస్తూన్నారు నాన్నగారు. వారి వద్దకు వెళ్ళాను, బోదెకు అపైన అడ్డకట్టలు కట్టి మెరక పొలానికి నీరు ఎక్కిస్తున్నారు ఆయన. నన్నుచూచి చిరునవ్వుతో "ఓహో! ఇలా వచ్చావే!" అంటూ "చూడు! ఆఅడ్డకట్టు ఇంకొక నాలుగు అంగుళాల ఎత్తు పెంచామంటే ప్రొద్దుగూకే లోపల చేనంతా తడుస్తుంది" అని నాకు వివరంగా చెప్పసాగారు. నేను వచ్చిన పని వేరు. నా ఉద్దేశ్యంలో అతి జరూరైన పని. ఆయనతో ఆ విషయం చెప్పి తగినఏర్పాటు చెయ్యాలనే ఆత్రుత నాలో. వారింకా అంటున్నారు, "మధ్యాహ్న మంతా నీరు నిండక పోతే, దమ్ముకు అదును దాటిపోతుంది, మనందగ్గరఉండి ఈబోది పని చేయించకపోతే, అంతే!" అంటున్నారు. నేను అనేశాను: "చాలా అర్జంట్ పని మీద వచ్చాను, బ్యాంక్‌లో వెయ్యి రూపాయలు కట్టాలి, వెంటనే" అన్నాను. ఆయని నా ఆత్రుత గ్రహించి "అందుకా ఇంత ఎండలో వచ్చావు! చాలా ఎండగా ఉంది. ఇదిగో ఈ ఉత్తరీయం తలపైన కప్పుకో — ఎండబడతావు" అన్నారు. అని, మళ్ళీ మెరక పొలానికి నీరు అందించే ప్రస్తావన లోకి వచ్చారు. నాకు వినడానికి ఓపిక లేదు. మళ్ళీ అన్నాను: "నేను వెంటనే పట్నం తిరిగి వెళ్ళాలి. ఆఫీసు పని అంతా అలాగే ఉంచి వచ్చాను. బ్యాంక్ సంగతి ఏమి చెయ్యాలి?" అన్నాను. "నీవు వెళ్లి పోవాలా? కాస్సేపుంటే పొలం నాలుగు మూలలా చూపిద్దామనుకున్నాను, నీవు ఎప్పుడోగాని రావు ఈవేపు. సరే" వెళ్ళు,అన్నారు. అంతేగాని ఏం చెయ్యాలో చెప్పలేదు. మళ్ళీ అడిగాను బ్యాంక్ మాట ఎల్లాగాఅని ఆత్రుతతో. "అదా! కడదాములే, రేపు ఉదయం కదా!" అన్నారు. నాకు ఏమనాలో తెలియలేదు. అల్లాగే ఉండి పోయాను, "సరే! వెళ్ళాలంటున్నావు కనుక వెళ్లు, రైలుకు వేళవుతోంది" అన్నారు. తాను మళ్ళీ పొలంపనిలో నిమగ్నులయ్యారు.

ఎంతో బెంగతో చెప్పాను, హెడ్‌క్లార్క్ శాస్త్రితో నేను వెళ్ళినపని ఏమీ కాలేదని. "ఆయన అంతే! తామరాకుమీద నీటి బొట్టులా ఉంటారు! ఎక్కడనుంచో మనకు సొమ్ము పంపవలసినవారు పంపరా అనే విశ్వాసము

ఉంది ఆయనకు" అన్నారు ఆయన. నాకుమాత్రం ఆ విశ్వాసములేదు. ఏమవు తుందో అనే బెంగే! ఆ బెంగతోనే, ఆఫీస్‌పని పూర్తి చేసుకొని, సాయంత్రం ఆరుగంటలకు, డస్సిపోయి, టైప్‌రైటర్ మూశాను. బల్లమీద టెలిఫోన్ మ్రోగింది. నాన్నగారి పేర పిలిచి, నేను ఫలాన అని తెలిశాక, ఆకారపు నరసింహమ్ కుమారుడు అన్నారు నాతో, "మా వరంగల్ ఆఫీసునుంచి టెలి గ్రామ్ వచ్చింది, మీ కాతాను రెండువేలు జమకట్టమని. మీరు వచ్చి సొమ్ము తీసుకువెళ్ళవచ్చు" అని. ఈ సంభాషణ గురించి విన్న హెడ్‌క్లార్క్ అప్పు డన్నారు: "ఆయన విశ్వాసము అటువంటిది!" అని.

ఆ రోజులలో నేను చదువుతూన్న ఒకగొప్ప పుస్తకము నాన్నగారు తీసుకున్నారు తాను చదువుతానని. వారికి నవలలు చదవడానికి తీరికలేదు. కాని నేను ఆ పుస్తకాన్ని గురించి ఎక్కువగా మెచ్చుకోవడము విని తీరికజేసుకు చదివారు. ప్రఖ్యాత నార్వీజియన్ రచయిత జాన్‌బోయర్ రచించిన 'గ్రేట్ హంగర్, [గొప్పఆకలి] అనే నవల. జన్మసార్థకమయ్యే ఉత్తమకృషి ద్వారా లోకకళ్యాణం కలిగించాలనేదే ఆదర్శజీవి ఆశయము; అదే అతనిలోని గొప్ప ఆకలి—మన పరిభాషలో 'తృష్ణ.' ఈ తృష్ణే మనలను ఎంతో త్యాగానికి పురికొల్పుతుంది. ఈ తృష్ణవల్లనే ఎటువంటి అంతరాయాలు వచ్చినా సహించ గలము. అందుబాటులోకి వచ్చిన విజయము మృగ్యమైపోయినా, విధికి తల యొగ్గి అపజయం అంగీకరింపడు ఈ తృష్ణ గల బోయర్, కథానాయకుడు. అతడొక ఇంజనీర్. అతి మేధావంతుడు. కేవలం ఆదర్శజీవి. తన శక్తి సామర్థ్యాలనంతా వినియోగించి బ్రహ్మాండమైన ఆనకట్ట నిర్మిస్తాడు. ఈ యత్నం ఫలిస్తే లక్షలాది జనులకు అన్నవస్త్రములు లభిస్తాయి. కాని, ఈ నిర్మాణానికి ఎన్నో ఆటంకాలు వస్తాయి. అయినా, చలించకుండా, అతను కార్యసాధకునిగా అహోరాత్రాలు పనిచేసి నిర్మాణము పూర్తిచేస్తాడు. ఇన్నాళ్లూ అతనికి తోడునీడగా వర్తిస్తూ అతని ఆశయాలకు దోహదమిస్తూన్న భార్య చాలా సంతోషిస్తుంది, అతనికృషి ఫలవంతమయ్యే సమయం వచ్చినదని, కాని, ఆ రాత్రి ఏదో లోపంవల్లనో, కొంతవరకు, కిట్టనివారి కుతంత్రమువల్లనో, ఆ ఆనకట్ట బద్దలై అతని పదేళ్ళపనీ బూడిదలో పోసిన పన్నీరవుతుంది.

అంతేగాక, అతనికి బ్రహ్మరథం పట్టవలసిన లోకము ఇప్పుడతనిని హేళన చేస్తుంది. గుండె పగిలేటంతటి ఈ ఆశాభంగాన్ని అతడు ఒక్కడూ ఐతే, వోర్చుకోలేకపోయి ఉండునేమో, ఆ చీకటిలో ఆమె మృదుహస్త మతనికి ఆసరా అవుతుంది. ఒక్కమాట మాట్లాడకుండా, ఆమె అతనికి కొండంత ధైర్యాన్నిస్తుంది, ఉత్తమపత్నిగా, ఆదర్శ స్నేహితురాలిగా.

ఇంతట్లోకి దేశమంతటా కరువువస్తుంది. ఎవరికి దొరికిన ధాన్యం వారు పదిలపరుచు కొంటారు. తొలకరికిముందు అందరూ తమ తమ నేల దున్ని ఉంచుకుంటారు. అతని పక్కఇంటి రైతు తన చేనుదున్ని ఉంచుకుం టాడు. రైతుగా మారిన ఇంజనీయరూ తన ఎకరంనేల చక్కగా దున్ని విత్త నాలు చల్లడానికి సిద్ధం చేసుకుంటాడు. సాయంత్రమయ్యేసరికి ఆకాశం మేఘావృతమవుతుంది. 'ఇదే అదను, ఈసారి విత్తనాలు సరిగా నాటుకుంటే మన అదృష్టంవల్ల మన భూమి బంగారం పండుతుంది' అంటుంది అతని భార్య. వారిద్దరూ ఈ పనీ ఆ పనీ పూర్తిజేసుకుని, పడుకోబోయే ముందు ఒక సారి తమ ఇంటిచుట్టూ పచారు చేస్తారు. ఇలా పచారు చేస్తున్నవారికి ప్రక్క ఇంటివారి మాటలు వినబడుతాయి. ఆ రైతు తన భార్యతో అంటున్నాడు: "మంచి అదును; ఆకాశం మేఘాలు క్రమ్మింది. విత్తులు చల్లగలిగామంటే పొలము బాగా పండుతుంది, మన అదృష్టమువల్ల. కాని, ఒక్క గింజలేదు, మధ్యాహ్నం, సాయంత్రం ఊరుఊరంతా గాలించాను, ఎవ్వరూ ఇచ్చారుకారు, ఈసమయం దాటితే ఈఏడాది మనం పస్తుఉండవలసిందే!" అని ఎంతో జాలిగా అంటున్నాడు. అతని భార్య కొంతసేపు అతనితో కలిసి చింతించి చటుక్కున అంటుంది: "ప్రక్కఇంటి ఇంజనీర్ని అడుగరాదా ! అతనికి మనకంటె ఎక్కువ దూరదృష్టి. విత్తనాలధాన్యం నిలవజేసి ఉంటాడు." అంటుంది. ఈ మాటకు ఆమె భర్త మండిపడతాడు. "ఆ దౌర్భాగ్యుణ్ణ నేను అర్థించ డము? ప్రాణంపోయినా, అతనిని నేను ప్రాధేయపడను!" అంటూ, ఏవేవో మాటలు అంటాడు. అవి వినలేక వీరు ఇంట్లోకి వచ్చేస్తారు. కాని, ఎంతసేప టికీ ఇంజనీర్కి నిద్దరరాదు. "ఈ సమయం దాటితే, ఈ ఏడాది మనం పస్తు ఉండవలసినదే!" అన్న ప్రక్కఇంటి రైతు, తనను శత్రువుగా భావించిన

తను, పడిన ఆవేదన మరీ మరీ జ్ఞప్తికి వస్తుంది అతనికి. అతడు తనను అకారణంగా ద్వేషిస్తున్నాడని తెలుసు. తన అనకట్ట విషయంలోనూ, ఇతర సందర్భాలలోనూ తనకు తీరని అపకారం చేశాడు అతను. కాని, అతని ఆవేదన ఇంజనీర్ మనస్సును మరీ మరీ కలిచివేస్తుంది. అతని ప్రక్కనే పరున్న భార్య కళ్లుమూసుకుని ఉన్నదేగాని, భర్త అనుభవిస్తున్న చిత్తావేదన ఆమెకు అవగాహనయే; కాని, ఏమీ మాట్లాడదు.

ఒక రాత్రివేళ అతను లేస్తాడు. చప్పుడు చేయకుండా వెళ్లి, పురిపైన గంపలో పదిలపరిచిన విత్తనాల సంచి తీసుకుంటాడు. తమ ఎకరపు నేలకూ అవి ఎంతో కష్టపడి పదిలపరచిన విత్తనాలు. ఆ చీకటిలో, గోడదాటి, తన పొరుగింటి రైతు భూమిలో చల్లుతాడు ఆ విత్తనాలన్నీ. నక్షత్రపు కాంతిలో అడుగులు వేసుకుంటూ నడచి ఆ నాలుగు వైపులా చల్లి వస్తాడు, తన పొలమునకై దాచిఉంచిన ధాన్యము. చేతులు కడుక్కొని, లోనికివచ్చి భార్య ప్రక్కన ఒళ్లువాలుస్తాడు. ఆమె అతని చెయ్యిని తన గుండెల పైకి తీసుకుంటుంది. అతను ఎందుకు లేచి వెళ్లాడో ఆమెకు తెలుసు. అతని త్యాగబుద్ధి అతనిని దైవ సమానునిగా చేస్తుంది ఆమె దృష్టిలో. కాని, మళ్లా కారు వరకు రోజులు ఎలా గడుస్తాయో అనే బెంగ ఆవరిస్తుంది ఆ ఇల్లాలి హృదయాన్ని. ఈ రెండు భావాల సంఘర్షణ వల్ల కలిగిన చిత్తావేదనతో బాధ పడుతూ ఆమె కన్నీరు కారుస్తూ ఉంటుంది. భర్త చెయ్యిని తన చేతితో దువ్వుతూ అంటుంది ఆమె: "చీకట్లో ఒక్కరూ వెళ్ళారా? నన్ను కూడా తీసుకు వెళ్లక పోయారా? మీ మాట నేను ఎన్నడయినా కాదంటానా?" అంటుంది. అతడు ముందుకు వంగి, ఆమె నుదుటిపై తన పెదవుల నుంచుతాడు.

జాన్ బోయర్ భావాలు నన్ను చాలా ఎక్కువగా కదల్చాయి, పూర్తిగా ఆదర్శజీవి ఐన నాన్నగారికి ఈ రచన నచ్చడంలో ఆశ్చర్యంలేదు. ఆ పుస్తకం గురించి చాలామంది స్నేహితులతో చెప్పాను, ఆ రోజులలో.

మా ఆఫీస్‌కు ప్రక్కనే మేజిస్ట్రేట్ కచ్చేరీ, సబ్ జెయిలూ. ఒక రోజు మూడు గంటలకు కబురు వచ్చింది, సబ్ జైలులో ఒక రాజకీయ ఖైదీ వెంటనే మిమ్మల్ని ఒకసారి తనను చూచి వెళ్ళమంటున్నాడు అని. ఉద్యమపు

రోజులలో అలాగే కబురు వస్తూ ఉండేది, బందరు నుంచి, రాజమహేంద్ర వరము నుంచి వేలూరు జైలుకు మార్చబడుతున్న మనవారు, నాన్నగారికి తెలిసిన వారు ఇలా వర్తమానం చేస్తుండేవారు. ఒక రైలు దిగి, ఇంకో రైలు ఎక్కే ఒకపూట వారు ఈ సబ్‌జైలులో ఉంటారు. వారు అక్కడ ఉన్నారని తెలిశాక వారికి కావలసిన సదుపాయాలు కొన్నిటిని చేయించే వారు నాన్నగారు. ఆ పనంతా నేను చూస్తూ ఉండేవాడను. వారికి కావలసిన అన్నపానీయాలే గాక, వారికి నచ్చిన పుస్తకాలు కూడా ఇస్తూండేవాడను వారికి. కాని, ఈ వేళ వచ్చిన కబురు నాన్నగారికి గాక, నాకు. నేను గ్రహించాను నాకోసం కబురు పంపిన రాజకీయా ఖైదీ ఎవరో. వెంటనే చేతికి అందిన ఫలహారాలు తీసుకుని వెళ్లి కటకటాల వెనుక నున్న మా బావ మల్లవరపు వెంకట కృష్ణా రావును చూచాను. నేను నిలువనా నీరయ్యాను. అతను నవ్వుతూనే ఉన్నాడు, నన్నుచూచి: "ఏం! బావా!" అన్నాడు, కటకటాలలోంచి చెయ్యి జాచి నా భుజము నిమురుతూ. పోలీస్‌జవాన్ కటకటాల తలుపు తీసి నన్నూ ఆ లోపలకు పంపాడు. లోపల అందరూ నా స్నేహితులే. ఆడుగుదు అనుకుంటా. అంతా మా బావ ఈడువారే. అందరకూ తల్లులూ, అప్ప చెల్లెళ్లూ అన్న దమ్ములూ ఉన్నారు. ఒకరిద్దరు గృహస్థులు కూడా. వీరందరు అన్నీ వదులు కొని లాఠీదెబ్బల భయం లేకుండా ఈ కారాగృహవాసం వాంఛించడము నాకు వారి దెస ఎంతో భక్తిని కలిగించినది. అప్పటి నా రాజకీయ దృక్పథమును బట్టి కార్యరూపంగా వారిని అనుసరించ లేకపోయినా, మనస్సులో ఎంతో మెచ్చుకొన్నాను వారి సాహసాన్ని.

మా బావా నేనూ చాలాసేపు మాట్లాడు కొన్నాము, దయగల ఆ జవాను పుణ్యమా అని. కృష్ణారావును కలుసుకొని చాలాకాలమైంది, చెప్పుకోవలసిన మాటలు చాలా ఉన్నాయి. అందుచేత అప్పటికి వారందరి వద్ద సెలవు దీసుకుని రాత్రి రైలు స్టేషన్‌లో కలుసుకున్నాను వారిని. నేనూ ఒక సెకండ్ క్లాస్ టికెట్ తీసుకుని వారున్న కంపార్టుమెంటులోకి ఎక్కికూర్చున్నాను. రైలు ప్లాట్‌ఫారం మీద ఉన్నంతసేపూ నేను వారితో మాట్లాడలేదు. రైలుకదిలి కొంత దూరం సాగడంతోనే మా బావ నా ప్రక్కన వచ్చి కూర్చున్నాడు.

సార్జెంట్ మా నాన్నగారిని, అమ్మగారిని ఎరుగును. అమ్మగారు అప్పుడు నెల్లూరు జైలులో ఉన్నారని తెలుసు అతనికి. నన్ను చాలా దయతో చూచాడు సార్జంట్. ఆ పెట్టెలో వారు ఆరుగురు రాకీజయఖైదీలు, ఆ సార్జెంటూ, ఎనిమిదవవాడను నేను. మద్రాస్‌లో బయలుదేరిన లగాయతూ రాత్రి ఏరెండు గంటలకో కాట్పాడి జేరేవరకూ, మా బావా నేను మాట్లాడుతునే ఉన్నాము, అతను అరెస్ట్ అయిన ఉదంతము పూసగ్రుచ్చినట్లు చెప్పమని విన్నాను, నేను చాలా భయపడ్డాను. కసికొద్దీ పోలీసులు, రిజర్వ్ ఆతనిని లాఠీలతో మోదా రేమోనని. తనకు దెబ్బలు తగలలేదు కాని, కూడా ఉన్నవారు కొందరు, ముఖ్యంగా, జనులు విపరీతంగా ప్రేమించిన నాయకులు, అతి తీవ్రమైన హింసకు పాత్రులయ్యారని చెప్పాడు మా బావ. ఆ మాటలు వింటూ ఉంటే ఒళ్ళు జలదరించేది. కాని, ఆ తీవ్రచర్యలను గురించి చెబుతూన్నప్పుడు మా బావ మాటలలో అవి చేసిన వారి పట్ల అవగింజతైనా ద్వేషభావము కనపడలేదు. వారు చేయవలసిన పని వారు చేశారు. అంతే! ఆ ఉద్యోగం ఉండాలంటే వారలా చెయ్యాలి, అంతే!

మా బావతో ఉన్న తతిమ్మా ఐదుగురున్నూ యోధులే. తమ తమ ఊళ్ళలో స్వాతంత్ర్య సమరాన్ని ఏకదీక్షతో నడిపి, ఈ కారాగృహ వాసాన్ని కోరుకు వచ్చినవారే. వారిని చూచినకొద్దీ, వారి అనుభవాలు వినినకొద్దీ మరీ మరీ అతిశయించింది సానుభూతి నాకు వారి యెడల.

కాట్పాడీ దగ్గర ఐనకొద్దీ, నా మనస్సులో బెంగ కొండంత ఐంది. ఇంక ఎన్నాళ్ళకు చూస్తానో మా బావను అనే బాధ ఒకటి. జైలులో అతను ఏమిపాట్లు పడతాడో అనే భయం ఒకటి. కొందరు మంచివా రుంటారు, కొందరు దుష్టులుంటారు అధికారులలో, ఏమేమి తిప్పలు పడవలసి వస్తుందో, నా మేనత్త కొడుకు అని చాలా ఆరాటపడ్డాను. స్టేషన్ వచ్చాక నేనూ వారితో కూడా క్రిందికి దిగి, వాన్‌దాకా వారితో వెళ్ళవచ్చు అనుకున్నాను, కాని, సార్జెంట్ అన్నాడు: "స్టేషన్‌కి నెల్లూరు రిజర్వు వచ్చివుంటారు; వారి తరహా వేరు; మీరు కంపార్టుమెంట్‌లోనే ఉండిపోతే మంచిది" అన్నాడు. అతను అన్నట్లుగానే ఆ రిజర్వును చూచి నేను కాస్త జడుసుకున్నాను. బండి దిగాక,

## నా స్మృతి పథంలో...

సార్జెంట్ వారిని ఆ రిజర్వుకు అప్పగించాడు. వారితో కదిలి వెళ్ళిపోతున్న మా బావా రైలులోనే కూర్చున్న నేనూ కన్నులతోనే పలుకరించు కున్నాము. అతను సరదాగా, తన సహచరులతో మాట్లాడుతూ నాకేసి చూస్తున్నాడు. నేను, కొలకులలో నిండిన కన్నీటిని అట్టే ఆపుకో గలిగాను విశ్వప్రయత్నం చేసి.

మా బావ మల్లవరపు వెంకటకృష్ణారావు అలా కారాగృహ వాసానికి వెళ్ళిపోతూ ఉండగా అతనూ అనుకోలేదు, నేను అనుకోలేదు, మరి ఒక ఇరవై ఏళ్ళకు, ఎక్కడో ఉన్న అతని కొరకు మద్రాస్ ముఖ్యమంత్రి శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి కబురుపంపి, అతనికి విద్యామంత్రి పదవిని ఇచ్చి గౌరవిస్తారనీ, ఆ క్రొత్తపదవిలో అలవాటయ్యేవరకూ మా బావకు నేను ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేస్తాననీ. ఎలా తెలుస్తుంది మాకు! జీవితంలో ఏమేమి లిఖించి ఉన్నాయో! కాని, రాజగోపాలచారి వద్ద ఉద్యోగస్వీకారం చేసి, తిన్నగా మా ఇంటికి వచ్చాడు, క్రొత్త మంత్రిగా మా బావ. అతడూ నేనూ సహపంక్తిని భోజనం చేస్తుండగా, చటుక్కున జ్ఞాపకంవచ్చింది; కండ్లకు కట్టి నట్టు ఆ దృశ్యం అవతరించింది నా స్మృతిపథంలో. ఆరాత్రి మిణుకు మిణుకు మనే ఆ దీపపు కాంతిలో తన సహచరులతో మా బావ వెల్లూరి జెయిలుకు వెళ్ళడం. ఎప్పటి మాట!

ఆ కృష్ణారావే ఈ కృష్ణారావు; ఏమీ మారలేదు; నేనూ మారలేదు. ఎలా మారుతాము!

## ౨౨

చేతులార శృంగారము
చేసి చూతును శ్రీరామ !

సేతుబంధన సురపతి సర
సీరుహాభవాదులు పొగడ, నా చేతులార
మెరుగు బంగారందెలు బెట్టి
మేటియౌ సరిగవల్వలు గట్టి
సురతరు సుమములు సిగనిండ జుట్టి
సుందరమగు మోమున ముద్దుబెట్టి ॥చేతు॥

మొలను కుందనపు గజ్జలు గూర్చి
ముద్దుగ నుదుట తిలకము దీర్చి
అలకలపై రావి రేకయు జార్చి
అందమైన నిన్నురము జేర్చి ॥చేతు॥

ఆణిముత్యాల కొండెవేసి
హావుసుగా పరిమళ గంధము బూసి
వాణి సురటిచే విసరగ వాసి
వాసి యనుచు త్యాగరాజసుత యనిరోసి

చేతులార శృంగారము
చేసి చూతును! శ్రీరామ

నూతిచుట్టూ ఉన్న పాలగచ్చు పళ్ళెంమీద ముక్కాలిపీటమైన కూర్చుని ఉన్నాను నేను సందెచీకటిలో. నాకు ఒక ప్రక్కగా నుంచున్నారు చంటిబిడ్డ నెత్తుకుని, ఆయన, నా స్నేహితుడు. మాఎదుట కాస్త దూరాన చిన్న కుంపటి

పైన వంట చేస్తూంది ఆవిడ, ఆయన భార్య. వేయిస్తూన్న బూడిదగుమ్మడి కాయల వడియాల వాసన గుప్పుమని వచ్చింది. నాకు ఈ పరిమళము చాలా ఇష్టము. ఒకప్పుడు అనుకుంటూ వుంటాను: ఈ పరిమళంలో తెనుగుతన మెంతో ఉన్నదని. మన ఆవకాయకన్నా, ఈ సువాసన వీచేసరికి, అదేదో వింత వాతావరణలోకి వెళ్ళిపోతుంది మనస్సు.

"ఈ వడియాలు నాలుగూ వేయించి వచ్చి, మీకు పాటలు వినిపిస్తాను, మీ స్నేహితుడు కృష్ణశాస్త్రి పాటలు!" అన్నది, ఆమె, నా వేపు జూచి.

"అమ్మా! ఏం పాటలు పాడుతావె!" అన్నాడు అవతల, చెల్లెలితో ఆడుకుంటూన్న అబ్బాయి. వాళ్ళ నాన్నగారు పిల్లలకేసి చూచి, "మీ కొచ్చిన పాటలన్నీ మీరూ పాడుతారుగా!" అన్నారు.

ఆమె పని పూర్తిచేసుకుని, చేతులు కడుక్కొని, ఒక్కసారి ఇంట్లోకి వెళ్ళి, చెరిగిపోయిన బొట్టు సరిదిద్దుకొని, మా యెదుట వచ్చి కూర్చున్నారు. మొదటి నక్షత్రం అప్పుడే మినుకు మినుకు మంటోంది. అతి ప్రశాంతంగా ఉంది ఆ దివ్యసమయం. అప్పుడు, ఆమె కంఠమెత్తి గానం చేశారు:

మ్రోయింపకోయ్ మురళి
మ్రోయింపకోయ్ కృష్ణ!
తీయ తేనియ బరువు
మోయలేదీ బ్రతుకు,
మ్రోయింపకోయ్ మురళి
మ్రోయింపకోయ్ కృష్ణ!

ప్రబంధ కవిత్వానికీ మన ఆధునిక కవిత్వానికీ కల తేడా ఒక్క మాటలో చెప్పాలంటే, ఇలా అనవచ్చేమో: ఆ కవిత్వము ఎక్కువ ఊహా కవిత్వము; ఈ కవిత ఎక్కువగా అనుభవ పరంపర. ఊహకు హద్దులేదు. చక్కటి పదజాలంతో ఎటువంటి అద్భుత దృశ్యాలనైనా సృష్టించవచ్చు కవి. అనుభవానికి ఒక పరిమితి ఉంటుంది. ఆ అనుభవము భౌతికమైనా, మానసిక

మైనా ఈ పరిమితిలో, ఉత్తమకవి తన ఉత్తమ అనుభవాలను మనతో పంచుకోకలిగితే అతడూ ధన్యుడే, మనమూ ధన్యులమే. అయితే, కవి అనుభవించునట్లుగా, అంతటి తీవ్రతతో, అంతటి ఆవేదనతో, అంతటి తన్మయతతో మనమూ అనుభవించాలంటే అతని కున్నంత సంస్కారము మనకూ ఉండాలి. ఆమెకు అంతటి సంస్కారము ఉండబట్టే, కవి హృదయాన్ని అంత చక్కగా అవగాహన చేసుకొని అంతటి అనుభవాన్ని చూపించ కలుగుతున్నారు, ఆమె, గానంలో.

> మురళి పాటకు రగిలి
> మరుగు నీ వెన్నెలలు
> సొగయు నా యెదకేల
> తగని సౌఖ్య జ్వాల?
> కాలు చల్లదనాలొ
> కనలు తీయదనాలొ
> వలపు పిల్లన గ్రోవి
> పిలుపులో సొలపులో
> మ్రోయింపకోయ్ మురళి
> మ్రోయింపకోయ్ క్రిష్ణ!

ఆమె రాధగా అర్థిస్తోంది, తన మనస్సులో నిలచిన శ్రీకృష్ణుని. మన అందరి మనస్సులోనూ ఉంటుంది, ఒకానొక శ్రీకృష్ణ స్వరూపం. మనమూ 'రాధ'గా ఐపోతాము. ఈ మూగబాధ ఒకప్పుడు మనకూ అంత భరింపరానిదీ అవుతుంది. కవి అనుభవించిన అనుభవాన్ని తన అనుభవంగా చేసుకోవటమే కాక, ఎంతో నేర్పుతో మనకూ అందిస్తున్నారు ఆ అనుభవాన్ని ఆవిడ—ధన్యజీవి, అనుకున్నాను నేను. దీనినే ఇంగ్లీష్‌లో ది ఆర్ట్ ఆఫ్ కమ్యూనికేషన్ అంటారు. ఈ ప్రతిభ ఏ కొందరికోగాని ఉండదు. ఆమె స్థాయి, కాస్త హెచ్చించి, అన్నారు:

వలదోయి, అలమునీ
కలలలో నిదురింతు;
భరమోయి నీ ప్రేమ
వరమే నేటి రేయి!

అబ్బ! ఎంత తీయని బాధ! నా ప్రక్కన నుంచున్న స్నేహితుని చేయి గట్టిగా పట్టుకున్నాను. అతనిని అభినందించానో, నాగుండెదిటవు చేసుకున్నానో ఈ కరస్పర్శవల్ల ఆయనకు సరిగ్గా తెలియలేదు అనుకుంటా—నాకూ సరిగ్గా తెలియలేదు.

ఒకప్పుడు తోస్తుంది నాకు: కవి నిమిత్త మాత్రుడే అని. అంతవరకు మన మనస్సులో పదిలపరచుకున్న అనుభవ పరంపరలన్నీ కట్ట తెంచుకు పొరలి వస్తాయి అతని ఒకమాటవల్ల. 'వలదోయి—నీ కలలో నిదురింతు; భర మోయి నీ ప్రేమవరము' అంటాడు, కవి, ఎంతో అందంగా. మనకు ఎంత బాధ కలుగుతుందో ఈ అందమైన మాటలవల్ల, అతనికేం తెలుసు? కాని, తెలుసేమో, ఒకవేళ. అందుకే, మనకోసం, అంటాడు: "మ్రోయింపకోయ్ మురళి" అని.

అప్పుడు నేనేమై పోయేవాడనో, వాళ్ళ అబ్బాయి తల్లివద్దకు వచ్చి, "అమ్మా! ఇంక నేను పాడతాను: 'ఈ గడ్డిపూవులే?'" అని, అనకపోతే! పిల్లవాని తల నిమురుతూ ఆమె అన్నారు: "పాడు, తాపీగా కూర్చుని, చక్కగా పాడు" అని. అవ్యక్తమధురిమతో ఆ అబ్బాయి తల్లిని అనుకరించాడు:

ఈ గడ్డిపూవులే ఈ దారి పొంతనే
అలసిపోనీవోయి దేవా! దేవా!
నీ యిష్టమైనచో నీ పూలదండలో
మెరిసిపోనీవోయి దేవా! దేవా!!
ఈ లేతగీతాలు ఈ గూటి మూలనే
మూగవోనీవోయి దేవా! దేవా!

నీ యిష్టమైనచో నీ కీర్తనమ్ములో
మ్రోగిపోనీవోయి దేవా! దేవా!!

ఆ మాటల అర్థము ఆ లేత హృదయానికి పూర్తిగా తెలియకపోవచ్చు కాని, తరచు తన తల్లి వద్ద పాటలు విని, ఆమె హృదయంలోని ఆర్ద్రత తన మాటలలోకి అలవరచుకున్నాడు ఆ పాప. పిల్లవాడు తల్లిని ఇంత చక్కగా అనుకరిస్తూ ఉండడం చూచి, సంతోషముతో ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు తండ్రి, తన బుజముపై నిదిరిస్తున్న చంటి పిల్లను ఒక చేతితో జోకొట్టుతూ....

....భోజనాలయ్యాక, తమలపాకులు వేసుకుంటుండగా, ఆమె "మీకు 'చేతులార శృంగారము' చాలా ఇష్టమని విన్నాను. నాకూ ఆ పాట చాలా ఇష్టము; పాడతాను" అని పాడసాగారు.

చక్కని కంఠస్వరము; అంతకంటె ఎక్కువైనది ఆమె గానం చేస్తున్నప్పుడు, వినేవారి మనస్సును క్రమ్మివేసే ఆమె పలుకులోని మనఃపూర్వకత్వం. (ఇంగ్లీష్‌లో సిన్సియరిటి ఆఫ్ ఫీలింగ్ అంటారు.) ఇందాక, రాధగా ఉత్తమోత్తమ ప్రేయసీ ప్రేమభావాన్ని వ్యక్తపరచిన ఆమె, దివ్య మాతృస్వరూపిణిగా, కౌసల్య తల్లిప్రేమను వెళ్ళడించారు, ఇప్పుడు. కన్నతండ్రిని చక్కగా అలంకరిస్తూ పాడుతూ ఉంటుంది కౌసల్య, అందెలు పెట్టి, సరిగ వల్వలు కట్టి, సిగనిండా సురతరుసుమములు జుట్టి. ఏ తల్లికి ఆనందం కాదు ఈ సింగారం! చేతులార శృంగారించి, ముద్దులొలికే శ్రీరాముని ముద్దుపెట్టుకుంటుంది, ఆ తల్లి కౌసల్య.

ఆమెకు వయొలిన్ కూడా వచ్చు. "సరిగా సాధకం చెయ్యడంలేదు; ఎలా ఉంటుందో" అని క్షమాపణ చెపుతూ, ఒక చక్కని వర్ణం వినిపించారు. ఆమె, తల్లి తండ్రితో కొన్నాళ్ళు దక్షిణాదిని ఉన్నారట, పెండ్లికాక మునుపు; దక్షిణాదిబాణీ చక్కగా అలవడినది ఆమెకు.

ఇంకా ఎంతసేపు వారని ఇబ్బంది పెట్టి ఉందునో— నాకు రైలుకు వేళఐపోబట్టి కాని. ఆయన నాతోకూడా స్టేషన్‌కి బయలు దేరారు. ఆమెకు నా

కృతజ్ఞత ఎలా తెలుపాలో తెలియలేదు. కాస్త ఎక్కువగా మాట్లాడతాను అనే పేరు కలిగిన నేను ఆ నిమిషము ఏమీ మాట్లాడ లేకపోయాను. "ఇంతటి సంస్కారమున్న కుటుంబాలు చాలా అరుదు, మనవారిలో" అన్నాను, ఇంగ్లీష్ భావాన్ని తెలుగులోకి తర్జుమాచేస్తూ. ఆమె, విశాల నేత్రాలతో నా వైపుజూస్తూ "మీవంటి వారు మాయింటికి రావడం ఎంతో అదృష్టం. మావారు చెప్పారు, మిమ్మల్ని గురించి, ఎంతో" అన్నారు. ఇంక ఏమి అనగలను నేను? గడప దాటుతూ, వెనక్కి తిరిగి చూస్తూ అన్నాను: "ఎప్పటికీ మరచిపోను, ఈ నిమిషం" అని.

నిజమే! పాతిక ఏళ్ళ క్రిందటి నూతిపళ్లెం వద్ద ఆ వడియాల వాసన, ఆ 'మ్రోయింపకోయిమురళీ', ఆ 'గడ్డిపూవులు', ఆ 'చేతులార శృంగారం', ఆ దంపతుల సౌజన్యం ఇప్పటికీ మరచి పోలేదు నేను; ఎప్పటికీ మరచిపోను.

ఆ ప్రయాణములో రేపల్లె వెళ్లాను, నేను, నాన్నగారి ఆఫీసు పనిమీద. రేపల్లె రహదారి బంగళాలో బస చేసుకొని, అక్కడకు మూడుమైళ్ళ దూరాన ఉన్న తాలూకా బోర్డ్ ప్రెసిడెంట్ చౌదరి గారి ఊరు వెళ్లి వారిని దర్శించి మా ఫార్మశీ మందుల ప్రాశస్త్యంగురించి చెప్పాను వారితో. నేను తెచ్చిన మందులూ చూపించాను వారికి. "సరే; ఉంచి వెళ్ళండి" అన్నారు, ఆయన. తాలూకా బోర్డుకు సంబంధించిన ఔషధాలయాలలో మా ఫార్మశీ మందులు ఉంచాలని నాయత్నము. "శాస్త్రరీత్యా, అతి నికరంగా తయారైనవి ఇవి. ఆయుర్వేద ప్రాశస్త్యమును గురించిన సదభిప్రాయం జనులలో వ్యాపించడమే మా ఆశయం," అని వారికి నచ్చ చెప్పాను.

తరువాత, రేపల్లె ఊళ్లోకి వచ్చి తిన్నగా సాహితీసమితి సభ్యుడు నోరి నరసింహ శాస్త్రి ఇంటికి వెళ్ళాను. ఆయన న్యాయవాది. కచేరీకి వెళ్ళారు, అక్కడకు వెళ్లి కలుసుకోవచ్చునన్నారు, వారి ఇంట్లో. నాకు న్యాయవాదితో పనిలేదు. సమితిసభ్యునికోసమే వచ్చాను వారింటికి. నా రాకను గురించి తెలియజేస్తూ, సాయంత్రం, వీలుంటే, రహదారి బంగళాలో వచ్చి కలుసుకోమన్నాను వారిని.

సాయంత్రం వచ్చారు ఆయన. ఇదివరకు ఆయనను చూడలేదు నేను. కాని, సాహితీ సమితి ఆత్మీయమైన సంస్థ నాకు. సమితి సభ్యులు నా వారు, వారిని నేనుకలుసు కున్నా కలుసుకోక పోయినా సరే. అయితే, సమితి ఇతర సభ్యులకూ నోరి నరసింహ శాస్త్రికీ ఎంతో తేడా ఉన్నది. ఇతరులంత ఒళ్ళు తెలియని 'భావోద్రేకం' లేదు ఆయనలో. ఆయన సత్యశీలి. సత్యాన్వేషణే ఆయన జీవిత పరమావధి— సౌందర్యాన్వేషణకంటె ఎక్కువగా. ఆయన కవిత్వంలో కూడా ఈ ఛాయలే కనిపించాయి నాకు.

మేలి బంగరు శృంఖలంబులు,
పూలతోటయె బందిఖానా;
పాలకులు నా మిత్రవర్యులు,
మేలు కూర్చితిని...

అంటారు ఆయన. ఆయన రచించిన "సోమనాధ విజయము" మన ఏకాంకికలో అత్యున్నతస్థాన మందున్న గొప్ప రచన. హిందూమత ఆచారాలను నాశనముచేసి, ఎన్నో ఎన్నో, దేవాలయాలను నిర్మూలించిన ఘజనీసుల్తాన్ ఈ ఏకాంకికలో ఒక ప్రవక్తగా కనిపిస్తాడు మనకి. అర్థంలేని సంప్రదాయాలనూ, వెగటు కలిగించే మూఢవిశ్వాసాలనూ రూపుమాపాలని అతని ప్రయత్నం. ఉన్నతాదార్శముగల సత్యాన్వేషకునిగా చిత్రిస్తారు ఘజనీని, నోరి నరసింహశాస్త్రి ఈ ఏకాంకికలో. చక్కని రచన. సంభాషణలూ చకచకా సాగిపోతాయి. మంచి వాతావరణం కల్పిస్తారు కవి.

రైలువేళవరకు నాతోనే ఉన్నారు నరసింహశాస్త్రి. ఎంతో ఉన్నది మేమిద్దరము మాట్లాడుకోవలసినది, కవిత్వం గురించీ కవుల గురించీ, స్నేహితులు ఒక్కొక్కరిని గురించీ అంతవరకు నాకు తెలియని వివరాలు ఎన్నో తెలుసుకున్నాను వారితో సంభాషణ ద్వారా.

నరసింహశాస్త్రి స్నేహశీలి. ఐనా, ఆయనకు ఒకరియందు ఉండే స్నేహభావము, వారిలోఉన్న లోపాలను కప్పివేయదు ఎన్నటికిన్నీ. ఆ

లోపాలనూ గుర్తిస్తారు ఆయన. గుర్తించాక కూడా, వారిని ప్రేమించడానికి ప్రయత్నిస్తారు.

నాకు జ్ఞాపకం: అప్పుడు ఆయన 'దేవీభాగవతం' వ్రాయడానికి పూనుకున్నారనీ, ఎంతో నిష్ఠతో పూజచేస్తున్నారనీ. ఆయన నూటికి నూరుపాళ్ళు సనాతనుడు. నుదుట కుంకుమబొట్టు, ముఖంలో బ్రహ్మవర్చస్సు! ఇదీ అప్పటి. వారిని గురించిన నా జ్ఞాపకము.

రేపల్లెనుంచి వచ్చి తెనాలి స్టేషన్‌లో ఆగాను, మద్రాస్ వెళ్ళే మెయిల్ కోసం. స్టేషన్‌ప్లాట్‌ఫారంపైన పచారుచేస్తూండగా, తూర్పువెళ్ళే ప్యాసింజర్ వచ్చి ఆగింది. నేను నుంచున్నచోటుకు ఎదురుగాఉన్న పెట్టెలోంచి ఒకాయన దిగారు. దిగి, ఇటూ అటూ పరకాయించి చూశారు. ఇంతట్లోకి, వారిని వెతుక్కుంటూవచ్చిన వారు, ఐదారుగురు ఆయనను కలుసుకున్నారు. మరు నిమిషంలో ఇంకో పదిమంది వారిచుట్టూ జేరారు. ఆయన వారితో, ఈ మాటా ఆ మాటా మాట్లాడి, జేబులోంచి ఓ కాగితం తీసి, చక్కని కంఠస్వరంతో ఒక చక్కని పద్యం చదివారు. రామాయణ గాథ—ఎంతో శ్రావ్యంగాఉంది. తరువాత, ఇంకో పద్యం, తరువాత ఇంకో పద్యం. ఇలా ఆరుపద్యాలు చదివారు. ఒకప్పుడు, మరీ బాగున్న పద్యం రెండోసారి కూడా చదివారు. ఆరవ పద్యం చదివాక, "ఇప్పటికింతే!" అని వెళ్ళి రైల్లో కూర్చున్నారు. వచ్చినవారు ఆయన బండి కిటికీముందు గుమికూడి అంతా ఒకేసారి మాట్లాడుతూండగా, గంటకొట్టి, ఇంజన్ కూతవేసి, రైలు వెళ్ళిపోయింది.

తర్వాత అడిగి తెలుసుకున్నా: ఆయన మహానీయుడు మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి అని.

మరునాడు మద్రాస్ చేరి, పదిగంటలకు ఆఫీసుకు వెళ్ళాను. నేను కుర్చీలో కూర్చున్నానో లేదో, నాన్నగారు నావద్దకు వచ్చి, "అర్జంట్ పనిమీద హైదరాబాద్ వెళ్ళాలి, నీవు, ఈ రాత్రే ప్రయాణమ"న్నారు!

## —౨౩

ప్రళయ రుద్రుని కేళికా రామమైన
ఈ భయావహ శూన్యమం దిటుల నన్ను
తోలుబొమ్మ లాడింతు వేల ప్రణయ
సూత్రమును వ్రేళ్ళమధ్య చేర్చుకొని ఊరక
లాగి వదలుచు చెరలాటమా? గభీర
వదనమున రేకదీర్చు నవ్యక్తమంద
హాసమున కర్థ మేమి? నఖాగ్రధార
దారమును త్రెంచు తలపు పుట్టదు కదా?
రవంత కొనయాసతో తేలియాడుచున్న
గాలిపటము ఝంఝూనిలాఘాతమునకు
కొట్టుకొని పోయినంత నీకు వచ్చినది ఏమి?
కండె చుట్టుచు దారమ్ము క్రమముగా త్వ
దీయ స్వామీప్యమునకు రావించి నన్ను
నీదు హృదయాంతరమున బంధింపమంచు
వేడుకొనుచుంట లేదు; నీ వ్రేళ్ళ మధ్య
నలరు దారమ్ము త్రెంపకు మంటెచాలు!

ఊహ, అనుభవము, శైలి—అన్ని లక్షణాలూ ఉన్నాయి, నాయని సుబ్బారావు రచించిన ఈ పంక్తులలో. అప్పటి నా మానసిక ఆందోళనను అవి చక్కగా వర్ణించాయి. ఈ కవి వాక్యాలు—ఆ ఉపమానము, ఆ వేడికోలు. ఆ మాటే అంటున్నా. నాతో కలిసి హైదరాబాద్ వస్తూన్న స్నేహితుడు తెలికి

చర్ల కృష్ణమూర్తితో. నేను హైదరాబాద్‌కు ప్రయాణమవుతూ గుంటూరులో ఉన్న అతనికి కబురుచేశాను: నిన్ను చూచి చాలా కాలమైంది, నీవు బెజవాడలో వచ్చి కలుసుకుంటే ఇద్దరమూ హైదరాబాద్ వెళ్ళివద్దామని. అతను వచ్చి కలుసుకున్నాడు. ఇద్దరమూ కలసి ప్రయాణము చేస్తున్నాము.

నా కథ సాంతమూ విని నాకోసం చాలా బాధపడ్డాడు, నా స్నేహితుడు. "నీవు సుఖంగా ఉండగలిగితే బాగుండేది" అన్నాడు కృష్ణమూర్తి-తాను మహా సుఖంగా ఉన్నట్టు. తన సంగతి నాతో ఎక్కువ చెప్పలేదు; కాని, నా సంగతి అంతా విన్నాడు. నా మాటలతోనే గడిచిపోయింది ప్రయాణము, రాత్రి రెండవ జామువరకూ.

శ్రీ మునగాల రాజావారి తమ్ముడు వరదరావు స్టేషన్‌కు వచ్చి మమ్మలను కలుసుకుని సైఫాబాద్‌లో ఉన్న వారి బంగళాకు తీసుకువెళ్ళారు. మద్రాస్ చింత్రాదిపేటలో ఉంటూండగా, ఏ పాతికేళ్ళ క్రితమో, వరదరావు నన్ను బాగా ఎరుగును. పాతికేళ్ళలోనూ ఆయన ఏమంత మారలేదు. నన్నుకూడా అప్పటి ఆతొమ్మిదిఏండ్ల పిల్లవానిగానే భావించారు, అతనూ అతని అన్నగారు శ్రీ రాజావారూ. రాజాగారు నాన్నగారిని గురించి వివరంగా అడిగి తెలుసుకున్నారు. నేను వచ్చిన ఆఫీస్‌పని మూడు నిమిషాలలో పూర్తి అయినా, "ఇదేమొదటిసారి మీరుఈఊరురావడము. ఊరుచూచి వెళ్ళండి" అన్నారు. ఆ సాయంత్రం వారి కుమార్తె వనపర్తి రాణి నన్ను తమ సమక్షానికి పిలువనంపారు. రాణిగారు చిన్నప్పుడు నాతోనూ, మా అక్కచెల్లెళ్ళతోను ఆడుకునేవారు, మద్రాస్‌లో వారి బంగాళాలో. నన్నుఎంతో ఆదరించి మా అక్కయ్యను గురించీ, మా చెల్లెలిని గురించీ మరీ మరీ అడిగారు. వారి సౌజన్యం ఎన్నటికీ మరువరానిది. కాలగతిని వ్యక్తుల పదవులు మారవచ్చును కాని, హృదయాలు ఎన్నటికీ మారవు.

దీపాలవేళ ఊళ్ళోకి వెళ్లి, కృష్ణదేవరాయ పుస్తక భాండాగారము వద్ద, ఆదిరాజు వీరభద్రరావును కలుసుకున్నాను. వీరభద్రరావు మద్రాస్‌లో విజ్ఞాన చంద్రికా మండలి పని అంతా చూస్తూ, నాన్నగారికి కుడిభుజముగా ఉంటూ ఉండెవారు. నా బాల్యమంతా వారి శిక్షణలోనే గడిపాను. నేను చదివిన పుస్త

కాలన్నీ వారి ప్రోత్సాహము వల్లనే చదివాను. తెనుగు భాషలోని తేటతనమూ సంస్కృత భాషలోని ప్రౌఢత్వమూ వారే నాకు విశదపరచారు. ముక్కుతిమ్మన గురించీ కాళిదాసును గురించీ భవభూతిని గురించీ ఎంతో చక్కగా చెప్పే వారు ఆయన. కాళికాదేవి తన వజ్రాలముక్కరను ఆకాశంలోకి విసిరి చంద్రోదయ భ్రాంతి కల్పించి తన భక్తుని మర్యాద కాపాడిన గాథ ఆయనే చెప్పారు నాకు. నాలో, శ్రీ కృష్ణదేవరాయల గురించి అపారమైన గౌరవము కలిగించినది వారి బోధనే. హైదరాబాద్‌లో ఈ పుస్తక భాండాగారం వెలయించడమే గాకుండా, తెలంగాణావారికి తెలుగులో అపరిమితమైన అభిరుచి, అభిమానము కలిగినది వీరిభద్రరావు వంటివారి నిరంతర కృషి వలననే. నన్ను చూచి, పూర్వము, నా చిన్ననాటి విషయాలన్నీ ఒకసారిగా జ్ఞాపకానికి వచ్చి, ఎంతో ఆర్ద్రమనస్కు లయ్యా రాయన. కాలపు గడియారము ఒకసారి పాతికేళ్లు వెనక్కు మరలింది.

మరునాడు, కృష్ణమూర్తి, నేను, గాడేపల్లి సూర్యప్రకాశ రావునూ ఆయన భార్య సత్యవతినీ చూడడానికి వెళ్లాము. ప్రకాశరావూ, మొక్కపాటి రామమూర్తీ, గుడిపాటి వెంకటచలం ఒక బృందములో వారు. వెంకటచలం, రామమూర్తి నాకు స్నేహితులు. కనుక, ప్రకాశరావూ స్నేహితుడే. ఆ చనువుతో వారింటికి వెళ్లిన మమ్మల్ని చాలాచాలా ఆదరించారు ఆ దంపతులిద్దరూ. ప్రకాశరావు చాలా బాగా చదువుకున్నారు. ఎంతో చక్కగా ఎన్నో విషయాల గురించి ఆయన మాట్లాడ గలరు. ఆమెకూడా మా సంభాషణలో ఆసక్తితో పాల్గొన్నది. వారి కిద్దరు కొడుకులు. పెద్దవాడు ఏడేళ్ల షాజహాన్, రెండవ అతను ఐదేళ్ల జనూపావ. వారికి ఆ పేర్లు పెట్టడం, ఆ దంపతుల అతి ఉదారమైన మానసికదృష్టికి తార్కాణ మనుకున్నాను.

ఆ రోజంతా ఊరు చూపించారు మాకు వారిద్దరూ, గోలకొండకూ నిజామ్‌సాగర్‌కూ ఇంకా చూడవలసిన అన్ని చోట్లకూ వారి కార్‌లో తీసుకువెళ్లి. షాజహానూ, జనూపావా ఎంతో ముద్దువచ్చారు నాకు. వచ్చేస్తూ వారి ఆటోగ్రాఫ్ పుస్తకంలో ఇలా వ్రాశాను:"ఇప్పుడు మీరు చాలా చిన్న పిల్లలు. ఎదిగి పెద్దవాళ్ళవుతారు. పది ఏళ్లయినాక, జ్ఞాపకముంచుకొని నన్ను మద్రాస్‌లో

వచ్చి కలుసుకుంటారు కదూ!" అని వ్రాశాను. అల్లాగే, వారిద్దరు నన్ను కలుసు కున్నారు. ఆనవాలు పట్టలేనంత పొడుగు ఎదిగి ఉన్నారు. పెద్దతను సంయుక్త రాష్ట్ర గవర్నరుకు అంగరక్షకుడయ్యాడు, దరిమలాను. రెండవ అతను మిలిటరీలో పెద్ద ఉద్యోగి అయ్యాడనుకుంటాను.

ఆ ప్రయాణం గాక, నేనుమళ్ళా ఓ పర్యాయము హైదరాబాద్ పీమకు వెళ్ళాను. ఈ సారి హైదరాబాద్‌కు నూరుమైళ్ళ దూరంలో ఉన్న అసీఫాబాద్ జిల్లాలో ఒక దేశముఖ్ కుటుంబము వారింట ఒక పదిహేను రోజులున్నాను. ఆ దేశముఖ్ భార్యా పిల్లలూ మా నాయనగారివద్ద వైద్యం చేయించుకున్నారు. అంతేగాక, రాణీగారికి మా నాయనగారియందు ఎంతో భక్తిభావము ఏర్పడడం వల్ల మద్రాసునుంచి స్వదేశం వెడుతూ, "మీ అబ్బాయిగారిని ఒక తఫా మా రాజ్యానికి పంపండి" అని అడిగారు రాణీగారు. ఆమె కోరిక ప్రకారం నాన్న గారు నన్ను ఆమెవద్దకు పంపారు. "ఒకసారి రాణీగారిని, పిల్లలను చూచిరా, వీలుంటే ఆ ప్రాంతాలలో మన ఫార్మసీ పని కొనసాగేటట్టూ, తగిన ఏర్పాట్లు చేసిరా" అంటూ,

నాగపూర్ సైన్స్ కాంగ్రెస్ నుంచి తిరిగివస్తూ ఆ ఊళ్ళో ఆగాను నేను. స్టేషన్‌కి బండిని తీసుకువచ్చిన జవాన్ "డాక్టర్ సాబ్! మాఊరి గంగా పురం జాతరకు వచ్చారా?" అని ప్రశ్నించాడు. నేను ఏమీ అనలేదు. కాని, తర్వాత రాణీగారు చెప్పారు, వారి ఊరికి పదిమైళ్ళలో ఉన్న గంగాపురంలో ఏటేటా జరిగే జాతర ఆ ప్రాంతాలలో చాలా ప్రసిద్ధమైనదనీ, ఆ రోజులలో వారి ఊరు ఎవరు వచ్చినా, ఆ జాతర చూడడానికే వస్తూంటారనీ.

రాణీగారికి ఇద్దరు కొడుకులూ ఒక కూతురూను. రెండవ కుమారుడు పుట్టిన ఏడాదిలోపలనే రాజాగారు (దేశ్‌ముఖ్) అకస్మాత్తుగా కాలధర్మం చెంద డము వల్ల ఆ జమీందారీ బాధ్యత అంతా ఆమె పైననే పడింది. ఎంతో చాక చక్యంతో వ్యవహారాలు చక్కబెట్టుకోవడం నేర్చుకొన్నది ఆమె. హైదరాబాద్ వంటి రాష్ట్రంలో ఇది ఎంతో ఘనకార్యం,

రాణీగారి తండ్రి చాలా చదువుకున్నవారు. వేదవేదాంగాలూ, పురాణేతి హాసాలు ఆయనకు కరతలామలకం. ఆయనగారి శిక్షణవలన ఆమెకున్నూ,

ఆజ్ఞానమూ ఆ పాండిత్యమూ అబ్బినవి. కురాన్‌కూడా చక్కగా పరిశీలించాడట ఆయన. ఆమెకూ అందు ప్రవేశమున్నది. ఇన్ని కారణాలను బట్టిన్నీ ఆమెకు మా తండ్రిగారిపై ఉన్న అపారమైన భక్తివల్లనూ, నేను వారికి ఆప్తుడనూ దగ్గర స్నేహితుడనూ ఐనాను, చప్పున. నన్ను విడిచి ఒక్క నిమిషము ఉండలేక పోయేవారు ఆమే, ఆమె పిల్లలూ. నా జీవితగాథ సాంతమూ విని, కంటతడి పెట్టుకున్నారు ఆమె. "ప్రపంచమంతా తిరిగి వచ్చినా, ఇదే మీ ఇల్లనుకోండి, ఇకమీదట మీ జీవితంలో ఎటువంటి వ్యధ ఉంచుకోరని మాట ఇవ్వండి!" అన్నారు రాణీగారు. "మీ తల్లి పోయారనేవెత్తి ఉండరాదు, ఇకమీదట" అన్నారు, ఆ మాతృస్వరూపిణి.

పదిరోజు లున్నాను వారి ఊరిలో: పదిహేను రోజులు-ఇంకా నన్ను వెళ్ళనియ్యబుద్ధి వెయ్యలేదు వారికి. ఊరిలోని వారందరికీ నేను హితుడ నయ్యాను. అంతటి అమాయకత్వము, అంతటి అవ్యాజమైన ప్రేమ చాలా అరుదు, మన ప్రాంతాలలో అనుకుంటాను.

ఇరవై రోజులయ్యాక ఆమె అన్నారు: "నేను మా అమ్మగారింటికీ మా చెల్లెలి అత్తగారింటికీ వెళ్ళవలసి ఉన్నది. మిమ్మల్ని తప్పకుండా నాతో తీసుకురమ్మన్నారు. రేపు విదియ. ప్రయాణానికి మంచిది" అన్నారు. నేను ఏదో చెప్పబోతూ ఉంటే, "మీ నాయనగారికి ఇదివరకే వ్రాశాను. ఆయన ఏమీ అనరు. మా అమ్మగారికీ చెల్లెలికీ చూపించకుండా మిమ్మల్ని ఈ రాజ్యం నుంచి వెళ్ళనిస్తే నన్ను బ్రతకనిస్తారా మా వాళ్ళు!" అన్నారు రాణీగారు.

రాణీగారూ పరివారమూ నేనూ వారి అమ్మగారి ఊరువెళ్ళి అక్కడ ఒకపూట ఉండి, అక్కడినుంచి, ఆమె చెల్లెలు సరస్వతమ్మగారి ఊరు వెళ్ళాము. సరస్వతమ్మగారి భర్త "దేశ్‌ముఖ్, దేశ్‌పాండే, పటేల్, పట్వారీ" ఆయనా ఆమేకూడా కొన్నాళ్ళు మా నాయనగారివద్ద ఆవడిలో ఉన్నారు. నాయనగారిదెస వారికి కలిగిన ఆదరాభిమానాలు నాపై ప్రసరించాయి. నేను వారి ఊరిలో ఒక నెలరోజులు ఉండవలసి వచ్చింది. కృష్ణారావు బహద్దర్‌వారు చాలా సరసులు. విపరీతమైన ప్రేమ, ఆయనకు నచ్చిన వారిదెస. కవులు, గాయకులు, భాగవతులు, ఎందరెందరో, నెలల తరబడి ఆయన దివాణంలో ఉండి

పోయి ఆయన మన్ననల నందేవారు. రాణిసరస్వతమ్మగారు, ఆమె అక్క గారి వలెనే నాయందు అపరిమితమైన అనురాగం చూపించారు. నా భోజన విషయాలలో అమ్మ చూపించిన శ్రద్ధ చూపేవారు ఆమె. వారిద్దరికీ కూడా సంగీత సాహిత్య విషయాలలో ఎంతో ఆసక్తి, ప్రవేశమూ ఉండబట్టి గంటల తరబడి ఆ విషయాల గురించి మాట్లాడుకునే వారము.

ఒక పర్యాయం ఆరుబయట కూర్చొని ఈమాటా ఆమాటా మాట్లాడుకుంటూ ఉండగా, మన ప్రాంతంనుంచి, పిఠాపురం నుంచో బొబ్బిలి నుంచో వచ్చిఉన్న ఒకగాయకుడు వచ్చారు వారి వద్దకు. అప్పుడే చీకటి పడుతోంది. మాకు ఎదురుగా కాస్త అవతల కూర్చుని, ఆయన పాట నారంభించారు. కొంతసేపయాక, సావేరిరాగం ఆలపింప సాగారాయన. ఎంతో రక్తి గట్టించే విధంగా చాలాసేపు ఆలాపించారాయన ఆఒక్క రాగాన్నీ. నాకు సావేరి చాలా ఇష్టం. తలవంచుకు వింటూన్నాను అంతసేపు. ఆయనపాటముగించాక, క్షణం అలాగే ఉండిపోయి, తలఎత్తి చూతునుగదా, సరస్వతమ్మగారి కన్నులవెంటా ఆమెఅక్కగారు రాణీగారి కన్నులవెంటా అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. ఇది అతిశయోక్తికాదు. అంతటి ఆర్ద్రత ఉన్నది వారి హృదయాలలో.

వసుచరిత్ర, మనుచరిత్ర, పారిజాతాపహరణ కావ్యాలనుగురించి, ఎక్కువగా మాటలాడుకునేవారము మేము. నాచేత పద్యాలు చదివించి నా ఉచ్ఛారణ లోని ఇంగ్లీషుయాసను గురించి నవ్వేవారు సరస్వతమ్మగారు. కాని, ఇంగ్లీష్ పద్ధతిని నేను వివరించే సాహిత్య విషయాలను గురించి ఎంతో ఆసక్తితో వినే వారు వారిద్దరూ.

ఆ ఊళ్ళో, మన ప్రాంతాలలో కలెక్టర్‌లాగే అవల్ తాలూక్‌దార్ చాలా పెద్ద ఉద్యోగస్తుడు. అప్పుడు అచ్చటి అవల్ తాలూక్‌దార్ లక్నో మొగలాయి కుటుంబానికి చెందిన ఆయన, చాలా సంస్కారి. ఆయనకు నన్ను ఎంతో గర్వంతో పరిచయం చేశారు కృష్ణారావుగారు. కలెక్టర్ కొన్నేళ్ళు కేంబ్రిడ్జిలో ఉన్నారు. మాకు ఇద్దరకూ ఆసక్తిఉన్న ఎన్నో విషయాల గురించి గంటల తరబడి మాట్లాడుకొనేవాళ్ళము మేము. తనకు ఇంగ్లీషు అంత బాగా రాక

పోయినా, మా మాటలువింటూ ముగ్ధులయ్యేవారు రాజావారు. "మా కలెక్టర్ కంటే మీరే ఇంగ్లీషు బాగా మాట్లాడతారు" అన్నారాయన ఒక పర్యాయం.

నేను వచ్చి చాలా రోజులులైంది. నెల రోజులకు పైగా అవుతుంది. "నేను మద్రాస్ తిరిగి వెళ్లక తప్పదు, వెంటనే, మీరు అనుమతిస్తే రేపే ప్రయాణము" అని నేను అంటే, "అయ్యో మీరు వెళ్ళిపోతే ఎలాగ! మా అవల్ తాలుక్‌దారుతో ఇంగ్లీష్ ఎవరు మాట్లాడుతారు, మీరు వెళ్ళిపోతే" అన్నారు కృష్ణారావుగారు, అతి సీరియస్‌గా!

ఆ ఊరు వరంగల్లుకు వందమైళ్ళ దూరం. కార్ కావాలంటే, బస్సులో వరంగల్ మనిషిని పంపి కార్ తెప్పిస్తారు రాజాగారు. వారు తెప్పించాలె కాని కార్ నేను ఎలా తెప్పించను? ఇక బస్‌వాళ్ళు రాజాగారి అనుమతి లేనిదే, నన్ను బస్ ఎక్కనియ్యరు. నేను వెళతానండీ అంటే రాజాగారు "వెళదురుగాని లెండి; శనివారము పండుగ, పండుగకు ఉండకుండా ఎలా వెళతారు" అనే వారు. పూట పూటా మరిన్ని పిండివంటలు చేయించేవారు, రాణీగారికి పురమాయించి. "నేను వెళ్ళాలి, తప్పకుండా" అని సరస్వతమ్మగారితోనూ, వారి అక్కగారితోనూ అంటే వారిద్దరూ నాకేసి జాలిగా చూసేవారు. ఇంకొకసారి అంటే కంటతడి పెట్టుకుంటారేమో అనిపించేది.

పట్నంనుంచి నాన్నగారి వద్దనుంచి ఉత్తరాల మీద ఉత్తరాలు వచ్చేవి. ఒకసారి టెలిగ్రామ్ కూడా ఇచ్చారు నాన్నగారు. టెలిగ్రామ్ మాత్రం ఉత్తరంకంటే ఆలస్యంగా వచ్చింది ఆ ఊరు. కాని, వారు పంపితేగాని ఆ ఊరునుంచి బయటపడడము ఎలా? కలెక్టర్‌గారితో ఈ మాట అంటే; "వారింటికి వచ్చిన చుట్టాలు ఆరునెలలుండాలి-అధమపక్షము; మీ విషయంలో మూడు నెలలలో వెళ్ళనియ్యవచ్చు. నేను చెప్పిచూస్తాను. అవతల మీ పనులు పాడుకా కూడదు కదా!" అన్నారు.

కలెక్టర్‌గారి సిఫార్సు పనిచేసింది. నన్ను ఇంకో పదిరోజులయ్యాక వెళ్ళనియ్యడానికి ఒప్పుకున్నారు రాజాగారు. అదృష్టవశాత్తు, ఆ రోజు ఉదయమే ఆ ఊరి మీదుగా వరంగల్ వెళుతున్న ఫారెస్ట్ ఇలాఖా డైరెక్టర్ గారు

మజిలీగా రాజావారిఇంట బసచేశారు. నేను వారితోకూడా ప్రయాణమయ్యాను. రాజావారు మళ్ళా వాయిదా వెయ్యాలని చూచారు కాని, ఆ ఉద్యోగస్థుడు అన్నారు; "నాకూడా రానియ్యండి; నాకు జతగా ఉంటారు, దూరప్రయాణము, నాకూ ఏమీ తోచదు" అన్నారు. ఆయన మాట తీసివెయ్యలేక, సరేనన్నారు రాజాగారు.

ప్రయాణము సిద్ధమై రాజావారివద్ద, రాణీ సరస్వతమ్మవారివద్ద సెలవు తీసుకోడానికి వెళ్ళినప్పుడు, వారిద్దరూ నన్ను గురించే మాట్లాడుకుంటున్నట్టు తెలిసింది. "మన ఇంట్లో ఒకరైపొయ్యారు, ఆయన వెళితే ఏమి తోస్తుంది మనకు?" అంటున్నారు ఆయన. ఆమె ఏమో అనబోయింది. కాని, నేను రావడం చూచి, చిరునవ్వు నవ్వి ఊరుకొన్నారు సరస్వతమ్మగారు. భర్త సైగ చెయ్యగా, ఆమె లోపలకు వెళ్ళి వెండిపళ్ళెం నిండా ఇన్ని పళ్ళూ, ఎక్కడి నుంచి తెప్పించారో పువ్వులు, గంధం, కస్తూరి, జవ్వాది తెచ్చారు. పట్టురుమాలు కింద ఉన్నాయి వెండి నాణాలు ఎన్నో! ఆయన నా ఒంటిపైన గంధంపూసి, కస్తూరి, జవ్వాది రాచారు. ఆమె పళ్ళు, పువ్వులు నా దోసిలిలో ఉంచారు. అప్పుడు, పళ్ళెం రాణీగారు రెండు చేతులతో పట్టుకోగా, రాజాగారు వెండి నాణాలు గుప్పిళ్ళతో తీసి నాజేబు నింపారు. ఆ రోజులలో నేను పొడుగుజేబుల అంగరఖా (లాంగ్‌కోట్) తొడుక్కునేవాణ్ణి. రెండు జేబులూ నిండిపోయాయి వెండినాణాలతో. ఇంక పళ్ళెంలో మిగిలిన రూపాయలు పట్టురుమాలులో కట్టి నా దోసిలిలో ఉంచారు రాజాగారు. "ఇంకా రెండు మూడువారా లుంటారేమో, బరంపురంనుంచి పట్టు తాపితాలు తెప్పిద్దామనుకున్నాము, పట్నం వెళ్ళడం తోనే పట్టుబట్టలు కొనుక్కోండి" అన్నారు కృష్ణారావుగారు.

నాకు ఏమనాలో తెలియలేదు. "ఇంతదయకు నేనేలా నోచుకున్నానో, తెలియదు" అన్నాను గద్గదికతో. సరస్వతమ్మగారి పెదవులు కదిలాయి కాని, మాట వినబడలేదు. రాజాగారు నన్ను గాఢంగా కౌగలించుకుని "సుఖంగా వెళ్ళిరండి. మళ్ళా మీ రాకకు ఎదురుచూస్తూ ఉంటాము" అన్నారు. ఆమె ఆ నిమిషము తెచ్చిపెట్టుకున్న చిరునవ్వును ఎప్పటికీ మరువలేను; మనుచరిత్ర చదివినప్పుడల్లా ఆమె జ్ఞాపకం వస్తూ ఉంటారు.

చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ది
బొడమిన చెలువ తోబుట్టు మాకు...

అనే పద్యం ఎంతో చక్కగా చదివేవారు ఆవిడ.

* * * *

బెజవాడ స్టేషన్‌లో అడుగు పెట్టడంతోనే మా మేనత్తకొడుకు, మల్లవరపు కృష్ణారావు ప్రత్యక్ష మయ్యాడు నా యెదుట. నేను ఆశ్చర్య పోయాను. వెల్లూరు జెయిల్‌లో ఉన్న అతను ఇక్కడెలా అవతరించాడు చెప్మా! అనుకున్నా. అతను సంతోషంతో నవ్వుతున్నాడు. "మేమంతా విడుదలైనట్టు తెలియదా? గాంధి-ఇర్విన్‌పాక్ట్ కారణంగా!" అన్నాడు. నాకు తెలియదు. రెండునెలలుగా నేను పేపర్ చూడలేదు. అతని రైలు బయలుదేర బోతోంది. గబగబా చెప్పాడు, రాజకీయ వాతావరణంలో కలిగిన అద్భుతమైన మార్పులను గురించి. విశాఖపట్నం చేరాక ఉత్తరం వ్రాస్తానన్నాడు. కదులుతూన్న రైలు కిటికీలోంచి చేయిచాచి అతని చెయ్యిపట్టుకొని, గట్టిగా అదిమి, విడిచిపెట్టాను.

బెజవాడలో నా కొరకు ఆఫీస్ ఉత్తరాలు వేచిఉన్నాయి. ఆఫీస్ పని మీద బందరు, నరసాపురం, రాజోలు వెళ్ళవలసి ఉన్నది. వెంటనే బందరు వెళ్ళాను.

బందరులో నా పని చూచుకొని, ఆ ఉదయమే శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యను దర్శింపడానికి వెళ్ళాను, వారి ఇంటికి. నాన్నగారు ఆయన స్నేహితులు. ఇదివరకు నేను ఆయనను కలుసుకొని ఉండలేదు. వారి ఊరు వచ్చాను కాబట్టి ప్రప్రథమముగా వారిని దర్శించడం నా విధి అనుకుని వెళ్ళాను వారి వద్దకు. నన్నుచూచి మా నాయనగారిని చూచినట్టు సంతోషించారు ఆయన. "ఎంత వాడవయ్యావు! నీ చిన్నప్పుడు చింతాద్రిపేటలో మీ ఇంట్లో చూచాను నిన్ను. మీ అక్కయ్యను, చెల్లెలినీ. వారు కులాసాగా ఉన్నారా?"అని అడిగారు. మా సంభాషణ ప్రారంభించిన రెండు నిమిషాలలో రాజకీయ విషయాల ప్రస్తావన మొదలుపెట్టారు శ్రీ పట్టాభి. స్టేషన్‌లో నేను

చూచాయగా వినిన గాంధి-ఇర్విన్ ఒడంబడికగురించి సవిస్తరంగా చెప్పారు ఆయన. ఆ రాచకార్యపు పుట్టుపూర్వోత్తరము, అందుకు తాము చేసిన కృషి, ఒడంబడిక అసంతృప్తికరంగా ఉన్నదని ఆక్షేపించే అతివాదుల వాదనలోని లోపాలు, అన్నీ ఎంతో చక్కగా అర్థమయ్యేటట్టు చెప్పారు. నాతో మాట్లాడు తున్నారన్న మాటేగాని, అంత సేపూ, ఆయన వాగ్ధోరణి నన్ను ఉద్దేశించికాదు, వివిధ పక్షపు నాయకులను ఉద్దేశించి నాతో అంటున్నారు, ఆయన, అంతే! ఇంకా ఎన్నెన్నో విషయాలు తెలుసుకున్నాను, ఆ వారి ప్రసంగం వింటూ. కాంగ్రెస్ ఆశయాలూ నిర్మాణకార్యక్రమ ఆవశ్యకతా దేశంలో సంఘీభావం లేకపోవడం-ఇల్లాగ ఎన్నో సంగతుల గురించి చెప్పుతున్నారాయన, గొప్ప వక్త; ఆవేశంతో మాట్లాడినా, ఒక్క పొరబాటుదొరలదు. అద్భుతమైన జ్ఞాపకశక్తి, ఎంతో ఛలోక్తి. ఇలా ఎంతసేపు ప్రసంగించి ఉందురో "వడ్డించారు, భోజనానికి లేవచ్చు" అని లోపలినుంచి కబురు రాకపోతే. ఆ పూట వారి సహపంక్తిని భోంచేసి, కాస్సేపు విశ్రమించి, వారివద్ద సెలవు దీసుకొన్నాను.

నేను ఎప్పుడు బందరు వెళ్ళినా పూజ్యులు శ్రీ ముట్నూరి కృష్ణారావును దర్శిస్తూ ఉంటాను.వారితో ఒక నిమిషముసేపు మాట్లాడగలిగినా, అది ఎంతో ఉత్సాహాన్ని సమకూరుస్తుంది, తరువాత జీవితంలో తారసిల్లే వివిధ సమస్యలను ఎదుర్కోడానికి కావలసినంత బలమునిస్తూ. ఆయన ఎంతో ఆప్యాయంతో, ఎంతో దర్జాతో, చిరునవ్వునవ్వుతారు నన్నుచూచినంతనే. ఈ సారి వారికి కనుపించడముతోనే "ఈ మధ్య మీ రచనలు ఏమీ పంపడములేదు, మా పత్రికకు" అన్నారు వెన్నెలవిరిసే మందహాసంతో. మా నాన్నగారిని గురించీ, మా పినతల్లిని గురించీ మరీ మరీ అడిగారు. మా పినతల్లి చేసిన, చేస్తూన్న త్యాగాన్ని ప్రశంసిస్తూ, "వారిద్దరూ ధన్యజీవులు" అన్నారు. నేను నా స్నేహితుడు నాగభూషణం ఆరోగ్యం గురించి అడిగాను వారిని. "ఆదే ఆరోగ్యం, ఇంకా పూర్తిగా నయం కాలేదు. ఒకసారి ఇంటికి వెళ్లి చూచిరండి. అతని తల్లి సంతోషిస్తుంది." అన్నారు. నేను వారివద్ద సెలవు తీసుకునే ముందు మళ్లా ఒకసారి అన్నారు :

"కృష్ణా పత్రికకు ఏమన్నా వ్రాయండి, మీ రచనలో ఒకానొక విశిష్టత ఉన్నది" అన్నారు. మూర్తీభవించిన ఆంధ్రత్వం ముట్నూరి కృష్ణారావు.

బందరునుంచి భీమవరం, పాలకొలను, రాజోలు వెళ్ళాను. రాజోలు చాలా అందంగా కనిపించింది. కొబ్బరిచెట్లమధ్య అంత ఊరు ఎంతో హాయిగా ఉంది. రాజోలునుంచి నావలో గోదావరి దాటి, కొంతదూరం నడచి తరువాత జట్కాచేసుకొని పాలకొలనుచేరాను. పాలకొలనులో "భూప్రదక్షకుడు భార్యకు వ్రాసిన లేఖలు" అంటూ తమ విదేశయానమును గురించి విపులముగా వర్ణిస్తూ వచ్చిన అత్యం నరసింహంగారిని కలుసుకొని వారితో కొంత సేపు సంభాషించాను. ఆ రాత్రి రైలులో మద్రాస్‌కు ప్రయాణమయ్యాను.

మద్రాస్‌చేరేసరికి ఆఫీస్‌లో పరిస్థితులు కొంతమారి ఉన్నవి. ఇన్నాళ్ళ నా ప్రవాసంవల్ల పనికి ఎంతో అంతరాయం తగిలింది. అంతేగాక, ఆర్థికంగా కూడా ఎవరూ అనుకోని మాంద్యం ఆవహించింది దేశాన్ని. ఈ కారణాలూ, ఇంకా మరికొన్ని కారణాలూ, వీనివల్ల నేను ఆ పనినుండి విరమింపవలసిన స్థితి ఏర్పడింది.

మళ్ళా ఆవడి వెళ్ళాను నాన్నగారిని చూడడానికి. మళ్ళా ఆ పొలంలోనే పనిచేయిస్తున్నారు, అప్పుడు, పట్టుపట్టి, ఒక్కపూటలో తడిపించిన మెరక చేను వద్ద, నాన్నగారు. ఈసారి కోతలు కోయించి, కుప్ప నూర్పిస్తున్నారు, ఆయన సాయంత్రపువేళ. అస్తమిస్తూన్న సూర్యునికి చెయ్యి అడ్డము పెట్టుకొని వారిని సమీపించే నన్ను చూస్తున్నారు ఆయన. నేను దగ్గరగా వచ్చాక, కూర్చోమని పచ్చిక గట్టు చూపి, నాన్నగారు అన్నారు; "ఢిల్లీలో మీ అక్కయ్యకు ఉత్తరం వ్రాశాను. నీవు కొంతకాలం ఆమెవద్ద ఉండి, మరేదైనా ఉద్యోగానికి ప్రయత్నముచేయి. నీకు ఉద్యోగం దొరకకపోదు. ఉద్యోగం దొరికేవరకు అక్కయ్య వద్దనే ఉండు. మీరిద్దరూ కలిసిఉండి కొన్నేళ్ళు ఐనది అనుకుంటా. ఉదయమే వెళ్ళు, డిల్లీ" అన్నారు.

మరునాడు నా డిల్లీ ప్రయాణము. నాన్నగారి వద్దఉండి, వారి కృషికి తోడ్పడే అవకాశానికి ఇంత హఠాత్తుగా అంతరాయం కలుగుతుంది అనుకోలేదు నేను ఎన్నడూ. ఐనా, ఏ విషయమూ మన చేతిలో లేదు. ముందు

## నా స్మృతి పథంలో...

ముందు ఏమి జరుగుతుందో, ఎలా చెప్పగలము? రైలెక్కి మద్రాస్ పరిసర ప్రాంతాలు దాటుతుండగా నా మనస్సులో కొండంతబెంగ ఒక ప్రక్కన; ఒక ప్రక్కన, ముందు ఏమి కానున్నదో అనే ఒకరీతి ఉత్సుకత. ఆరోజు జులై నాలుగవతేది. అమెరికన్ల స్వాతంత్ర్యం ప్రకటించింది ఈనాడే. ఒక విధంగా నాకీ స్వతంత్రత మంచిదే. నాలో ఉన్న గుణగణాలు యధేచ్ఛగా వికసించ డానికి మంచి అవకాశము ఇది. నా అడయార్ రోజులూ, విజయనగరవాసమూ, ఏడేళ్ళ బెంగుళూరు అనుభవాలూ, అన్నీ ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చాయి. అనుకోకుండా, నాటకం మొదటి అంకంలోనే, తెర జారిన ఫార్మసీ ఉద్యోగము విషయమూ జ్ఞాపకం వచ్చింది, బాధగా. ఇలా ఆలోచిస్తూ ఉంటే, నాయని సుబ్బారావు వ్రాసిన ఆ గీతం మళ్ళా అవతరించింది, అక్షరం అక్షరం ఎంతో ప్రస్ఫుటంగా నా కనులముందు. ఎటొచ్చీ, మొదటిసారి ఆ భావాలు నా ప్రణయ జీవితానికే సంబంధించినవిగా అనుకున్నాను. ఇప్పుడు నా జీవితం యావత్తుకూ అన్వయిస్తున్నాయి ఆ మాటలు. గాలిలో ఎగురుతూన్న గాలి పటాన్ని నేనే. ఎగరవేయుచున్నది మాత్రం ఒక వ్యక్తిగాదు; విధి. విధే పటాన్ని దగ్గరకు లాగుతూ దూరముగా పోనిస్తూ, దారముపట్టుమాత్రం వదల కుండా ఆడిస్తోంది నన్ను-"ఆ ఆ 'భయావహ శూన్యంలో' ఒక క్షణం భయం వేసి, కళ్ళు గట్టిగా మూసుకున్నాను.

... ... ...గభీర
వదనమున సేద తీర్చు నవ్యక్తమంద
హాసమున కర్థమేమి? నఖాగ్రధార
దారమును తెంచు తలపు పుట్టదుకదా?
రవంత కొనయూసతో తేలియాడుచున్న
గాలిపటము ఝంఝూనిలాఘాతమునకు
కొట్టుకొని పోయినంత నీకు వచ్చినది ఏమి?

అని ప్రశ్నించుకున్నాను, విధిని, నాలో నేను.

ఎంత ఒంటరి జీవితము ఇది, అనిపించింది ఆ నిమిషము.

★ ★

## ౨౪

ఒకపరి తీయనౌ బరువు
లొత్తగ జీవితమంత క్రుంగి వే
రొకపరి తేలి యేలొ యెటకో
యెటకో జలదాల దాటి తా
రకల విశాల నీల పథ
రాజులనెల్ల నతిక్రమించి పో
యి కలియు సోలిసోలి చదలేటి
తుషారపు స్వప్నరాసులన్ ...
మరియు నేవేవొ కలలు ముంగురుల జారి
వాలి కనుబొమ్మ నునుగొమ్మ వంపులందు
దూరి చూపుల చెక్కిళ్ళ జేరి మంద
మందహాసంపు మసకలో మాయమౌను...

—దేవులపల్లి కృష్ణశాస్త్రి.

ఉద్యోగం లేకపోయినా, అక్కయ్యతో కలిసి ఉండడము ఎంతో తృప్తిగా ఉంది—గాయపడిన నా మనస్సుకు ఎంతో ఉపశాంతిగా ఉంది, ఆమె ఆదరణ. ఆమె కాలేజ్‌లో లెక్చరరూ, హాస్పటల్లో డాక్టరూ కూడా. పెద్ద ఆవరణలో వారందరి నివాసమూను, చక్కని బంగళాలు. నేను ఢిల్లీ చేరిన రెండు మూడు రోజులలోనే, అక్కయ్యతో కలిసి పనిచేస్తూన్న లేడీడాక్టర్లు ముఖ్యమైన వారందరితోను పరిచయం చేసింది నన్ను మా అక్కయ్య. వారు ఆమె ఇంటికి వస్తూఉండేవారు. తనూ వారి ఇళ్ళకు వెళుతూ నన్ను కూడా తీసుకు వెళ్ళేది. కొందరు ఆమెతో తీరికవేళలో బ్రిడ్జి ఆడేవారు. నాకూ ఆ ఆటలో చాలా ఆసక్తి. సాయంత్రపువేళ టెన్నిస్ ఆడేవాడను వారితో. ఒక్కొక్కవాడు

చదరంగమూ ఆడేవాడను డాక్టర్ రామ్ అనే ఆమెతో. మిస్ రామ్ కొన్నాళ్ళు ఆక్స్‌ఫర్డ్‌లో ఉండి పెద్ద పరీక్ష ఇచ్చి వచ్చారు. ఇంగ్లీష్ సాహిత్య విషయాల లోనూ మంచి ప్రవేశము ఆమెకు. చదరంగమాడుతూ, సాహిత్య విషయాలు ముచ్చటిస్తూ చాలాసేపు గడిపేవాడను వారి ఇంట.

బొంబాయి నుండి డాక్టర్ శుక్లా అక్కయ్యపేర ఉత్తరం వ్రాస్తూ "తమ్ముడు పజూబాయ్‌కి చాలా జబ్బుగా ఉంది. జానకిరామ్‌కి తీరికగా ఉన్న దని తెలిసి, అతను తనతో ఉండాలనిపిస్తోంది అంటున్నాడు, జానకిరామ్‌ను బొంబాయి పంపుతారా" అని వ్రాశారు. పజూబాయీ నేనూ బెంగుళూరులో కలిసి చదువుకున్నాము. తర్వాత, కైమూర్ సిమెంట్ ఫ్యాక్టరీలో అతను ఉద్యో గము చేస్తూండగా నేను వెళ్ళి చూశాను అతనిని. అతని భార్య హేమ, చాలా మంచిది. అన్నివిధాల అతనికి తగిన భార్య. ఎంతో అన్యోన్యంగా ఉండేవారు వారు. అలాంటిది, ఆమెకు చాలా జబ్బుచేసి, అతను రాత్రింబవళ్ళు పరిచర్య చేసినా ఫలింపక, ఆమె చనిపోయింది, పాపం. ఆమె పోయిన కొన్ని నెలలకే అతనికీ జబ్బు చేసింది. ఇట్టే ఎక్కువై పోయింది ఆ జబ్బు. ఆ స్థితిలో నేను పజూబాయ్‌తో ఉంటే ఎంతో ఉపశమనగా ఉంటుందని బొంబాయి వెళ్ళాను.

"నీవు వచ్చావు కాబట్టి నా ఒళ్ళు నయమవుతుంది అనుకుంటాను" అన్నాడు పజూబాయ్. అతని సంరక్షణా భారమంతా నాపై వేసుకున్నాను. వేళకు మందు ఇవ్వడం, పడకనుంచి లేవలేని అతనికి చేయవలసిన పరిచర్య అంతా చేయడం, కొంత విశ్రాంతిగా ఉండి మాట్లాడ కలిగినప్పుడు అతనితో మాట్లాడుతూ ఉండడమూ ఇలా, అహోరాత్రులూ అతనితోనే ఉన్నాను. అతను హేమను గురించే చెపుతూవుండేవాడు ఎల్లప్పుడూ. అంత అన్యో న్యంగా ఉండి, తమ జీవితంలో అంతటి అద్వైతభావం అలవర్చుకున్న దంప తులు చాలా అరుదు. అటువంటిది, వారిలో ఒకరిని విడదియ్యడం విధి లీల— ఎంతో క్రూర మనిపించింది. ఆ జంటలో మిగిలిన అతను ఎక్కువ కాల ముంటాడనే ధైర్యం లేకపోయింది నాకు—అతను జీవించాలనే ఆశ ఎంత ఉన్నా మా అందరికీ. "ఈ జబ్బు నయం కావడానికి అత్యవసరమైనది బ్రతి కాలనే సంకల్పము; హేమ లేని జీవితము అతనికి నిస్సారము, ప్రాణముపై

తీపి ఏమాత్రమూలేదు అతనిలో" అన్నాడు, అన్న డాక్టర్ శుక్లా ప్రభాబెన్‌తో. ఆ మాట విని ఆమె కంటతడి పెట్టుకుంది. నావేపు చూపుతూ "ఇతనువచ్చాక వ్యాధి తిరుగుముఖం పట్టిందనుకున్నాను. నానాటికి ముఖంలో ఎక్కువగా కళ కనిపిస్తోంది, చెలాకీగా మాట్లాడుతున్నాడు, అన్నహితవు కూడా కల్గింది. దైవం అనుకూలిస్తే అతను దక్కవచ్చు" అన్నది, వదినెగారు. కాని, పురుష యత్నమెంత ఉన్నా దైవం అనుకూలించలేదు. హేమను గురించి మాట్లాడు తూనే ఏదో జ్ఞాపకం వచ్చి చిరునవ్వు నవ్వుతూనే, నా చేతులలోనే కళ్ళు మూశాడు, స్నేహితుడు పజూబాయ్.

ఇందరము ఇంత మనఃపూర్వకంగా ఆశించినా, ఆ ప్రాణిని బంధింప లేక పోయినాము ఆ పంజరంలో. విముక్తి తప్పిందికాదు ఆ జీవునికి. ఆ లోకంలో వారి ఆత్మలు ఏకమయ్యాయి అను ఊరడింపే ధైర్యమిచ్చింది మాకు.

తరువాత కొంతకాలమున్నాను శుక్లావారింటనే బొంబాయిలో. వెళ్ళి పోయిన తమ్మునికి ప్రతిగా, నన్ను అంతటి ఆప్యాయంతోనూ చూచేవారు డాక్టర్ శుక్లా. ప్రభాబెన్ సరేసరి, "నీవు ఇక్కడే ఉండిపోవాలి, నిన్ను వెళ్ళ నియ్యము" అన్నది ఆమె.

బొంబాయిలో ఎంతో ఉద్యోగప్రయత్నం చేశాను. ఎన్నో పత్రికా ప్రకటలను గురించి ఉత్తరాలు వ్రాస్తూ, వారిని వెళ్ళి చూస్తూ ఎంతో కృషి చేశాను. కాని ఫలింపలేదు. అడయార్‌లో ఉండగా నాకు ప్రొఫెసర్‌గా ఉండిన టి. ఎల్. క్రాంబీ అప్పుడు బొంబాయిలో ఉన్నారు. సోఫయా వాడియా చేస్తూన్న ఆధ్యాత్మిక ప్రచార కృషిలో ఆయనా సాయపడుతున్నారు. వారు ఒక పత్రిక నడుపుతున్నారు. నాకు ఆ పత్రికా నిర్వహణ విషయంలో ఏదైనా పని యిస్తారనే ఆశతో వారివద్దకు వెళ్ళాను. "పత్రికపని ఎంతోలేదు. నేను ఒక్క డనే చూచుకోగలను, నీ ధీశక్తి, రచనా నైపుణ్యం ఇక్కడ వ్యర్థం కాకూ డదు" అన్నారు క్రాంబీ.

ఉద్యోగవిషయమెలా ఉన్నా, డాక్టర్ శుక్లా ద్వారా నాకు కొందరి అమూల్యమైన స్నేహసంపద లభించింది. వారిఇంటికి ఎందరెందరో వచ్చే

వారు, స్నేహశీలురు. వీరితో నాకిట్టే ఏర్పడేది స్నేహము. వారిలో ఒకరు మనీబెన్ కారా. ఆమె సంపన్న కుటుంబానికి చెందినది. లక్షాధికారి కూతురు. కాని, మిల్ పనివాళ్ళ గుడిసెలలోకి వెళ్ళి ఆ కార్మికుల కుటుంబాల సంరక్షణ విషయమై ఎంతో పాటుపడేది. ఆ తల్లులకు చేతిపనులు నేర్పడము, పిల్లలకు చదువు నేర్పడము, ఆట పాటలతో వారికి ఉత్సాహం కలిగించడము, ఇటువంటి కృషి ఎంతో చేసేది మనీబెన్. ఈ కృషి నాకెంతో ఇష్టము. నేనూ ఆమెతో కూడా వెళ్ళి ఆమె చేస్తూన్న పని అంతా చూస్తూ ఉండేవాడను.

ఇది ఒక చిత్రమే, కోటీశ్వరుల ఇంటి బిడ్డలు హంసతూలికాతల్పాలలో విశ్రమించి ఆటగా బ్రతుకు గడుపగలిగిన అవకాశమున్న మనీబెన్ అంటి వారు, ఎంతో ప్రయాసకోర్చి కార్మికులు నివసించే నిరుపేద పరిసరాలలో తిరుగుతూ చింపిరి తలల పిల్లలకు తలంటినీళ్ళు పోయిస్తూ ఇలా పాటుపడడము. మనీబెన్ కృషిని నేను చాలా మెచ్చుకున్నాను. మనిషి కూడా చాలా మంచిది. ఆమె రూపసి కూడా. తలచుకుంటే, తన కిష్టమైన సంపన్న యువకుని వివాహమాడి ఉండవచ్చు. కాని, ఆ దృష్టే లేదు ఆమెకు ఆ రోజులలో. ఆ మహానగరంలోని లక్షలాది కార్మిక కుటుంబాలలో నిత్య నివాసమైన చీకటిని తొలగించడానికి యత్నించడమే అప్పటి ఆమె జీవిత పరమావధి. నాకున్నూ ఆ కృషిలో పాల్గొనాలని ఎంతో ఆసక్తి కలిగింది. బొంబాయిలోనే ఉండి ఉంటే, తప్పకుండా ఆమెతో కలిసి పనిచేసే వాడను.

అక్కయ్య ఉత్తరం వ్రాసింది: "చాలా రోజులు ఉండిపోయావు, బొంబాయిలో. నీ సంరక్షణ శుక్లాకు, ప్రభాబెన్‌కూ భారమని తోచదని తెలుసు. ఐనా, నీవు ఉద్యోగ ప్రయత్నం చెయ్యడము అవసరము. ఇక్కడ నాన్నగారి స్నేహితుడు చివుకుల నారాయణరావు శాసనసభ ఆఫీస్‌లో ఉన్నారు. ఆయన నీకేదైనా ఉద్యోగ మిప్పిస్తానన్నారు. వచ్చే వెలంతా సిమ్లాలో జరుగుతాయి శాసనసభా సమావేశ సభలు. నీవు వెంటనే ఢిల్లీవస్తే నాతో కూడా సిమ్లా తీసుకువెళతాను. నారాయణరావు, అతని భార్య కమల మనకు చాలా ఆప్తులు; నీవు వెంటనే బయలుదేరి రావాలి" అని వ్రాసింది అక్కయ్య. శుక్లా వెంటనే అనుమతించారు. ప్రభాబెన్‌ను ఒప్పించడము మాత్రం చాలా కష్టమైంది. ఆ

పాటి ఉద్యోగం నీకు ఈ ఊళ్ళోనే దొరకదా, గట్టిప్రయత్నం చేస్తే. నిన్ను ఎలా వెళ్ళనిస్తాము మేము!" అన్నారామె. అంతటి అవ్యాజప్రేమ నాలా అరుదు.

బొంబాయినుంచి డిల్లీ వెళ్ళే త్రోవలో అహమ్మదాబాద్‌లో ఒక రోజు ఆగి, ఆ తర్వాత అబూపర్వతం వెళ్ళాను. అబూపర్వతం ఇది రెండవసారి నేను చూడడము. ఇంచుమించు మన నీలగిరులంత ఎత్తున ఉంటుంది, అబూపర్వతము. చాలాచల్లగా ఎంతో ప్రశాంతంగా ఉంటుంది. చుట్టూ కొండశిఖరాలపైన అచలేశ్వరాలయం, వశిష్ఠాశ్రమం, ఇలా ఎన్నో పవిత్ర స్థలాలను చూశాను. వీటిఅన్నిటికంటె అద్భుతమైనవి, దిలవారాలోని చలువరాతి శిల్పాలు. ఎత్తయిన దేవాలయ సౌధపులోపలి భాగమంతా విస్మయంతో ముంచివేసే నిపుణతతో చెక్కారు, చలువరాతిలో, ఎన్నెన్నో విగ్రహాలను, ఎన్నెన్నో పౌరాణిక గాథలను. శేషజీవితమంతా అక్కడే ఉండిపోయి. చూస్తూ ఉండవచ్చు, దేవతలవంటి శిల్పులు సృష్టించిన ఆ అద్భుత శిల్పాన్ని.

సిమ్లా ఎంతో బాగుంటుంది. హిమాలయ పర్వతసానువులలో అతి రమ్యమైన పరిసరాలలో వెలసింది అప్పటి భారత దేశప్రభుత్వ ప్రధానకేంద్రం. ఏమి పువ్వులు! ఏమి పువ్వులు!! కాని, విపరీతపు వర్షము. కాస్త తెరిపి ఇస్తే మాత్రము అందరూ షికార్లకు బయలుదేరుతారు. ఎంత దూరమైనా నడవవచ్చు ఆ వాతావరణంలో ఏమాత్రమూ ఆయాసము లేకుండా. అక్కయ్య చెప్పినట్టు, నారాయణరావు నాకు మంచి ఉద్యోగం సంపాదించిపెట్టారు. నాకు ఎవరైనా గొప్పవారికి అంతరంగిక కార్యదర్శిగా ఉండాలనే ఆశ. ఆ విషయమయ్యే అప్పుడు భారతప్రభుత్వంలో ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ మెంబర్ ఐన సర్. సి. పి. రామస్వామి అయ్యర్‌కి నాన్నగారు ఉత్తరం వ్రాశారు కూడా, నన్ను వారి అంతరంగిక కార్యదర్శిగా తీసుకోమని. సర్ సి. పి. వెంటనే సమాధాన మిచ్చారు: "మీ అబ్బాయి నావద్ద ఉంటే చాలా బాగానే ఉంటుంది. కాని, కొన్ని ఏళ్ళుగా చిదంబరం నా స్వంతపని అంతా చూస్తున్నాడు. ప్రభుత్వ సంబంధమైన పనికి, వేరు వేరు విషయాలలో అందుకు తగినవారు ఇదివరకే ఉన్నారు. ఇప్పటిలో మీ అబ్బాయికి తగిన పని నావద్ద లేదు" అని వ్రాశారు.

కాని, నారాయణరావు ఒకరోజు సాయంత్రం ఆఫీసునుంచి వచ్చీ రావడముతోనే మా అక్కయ్యతో అన్నారు: "మీ తమ్మునికి ఉద్యోగమైంది. రేపు ఉదయమే పని ప్రారంభించవచ్చు" అని. నేను చాలా సంతోషించాను. కాన్పూర్ మిల్ యజమాని, రామేశ్వర ప్రసాద్ బగ్లా, శాసనసభలో మెంబర్, నన్ను తన కార్యదర్శిగా నియమించారు. చిన్నప్పుడు, అడయార్‌లో మా ప్రొఫెస్సర్ చెపుతూ ఉండేవారు, "ఇంగ్లండ్ అటువంటి చోట్లలో ప్రఖ్యాతి వహించిన రాజకీయవేత్తల ప్రభావమంతా, చాలవరకు వారి కార్యదర్శి ప్రతిభ పైననే ఆధారపడి ఉంటుంది. వారు వ్రాసిన గంభీరమైన ఉపన్యాసాలు కార్యదర్శి వ్రాసినవే" అనేవారు ఆయన. నాకూ ఇటువంటి అవకాశం లభించింది; గొప్ప గొప్ప ఉపన్యాసాలు వ్రాసి బగ్లాచేత శాసనసభలో ప్రసంగింపిస్తాను; వారి రాజకీయమైన పని అంతా చక్కబెడుతూ ఆయనకు గొప్ప కీర్తిని సంపాదించిపెడతాను. వారు కలుసుకోవలసిన గొప్ప గొప్ప వారినందరినీ వారి తరపున కలుసుకుని ఎంతో చాకచక్యంతో మాట్లాడి ఆ పనులన్నీ చక్కగా నిర్వహించుక వస్తాను.... అంటూ ఏవేవో ఉద్దేశాలతో ఉవ్విళ్ళూరింది నా మనస్సు.

మరునాడు ఉదయం, సిమ్లాలోకల్లా గొప్పదైన సిసీల్ హోటల్‌లో బగ్లాగారి నివాసానికి వెళ్ళాను. మహారాజభోగము ఆ వసతి. వారి గది ప్రక్కనేవున్న గది ఆఫీస్ గదిగా నా కిచ్చారు. రోజుకు ముప్ఫై రూపాయలు అద్దె ఆ ఒక్కగదికి. నాదే ఆ గది. కిటికీ దగ్గరకు వెళ్ళి నుంచుంటే అద్భుత దృశ్యము కన్నుల పండువైనది. నీరెండలో ఎంతో దూరాన ఉత్తరి దిశను దట్టమైన మంచుగడ్డ పరచిన హిమాలయ శిఖరము. ఎంత అందంగా ఉంది! కైలాస శిఖరమే అది అనుకున్నాను. ఇటువంటిచోట పనిచేస్తూ ఉండడము ఒక మహా అదృష్టం అనుకున్నాను.

బగ్లాకు ఇంగ్లీష్‌లో అంత ప్రవేశం లేదు. ఆయన మరునాడు శాసనసభలో అడుగ దలచిన ప్రశ్నలభావం హిందీలో చెప్పి, ఇంగ్లీషుచేసి టైప్ చెయ్యమన్నారు. వానిని అసెంబ్లీ కార్యదర్శికి పంపుతూ వ్రాయవలసిన ఉత్తరమున్నూ టైప్ చేశాను. ఇంకా ఏవేవో చిన్న చిన్న ఉత్తరాలు టైప్‌చేసి వారి సంతకం తీసుకున్నాను. ఇంకొక గడియలో, ఆయన అసెంబ్లీకి వెళుతూ

"ఈవాళకు ఇంక నాకు నీతో పని ఉండదు. రేపు ఉదయమే ఇంక. నీవు ఉండాలంటే ఇక్కడే ఉండిపో. ఆ బెల్ నొక్కితే హోటల్ మానేజర్ వచ్చి నీకు కావలసినవన్నీ సమకూరుస్తాడు" అని వెళ్ళిపోయారు.

మరునాడూ అంతే; పావుగంట కంటే ఎక్కువ పని లేదు. మూడవ రోజు ఉదయం ఆయన నాకు వేరే పని పురమాయించారు. "సర్ ఫిరోజ్ ఖాన్ నూన్ ఇక్కడికి వచ్చి నన్ను కలుసుకుంటా నన్నారు. ఇంతవరకూ రాలేదు. ఎక్కడ ఉన్నారో కనుక్కో. ఒక వేళ ఇంకా సిమ్లాయే వచ్చి ఉండకపోతే ఇదుగో ఈ యడ్రస్‌కి టెలిగ్రామ్ ఇయ్యి" అన్నారు. అసెంబ్లీకి వెళుతూ ఓముప్ఫై రూపాయలు నా చేతిలోపెట్టి "ఈ ఈ చోట్లకు పచ్చిబఠాణీగింజలూ, యాపిల్ పండ్లూ పంపించు" అని ఆచిరునామా లిచ్చారు. ఫిరోజ్‌ఖాన్ ఆ ఉదయమే సిమ్లా వచ్చారని తెలిసింది నా వాకబ్‌వల్ల. నూన్‌తో టెలిఫోన్‌లో మాట్లాడి, ఆయన అసెంబ్లీలోనే బగ్లాను కలుసుకునేటట్టు ఏర్పాటు చేశాను. ఆ ఫిరోజ్‌ఖాన్ నూన్‌యే ఇప్పుడు పాకిస్తాన్‌లో ప్రధాన ఉద్యోగి.

బగ్లా నియమించినట్టు కూరలూ పళ్లూ బంగీలు కట్టించి ఆయా అడ్రస్‌లకు పంపి, తిరిగి సిసీల్ హోటల్‌కు వచ్చాను నేను. నేను నా గదిలో ప్రవేశించిన కాస్సేపటికి బగ్లా కూడా వచ్చారు. తొందర తొందరగా, "అసెంబ్లీ ప్రొరోగ్ అయింది. నేను కార్‌లో కాన్పూర్ వెళ్ళిపోతున్నాను వెంటనే" అన్నారు. నన్ను తర్వాత రైలులో రమ్మంటారు. సిమ్లానుంచి ఇంక కాన్పూర్‌లో కాబోలు నా నివాసము; కాన్పూర్ ఊరు ఎలా ఉంటుందో—అనుకుంటూ ఉండగా, ఆయన నా దగ్గరకు వచ్చి "బంగీలకు డబ్బు సరిపోయిందా, నేనింకా నీకు ఏమైనా ఇయ్యాలా?" అన్నారు. నా వద్ద మిగిలిన రూపాయి పావలా చిల్లర, బల్లపై ఉంచి "రశీదులు పోస్ట్‌లో పంపాను" అన్నాను. అప్పుడు ఆయన జేబులోనుంచి నూట ఏబది రూపాయలు నోట్లు తీసి నా కిస్తూ "ఇదిగో నీ జీతము. ఇంకా నేను నీకు ఏమైనా ఇవ్వవలసి ఉంటుందా?" అన్నారు.

నేను నిర్ఘాంతపోయాను. ఎన్నేళ్ళో ఉంటుంది అని ఉవ్విళ్ళూరిన ఉద్యోగం మూడు రోజులలో పూర్తి అయిపోయిందా? "ఏమి? నేను కాన్పూరు వస్తాను. మీవద్దనే పనిచేస్తాను" అన్నాను.

ఆయన "అబ్బే! అక్కడ వేరే పెద్ద ఆఫీస్ ఉన్నది. చాలామంది ఉన్నారు, నా పనులు చూడడానికి" అన్నారు. ఒకక్షణం ఆగి, "నీకు కావలసిన సర్టిఫికెట్ టైప్‌చెయ్యి; సంతకం చేస్తాను" అన్నారు.

నేను మిషన్‌వద్ద కూర్చుని సర్టిఫికెట్ టైప్ చేశాను. నన్ను గురించి నేనే ప్రశంసించుకుంటూ వ్రాయడం వింతగానే తోచింది. ఆయనకు చదివి వినిపించాను. "భేష్! సరియైన మాటలు వ్రాశావు!!" అంటూ ఆ కాగితంమీద సంతకంచేసి కార్‌లో వెళ్ళిపోయారు.... నేనూ నా టైప్‌రైటరూ మిగిలాము.

మింట చుక్క లదృశ్యమాయెను
చేతికందెడు పూలు వాడెను
సారహీనపు జీవితమునకు
గోరికలె మిగిలెన్ ...

ముగిసిచనె నూరేళ్ళ బ్రదుకిటు
మూడు నాళ్ళకె ముక్కలాయెను
మోడు మ్రానై పూయకుండగ
వాడి తూలిన తీవనై ...

తళుకు బంగరు తారలేలా ?
తలకుమీరిన తలపు లేలా ?
వలచి పొందగ గగన సుమములు
కలయె జీవితము !

అన్నాడు స్నేహితుడు కృష్ణశాస్త్రి. అతను ఆ పంక్తులు వ్రాసినపుడు కలలోనైనా అనుకుని ఉండడు, తన ఒకానొక స్నేహితుని జీవితంలో ఈ మాటలు ఇంత నిజమవుతాయని....

సిమ్లాలో ఉండగా ఎం. ఎల్. ఏ., రెడ్డిగారు నాకు స్నేహితులయ్యారు. వారికి ఓ ఏడేళ్ళ అమ్మాయి ఉండేది. కనకంపు బొమ్మ; పసిడి విగ్రహము;

బంగారు తల్లి-ఆ పాప. రెడ్డిగారు అసెంబ్లీ స్టేషన్‌కి బయలుదేరి వస్తూంటే. ఏ కారణంవల్లనో ఆయన భార్య ఆయనతో కూడా రాలేకపోయారు. పాపాయి మాత్రం పట్టుబట్టి తండ్రితో ప్రయాణమై వచ్చింది. తల్లికోసం బెంగ పెట్టుకోలేదు. తండ్రిని విడిచి నిమిషముండేది కాదు. మాట్లాడిస్తే చాలు కిలకిలా నవ్వేది ఆ పాప....

కొన్ని వారాలకి కృష్ణా పత్రికలో నా కథ అచ్చయి వచ్చింది. "తీరని వెత" అనే రచన. సీతాపతి అనే ఒక ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్, జీవితంలో ఏదో గొప్ప నిరాశకు పాలై, గాయపడిన హృదయంతో, కాస్త ఉపశమన నిమిత్తం బెంగుళూరులో ఉన్న చిన్ననాటి స్నేహితుని చూడడానికి వెడతాడు. ఆ స్నేహితుడు ఊళ్ళో ఉండడు. కాని, ఆ స్నేహితుని భార్య సీతాపతికీ, తన భర్తకూ గల అన్యోన్యమైన విశేష మైత్రిని తెలిసిన ఆమె, సీతాపతిని తన భర్త తరఫున చాలా ఆదరిస్తుంది. ఆమె గొప్ప సంస్కారి. ఇతరుల మనస్సును ఇట్టే అర్థం చేసుకోగలదు, రెండునాళ్ళ పరిచయంతో. ఆమెకు తనభర్త స్నేహితుని యెడల ఎంతో సానుభూతి కలుగుతుంది. ఏకోదరియైన సోదరిలా అతనిని మన్నించి, అతనితో మాట్లాడుతూ అతని యుదంతము తెలుసుకుంటుంది. ఆమెకు ఆరేళ్ళ అమ్మాయి ఉంటుంది. అందాలరాశి ఆ పిల్ల. "సిమ్లా మామయ్య, సిమ్లా మామయ్య" అంటూ ఆప్యాయంతో పిలుస్తూ అతని ఒళ్ళోవచ్చి కూర్చుని, ఊరికే ఎన్నో ఎన్నో కబుర్లు చెపుతుంది ఆ పాప.

ఇక రెన్నాళ్ళకి సీతాపతి స్నేహితుడు వస్తాడు. ఒక రెండు పూటలు బెంగుళూరులోనే ఉండి, మరో చాలా పెద్ద ఉద్యోగంపైన విదేశానికి బయలు దేరుతాడు సీతాపతి. పెద్ద ఉద్యోగం; ఎంతో సిరిసంపద; ఎంతో కీర్తి. ఐనా, ముఖ్యమైన విషయంలో అతని జీవితంలో కలిగిన వెల్తిని ఆ భార్యా భర్తలు ఇద్దరూ గుర్తించి అతను ప్రయాణ సన్నాహంలో ఉండగా, వారి అమ్మాయిని కూడా అతనితో ప్రయాణం చేస్తారు. వారి సద్భావాన్ని గ్రహిస్తాడు అతను; కాని, వారి త్యాగమును స్వీకరించడు. ఒంటరిగానే విదేశానికి వెళ్ళిపోతాడు.

పూజ్యులు శ్రీ ముట్నూరు కృష్ణారావు కోరికపైన వారికి నేను పంపిన ఈ రచన కృష్ణాపత్రికలో వెంటనే అచ్చయినది. ఇకమీదట సాహిత్య సృష్టిలో

భిమగ్నుడను కావాలి అని సంకల్పించుకున్నాను. కాని, అప్పటికి మరేదీ వ్రాయ లేకపోయాను.

తరువాత, సిమ్లాలో వర్షాలు షురీ అధికమై ఆఫీసులన్నీ ఢిల్లీ తరలి వచ్చాయి. చివుకుల నారాయణరావుతో కలిసి నేనున్నూ ఢిల్లీ వచ్చివేశాను. ఢిల్లీ చేరిన రెండురోజులకు నా బెంగుళూరు ఇన్‌స్టిట్యూట్ స్నేహితుడు మీర్ చందానీ ఢిల్లీ వస్తున్నాడని అక్కయ్యకు ఉత్తరం వచ్చింది. ఉత్తరం చదువుతూ అక్కయ్య నాతో అన్నది: "మీర్ ఢిల్లీ వస్తున్నాడు. నీకు ఇదివరకే చెప్పి ఉండాలి నేను: నేను అతనిని పెండ్లి చేసుకుంటున్నాను: అతను మద్రాస్ వెళ్ళి నాన్నగారి అనుమతి పొంది ఇక్కడకు వస్తున్నాడు" అన్నది కాస్త సిగ్గుతో, ఎంతో సంతోషంతో. నా ఆనందానికి మేరలేదు. నా ప్రాణస్నేహితుడు మా బావ కావడము ఎంత బాగుంటుంది! వారిద్దరిమధ్య అన్యోన్యమైన సుహృద్భావము ఏర్పడినట్టు నాకు తెలియును. ఇంచుమించు పదేళ్ళ క్రితం కలిగిన పరిచయం నానాటికీ స్నేహంగా అతిశయించి ఈనాటికి ఇలా ఫలశ్రుతి పొందినది. ఎంతో మంచి విషయము.

ఇంకో వారం రోజులకు నాన్నగారి వద్దనుంచి నాకు ఉత్తరం వచ్చింది: "శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఉద్యమంలో నాయకులు. నేడో రేపో ఆయన అరెస్టయి కారాగృహానికి వెళ్లనున్నారు. ఇన్నాళ్లూ, బెజవాడ కేంద్రంగా వారు మనఇన్సూరెన్సుపని చూస్తున్నారు. వారి స్థానే నీవు బెజవాడలోఉండి ఆ పనంతా చూస్తూవుంటే బాగుంటుంది. ఆంధ్రదేశమంతటా తిరిగి, ఈ ఇన్సూరెన్సు కంపెనీని వృద్ధిలోకి తేవడానికి అవకాశ మున్నది. నీవు వెంటనే బయలుదేరి రావాలి" అని వ్రాశారు నాన్నగారు.

ఈ ఇన్సూరెన్సు పనికీ, ఇదివరకు నేను తరిఫీదైన విషయాలకీ ఎంతో తేడా ఉంది. ఎలా నిర్వహింపకలనా ఈ పని-అని మొదట సందేహించాను. ఈ మాట చివుకుల నారాయణరావుతో చెపితే ఆయన అన్నారు: "మరేం, ఫరవాలేదు. నీకు మంచి పర్సనాలిటీ ఉన్నది. ఎంతో ఆకర్షణీయంగా ముచ్చటించే నేర్పువుంది. నీవంటి విద్యావంతులు ఈ వ్యాపకంలో రాణిస్తారు. అధైర్యపడకు!" అన్నారు.

## నా స్మృతిపథంలో...

నాన్నగారు నియమించిన పని శ్రద్ధతో చెయ్యాలి. ఏ పనిలో అయినా మనసార కృషిచేస్తే ఫలితం మాట మనం పాటింప నక్కరలేదు. కౌశలంతో చేసిన కృషి యోగంగా పరిణమిస్తుంది అని నాకునేనే ధైర్యం చెప్పుకుని, బెజవాడకు రైలు ఎక్కాను. నాకు నిజంగా ఢిల్లీ విడిచి రావాలని లేదు. ముందు ఏమవుతుందో, ఎటువంటి తుపానులు వస్తాయో ఈ జీవితంలోకి — అనే బెంగ ఆవహించింది నన్ను.

కాని, ఒకవంక గొప్ప ఆశ లేకపోలేదు. అడయార్‌లో నాకు కలిగిన శిక్షణవల్ల, ఈ జీవితాన్ని ఒక అమూల్యమైన అవకాశంగా పరిగణించే నాకు, రానున్నవి మంచి రోజులే అనే గొప్ప విశ్వాసం ఉంది. ఎన్ని మెలికలు తిరిగినా, నది చివరకు సముద్రం జేరకుండా ఉంటుందా అనే గొప్ప నమ్మకం నాకు ఎంతో ధైర్యమిచ్చింది.

ఆ ధైర్యంతోనే తిరిగి తెలుగు భూమిలో అడుగుపెట్టాను.



రచయిత సంఘంలో ఒక వ్యక్తి. కొన్ని చరిత్రలలోను, రచనలలోను సమకాలిక సంఘంకాక రచయితే అంతటా కనిపించడంవల్ల పాఠకుల ఉత్కంఠ కుంటుపడుతుంది. ఇందుకు భిన్నంగా సంఘమే నాలుగువైపులనుంచి ప్రతిబింబిస్తూ, సాహితీప్రియులను, రచయితలను విశేషంగా ఆకర్షించిన ఈ "నా స్మృతిపథంలో" వ్యాసాల పూర్వార్థం నేటి వ్యాసంతో సమాప్తమైంది. ఉత్తరార్థం ప్రచురణ మరికొన్ని వారాలకు ప్రారంభం కాగలదు. —ఎడిటర్, ఆంధ్రప్రభ.

[ఏప్రిల్ 10-1958]